# ఆంధ్ర మహాభారతములో ధర్మసూక్ష్మములు



సాహిత్య కళా వాచస్పతి

**డా. యమ్జిపి. శ్రీరామచంద్ర మూర్తి**
M.A., Ph.D.

Dist. Development Officer (Retd.)

కాకతీయ విశ్వవిద్యాలయముచే డాక్టరేటు పట్టము

కొరకు ఆమోదింపబడిన సిద్ధాంత గ్రంథము

**2000**

# ఆముఖము

**ఆచార్య హరిశివకుమార్**
డీన్, ఫాకల్టీ ఆఫ్ ఆర్ట్స్
కాకతీయ విశ్వవిద్యాలయము
వరంగల్

" ధరతి లోకా నితి ధర్మః" - అనగా లోకాలను ధరించేది ధర్మము అని అర్థము. " ధ్రియతే జనైరితి ధర్మః" - జనులచేత ధరింపబడేది ధర్మము అని మరొక అర్థము. అంటే- మానవులు ధర్మాన్ని ఆచరించటం వల్లనే ఈ లోకాలు నిలిచి ఉన్నాయని తాత్పర్యము. కనుక- మానవస్థితిగతులకు ధర్మమే కారణమని స్పష్టమవుతుంది.

అయితే - ఏది ధర్మము ఏది అధర్మము అని నిర్ణయించటం ఎట్లా ? అంటే- వేదవిహితమైనది ధర్మము; వేదవిరుద్ధమైనది అధర్మము అన్నారు. విద్ శబ్దానికి జ్ఞానము - అనగా తెలుసుకోదగినది అని అర్థము. ఇట్టి ధర్మాధర్మ పరిజ్ఞానం కలిగించేది కనుకనే వేదమని, ధర్మాధర్మములు దీని ద్వారా వినబడతాయి కనుక శ్రుతి అని, ఆధర్మము తరతరాలుగా అనుస్యూతంగా అభ్యసింపబడుతున్నది. కనుక ఆమ్నాయమని వేదానికి పేర్లు. అందుకే - వేదో ధర్మమూలమ్ - వేదమే ధర్మానికి మూలం అని గౌతముడు తనధర్మ సూత్రములలో చెప్పాడు. వేదములలో చెప్పబడిన ధర్మములే తరువాతి కాలములో పురాణేతిహాసాలలో కథలరూపాలలో అందరికీ అర్థమయ్యేటట్లు చెప్పబడింది. అందుకే మహాభారతానికి పంచమవేదమని ప్రసిద్ధి కలిగింది. తత్కారణంగా వ్యాసమహర్షి -

" నమోఽస్తు తే వ్యాస విశాలబుద్ధే
పుల్లారవిందాయతపత్రనేత్ర
యేన, త్వయా భారతతైలపూర్ణః
ప్రజ్వాలితో జ్ఞానమయప్రదీపః" -
అని ప్రశంసింపబడినాడు.

మహాభారతంలో చెప్పబడినన్ని ధర్మాలు మరేగ్రంథంలోనూ చెప్పబడలేదు. అట్లాగే భారతంలో చెప్పబడనివిషయాలు లోకంలో ఎక్కడాకన్పించవు. అందుకే-

ధర్మే చార్థే చ కామే చ మోక్షే చ వృషభర్షభ
యదిహాస్తి తదన్యత్ర యన్నేహాస్తి న కుత్రచిత్ -

అన్న ప్రసిద్ధి దానికి కలిగింది.

ఈ ధర్మము స్థూలధర్మమనీ సూక్ష్మధర్మమనీ రెండు విధాలుగా ఉంటుంది. మందబుద్ధులకు కూడా తెలిసేది స్థూలధర్మము. శాస్త్రపారంగతులకు మాత్రమే తెలిసేది సూక్ష్మధర్మము.

తరతరాలుగా మనం వేదోక్తమైన ధర్మాలనే ఆచరిస్తున్నాము. అది మన భారతీయసంస్కృతి. అయితే ఈ ధర్మాలు కొన్ని యుగాలనుబట్టి మారుతూ ఉంటాయి. ద్వాపరయుగంలో ధర్మాలు కలియుగంలో అనుసరణీయములు కాకపోవచ్చును. నిన్నమొన్నటి ఆచారాలే ఈనాడు మారిపోయాయి. పూర్వం భోజనపదార్థాల విక్రయం మహాదోషంగా భావింపబడేది. ఇవ్వాళ అది తప్పుకాదు. ఒకప్పుడు మేనరికం ఆచారంగా ఉండేది. ఈనాడది తప్పుగా భావింపబడుతున్నది. అలాంటి వాటిని మనం దేశ కాలపరిస్థితులను బట్టి అర్థంచేసుకోవలసి ఉంటుంది. అట్లాగే – మహాభారతంలో చెప్పిన కొన్నివిషయాలు, నేటి కాలపువారికి అధర్మభ్రాంతిని కల్గించవచ్చు, అలాంటి విషయాలలోని ధర్మసూక్ష్మాలను మహాభారతవ్యాఖ్యాతలు, విమర్శకులు, స్మృతికర్తలు చెప్పిన ప్రమాణాలను ఆధారంగా చేసికొని పరిశీలించాలి. అంతేకాని, ఈ నాటి ప్రమాణాలతో లెక్కించి, అవి అధర్మాలని తృణీకరించటం సమంజసంకాదు.

అలాంటి ధర్మసూక్ష్మాలను గ్రహించి, వాటిలోని ఔచిత్యాన్ని వ్యాఖ్యానిస్తూ మహాభారతసారోద్ధారము, మహాభారత తత్త్వనిర్ణయము, మహాభారతతత్త్వకథనము, మహాభారతవిమర్శనము, మహాభారతోపన్యాసములు, మహాభారతరహస్యములు వంటిగ్రంథాలుకొన్ని వెలుగులోనికివచ్చాయి. వాటన్నింటిలో అగ్రగణ్యమైనది 'పౌరాణికసార్వభౌమ' శ్రీమల్లాది చంద్రశేఖరశాస్త్రి గారి 'మహాభారతము ధర్మసూక్ష్మములు' అన్న గ్రంథము. అందులో శ్రీశాస్త్రి గారు ఆ యా ధర్మసూక్ష్మాలను అను శీలింపవలసిన తీరును చక్కగా ఉట్టంకించారు. అదే స్ఫూర్తితో, అదే పద్ధతిలో, మహాభారతంలోని వివిధ ధర్మ సూక్ష్మాలను విస్తృతంగా చర్చించారు శ్రీ యం.జి.పి శ్రీరామచంద్రమూర్తిగారు. ఈ సిద్ధాంతగ్రంథంలో శ్రీమూర్తిగారు వయోవృద్ధులు, జ్ఞానవృద్ధులూకూడా , వారు మంచి వ్యుత్పన్నులు. బహుగ్రంథకర్త. సంస్కృతాంధ్రమహాభారతములను బాగా పరిశీలించి, సమగ్రం గాను–సప్రామాణికంగా ఉండేటట్లు ఈ సిద్ధాంతగ్రంథాన్ని వ్రాసి, మా కాకతీయ విశ్వవిద్యాలయంనుంచి డాక్టరేట్ పట్టం పొందారు మూర్తిగారు.

పరాశర మహర్షి వలన మత్స్యగంధికి పుట్టినవాడు వ్యాసమహర్షి. ఆ వ్యాసమహర్షి

వలన విగతభర్తృకలైన అంబిక- అంబాలికలకు జన్మించినవారు ధృతరాష్ట్ర-పాండురాజులు. పాండురాజు జీవించి ఉండగానే ఇంద్రాదిదేవతల అంశతో జన్మించినవారు పాండవులు. ఆ పాండవులు ఐదుగురూ ఒకే స్త్రీని వివాహం చేసుకున్నారు. పరమ పూజ్యుడైన వ్యాసమహర్షి, భారతమునకు కర్ణధారియైన కర్ణుడు - ఇద్దరూ కానీనులే! అంతేకాదు - ఇలాంటి మహాభారతం చదివితే పాపాలు పటాపంచలవుతాయట ! పైగా ఈ చరిత్రలను వ్యాసమహర్షియే స్వయంగా వ్రాసుకున్నాడు. మరి అవన్నీ ధర్మసమ్మతాలనే ఆయన ఉద్దేశ్యమా ? ధర్మసమ్మతాలు కాకపోతే వ్యాసుడే స్వయంగా అట్లావ్రాసుకుంటాడా ? మరి అలాంటి మహాభారతం పంచమవేదం ఎట్లా అయింది ? అందులోని ధర్మసూక్ష్మం ఏమిటి ? - వంటి విషయాలు ఈ నాడు చర్చనీయాంశము లయ్యాయి.

ఇలాంటి విషయాలను కొన్ని ధర్మశాస్త్రగ్రంథాలు కూడా సమర్థించాయి. మహాత్ములైనవారు కొన్ని విషయాలలో ధర్మాన్ని అతిక్రమించటం కన్పిస్తుంది. అయితే అవిచూసి సామాన్యులైనవారు, వారిలాగా సాహసం చేయ్యరాదట. ఎందుకంటే - ఆ మహాత్ముల శరీరాలు, ఇంద్రియాలు తేజోమయములైనవి. నీరు తామరాకుకు అంటనట్లు ఆ దోషాలు వారిని అంటలేవు - అని మనుస్మృతిలో చెప్పబడింది. అంటే మహాత్ముల విషయంలో అవి సమర్థనీయములే అని భావము. అలాంటి విషయాలు ఏవిధంగా సమర్థనీయములో ఈ గ్రంథంలో విస్తృతంగా చర్చించి వివరించారు శ్రీ రామచంద్రమూర్తి గారు.

గ్రంథగ్రంథుల లాగా కన్పించే ఈ ధర్మరహస్యాలు ఈనాడు సమర్ధనీయములు కాకపోవచ్చును. కానీ అవన్నీ సముచితాలు కాకపోతే వ్యాసమహర్షితానే ఎందుకు బట్టబయలు చేస్తాడు ! మనువులాంటి ధర్మశాస్త్రకర్తలు ఎందుకు సమర్థిస్తారు ? కనుక-వాటిని అర్థం చేసుకోవలసిన పద్ధతి వేరే ఉన్నదన్నమాట ! అలాంటి వాటిని అర్థంచేసుకోవలసిన విధానాన్ని విశ్లేషించి వ్యాఖ్యానిస్తున్నది ఈ గ్రంథం !

ముఖ్యంగా - వ్యాస జననం, ధృతరాష్ట్ర-పాండురాజుల జననం, పాండవుల జననం, ద్రౌపదీ వివాహము, ధర్మరాజు ద్యూతము, రాజ్యము కౌరవులదా ? పాండవులదా ? ద్రోణవధకోసం ధర్మరాజు అబద్ధమాడటం, రణరంగమధ్యంలో భగవద్గీతాప్రసంగం, కర్ణవధ, భీముడు దుర్యోధనుని తొడలు విరగగొట్టటం - వంటి విషయాలు శ్రీమూర్తిగారు వ్యాఖ్యానించిన తీరు ప్రశంసనీయంగా ఉన్నది.

మరొక విషయం - ఈ కాలంలో కూడా ఇలాంటి గ్రంథాలు అవసరమా ?

అనే సందేహం కూడా కలుగకపోదు. కాని, ఇన్ని వందల సంవత్సరాలైనప్పటికీ, మన భారతీయసంస్కృతికి మూలకందములైన రామాయణభారత - భాగవతాదుల పట్ల జనసామాన్యానికి ఆదరణ తగ్గలేదు. అయితే- కొందరు ఆధునికులు చేసిన విపరీత వ్యాఖ్య లు ఆయాగ్రంథాలపట్ల చిన్నచూపును కల్గిస్తున్నాయి. అలాంటి అపోహలు తొలగి పోవటానికి ఎన్నో వ్యాఖ్యానగ్రంథాలు, వివరణగ్రంథాలు వెలుగులోనికి వస్తున్నాయి. ఆ కోవకు చెందినదే ఈ గ్రంథంకూడా దుర్వ్యాఖ్యా విషమూర్ఛితమైన భారత భారతిని ఇలాంటి గ్రంథాలు ఉత్థాపన చేసి నూతనోత్తేజాన్ని ప్రసాదిస్తాయని నా నమ్మకము !

67 సంవత్సరాలు వృద్ధాప్యంలో ఈ ప్రపంచం ఎటుపోతే మనకేమిలే అనే తూష్ణీంభావము లేకుండా, మన భారతీయ సంస్కృతి పట్ల ఆదరాభిమానాలను ఇనుమడింపజేయాలనే సత్సంకల్పంతో, ఈ గ్రంథాన్ని రచించి వెలుగులోకి తీసుకొనివచ్చిన శ్రీరామచంద్రమూర్తి గారిని హృదయపూర్వకంగా అభినందిస్తున్నాను. ఇలాంటి గ్రంథాలను ఇతోధికంగా వ్రాసి, సరస్వతీ సమారాధన చేయటానికి తగిన ఆయురారోగ్యైశ్వర్యములను శ్రీరామచంద్రమూర్తి గారికి ప్రసాదించాలని ఆ జగన్మాతను ప్రార్థిస్తున్నాను.

శుభం భూయాత్

వరంగల్
నూతన శతాబ్ది
నూతన సహస్రాబ్ది
1-1-2000

శ్రీ శివాయ గురవే నమః

# పరితోషము

ఆచార్య వేదుల సుబ్రహ్మణ్య శాస్త్రి
ఎమ్.ఏ.,పిహెచ్.డి (తెలుగు)
ఎమ్.ఏ.; పిహెచ్.డి (సంస్కృతము)
తెలుగు శాఖ
ఆంధ్ర విశ్వకళా పరిషత్తు, విశాఖపట్నం-2

" శారదా పీఠం"
46-15-35, మండావారి పేట,
విశాఖపట్నం - 530 016
ఫోన్ : 541003.

సనాతనభారతీయ సంస్కృతికి పరమాధారములు వేదములు. ఆవేదములు ధర్మప్రధానములైనవి. " వేదోऽఖిలో ధర్మమూలమ్" అని స్మృతివచనము.

వ్యాసమహర్షి వేదవిభాగము గావించి వేదవ్యాసుడై ఆ వేదసారమును మహాభారతరచనారూపమున లోకమునకందించి నాఁడు. కావుననే " భారతం పంచమో వేదః " అని ప్రశస్తి యేర్పడినది.

మహాభారతతత్త్వమును నిశితముగఁ బరిశీలించిన నన్నయ తద్గ్రంథ ప్రాశస్త్యనిరూపణ సందర్భమున " ధర్మతత్త్వజ్ఞులు ధర్మశాస్త్రంబని" ధర్మోపదేశమునకే ప్రాథమ్య మొసంగినాఁడు. మహాభారతమున ధర్మనిర్వచనముతో పాటు ధర్మప్రాశస్త్యము. ధర్మవైవిధ్యము పెక్కుసందర్భములందుఁ బేర్కొనఁబడినవి.

మహాభారతకథయందలి యనేకఘట్టములు ధర్మవిషయమున వివాదగ్రస్తములైనవి. పండితులు తమతమ బుద్ధినైశిత్యమును, బాండిత్యవిశేషమును బురస్కరించుకొని యాయా ఘట్టములలో ధర్మసమన్వయము గావింప పయత్నించినారు.

డా॥ యం.జి.పి శ్రీరామచంద్రమూర్తిగారు తమకుగల సుదీర్ఘజీవితానుభవమును, సాహిత్యాధ్యయన వైభవమును, వివిధ ధర్మశాస్త్రగ్రంథపరిశీలనప్రాభవమును బురస్కరించుకొని మహాభారతమందలి ధర్మ మీమాంసకు సంబంధించిన ప్రధానసన్నివేశములను నిర్ణయించుకొని ప్రమాణబద్ధముగ ధర్మసమన్వయము గావించి "ఆంధ్రమహాభారతములో ధర్మ సూక్ష్మములు" అనునుత్తమ గ్రంథమును రచించి

కాకతీయవిశ్వవిద్యాలయమునకు సమర్పించి డాక్టర్‌పట్టభద్రులై నేడు ఆగ్రంథమును బ్రచురించి లోకమునకు అందించుట అస్మదాదులకు బరమహర్షదాయకము.

ఈ గ్రంథమున విషయప్రతిపాదనము " నామూల ముచ్యతే కించిత్" అను మల్లినాథ సూక్తి వ్యాఖ్యాన పద్ధతికి లక్ష్యమనఁదగ్గది. సంస్కృతమహాభారతశ్లోకములు, నీలకంఠీయవ్యాఖ్యాన పంక్తులు అడుగడుగున నీ గ్రంథమునఁ బేర్కొనఁబడినవి. మహాభారతముపై రచింపఁబడిన మహాభారతచరిత్రము, మహాభారత మీమాంస వంటి గ్రంథములు, దేవీభాగవతము, విష్ణుపురాణము సూతసంహిత, ఆపస్తంబ ధర్మసూత్రములు, మనుస్మృతి, బ్రహ్మసూత్ర భాష్యము వంటి ఎన్నెన్నో ఇతరగ్రంథములు పరిశీలించి వానిలోని విషయములను డా॥ శ్రీరామచంద్రమూర్తిగారు సందర్భసముచితముగ ధర్మపరిష్కార సందర్భమునఁ బేర్కొనుటలో వారి పరిశోధన పాటవము, బహుగ్రంథపరిశీలన దక్షత విశదమగుచున్నది. ధర్మసమన్వయము విద్వదామోదయోగ్యముగా నున్నది.

మహాభారతమునకు సంబంధించిన విమర్శనగ్రంథములలో బహువిధవిజ్ఞానదాయకమైన ఈ గ్రంథము ఎంతయో ప్రాధాన్యమును సంతరించుకోఁగలదు. ఇట్టి ఉత్తమ గ్రంథమును రచించిన డాక్టర్ యం.జి.పి. శ్రీరామచంద్రమూర్తిగారిని హార్దికముగా నభినందించుచున్నాఁడను. " సమానానాముత్తమశ్లోకోఽస్తు " అని ఆకాంక్షించుచున్నాఁను.

శుభం భూయాత్

విశాఖపట్నం
25.12.99

# ధర్మాశంసనము

'సాహిత్యవిద్యాప్రవీణ,' 'శిక్షాశాస్త్రి'
**డాక్టర్. కంభంపాటి సీతారామాంజనేయులు**
ఎమ్.ఏ. ; పిహెచ్.డి(సంస్కృతము); ఎమ్.ఏ., (తెలుగు)
లెక్చరర్ (రిటైర్డ్), సంస్కృత విభాగము,
తి.తి. దేవస్థానము, హైదరాబాదు.

ఫోన్ నెం 3214133
ఇం. నెం 11 - 6- 418
గూడ్స్‌షెడ్ వెనుక
నాంపల్లి, హైదరాబాద్ - 1

Dr. M.G.P. శ్రీరామచంద్రమూర్తిగారు వ్రాసిన "ఆంధ్రమహాభారతములోని ధర్మసూక్ష్మములు" అనుగ్రంథమును జూచితిని. దీనిలో వారు లోకసంశయాస్పదములైన విషయములను గూర్చి చక్కగా ప్రమాణపూర్వకముగా చర్చించినారు. వారీ గ్రంథము నిరువదియెనిమిది శీర్షికలుగా విభజించినారు. ఒక్కొక్కవిషయమును గూర్చి సూక్ష్మేక్షికతో చూచినచో ధర్మబద్ధముగనే కనుపించుచుండును. వారనేక గ్రంథపరిశీలనము జేసి యాయా విషయములను కూలంకషముగా చర్చించినారు.

భారతదేశము ప్రాచీన సంస్కృతికాలవాలము. భారతీయసంస్కృతి ప్రపంచజనుల నాకర్షించినదనుటలో నతిశయోక్తి యేమాత్రమును లేదు. అట్టి సంస్కృతిని స్థిరముగ నిల్పిన వాల్మీకి వ్యాసాదులు మహాకవులు. కళ్యాణ మయములగు వారి ధర్మపన్నములు త్రికాలాబాధ్యములు.

" రమ్యం కవిత్వం భువి ధర్మదూరం
ధర్మ్యం కవిత్వం న హి రమ్యమేవ
స్వర్ణం సుగంధి ద్విగుణం కవిత్వం
గీర్వాణవాణ్యా ఇతరత్ర కుత్ర" - అన్నట్లు

రమ్యమగు కవిత్వము ధర్మమునకు దూరముగ నుండును. అట్లే ధర్మ్యమైన కవిత్వంలో రమ్యత లేకపోవచ్చును. కాని భారతీయ ధర్మమున కాటపట్టువగు వైదిక ధర్మమును సుహృద్వచనము మాదిరి అర్థప్రవణములగు పురాణ వచనములచే వాల్మీకి వ్యాసులు ధర్మబద్ధముగావించినారు. అనగా వైదికధర్మమును సర్వజనవిదితముగా సులభశైలిలో అందించినారు. ఏది ధర్మము? ఏది యధర్మము అను విషయమున మహాపండితులే విమోహమును చెందుచున్నారు అని గీతాచార్యుడంతటివాడే యీ విషయమును దెల్పినాడు. కనుక ధర్మమును

తెలియవలెనన్న త్రికాలాబాధ్యమగు వైదిక ధర్మమెరుగ వలయును. వేదోఖిలో ధర్మమూలమ్, తద్విదాం చ స్మృతిశీలే' అన్నట్లు ధర్మమునకు మూలము వేదములు. దాని నెరిగిన ( వేదవేత్త లయిన వారియొక్క స్మృత్యాది గ్రంథములు, వారి శీలము, ఆచారములు ప్రమాణములు.

ఎందరో మహానుభావులు వారందరు తమతమ మతములను (అభిప్రాయములను) వెలిబుచ్చియున్నారు. "కర్మజన్యాభ్యుదయం నిశ్రేయసహేతురపూర్వాఖ్య ఆత్మగుణో ధర్మః" తాను జేసిన కర్మలవలన కలిగిన పుణ్యముచేత అభ్యుదయములు అనగా స్వర్గాదిలోకములను పొందుటకును , నిశ్రేయసము ( మోక్షము ) పొందుటకును కారణమైన యపూర్వమను పేరుగల యాత్మగుణమే ధర్మము అని దాని కర్థము. ఇట్టి ధర్మమును తెలియవలయునన్న పూర్వజన్మసంస్కారముండవలయును. ఈ సంస్కారము తాజేసిన కర్మసిద్ధాంతముపైనాధారపడియుండును. కనుక వేదశాస్త్రోక్త కర్మలను జేయుచు చిత్త శుద్ధిద్వారా ఆత్మావలోకనముచేసి కొనువారికే ధర్మము తెలియును. మిగిలిన వారి విషయములో నది మృగ్యమనుట నిస్సందేహము.

' లోకో భిన్నరుచిః' అను నట్లనేకమంది యనేకవిధముల వారికి తోచినట్లు ధర్మనిర్వచనము చేయుచుందురు. కాని అది సరిగాదు. కౌరవపాండవుల విషయమునను ధర్మ నిర్ణయముచేయలేని పలువురు పలువిధముల నవకాశ వాదమును కల్పించుకొని వ్రాయుటయే సంభవించినది. నిరీహులు , మంత్రద్రష్టలు, దివ్యదృష్టిగలవారు, లోకకళ్యాణము నాశించు మహానుభావుల హృదయములనెరిగి ధర్మనిర్ణయము చేయవలెను. అట్టి ధర్మనిర్ణయముచేయగల మహానుభావులే భారతప్రాశస్త్యము నుగ్గడించుచు నీ మహాభారతము ధర్మశాస్త్రము, వేదాంతము, నీతి శాస్త్రము, మహాకావ్యము, సర్వలక్ష్యసంగ్రహము, ఇతిహాసము, బహుపురాణసముచ్ఛయము ధర్మార్థకామమోక్షచతుర్విధపురుషార్థసాధకమని యని నారు. ధర్మము స్థూలసూక్ష్మములని రెండు రకములు. అందు సూక్ష్మధర్మమును దెలిసికొనుట మిక్కిలి కష్టసాధ్యము. ధర్మనిర్ణయమును ఎవరిబుద్ధికి తోచినట్లు వారు చేయకూడదు. దానిని నిర్ణయించుటకు వేదశాస్త్ర స్మృతి పురాణములున్నవి. వానిని బట్టియే ధర్మ నిర్ణయము చేయుట మంచిది. కనుకనే "తాస్మాచ్ఛాస్త్రం ప్రమాణం తే కార్యాకార్యవ్యవస్థితౌ, జ్ఞాత్వా శాస్త్రవిధానోక్తం కర్మ కర్తు మిహార్హసి'

అని గీతాచార్యుని వచనము. అనగా కార్యాకార్యనిర్ణయము చేయునపుడు శాస్త్ర ప్రమాణమే శరణ్యము. శాస్త్రము నెరిగియే కర్మనాచరింపవలయునని అర్థము. శాస్త్రవిధానమునెరుంగక దానినుల్లంఘించి తనయిష్టానుసారము ప్రవర్తించువాడు సుఖసంతోషములను పొందక యధఃపతితుడగునని గీతాచార్యుడే చెప్పియున్నాడు. ఇంకను పాపాచరణమును చేయువారు పాపయోనులయందును పుణ్యాచరణమును చేయువారు ఉత్కృష్టయోనులందును జన్మింతురని వేదశాస్త్రములుద్ఘోషించుచున్నవి. అట్లే ప్రతిమతగ్రంథములును నుడువుచున్నవి. అట్టి మతగ్రంథములను ప్రతియొక్కరును తెలిసికొనవలయును. అట్లు వీలులేనపుడు స్వార్థరహితులునగు మతాచార్యుల బోధనలను వినియైనను ధర్మము నాచరించవలయును. స్వార్థముతోనుండువారి నొకకంట నప్రమత్తులై కనిపెట్టుచునే యుండవలయును. అట్టివారు దేనినైనను తమ కనుకూలముగ చేసికొని బోధింతురు. వారు సర్వజ్ఞంమన్యులగుచు ఇతరులను దుఃఖసముద్రమున చేర్చుచుందురు. ధర్మమును తెలియకుండుట అధర్మము కానేరదు. కాని ధర్మము నాచరింపక తమ తమ యిష్టానుసారము ఆచరించుటయే అధర్మమగును. అట్టివాడు ధర్మాధర్మముల నెరుగుటయెట్లన, శ్రేష్ఠుడగు నుత్తమపురుషుని యాచరణమునే ప్రమాణముగ గైకొని ధర్మాచరణమును చేయవలయును. వారివారి ప్రవృత్తిని బట్టియే మనము ఉత్తమపురుషులను తెలియవలయును. కనుకనే " తద్విదాం చ స్మృతి శీలే " అనగా వారి వ్రాతలు, వారి యాచారములు నడవడికలు ప్రమాణములని శాస్త్రములు బోధించుచున్నవి.

సాక్షాత్కృతాత్మధర్ములగు మహర్షుల యాచరణము మనకు ప్రమాణమనియు, అగ్ని సర్వగతుడై యుండునట్లు మహాత్ముల తేజస్సు సర్వగతమనియు, వారి కామ క్రోధాదులు లోకకళ్యాణమునకే యనియు, వ్యాసుని విషయమున బీజప్రాధాన్యము ప్రమాణపురస్సరముగ ప్రదర్శింపబడినది.

రాజ్యము పాండవులదా ? లేక కౌరవులదా ? అను విషయమున ధృతరాష్ట్రుడు పుట్టు గ్రుడ్డివాడగుటచే రాజ్యాధికారము లేనందున " నాంధః కురూణాం నృపతిః ... ద్వితీయం రాజానం దాతుమర్హసి" అను ప్రవృత్తి ధర్మసూక్ష్మమును బట్టి పాండురాజే ప్రభువనుట స్పష్టము.

పాండవుల జననవిషయమున అప్రత్యక్ష విషయములను నిర్ధారణ చేయుట

కాప్తవాక్యములే ప్రమాణములనియు, ఆత్మజ్ఞానమునుబొందిన మహర్షులాప్తులనియు, వారిసమక్షమున దేవతలు దుందుభి స్వనములచేతను, జయజయ ధ్వానములచేతను, పుష్పవృష్టిచేతను పాండవుల జననము సర్వులకు అమోదయోగ్యమైనది దానిని చూడజాలని యజ్ఞుల కది వెగటైనది.

ఇక కర్ణుని విషయమున కుంతీదేవి దుర్వాసుని మంత్రప్రభావమును, తాను సూర్యునాహ్వానించిన విధమును సూర్యాంశమున కర్ణుని జన్మమును వ్యాసునితో చెప్పగా వ్యాసుడు కుంతితో చెప్పిన సమాధానములు సప్రమాణముగ నున్నవి. అతీంద్రియజ్ఞానసంపన్నుల వాక్కు లమోఘములను విషయము ఉత్తమాధికారులకే తెలియును అను విషయము ఆ ఘట్టముననే చక్కగా వివరించబడినది.

ద్రౌపదీవిషయమున ద్రుపదుడు యాజుడను ఋత్విక్కుని వేడుకొనగా యాజునిచే సంస్కరింపబడిన హవిస్సును అగ్నియందు హోమముచేయగా అగ్నినుండి అయోనిజయగు ద్రౌపది ఉద్భవించినది. మంత్ర ప్రభావమట్టిది. పైగా శరీరము యోనిజము అయోనిజమని రెండురకములనియు, దేవతాదుల శరీరములు శుక్రశోణిత సంబంధములేకయే అణువులనుండి పుట్టుచున్నట్లు శాస్త్రము లుద్ఘోషించుచున్నవి. బ్రహ్మసూత్రములు 3-2-20, 21, ; 3-1-18, 19 ఈ విషయాలను చాటుచున్నవి.

ద్రౌపదీ వివాహ విషయమున మనము ఆమె పూర్వజన్మమును, వ్యాస వచనమును స్మరించినచో ద్రౌపది పంచభర్తృక యగుటలోని పారమార్థ్యము మనకు గోచరమవుతుంది. ఈ విషయములందు సామాన్య విశేష ధర్మములను మరువకుండ ప్రమాణములను బట్టియే విషయములను తెలిసికొనుచుండవలయును. జటిల, వార్క్షి మున్నగు వారు కూడ బహు భర్తలు గలవారే.

ఏకలవ్యుని విషయములను నాతడు నిషాదుడగుటవలన నుపనయనాధికారము లేకుండుటవలనను, ఉపనయనములేనిదే ధనుర్వేదము నేర్పరాదు కనుకను, గురుశుశ్రూషయొనర్పక లభించినవిద్య సర్వథా అనర్థదాయకమగుటచేతను ద్రోణుడాతనిని శిష్యునిగా స్వీకరింపకుండుటయు, పరోక్షముగా నేర్చిన విద్య నిరర్థకమయినది.

ధర్మజుడు ద్యూతము నాడు విషయమున "ఆహూతోఽపి పరైః రాజా క్షాత్రం వ్రతమనుస్మరన్" అను యుండుటవలన ధర్మజుడు పరులాహ్వానించుట వలన క్షాత్రధర్మము ననుసరించి జూదమునకు ప్రవృత్తుడయ్యెనేకాని ద్యూతవ్యసనుడై

జూదమాడలేదనియు డా. యమ్మీ పి. శ్రీరామచంద్రమూర్తి గారు సప్రమాణముగ నిరూపించినారు. ద్రౌపతి ప్రాతికామితో ముందు తన్ను తానోడెనో లేక నన్నోడెనో అగుడుమనినది. ఈ విషయమున వికర్ణ విదురులు చేసిన ధర్మనిర్ణయములు అరణ్యరోదనములయినవి. భీష్మద్రోణాదుల మాధ్యస్థ్యము భంగమగునని తలంచి మిన్నకుండిరనుట యుక్తి యుక్తము.

ఇంద్రుడు బ్రాహ్మణవేషమున వచ్చి కర్ణుని వంచించినాడని పలుకు నజ్ఞుల యభిప్రాయమును దూరముచేయుచు, కర్ణునకు సూర్యుడు చేసిన ప్రబోధమును, ఇంద్రుడు వచ్చి కవచకుండలములను యాచించిన విధానమును, తద్విషయమున కర్ణుడు ఇంద్రుడంతటివాడు వచ్చి తన్ను యచించినచో తాను మిన్నకుండజాలనని పలికి తన స్వీయాభిప్రాయమును స్పష్టముగా విశదీకరించినాడు.

ద్రౌపది కర్ణు నారవవానిగ భావించు నను ప్రసంగమున "షష్ఠే చ త్వాం తథా కాలే ద్రౌపద్యుపగమిష్యతి" అను కృష్ణుని ఎత్తి పొడుపు వాక్యమునకు "యదబ్రువ మహం కృష్ణ కటుకాని స్మ పాండవాన్. ప్రియార్థం ధార్తరాష్ట్రస్య తేన తప్యేహ్యకర్మణా" అని పశ్చాత్తాపమును ప్రకటించినాడు. అంతేకాని కృష్ణుడు ఇపుడామె నిన్ను ఆరవవానినిగా వరించునని అర్థము కాదను విషయమును వక్తృబుద్ధి సన్నిధాపితనుగు నర్థమును శ్రీరామచంద్రమూర్తిగారు విస్తృతముగా వివరించినారు.

అర్జునుడు నియోగ విధిననుసరించియే ఉలూపియందు ఇలావంతుని కనెననియు, నర్జునుడామెను వివాహమాడలేదనియు సవిస్తరముగా విశదీకరించినారు.

ధర్మజుడు భీష్మునకు నమస్కరించి జయాశీర్వాదమును కోరినట్లే ద్రోణుని కూడ కోరినందువలన ద్రోణుడు సంతసించి "ధృవస్తే విజయో రాజన్ యస్య మన్త్రీ హరిస్తవ" శ్రీకృష్ణుడు మంత్రియైన నీకు తప్పక విజయం కలుగుతుంది: యుద్ధమున నన్ను వధింపగలవాడులేడు. విశ్వాసపాత్రుని వలన అప్రియవార్తను వినినపుడు మాత్రము నేను శస్త్రమును వీడెదనని ముందుగనే పలికి శరవర్షముతో పాండవ సైన్యమును దునుమాడుచుండుటచే భీమశ్రీకృష్ణుల ప్రోద్బలమున ధర్మసూక్ష్మము ననుసరించి సత్యమునకంటె నసత్యమే మేలని తలంచి "అశ్వత్థామా హతః" అని బిగ్గరగా పలికి "కుంజరః" అన్ని మెల్లగా పలికెను. ! అబద్ధమైనను చెప్పవచ్చును గాని ప్రాణిహింస చేయకూడదను ధర్మసూక్ష్మము ననుసరించి యట్లు పలికెనని తెలిసికొనవలయును. పైగా ఆ యుద్ధమున ద్రోణుడు ఆతతాయి అయినాడు. ఆతతాయిని విచారింపక చంపవచ్చునని శాస్త్రము. కనుక ధృష్టద్యుమునిచే ద్రోణుడు హతుడైనాడు.

విరథుని, కవచరహితుని పారిపోవువానిని, శరణు వేడినవానిని వధింపరాదన్నది యుద్ధ ధర్మమే యయినను తనను జంప ప్రయత్నించుచున్న కర్ణుని అదను చూచి వధించుట పార్థుని తప్పుగాదు. బ్రాహ్మణశాపఫలితముగ రథచక్రము క్రుంగినది. కర్ణుడు బ్రతికియుండగా నెంతపెనగులాడినను రథచక్రము పైకి లేవలేదు. తాను చచ్చిన వేంటనే చక్రము తనంతట తానే పైకి లేచినది. కనుక శల్య సారథ్యము, బ్రాహ్మణశాపము, రథచక్రము భూతలగ్రస్తమగుట యనునవి కర్ణుని వధకుపకరించినవని గ్రంథకర్త యీ విషయములను స్పష్టపరచినారు.

భీముడు దుర్యోధనుని తొడలు విరగగొట్టుటయనునది ప్రతిజ్ఞావిశేషధర్మము. గదాయుద్ధమున నాభికి క్రిందిభాగమున కొట్టకూడదనుట సామాన్య ధర్మము. సామాన్యధర్మము కంటె విశేషధర్మమే ప్రబలము కనుక, ప్రతిజ్ఞాసాధనముల నధర్మము కానేరదని తలంచవలయును.

ద్యూతసమయమున శ్రీకృష్ణుడున్నచో తాను దానిని నివారించెదనని చెప్పుట సర్వగతుడగు చక్రి తాను జూదమును ధర్మజునిచే నా సమయమున స్మరింపబడకుండుటచే వారింపలేదను కృష్ణుని యభిప్రాయము చక్కగా విపులీకరింపబడినది.

ఇక గీతోపదేశము శరసంధానము చేయునపుడు గాక ఉభయపక్షసైన్యములు వ్యూహములు పన్నుకొని సిద్ధముగా నుండు సమయముననే యుద్ధప్రారంభమున కంటె ముందుగనే జరిగినదని తెలియవలెను. ఈ విషయము గూడ కూలంకషముగ చర్చింపబడినది.

కృష్ణార్జునులు క్షత్రియులకు నిషిద్ధముగాని మధ్వాసవములను సేవించినారని " ఉభౌ మధ్వాసవక్షీబా వుభౌ చందనచర్చితౌ " అను దానికర్థము దానిని తగిన విధమున తీసికొని హెచ్చరికగ నున్నారని తెల్పుటయే సంజయుని యాశయమని స్పష్టీకరింపబడినది.

విరటుని కొల్వులో ధర్మజుడు తనను గూర్చి చెప్పుకొనిన వాక్యములన్నియు ధర్మభూయిష్ఠములే గాని యధర్మభూయిష్ఠములు గావనియు, నవన్నియు పరంపరాసంబంధములచే సత్యములే యనియు, నజ్ఞాతవాససమయమున నట్లు పలుకుట తప్పని సరియనియు నవి సత్యదూరములు కావనియు నిరూపింపబడినది.

ఇట్లే మిగిలిన విషయములన్నియు నీ గ్రంథమున చక్కగా యుక్తి యుక్తముగా

పొందుపరుపబడినవి. కనుక భారతాఖ్యానములందలి శంకానివారణమును గోరువారలకీ గ్రంథమెంతయో యుపకరించుననుటలో సందియము లేదు.

ఇట్టి ధర్మశాస్త్రవిషయములను , సూక్ష్మధర్మములను డా. యం.జి.పి శ్రీరామచంద్రమూర్తిగారు ఆయా సందర్భములందు ప్రమాణపురస్సరముగ నీ గ్రంథమున పొందుపరచియున్నారు. ఇట్టి సూక్ష్మధర్మములన్నియు లోకులకు, చదువరులకు తెలియవలసియున్నది. ధర్మప్రవృత్తిగలవాడు, గీతాచార్యుడు చెప్పినట్లు, "తనను తానుద్ధరించుకొనవలయును. తనను తానే అధోగతి పాలుచేసికొనును. తనకు తానే బంధువు. తనకు తానే శత్రువు" అను మాటను మరువ కూడదు. ధర్మప్రవృత్తి గల శ్రీ శ్రీరామచంద్రమూర్తిగారిట్టి గ్రంథముల నింకను తరచి తరచి సులభశైలిలో నందరికీ అర్థమగునట్లు వ్రాయుటకు భగవంతుడు వారికాయురారోగ్య - ఐశ్వర్యములను ప్రసాదించుగాక.

హైదరాబాదు
1-1-2000 ఇతి శమ్

# కృతజ్ఞతలు

బాల్యమున చదువుకొన వలసిన ప్రాయములో అభిలాష యున్నను పరిస్థితులను కూలింపక జీవికకై ప్రాకులాడవలసివచ్చినది. నలుబది యేండ్లు ఉద్యోగముచేసి అంచెలంచెలుగా వృద్ధిచెంది 1992 ఫిబ్రవరిలో జిల్లా అభివృద్ధి అధికారిగా పదవీ విరమణ చేసితిని. ఈ మధ్యకాలములో నూరకుండక చేతనైనంత మేర రచనా వ్యాసంగమును చేయుచునే యుంటిని. 1995 లో ఆంధ్ర విశ్వవిద్యాలయమునుండి తెలుగులో ఎమ్. ఎ. పట్టభద్రుడనైతిని. డాక్టరేట్ చేయవలెనను కోరికతో కాకతీయవిశ్వవిద్యాలయమునాచార్యులుగా నున్న డా. హరి శివకుమారు గారిని సంప్రదించి, 'ఆంధ్ర మహాభారతములో ధర్మసూక్ష్మములు' అను నంశమును 1997 లో పరిశోధనకు స్వీకరించితిని కాకతీయవిశ్వద్యాలయమున డీన్ ఫాకల్టీ ఆఫ్ ఆర్ట్సుగానున్న అస్మద్గురువర్యులు బ్రహ్మ శ్రీ ఆచార్య డా॥ హరి శివకుమారు గారే పర్యవేక్షణ బాధ్యతనుస్వీకరించి, ఆ సీమాంతము చేయూతనిచ్చి, నా యీ పరిశోధనను పూర్తిచేయించిరి. వారికి నా హార్దిక కృతజ్ఞతాంజలులు. ఈ అంశము పై పరిశోధనకను మతించిన విశ్వవిద్యాలయాధిపతులకు తెలుగు శాఖాధ్యక్షురాలు డా॥ పి. జ్యోతి గారికి బోర్డ్ ఆఫ్ స్టడీస్ ఛైర్మన్ డా ॥ రుక్మిణి గారికి తెలుగు శాఖాచార్యులకు వినయపూర్వక కృతజ్ఞతాంజలులు.

ఈ సిద్ధాంతగ్రంథ రచనాసందర్భములో నాకు సహకరించిన సంభావిత గ్రంథముల పట్టిక యొసంగితిని. ఆయా గ్రంథకర్తలకు నా కృతజ్ఞతాపూర్వక నమస్కృతులు.

నా యీ సిద్ధాంతగ్రంథముపై కోరిన వెంటనే తమ అమూల్యాభిప్రాయముల నొసంగి అనుగ్రహించిన అస్మద్గురువర్యులు బ్రహ్మశ్రీ ఆచార్య డా॥ హరి శివకుమార్ గారికి, ఆంధ్రవిశ్వవిద్యాలయమునందాంధ్రాచార్యులు బ్రహ్మశ్రీ ఆచార్య వేదుల సుబ్రహ్మణ్య శాస్త్రిగారికి, బ్రహ్మశ్రీ డా॥ కంభంపాటి సీతారామాంజనేయులు గారికి భక్తిపూర్వక నమస్కారములు.

ఈ గ్రంథమును చక్కగా సకాలములో ముద్రించి యిచ్చిన ఆర్.కె. ప్రింటర్స్ హైద్రాబాద్ అధినేతలు బ్రహ్మశ్రీ డా॥ కంభంపాటి సీతారామాంజనేయులు గారికి, వారి సిబ్బందికి కృతజ్ఞతాంజలులు.

గ్రంథముద్రణ నేటికాలమునననుసరించి మిక్కిలి వ్యయభరితము. కోరిన వేంటనే నా ఆప్తమిత్రులు, సాహితీబంధువులు ఉదారస్వభావముతో భూరివిరాళముల నొసంగిరి.

వారి ఆర్థిక సహాయ్యమే లేనిచో నీ గ్రంథముద్రణ సాధ్యమయ్యెడిది కాదు. అట్టి వదాన్యులైన సాహితీమిత్రులకు, వారి కుటుంబములకు ఆ పరమేశ్వరుడా యురారోగ్యైశ్వర్యముల నొసంగి బ్రోచుగాక !

ఇట్లు

స్తంభాద్రి బుధజన విధేయుడు

5-1-2000 యం.జి.పి. శ్రీరామచంద్రమూర్తి

# ఆంధ్ర మహాభారతములో ధర్మసూక్ష్మములు

## అనుక్రమణిక

## సంకేతముల పట్టిక

వి.పు. - విష్ణుపురాణము

దేవీ.భాగ- దేవీ భాగవతము.

మ.భా.వి.- మహాభారతవిమర్శనము.

మ.భా.ఉ. - మహాభాతము ఉపన్యాసములు.

మ. భా.సా - మహాభారత సారోద్ధారము.

సం.భా - సంస్కృత భారతము.

మ.భా.తత్త్వ - మహాభారత త్త్వకథనము.

మను. - మనుస్మృతి

శ్లో॥ భక్త్యా భాగవతం జ్ఞేయం భక్త్యా యుక్త్యా చ భారతమ్ ।
భక్త్యా యుక్త్యా చ బుధ్యా చ జ్ఞేయం రామాయణార్ణవమ్॥

ఓమ్ మహా గణాధిపతయే నమః

# ఆంధ్రమహాభారతములో ధర్మసూక్ష్మములు

వేదవ్యాస ప్రశంస -

వ్యాసాయ విష్ణురూపాయ వ్యాసరూపాయ విష్ణవే
నమో వై బ్రహ్మనిధయే వాసిష్ఠాయ నమో నమః.

కృతత్రేతాద్వాపరకలియుగములు కలిపి ఒక మహాయుగము. అట్టి 71 మహాయుగములు ఒక మన్వంతరము. అట్టి 14 మన్వంతరములు సంధియుగములు కలిసి ఒక వేయి మహాయుగములైనచో, అనగా 432 కోట్ల సంవత్సరములైనచో, బ్రహ్మకు ఒక పగలు. కృతయుగమున నాలుగు పాదములతోను, త్రేతాయుగమున మూడు పాదములతోను, ద్వాపరయుగమున రెండుపాదములతోను కలియుగమున నొక్కపాదముతోను ధర్మము నడచుచుండును. ఏకరూపముగా నున్న వేదమును కలియుగమునందలి జనులు అల్పాయుష్కులు నల్పబుద్ధులు నగుటచే వారు ధారణ చేయలేరు కనుక ప్రతిద్వాపరాంతమునందును భగవానుడు వ్యాసరూపమున నవతరించి వేదవిభజన చేసి పురాణసంహితను ప్రజలకందించును. ఇప్పుడేడవదైన వైవస్వతమన్వంతరము నడుచుచున్నది.

అతీతానాగతానీహ యాని మన్వన్తరాణి వై
తాన్యహం భవతస్సమ్యక్కథయామి యథాక్రమమ్
స్వాయంభువో మనుః పూర్వం పరస్స్వారోచిషస్తథా
ఉత్తమస్తామసశ్చైవ రైవతశ్చాక్షుషస్తథా
షడేతే మనవోఽతీతా స్సాంప్రతం తు రవేస్సుతః
వైవస్వతోఽయం యస్యైతత్సప్తమం వర్తతేఽన్తరమ్.

(విష్ణుపు. III-1–5,6,7 శ్లో)

అనగా నీ మహా కల్పమునందు అతీతములైనవియు అనాగతములైనవియునగు మన్వంతరములను క్రమముగ చెప్పెను. స్వాయంభువమనువు, స్వారోచిషుడు, ఉత్తముడు, తామసుడు, రైవతుడు, అచాక్షుషమనువు అను నారుగురు మనువులు గతించిరి. ప్రస్తుతము సూర్య పుత్రుడగు వైవస్వతమనువుయొక్క అంతరము అనగా నేడవమన్వంతరము జరుగుచున్నది.

ఇందులో 27 మహాయుగములు గడచి 28వ మహాయుగము నడచుచున్నది.

వ్యాసుడనునది ఒక వ్యక్తి నామము కాదు, అది పదవీనామము. ఈ పదవిలోనున్న వారందరూ వ్యాసులే. ఇందుకు ప్రమాణము విష్ణుమహాపురాణము. తృతీయాంశము-తృతీయాధ్యాయశ్లోకములు. అనగా వైవస్వతమన్వంతరమునందలి ద్వాపరయుగము లందు వేదము ఇరువదియెనిమిది పర్యాయములు విభక్తమయినది. ఇరువది యెనమండుగురు వ్యాసులు గతించినారు.

ద్వాపరే ప్రథమే వ్యస్తస్స్వయం వేదస్స్వయంభువా ।
ద్వితీయే ద్వాపరే చైవ వేదవ్యాసః ప్రజాపతిః
తృతీయే చోశనా వ్యాసశ్చతుర్థే చ బృహస్పతిః ।
సవితా పఞ్చమే వ్యాసష్షష్ఠే మృత్యుస్స్మృతః ప్రభుః॥
సప్తమే చ తథై వేన్ద్రో వసిష్ఠశ్చాష్టమే స్మృతః ।
సారస్వతశ్చ నవమే త్రిధామా దశమే స్మృతః ॥
ఏకాదశే తు త్రివృషా భరద్వాజ స్తతఃపరః ।
త్రయోదశే చాన్తరిక్షో ధర్మీ చాపి చతుర్దశే ॥
త్రయ్యారుణిః పఞ్చదశే షోడశే తు ధనంజయః ।
కృతంజయస్సప్తదశే సంజయోఽష్టాదశే స్మృతః ॥
తతో వ్యాసో భరద్వాజో భరద్వాజాత్తు గౌతమః ।
గౌతమాదుత్తమో వ్యాసో హర్యాత్మా యోఽభిధీయతే ॥
అథ హర్యాత్మనో వేనస్స్మృతో వాజశ్రవాస్తు యః ।

సోమశుష్మాయణ స్తస్మాత్తృణబిన్దురితి స్మృతః ॥
ఋక్షోऽ భూద్భార్గవస్తస్మాద్వాల్మీకిర్యోऽ భిధీయతే ।
తస్మాదస్మత్పితాऽశ క్తిర్వ్యాసస్తస్మాదహం మునే ॥
జాతుకర్ణో భవన్మత్తః కృష్ణద్వైపాయనస్తతః ।
అష్టావింశతిరిత్యేతే వేదవ్యాసాః ప్రకీర్తి తాః ॥
ఏకో వేదశ్చతుర్ధా తు తైః కృతో ద్వాపరాదిషు ॥
భవిష్యే ద్వాపరే చాపి ద్రౌణిర్వ్యాసో భవిష్యతి।
వ్యతీతే మమ పుత్రేస్మిన్ కృష్ణద్వైపాయనే మునే ॥

-వి. పు III అ. 3. 11-21 శ్లో

అనగా ప్రథమద్వాపరయుగమునందు స్వయంభువుని (బ్రహ్మ) చే వేదవిభాగము చేయబడెను. రెండవద్వాపరయుగమున ప్రజావతిమనువు వేదవ్యాసుడాయెను. తృతీయద్వాపరయుగమున ఉశనుడు (శుక్రుడు) ను, చతుర్థద్వాపరమున బృహస్పతియు, పంచమద్వాపరమున సవితయు (సూర్యుడును) షష్ఠద్వాపరమున మృత్యుదేవతయు, సప్తమద్వాపరమున ఇంద్రుడు, అష్టమద్వాపరమున వసిష్ఠుడు, నవమద్వాపరమున సారస్వతుడు (బ్రహ్మ) దశమద్వాపరమున త్రిధాముడు, ఏకాదశద్వాపరమున త్రివృషుడు, ద్వాదశమున భరద్వాజుడు, త్రయోదశద్వాపరమున నంతరిక్షుడు, చతుర్దశ ద్వాపరమున వర్ణియు, పంచదశద్వాపరమున త్రయ్యారుణియు, షోడశద్వాపరమున ధనంజయుడును, సప్తదశద్వాపరమున ఋతుంజయుడును, అష్టాదశద్వాపరమున జయుడును, తరువాత భరద్వాజుడు, గౌతముడు, హర్యాత్మ, వాజశ్రవముని, సోమశుష్మాయణ వంశీయుడయిన తృణబిందువు, భృగువంశీయుడైన ఋక్షుడు, వాల్మీకి, వాని తరువాత మా తండ్రియగు శక్తియు, తరువాత నేను (పరాశరుడు) జాతుకర్ణుడు కృష్ణ ద్వైపాయనుడు వ్యాసులైరి. పూర్వపు వేదవ్యాసులగు వీరు ఇరువది యెనమండ్రుగురు. ద్వాపరాదులందు వీరిచే నొక్కటిగా నున్న వేదము నాలుగు వేదములుగా విభజింపబడినది. రాబోవుద్వాపరమున కృష్ణద్వైపాయనుని యనంతరము ద్రోణపుత్రుడగు అశ్వత్థామ వ్యాసుడు కాగలడు.

ఈ విషయమునే దేవీభాగవతముకూడ విశదీకరించుచున్నది.

"మన్వంతరేషు సర్వేషు ద్వాపరే ద్వాపరే యుగే
ప్రాదుఃకరోతి ధర్మార్థీ పురాణాని యథావిధిః
ద్వాపరే ద్వాపరే విష్ణుర్వ్యాసరూపేణ సర్వదా
వేదమేకం స బహుధా కురుతే హితకామ్యయా
అల్పాయుషో అల్పబుద్ధీంశ్చ విప్రాన్ జ్ఞాత్వా కలావథ
పురాణసంహితాం పుణ్యం కురుతేఽసౌ యుగే యుగే.

(దేవీ భాగ- 1-3- 18-19- 20 శ్లో.)

శ్రీమద్భాగవతమునందును "వ్యాసో నారాయణస్సాక్షాత్" అని చెప్పబడినది బృహన్నారదీయము 92 వ అధ్యాయమున " శ్రీహరిర్వ్యాసరూపేణ జాయతే చ యుగే. యుగే " అని చెప్పబడినది.

" వ్యస్త వేదతయా వ్యాస ఇతి లోకే శ్రుతో మునిః
అయం సాక్షాన్మహాయోగీ వ్యాసస్సర్వజ్ఞ ఈశ్వరః

మ. భా. వి. పు 4

అనియు శ్రీ విష్ణుపురాణమునందును,
కృష్ణద్వైపాయనం వ్యాసం విద్ధినారాయణం ప్రభుం
కో హ్యన్యః పుండరీకాక్షాన్మహాభారతకృద్భవేత్"

మ. భా. వి. పు 4

అనియు చెప్పబడినది. భగవంతుని ఇరువదియొక్క అవతారములను చెప్పుచు వ్యాసుని పదునేడవ అవతారముగా చెప్పబడినది.

"తతః సప్తదశే జాతః సత్యవత్యాం పరాశరాత్
చక్రే వేదతరోశ్శాఖా దృష్ట్వా పుంసోఽల్పమేధసః"

మ. భా. వి. పు 4

పరాశరమహర్షివలన సత్యవతీదేవియందు వ్యాసరూపమున నవతరించి. వేదములను నాలుగు భాగములుగా విభజించి అష్టాదశపురాణములను, అష్టాదశ ఉపపురాణములను, బ్రహ్మసూత్రములను, మహాభారతము మున్నగునవెన్నియో

లోకమునకు ప్రసాదించిన మహనీయుడే కృష్ణద్వైపాయనుడు.

వ్యాసుని పూర్వజన్మవిషయమున వ్యాసభారతము శాంతి పర్వము 350వ అధ్యాయమున జనమేజయుని ప్రశ్నకు వైశంపాయను డిట్లు చెప్పెను. పూర్వకాలమున జగత్స్రష్టయగు బ్రహ్మదేవుడు వేదము నుచ్చరించుచు 'భో' అను శబ్దమును ధ్వనింపజేసెను. అప్పుడు 'అపాంతరమా' అను పేరుగల వాక్కునుండి పుట్టిన కుమారుడు ఉద్భవించెను. అతడు భూతభవిష్యద్వర్తమానముల నెరింగినవాడును, సత్యవాక్కుగలవాడును, దృఢమైన వ్రతముగలవాడును ఆయెను. తనకు నమస్కరించుచున్నట్టి కుమారునిగూర్చి బ్రహ్మదేవుడిట్లు నుడివెను.

" ఓ బుద్ధిమంతుడా ! వేదములను చెప్పుట నీవల్ల శ్రవణము చేయదగి యున్నది. మరియు వైవస్వతమన్వంతరము రాగా కురువంశీయులగు భారత రాజులు పుట్టగలరు. వారు గొప్ప వారును, లోకమునందు ప్రసిద్ధినొందినవారును కాగలరు. నీనుండి పుట్టిన వారలకు విరోధము సంభవించును. వసిష్ఠమహర్షినుండి పరాశరుడను మహర్షియు సంభవింపగలడు. వానిని నిమిత్తముగా చేసికొని పుట్టి నీవు భారతమును రచింపగలవు. ఈ విధముగా సరస్వతీకుమారుడైన అపాంతరమ ఋషినిగూర్చి బ్రహ్మదేవుడు చెప్పెను. ఆవిధముగా బ్రహ్మయనుగ్రహముచే అపాంతరమ ఋషియే హరియంశచే మరల వ్యాసుడుగా నవతరించెను. ఈ విధముగా శ్రీ మహావిష్ణువే సత్యవతీదేవియందు కృష్ణ ద్వైపాయనుడుగా పరాశరమహర్షివలన నుద్భవించిన వాడాయెను.

> "న్యస్తో ద్వీపేన యద్బాల: తస్మాద్ద్వైపాయనస్స్మృత:
> యే వ్యస్య వేదాంశ్చతుర: తపసా ? భగవాన్ ఋషి:
> లోకే వ్యాసత్వమాపేదే కార్ష్ణ్యాత్ కృష్ణత్వమేవ చ "

మ. భా. ఉ..పు.25

పరాశరునివలన కలుగుటచే పారాశర్యుడనియు, ద్వీపమునందు బుట్టుటచే ద్వీపము (అయనము) గలవాడు గాన ద్వైపాయనుడనియు, నల్లగానుండును కనుక ఆ నదియందలి ద్వీపమున బుట్టుటచేతను కృష్ణవర్ణము కలిగియుండుటచేతను కృష్ణద్వైపాయనుడనియు, సత్యవతి కుమారుడగుటచే సాత్యవతేయుడనియు, వేదములను విభజించి విస్తరింపజేయుటచే వ్యాసుడనియు, వేదవ్యాసుడనియు నామము లేర్పడెను. నీలకంఠులు ఈ ప్రదేశముననే " ఈశ్వరాదనవ్యత్వాత్ కృష్ణత్వం" అని

స్వారస్యమును చెప్పిరి. జగదీశ్వరుడైన శ్రీమహావిష్ణువు కృష్ణవర్ణుడు గనుకను కృష్ణ ద్వైపాయనుడు శ్రీమహావిష్ణువుయొక్క అవతారమగుటచే నాతనిశరీరము కృష్ణవర్ణము కలది యని.

వ్యాసునిగూర్చి యొకప్రశంస లోకమున గలదు.

"అచతుర్వదనో బ్రహ్మా ద్విబాహురపరో హరిః

అఫాలలోచనశ్శంభుః భగవాన్ బాదరాయణః."

భా. ఉ. పు 25

ఆయన నాలుగు ముఖములులేని బ్రహ్మయట. రెండే బాహువులుగల శ్రీ మహావిష్ణువట, మూడవ నేత్రములేని ఈశ్వరుడట. అనగా త్రిమూర్త్యాత్మకుడని అర్థము.

ఋషులకు అతీంద్రియపదార్థముల విషయమయి ఆత్మమనస్సంయోగమువలన ధర్మాతిశయమును బట్టి కలిగెడు యథార్థజ్ఞానము ప్రాతిభమనియు ఆర్షమనియు చెప్పబడును. అది ఋషులకు, దేవతలకు బహుళముగా నుండును. లౌకికముగా క్వాచిత్కమయి యుండును కనుకనే రేపు నా సోదరుడు వచ్చునని నా హృదయము చెప్పుచున్నది అని ముందుగా చెప్పుదుము. దీనినే sixth sense అనుచున్నాము. ఈ ప్రమాణములు చూడగా ఋషులు మనవంటి వారు కారనియు, మనకు అస్వాభావికమయినది ఋషులకు స్వాభావికమే యగుననియు, త్రైకాలికజ్ఞానము వారికి తపః ప్రభావమున కలదనియు స్పష్టమగుచున్నది. వేదవ్యాసమహర్షి తానఖండతపస్సు చేసి త్రైకాలికజ్ఞానమును పొందినట్లు తన శిష్యులకు జెప్పెను.

పరాశరసుతశ్శ్రీమాన్ వ్యాసో వాక్యమథాబ్రవీత్

మయా హి సుమహత్తప్తం తపః పరమదారుణమ్ ॥

భూతం భవ్యం భవిష్యం చ జానీయామితి సత్తమాః

తస్య మే తప్తతపసో నిగృహీతేన్ద్రియస్య చ ॥

నారాయణప్రసాదేన క్షీరోదస్యానుకూలతః

త్రైకాలికమిదం జ్ఞానం ప్రాదుర్భూతం యథేప్సితమ్ ॥

తచ్ఛృణుధ్వం యథాన్యాయం వక్ష్యే సంశయముత్తమమ్

యథావృత్తం హి కల్పాదౌ దృష్టం మే జ్ఞానచక్షుషా ॥

(మహాభారతం శాంతి 34. అధ్యా)

నేను భూతభవిష్యద్వర్తమానముల వృత్తాంతములను తెలిసికొనుటకై దారుణమయిన తపస్సు చేయగా నారాయణానుగ్రహమువలన త్రైకాలికజ్ఞానము నేను కోరినట్టు ప్రాప్తించినది. కల్పాదియందేది జరిగినదో నా దివ్యదృష్టికి గోచరించినది. చెప్పెదను వినుడని భావము.

## మహాభారత ప్రశంస :

" నారాయణం నమస్కృత్య నరం చైవ నరోత్తమం,
దేవీం సరస్వతీం వ్యాసం తతో జయముదీరయేత్"

మ. భా. సా. పు 8

ప్రతిపురాణమునకును ఆదిని 'నారాయణం నమస్కృత్య తతో జయముదీరయేత్' అని యున్నది. శ్రీమద్భాగవతద్వితీయాధ్యాయమున కథారంభముచేయు సూతుడు గురునమస్కారానంతర మీశ్లోకమును జెప్పెను. అచ్చట జయమును జెప్పుచున్నాననియు చెప్పెను. శ్రీధరీయమున జయత్యనేన సంసారమితి జయో గ్ర ంథః అని వ్యుత్పత్తి చెప్పబడినది. దీనిచేత ఈ సంసారము జయింపబడును కనుక జయమని భావము. మహాభారత మాదియందున్న "నారాయణం నమస్కృత్య తతో జయ ముదీరయేత్" అను చోట నీలకంఠీయము నందిట్లున్నది. "జయో నామేతి హాసో ऽయమితి వక్ష్యమాణత్వాత్ జయసంజ్ఞం భారతాఖ్యమితిహాసం వా"

అష్టాదశపురాణాని రామస్యచరితం తథా, కార్ష్ణ్యం వేదం పంచమం చ యన్మహాభారతం విదుః

తథైవ విష్ణుధర్మాశ్చ శివధర్మాశ్చ శాశ్వతాః
జయేతి నామ తేషాం చ ప్రవదంతి మనీషిణః.
ఇతి భవిష్యవచనాత్పురాణాదికం వా
చతుర్ణాం పురుషార్థనామపి హేతౌ జయోऽస్త్రి యామ్

- మ. భా. సా. పు 8

ఇతి కోశాదన్యం వా సర్వపురుషార్థప్రతిపాదకం గ్రన్థం శారీరకసూత్రభాష్యాది రూపముదీరయేత్. జయమనగా జయమను పేరుగల భారతాఖ్యమని యర్థము.

ప్రసిద్ధి చెందిన మహాభారతమును జయమనెడి పేరుతో విద్వాంసులు చెప్పుచున్నారు. అదే విధముగా విష్ణుధర్మములును సనాతనమయిన శివధర్మములును జయమను పేరుగలవని విద్వాంసులు వ్యవహరించుచున్నారు. చతుర్విధపురుషార్థములు నీ భారతముచే పుష్కలముగా వృద్ధినొందుచున్నవి. గాన జయమనగా మహాభారతమని యర్థము. అక్షరసంఖ్యానిఘంటువుననుసరించి "జ" అనగా నెనిమిది. "య" అనగా నొకటి. "అంకానాం వామతో గతి:" యనుటచే చివరనుండి పఠించిన పదునెనిమిది యగును. అవియే పదునెనిమిది పర్వములు.

"లక్షం తు చతురో వేదా లక్షం తు భారతమేవ చ
ధర్మే చార్థే చ కామే చ మోక్షే చ భరతర్షభ
యదిహాస్తి తదన్యత్ర యన్నేహాస్తి న తత్క్వచిత్"

సం. భా. ఆది. 1 అ

నాలుగు వేదములును లక్ష గ్రంథప్రమాణము గలవి. ఈ మహాభారతమును లక్షగ్రంథ ప్రమాణముగలదియే. ధర్మవిషయమునను, అర్థ విషయమునను, కామ విషయమునను, మోక్ష విషయమునను నిచ్చట నున్నదియే ఇతర గ్రంథమునందును గలదు. ఇయ్యది ధర్మార్థ కామమోక్ష చతుర్విధ పురుషార్థసాధకము.

ఆదికవి నన్నయభట్టారకులు మహాభారతప్రాశస్త్యమునిట్లు గ్గడించిరి.

ధర్మశాస్త్రజ్ఞులు ధర్మశాస్త్రం బని
యధ్యాత్మవిదులు వేదాంతమనియు
నీతివిచక్షణుల్ నీతిశాస్త్రంబని
కవివృషభులు మహాకావ్యమనియు
లాక్షణికులు సర్వలక్ష్య సంగ్రహమని
యైతిహాసికు లితిహాసమనియు
బరమపౌరాణికుల్ బహుపురాణసముచ్చ
యంబని మహి గొనియాడుచుండ
వివిధ వేదతత్త్వవేది వేదవ్యాసు
డాదిముని పరాశరాత్మజుండు

విశ్వసన్నిభుండు విశ్వజనీనమై
పరగుచుండ జేసె భారతంబు.

మ. భా. ఆది. 1 అ. 32

ఇయ్యది ధర్మశాస్త్రము, వేదాంతము, నీతిశాస్త్రము, మహాకావ్యము, సర్వలక్ష్య సంగ్రహము, ఇతిహాసము, బహుపురాణసముచ్చయము, వ్యాసభారతము పరమ గంభీరరమణీయార్థప్రతిపాదకము. వ్యాసభారతిని సంపూర్ణముగా నర్థము చేసికొనగల్గుట యెట్టివారికిని అసాధ్యము. ఇట్టి భారతమునకు లేఖకుడు విఘ్నేశ్వరుడు.

"గ్రంథగ్రంథిం తథా చక్రే మునిర్గూఢం కుతూహలాత్
యస్మిన్ ప్రతిజ్ఞయాది ప్రాహ మునిర్ద్వైపాయనస్త్విదమ్
అష్టౌ శ్లోకసహస్రాణి హ్యాష్టౌ శ్లోకశతాని చ
అహం వేద్మి శుకో వేత్తి సంజయో వేత్తి వా న వా"

మ. భా. తత్త్వ.పు 33

గణేశుడు తన ఘంటమునాపకుండునట్లు వ్యాసులు భారతమును చెప్పవలయు ననియు, వ్యాసులు చెప్పిన భారతశ్లోకములనర్థమెరింగి గణేశుడు వ్రాయవలెననియు బరస్పరము నియమము జేసుకొనిరి.

గణేశుని వ్రాతయందలి వేగమును అరికట్టవలెనను కుతూహలముతో మధ్య మధ్య వ్యాసమహర్షి కొన్ని గ్రంథగ్రంథులను జేసెను.

"సర్వజ్ఞోఽపి గణేశో యత్క్షణమాస్తే విచారయన్ "

సర్వజ్ఞుడయిన గణేశుడే వ్రాయుటనాపి ఆ శ్లోకములనర్థము నెరుంగుటకు క్షణకాల మాలోచింపవలసివచ్చెను. అట్టి శ్లోకములే 8800, వాని యర్థము దురవగాహమని వ్యాసమహర్షియే చెప్పెను. ఈ శ్లోకముల యర్థము నాకు తెలియును. శుకునకు తెలియును, సంజయునకు దెలియునో లేదో అని వచించెను. (కొందరు సంజయో వేత్తి, వా, న = గణపతివేత్తివా తెలుసుకొనునో లేదో అని చెప్పెదరు.

భారతమనగా "భా సూర్యః - ర అగ్నిః తం-చంద్రః" చంద్రసూర్యాగ్ని చంద్రసంయోగాదేవ చరాచరాత్మసృష్టిరిత్యర్థః అని బీజాక్షరనిఘంటువు.

సూర్యచంద్రాగ్నుల సంయోగమువలననే సమస్తచరాచరప్రపంచముయొక్క సృష్టి జరుగుచున్నదని తాత్పర్యము.

"ధర్మార్థకామమోక్షాణాముపదేశసమన్వితమ్
పూర్వవృత్తకథాయుక్తమితిహాసం ప్రచక్షతే"

- మ. భా. సా.పు 34

అని ఇతిహాసలక్షణము. కావ్యమీమాంసా వృత్తియందు ధర్మార్థకామమోక్షముల యొక్క యుపదేశములతో కూడుకొనియున్నదియు, పూర్వము జరిగిన కథావృత్తము కలిగిన దానిని ఇతిహాసమని చెప్పుచున్నారు. ఈ ఇతిహాసములు రెండు విధములు, పరక్రియ, పురాక్రియ అనునవి. ఒకే నాయకుడు కలిగినది పరక్రియ. దీనికి రామాయణము లక్ష్యము. పెక్కుమంది నాయకులు కలది పురాక్రియ లేక పురాకల్పము. ఇందుకు మహాభారతము లక్ష్యము.

"సర్గశ్చ ప్రతిసర్గశ్చ వంశో మన్వంతరాణి చ
వంశానుచరితం చేతి పురాణం పంచలక్షణమ్"

- మ. భా. సా 34

సృష్టి, ప్రతిసృష్టి, వంశములు, మన్వంతరములు పూర్వరాజులకథ అను నీయైదు లక్షణములు కలది పురాణము. మహాభారతము, పురాణేతిహాసము, పురాణేతిహాసములను గూర్చి ఇతిహాససముచ్చయగ్రంథము నందీవిధముగా గలదు.

"ప్రాయేణ పూర్వభాగార్థో ధర్మశాస్త్రేణ కథ్యతే
ఇతిహాసపురాణాభ్యాం వేదాంతార్థః ప్రకాశ్యతే"

మ. భా. సా పు 12

అనియును "అర్థోఽయం బ్రహ్మసూత్రాణాం భారతార్థవినిర్ణయః" అనియును కలదు. ఇతిహాసములనబడు శ్రీమద్రామాయణ, మహాభారతములు పూర్వోత్తర భాగములవలె సపాదలక్షాత్మకమగు నొకేగ్రంథము.ఇతిహాసమనగా వేదార్థ ప్రతిపాదకమగు గ్రంథము. కావుననే వేదోపబృంహణగ్రంథమును బ్రాహ్మణమనియు, వేదార్థనిర్ణయగ్రంథమగు నిరుక్తము నితిహాసమనియును, కావ్యలక్షణ, శ్రీ లక్షితములగుటచే కావ్యములనియు పేర్కొనబడుచున్నవి. ఇంతమాత్రమేగాక నీ రెండును వ్యాసప్రోక్తములే. ఇరువది నాల్గవ మహాయుగమునకు వాల్మీకి వ్యాసుడు, ఇరువదినెనిమిదవ మహాయుగమునకు కృష్ణద్వైపాయనుడు వ్యాసుడనియు పురాణములందు గలదు.

పురాణేతిహాసముల ప్రయోజనమేమన వానిశ్రవణము గావించినవారికి శోకమోహములు పోగొట్టి జ్ఞానోత్పత్తిని గావించి వారికి స్వస్వరూపప్రాప్తియను మోక్షమును అందజేయును.

అర్థపంచక వివరణ గ్రంథమునందు....

"ప్రాప్యస్య బ్రహ్మణో రూపం ప్రాప్తిశ్చ ప్రత్యగాత్మనః
ప్రాప్త్యుపాయం ఫలం ప్రాప్తేః తథా ప్రాప్తివిరోధి చ ॥
వదంతి సకలా వేదా సేతిహాసాః పురాణకాః"

మ. భా. సా. పు 13

అని చెప్పుటచేత సర్వపురాణేతిహాసములును కేవలము ఉపనిషదర్థములే యని నిర్ణయింపబడెను. ఇక నీశ్రీమద్భారతమనుపంచమ వేదవిషయమున శ్రీమద్భాగవతమున

శ్లో ॥ అర్థోఽయం బ్రహ్మసూత్రాణాం భారతార్థవినిర్ణయః ।

మ. భా. సా. ఆది. 14

అని శ్రీ వేదవ్యాసులే యనుగ్రహించిరి.

శ్లో ॥ ప్రాతర్వైదికకర్మణా తదను సద్వేదాంతసచ్చింతయా
పశ్చాత్ భారతమోక్షధర్మమననా ద్వాశిష్ఠరామాయణాత్
సాయం భాగవతార్థదివ్యకథయా రాత్రౌ నిదిధ్యాసనాత్
కాలో గచ్ఛతి సచ్ఛరీరభరణం ప్రారబ్ధకర్మార్పితమ్

మ. భా. సా. పు 14

అని ఆదిశంకరులు సెలవిచ్చిరి. మరియు "ప్రాతః ద్యూతప్రసంగేన మధ్యాహ్నే స్త్రీప్రసంగతః రాత్రౌ చోరప్రసంగేన కాలో గచ్ఛతి ధీమతాం " అనియు ఒక ఆభాణకము. ప్రాతఃకాలమున భారతపారాయణము, మధ్యాహ్నమున రామాయణ ప్రసంగము, రాత్రులందు శ్రీమద్భాగవతప్రసంగముచేత ధీమంతులు కాలక్షేపము చేయుదురుగాక.

--- (మహాభారతసారోద్ధారమునుండి)

ఉమాసంహిత యందు సాక్షాత్ పరమేశ్వరుడు పార్వతీదేవితో నీ విధముగా జెప్పెను..

ఇతిహాసావిమే ప్రోక్తే శ్రీరామాయణభారతే
అత్యంతసాత్వికతమే శ్రోతవ్యే ముక్తికాంక్షిభిః ॥

యదిహాస్తి తదన్యత్ర యన్నే హాస్తి న కుత్రచిత్ ॥
భారతాద్రామాయణవృత్తాద్వా యస్య న స్యాత్ కృతార్థతా
తం కృతార్థయితుం దేవి బ్రహ్మాపి న హి శక్నుయాత్

-మ.భా.సా.14

అని, కావుననే "భారతః పంచమో వేదః" అనియును, "వేదః ప్రాచేతసాదాసీద్ సాక్షాద్రామాయణాత్మనా" అనియుండుటచేత శ్రీ మద్రామాయణమహాభారతములు కేవలము వేదతుల్యములు. ముక్తిని కాంక్షించువారు రామాయణభారతములను పారాయణ చేయవలయును. రామాయణమహాభారతముల పారాయణమువలన కృతార్థతనొందజాలనివానిని బ్రహ్మయైనను కృతార్థుని జేయజాలడు. కావుననే మహాభారతఫలశ్రుతి ఇట్లు చెప్పబడినది.

శ్లో ॥ ధన్యం యశస్యమాయుష్యం శత్రునాశనమేవ చ
పుత్రపౌత్ర ప్రదం పుంసాం సర్వైశ్వర్యప్రదాయకం
భారతం హి మహాపుణ్యం యః శృణోతి దినే దినే
సర్వతీర్థాభిషేకస్య ఫలమాప్నోతి మానవః
భారతం భవనే యస్య తస్య హస్తగతో జయః
భారతం సర్వశాస్త్రాణాం ఉత్తమం భరతర్షభ
ఏక శ్లోకమపి శ్రుత్వా అశ్వమేధఫలం లభేత్.

మ. భా. సా 15

మహాభారతశ్రవణమును ప్రతిదినమును చేయుచుండిన సకలకోరికలు నెరవేరును. ఒక్కశ్లోకము విన్నను అశ్వమేధయాగఫలము లభించును. మహాభారతఫలసిద్ధిని నన్నయభట్టారకులును శ్లాఘించిరి.

ఆయురర్థులకు దీర్ఘాయురవాప్తియు
నర్థార్థులకు విపులార్థములును
ధర్మార్థులకు నిఖిలధర్మసంప్రాప్తియు
వినయార్థులకు మహావినయమతియు
బుత్త్రార్థులకు బహుపుత్రసమృద్ధియు

సంపదర్థుల కిష్టసంపదలును
గావించు నెప్పుడు భావించి వినుచుండు
వారలకిమ్మహాభారతంబు
ఆ॥ భక్తియుక్తులైన భాగవతులకు శ్రీ
వల్లభుండు భక్తవత్సలుండు
భవభయంబులెల్ల బాపి యిష్టార్థసం
సిద్ధి గరుణతోడ జేయుచుండు

-- మహా. భా. ఆదిప - ప్రథమ అశ్వా 34

మహాభారతమెట్టిదనగా నన్నయభట్టారకుల మాటలలో

క. ఏ యది హృద్యమపూర్వం
బేయది యెద్దాని వినిన నెఱుకసమగ్రం
బైయుండ నఘనిబర్హణ
మేయది యక్కథయ వినగ నిష్టముమాకున్

- మహా. భా. - ఆదిప - ప్రథమాశ్వా 30

తిక్కన సోమయాజియు
క॥ వేదములకు నిఖిలస్మృతి
వాదములకు బహుపురాణవర్గంబులకున్
వాదైనచోటులనుదా
మూదల ధర్మార్థకామమోక్ష స్థితికిన్

--మహా. భా.- విరాట-ప్రథమాశ్వా 4

ధర్మార్థకామమోక్షచతుర్విధపురుషార్థముల నిర్ణయమునుగూర్చి శ్రుతిస్మృతి పురాణములకు భేదాభిప్రాయమేర్పడినప్పుడు ధర్మనిరూపణము జేయదగు ప్రమాణగ్రంథము మహాభారతమే.

## కవిత్రయము వారి దృష్టి

వ్యాస భారతమును కవిత్రయము తెనిగించినదని మనము సామాన్యముగా భావించుచుందుము. అందువలన భారతవిమర్శనమునకు గడంగువారు సంస్కృతభారతములోని శ్లోకములను తెలుగుభారతములోని పద్యములను పోల్చిచూచి

విమర్శించుట సాధారణమయినది. కాని కొందరు వ్యాసభారతమును మాతృకగాగొని కవిత్రయమువారు తెలుగు భారతమును రచించిరే గాని ఆంధ్రీకరింపలేదని వాదింతురు. వాస్తవమును విచారించగా వ్యాసుని దృష్టికిని కవిత్రయమువారిదృష్టికిని భేదమున్నది. మూలమగు సంస్కృత భారతమితిహాసము, పురాణము. ధర్మ ప్రబోధ ప్రచారములే వ్యాసభారతమునకు పరమ ప్రయోజనము. మూలకర్త ధర్మపారవశ్యమున చెప్పిన ధర్మమునే మరల మరల చెప్పుచుండును. పునరుక్తి దోషము సాహిత్యమునకేగాని ధర్మప్రబోధమునకు లేదు. మూలభారతము ప్రధానముగా ధర్మప్రబోధము. కేవలధర్మప్రబోధములు జనరంజకములు కావు. కనుకనే వ్యాసభగవానులు పెక్కు ఉపాఖ్యానములను గూడిన భారతకథతో మేళవించి యనుగ్రహించెను. మూలభారతమెంత మహాకావ్యమయినను ధర్మప్రబోధమేముఖ్య ప్రయోజనముగా గలది. మూలభారతము కావ్యముగాకంటె నొకమహాపురాణముగా, ఒక మహేతిహాసముగా మనకు దర్శనమిచ్చుచున్నది . మూలభారతకర్త యగు వ్యాసునిది ధర్మోపదేశము ప్రధానముగా గల పౌరాణికము, నైతిహాసికము నగుదృష్టి. అతని రచన ప్రధానముగా వేదసమ్మితము సంస్కృత భారతమునందు కావ్యత్వమును కబళించి వేయునంతటి ధర్మప్రబోధము ధర్మపరిశీలనము కలవు.

జననుత కృష్ణ ద్వైపా
యనముని వృషభాభిహిత మహాభారతబ
ద్ధ నిరూపితార్థమేర్పడ
దెనుగున రచింపు మధిక ధీయుక్తిమెయిన్.

(ఆ.భా. ఆది- ప్రథమ-16)

అని రాజరాజు నన్నయభట్టారకులను గోరిరి. సంస్కృతభారతమున వ్యాసునిచే చెప్పబడిన యర్థమును నధికధీయుక్తితో స్పష్టముగా తెనుగున రచింపుమనినాడేగాని వ్యాసభారతమును యథాతథముగా నాంధ్రీకరింపుమని చెప్పలేదు. నన్నయ దేవా! నీయనుమతంబున విద్వజ్జనంబుల యనుగ్రహంబునంజేసి నానేర్చు విధంబున నిక్కావ్యంబు రచించెదనన్నాడు. అంతేకాని వ్యాసభారతమును యథాతథముగా నాంధ్రీకరింతునని చెప్పలేదు. కనుక నన్నయభట్టారకులు కథామాత్ర ప్రధానమును యథోచితానుసరణమునైన యనువాదమునే చేసిరి. కవిత్రయము వారిది కావ్యదృష్టి.

ధర్మప్రబోధమును, వ్యాసహృదయమును చాలాచోట్ల మరుగుపరచునంతటి కావ్యదృష్టి కవిత్రయము వారిది యన్నను దోషము కాదేమో, నన్నయ ఉత్తమకథకుడు. కథాగమనమునకు క్లిష్టతగాని, వక్రతగాని, అతిసంకుచితత్వము గాని, అతివిస్తృతి గాని కలుగకుండ, ప్రసన్నముగ నిర్వక్రమముగ, అనతివిస్తారముగా బహుకుశలతతో కథనునడిపెను. తిక్కనసోమయాజియు నిదే మార్గముననుసరించి నాటకీయతను తన రచనయందు చక్కగా మేళవించి కృతకృత్యు డయ్యెను. శంభుదాసుడును తాను సంపూర్ణముగా నన్నయకవితామార్గమునే యనుసరించి తనదైన వర్ణనాత్మకశైలిని మేళవించి శోభనుగూర్చెను.

స్థూలముగా బరిశీలించినచో కవిత్రయము వారిది ప్రధానముగా కవితాదృష్టి. వారి దృష్టి ద్విధాభూతమయినది. వారికి ధర్మోపదేశమెంత ప్రధానమో రసపోషణమంతకంటె ప్రధానము. ధర్మోపదేశము కావ్యమునకుగూడ నొక ప్రయోజనమే ఐనను అది కావ్యమున వ్యజ్యమానము గావలయునేగాని వాచ్యము కారాదు. వాచ్యమయినచో నది పురాణమో, ఇతిహాసమో అనిపించుకొనును. అందుచేత కవిత్రయమువారు మూలమునందలి ధర్మోపదేశసారమును మాత్రము గ్రహించి కావ్యపరమలక్ష్యమగు రసపరిపోషణమున కావశ్యకమగు మెలుకువను బూని కావ్యకళా దృష్టితో కాంతాసమ్మితముగా తెలుగుభారతమును రచించిరి.

అందుచేతనే ధర్మాధర్మనిశితపరిశీలానావశ్యకములు ధర్మనిర్ణయ పరిశీలనాంశములు గల సన్నివేశములను మిక్కిలి సంగ్రహపరచిరి. కొండొకచో నుపేక్షించుటయు కలదు. ఐతిహాసికపరిశీలనము గలవారికిని, ధర్మసూక్ష్మపరిశీలన గలవారికిని తెలుగుభారతము సంతృప్తినీయదు. నిజమునకు తెలుగున ఏ పురాణమును సంస్కృతపురాణమువలె నైతిహాసికధర్మసూక్ష్మపరిశీలనకు పనికిరావు. ముఖ్యముగా నన్నయభట్టారకులు ధర్మసూక్ష్మవాదాంశములతో నిండియున్న సభాపర్వమును మిక్కిలి సంగ్రహపరచిరి. అయినను సంస్కృతభారతమునందలియు, తెలుగుభారతమునందలియు, కథకు, విషయములకు, సన్నివేశములకు భేదములేదు. కనుక ధర్మసూక్ష్మపరిశీలన చేయవలసినప్పుడు సౌలభ్యముకొరకు, విషయసేకరణకొరకును తరచుగా వ్యాసభారతాంశములను స్పృశించుట యావశ్యకమగును.

## ధర్మ స్వరూపము స్థూలధర్మము సూక్ష్మధర్మము

"ధర్మతత్త్వజ్ఞులు ధర్మశాస్త్రంబని" నన్నయభట్టారకులచే ప్రముఖముగా

పేర్కొనబడిన ధర్మతత్త్వము వైదికధర్మతత్త్వము. అనగా వేదమెట్లు ధర్మమూలమో భారతమును ధర్మమూలమే. ధర్మమనగా కర్తవ్యము.మానవుడు చేయదగినది. చేయవలసినది. నిత్యజీవితములో విధిగా నిర్వర్తింపదగినది. ధార్మికవిధి క్రియా కలాపములు ధర్మమూలమే. ఒక్కొక్కవేదమున నొక్కొక్కవిధముగా ధర్మస్వరూపము వివరింపబడినది. ధార్మిక కర్తవ్యములు, యజ్ఞాధ్యయన దానములు, తపము, బ్రహ్మచర్యము ధర్మములని చెప్పబడినవి. అభ్యుదయకారణమయిన క్రియాకలాపము ధర్మము. ధర్మము శ్రుతిప్రమాణము. "ధరతి లోకానితి ధర్మః" లోకములను ధరించునది ధర్మము "ధ్రియతే వా జనైరితి ధర్మః" జనులచే ధరింపబడునది ధర్మము. అనగా జనులచే ననుష్ఠింపబడునది ధర్మము. "ధర్మసారమిదం జగత్" అని రామాయణము. ధర్మమేదియో అధర్మమేదియో నీస్థూల దృష్టిచే నిర్ణయింపజాలదు. కనుకనే "తస్మాచ్ఛాస్త్రం ప్రమాణం తే కార్యాకార్యవ్యవస్థితౌ' అని గీతాచార్యులు భగవద్గీతలో బోధించినారు. "విదంత్యనేన ధర్మాధర్మావితి వేదః' దీనిచే ధర్మాధర్మములనెరుంగుదురు కావున వేదమని పేరు... " శ్రూయతే ధర్మాధర్మాదికమనయేతి శ్రుతిః" దీని వలన ధర్మాధర్మాదులు వినబడునుకనుక శ్రుతియనియు పేరు. "వేదో ऽఖిలో ధర్మమూలం' ' వేదము ధర్మమునకు కారణము ఇతరప్రమాణములమీద నాధారపడక స్వతఃప్రమాణమయి అన్యప్రమాణముల కన్నింటికి పరమప్రమాణభూతమయినది వేదము. దానిని పరమేశ్వరునియొక్క శబ్ద స్వరూపమనియు, శబ్దబ్రహ్మమనియు, విజ్ఞులు భావింతురు.

"వేదప్రణిహితో ధర్మో హ్యధర్మస్తద్విపర్యయః
వేదో నారాయణస్సాక్షాత్ స్వయం భూరితి చ శ్రుతిః"

మ. భా. వి. పు18

వేదముచే చెప్పబడినది ధర్మము. దానికి విరుద్ధముయినది అధర్మము. వేదముసాక్షాన్నారాయణస్వరూపము, స్వయంభువు. వేదవేదార్థముల నెరుంగుట సులభసాధ్యముకాదు. కావున వేదాభిజ్ఞులగు కొందరు మహర్షులు వేదధర్మములను స్మృతులుగా రచించిరి. "మహర్షిభిః వేదార్థస్మరణపూర్వకం రచితత్వాత్ స్మృతిః" మహర్షులచేత వేదార్థపర్యాలోచనపూర్వకముగ నిర్మించబడినది స్మృతి. వేదములు అపౌరుషేయములు. స్మృతులు పౌరుషేయములు. మూలస్మృతులు పదునెనిమిది.

వీనిని రచించిన ఋషులు మను- అత్రి - విష్ణు - హారీత -యాజ్ఞవల్క్య - ఉశన - అంగీరస - యమ - ఆపస్తంబ - సంవర్త - కాత్యాయన -బృహస్పతి - పరాశర -వ్యాస - శంఖలిఖిత -దక్ష - గౌతమ - శాతాతపి. శ్రుతిలో లేనివిషయము స్మృతిలో నున్నచో నదియు గ్రాహ్యమే. కాని శ్రుతిలో నున్న దానిని స్మృతి కాదన్నచో నప్పుడు స్మృతి ప్రమాణము కాజాలదు. కావున శ్రుతికి విరుద్ధము కానంతవరకు స్మృతియు ప్రమాణమే. కనుకనే స్మృతిది పరతః ప్రమాణమని చెప్పబడినది.

సహజధర్మముచే నెరవేర్పజాలని యాపద యేర్పడినప్పుడు అట్టి ఆపత్కాలము నందు మాత్రమే ఆచరింపదగినది ఆపద్ధర్మము. ఆపత్కాలమున నట్లు చేయుట అధర్మముకాక ధర్మమే యగును. కనుకనే అది ఆపద్ధర్మమయినది. "యద్వై మనురవదత్ తద్భేషజమ్" మనువు చెప్పినది మందు అని వేదమే చెప్పినది. మనుస్మృతి ప్రమాణ మూర్ధన్యమయినది. ఆపద్ధర్మమెంత సూక్ష్మమయినదో ఛాందోగ్యోపనిషత్తు నందలి ప్రథమాధ్యాయము, పదవఖండమున గల ఆఖ్యాయిక వలన తెలియగలదు.

కురుదేశము పిడుగుపడి నాశనమయినప్పుడు తీవ్రమయిన దుర్భిక్ష మేర్పడెను. అప్పుడు చక్రుని కుమారుడు చాక్రాయణుడు అను మునీశ్వరుడు తన భార్యతో నాకలితో తల్లడిల్లుచుండెను. ఆ చాక్రాయణుని పేరు ఉషస్తి. అతడొక గ్రామమునకు పోయి మావటివాని నొకని చేరి వాడు తినుచున్న మినుపగుగ్గిళ్ళను యాచించెను. మావటివా డవి ఉచ్ఛిష్టమయిపోయినవి ఇంతకంటె వేరేమియులేవని చెప్పెను. ఆ ఉచ్ఛిష్టమయిన వానినే ఇమ్మని అడిగి తీసికొని భుజించి ఆకలి తీర్చుకొనెను. ఆ మావటివాడు త్రాగుటకు తాను త్రాగగా మిగిలిన జలమునిచ్చెను. ఈ జలము ఉచ్ఛిష్టము, నాకు వలదని ఉషస్తి చెప్పెను. ఈ గుగ్గిళ్ళు మాత్రము ఉచ్ఛిష్టము కావా? వీనిని తినవచ్చునా ? అని మావటి వాడడిగెను. అప్పుడు ఉషస్తి ఇట్లు చెప్పెను. ఆ గుగ్గిళ్ళు తినని యెడల నా ప్రాణములు పోయియుండును. అట్టి ఆపత్సమయమున ఉచ్ఛిష్ట దోషము లేదు. నాకు త్రాగుటకు జలము దొరుకును. ఇప్పుడట్టి ఆపదలేదు. ఆ నీరు నాకిప్పుడవసరము లేదని తిరస్కరించెను. ఇదియే ఆపద్ధర్మస్వరూపము. ఇదియే ధర్మముయొక్క సూక్ష్మత. ఆపదయందు మాత్రమే దాని ననుష్ఠించిన దోషము లేదు. ఆపద తీరినపిమ్మట మరలనట్లు చేసినయెడల దోషావహమగును. దీని తత్త్వమెఱుంగజాలకయు, నార్షసంప్రదాయపరిచయములేకయు వేదవాఙ్మయము యొక్కయు, వేదర్షులయొక్కయు మాహాత్మ్యము నెరుంగజాలని సామాన్యులు

భారతగాథలను అసంభవములు గాను, ధర్మవిరుద్ధములు గాను భావించుటలో వింతలేదు. కాని మేధావంతులయిన పాశ్చాత్యనాగరికతాసంపర్కము కలిగిన విద్యావంతులు సయితమట్లే భావించుట దురదృష్టమనకతీరదు.

భారతీయువాఙ్మయమున ధర్మమను శబ్దము చాలా ప్రముఖమయిన స్థానమునలంకరించి విస్తృతమయిన అర్థముకలదిగా నున్నది. ఇయ్యది మంగళవాచకము కూడను భగవద్గీతయందు సయితము "ధర్మక్షేత్రే కురుక్షేత్రే సమవేతా యుయుత్సవః'' అని ధర్మశబ్దముచేతనే ఆరంభింపబడినది. బహుభాషావేత్తయగు "వింటర్‌నిడ్జ్" అను పండితుడు " There is no word in any European Language which is quite synonymous with the Sanskrit word Dharma" దర్మశబ్దానికి సర్వార్థచ్ఛాయలుగల పదాలు ఇతర భాషలలో లేవు. ధర్మపదానికి సమానార్థకమయిన శబ్దము యూరోపియన్ భాషలలోను లేదని వక్కాణించెను.

పాణినిమహర్షి అష్టాధ్యాయిలోని ఉణాది సూత్రములో "ధర్మః" అను సూత్రము ద్వారా ధర్మశబ్దస్వరూపమును ప్రతిపాదించినారు. ఈ శబ్దమునకు సమస్త విశ్వమును నిలకడగా నుంచునదియని యర్థము. అయితే యీ ధర్మస్వరూపము ప్రత్యక్ష ప్రమాణము ద్వారాగాని, అనుమానప్రమాణముద్వారా గాని, హేతువాద నాస్తికవాదములద్వారాగాని తెలియబడదు. శబ్దప్రమాణమూర్ధన్యమయిన వేదముద్వారా, తదర్థబోధకములైన పురాణేతిహాసములమూలముననే తెలియవలెను. అయితే ఈ ధర్మము యుగములననుసరించి మారుచుండును. కృతత్రేతాద్వాపరయుగములం దనుసరింపబడిన అపద్ధర్మమయిన నియోగపద్ధతిని సంతానమును పొందుట కలియుగమున మనువు చేతనే నిషేధింపబడినది. అట్లే కొంతకాలము క్రిందట రజస్వలానంతర వివాహములు దూష్యములు. నేడు బాల్య వివాహము శిక్షార్హమయిన నేరము. మహాభారతమునందలి ధర్మసూక్ష్మములు స్థూల దృష్టికలవారికి దురవగాహములు.

ధర్మము స్థూలధర్మమనియు సూక్ష్మధర్మమనియు ద్వివిధము. ఆపద్ధర్మము విశేషధర్మము అనునవి సూక్ష్మధర్మమునకే పర్యాయ పదములు. "మందమతిభిరపి సుఖేన బుద్ధ్యమానశౌచాచమన సంధ్యావందనాదిః స్థూలో ధర్మః" మందమతులకు కూడ సుఖముగా తెలియబడునట్టి శౌచాచమనము, సంధ్యావందనాదులు స్థూల ధర్మములు.

శాస్త్రపారంగతైః పండితై రేవ బోద్ధుం యోగ్యః ఇతరేషాం అధర్మభ్రాంతివిషయః ద్రౌపదీవివాహాదిసూక్ష్మో ధర్మః

శాస్త్ర పారంగతులగు పండితులకు మాత్రమే తెలిసికొనదగినదై అన్యులకు అధర్మభ్రాంతిని కలిగించునట్టి ద్రౌపదీవివాహాదికము సూక్ష్మ ధర్మము .

## ధర్మ సూక్ష్మముల పరిశీలనావశ్యకత :-

"భారతసూర్యేణ నృణాం వినిహితం తమః "

భారత మనుసూర్యునిచేత మానవులంతఃకరణమందలి చీకట్లు తొలగిపోవును.

"పురాణపూర్ణచంద్రేణ శ్రుతిజ్యోత్స్నా ప్రకాశితా " పురాణమను పూర్ణచంద్రుని చేత వేదము లనువెన్నెల వెలుగొందబడినది. అట్టి మహాభారతము పంచమవేదము. వేదము ధర్మమూలము. నాలుగువేదములందును నిక్షిప్తమయిన ధర్మము కథారూపమున నీ భారతమున వెలసినది. కావుననే భారతమునకు పంచమవేదమని పేరు. ఈ మహాభారతమునకు ఇటీవలికాలమున నాలుగైదు దశాబ్దములనుండి ఆధునిక భారతవిమర్శనము లనుపేరుతో ఆంగ్లభాషాపరిచితులు పాశ్చాత్యనాగరికతా ప్రభావమున బహిరంగపరిశోధనము, నిజనిరూపణమనుపేరున, విరోధభావములతో , నిందారోపణలతో సాధుదూషణ పాపభూషణయుతముగను తమతమ స్వైరవృత్తిని బురస్కరించుకొని యనేక విమర్శనగ్రంథములను వ్రాసిరి. మహాభారతమున గాన్పించు నద్భుతవిషయములు, నేటి సాంఘికాచారములకు విరుద్ధములైన కొన్ని విపరీతసంఘటనలు, అణిమాదిసిద్ధులు, దీవనలు, శాపములు, వరములు వానిపర్యవసానములు మున్నగునవెన్నియో మనకు కనిపించును. మన యాధునిక విమర్శకులకవి యభూతకల్పనలుగాను, అసంభవములుగాను, నన్యాయముగాను, సామాజికకట్టుబాట్లకు విరుద్ధముగాను తోచుచున్నవి.

పరాశరుని యనుగ్రహమున సత్యవతియందు వ్యాసుడు జన్మించియు సత్యవతి కన్యాత్వము దూషితము కాకుండుట, విచిత్రవీర్యుని భార్యలయందు వ్యాసునివలన ధృతరాష్ట్ర పాండురాజులజననము, కుంతికి సూర్యునివలన కర్ణుడు జన్మించియు నామెకన్యాత్వము దూషితముకాకుండుట, పంచపాండవులజననము, ద్రౌపది యయోనిజయగుట, ఆమె పంచభర్తృకయయ్యు పతివ్రతయగుట, కౌరవపాండవ రాజ్యాధికారనిర్ణయము, కురుక్షేత్రమున భీష్మద్రోణులవధ దుర్యోధనుని పరాజయము,

ఆతని తొడలు విరుగగొట్టబడుట మున్నగునవి కొన్ని మనవిమర్శకుల వివాదాంశములు.

ఇటువంటి విమర్శకాగ్రేసరులు తమతమ పాశ్చాత్యనాగరికతావిలసితబుద్ధి వైభవముకొలది పుంఖానుపుంఖములుగా సంస్కృతభాషయందును, హిందీ భాషయందును రచించిన గ్రంథములు, లేఖలు, తెనుగున ననూదితములైనవి. ఇవి గాక ప్రసిద్ధతెలుగుపండితులు సైతము మహాభారతరచనము, ఉత్తరభారతము, రాజసూయచరిత్ర, కర్ణచరిత్రము, సుయోధనవిజయము, కురుపాండవదాయ భాగనిర్ణయము, మహాభారతరహస్యము, కురుక్షేత్ర సంగ్రామము, భగవద్గీతానాటకము, "చనవు" అను పేరుగల ఖండకావ్యము- ఇట్టివెన్నియో గ్రంథములు చాల విరివిగా రచింపబడి ప్రకటింపబడినవి. నేటికాలమున మహాభారతకథ వచనరచనలుగా పద్యకావ్యములుగా నాటకములుగా, సినిమాలుగా, విరివిగా, ప్రజాదరణకు పాత్రమయినది. స్థూలముగా మహాభారతకథ జనసామాన్యమునకు పరిచితమే. దీనికితోడు రేడియో, టి.వి., సినిమాలద్వారా యీ కథ యెక్కువగా జనబాహుళ్యములోనికి చొచ్చుకొనిపోయినది. ఇది ఒక విధముగా శుభపరిణామమే, కాని ఆ యా రచయితలకు, కవులకు, ప్రసారసాధనములకు ప్రమాణబుద్ధి లేకపోవుటవలన ప్రజారంజనమే ప్రధానమను దృష్టికల వీరలు మహాభారతమందలి సన్నివేశములను వాస్తవములకు విరుద్ధముగా ప్రచారముచేయుచున్నారు. మన విద్యావంతులలో పెక్కుమంది వ్యాసభారతమునే కాదు కవిత్రయము వారి తెలుగు భారతమునైనను పూర్తిగా చదివి యర్థము చేసికొన్నవారు చాలా తక్కువ. ఈ కారణమున ఆ యా రచనలలోని విషయములే మహాభారతమునందలి వాస్తవగాథ యను భ్రమకు లోనగుచున్నారు. పైన పేర్కొనబడిన విమర్శకులవ్రాతలు, చదువరుల భ్రమప్రమాదములు ధ్రువపడుటకు దోహదకారులై యీ ప్రసారవిషయములే వాస్తవములు కాబోలు, భారతమంతయు నభూతకల్పన, పాండవపక్షపాతయుతము, కౌరవులదే ధర్మము, పాండవు లధర్మముగా కౌరవులను జయించి సంహరించి రాజ్యమును చేజిక్కించుకొన్నారని నమ్ముచున్నారు. ఈ విపరీత భావమునుండి జనసామాన్యమును ముఖ్యముగా తెలుగుదేశమునందలి విద్యావంతులను మరలించి వారియపోహలను నివృత్తి చేయుటకు మహాభారతమునందలి ధర్మసూక్ష్మపరిశీలన మత్యంతావశ్యకము.

## ఇదివరలో వచ్చిన గ్రంథములు :-

మహాభారతమునందలి ధర్మాధర్మమీమాంస విషయమున చాల గ్రంథములు వెలువడినవి. అవి రెండు విధములు, పాశ్చాత్యనాగరికతాప్రభావమున కొందరు మేధావులు భారతమునందలి కథాంశములు ధర్మవిరుద్ధములనియు, వ్యాసజననము, ధృతరాష్ట్ర పాండురాజుల జననము, పంచపాండవులు కుంతియందు యముడు వాయువు ఇంద్రుడు మున్నగువారివలన జననమొందుటయు, కన్యగానున్న కుంతికి సూర్యునివలన కర్ణజననము, ద్రౌపది యయోనిజగా జన్మించుట, పంచభర్తృకయయ్యు నామె పతివ్రతయగుట, కౌరవపాండవరాజ్యాధికారనిర్ణయము కురుక్షేత్రమున భీష్మద్రోణులవధ, భారతయుద్ధమున, కౌరవులదే న్యాయమనియు, పాండవులది అధర్మవిజయమనియు ననేక రీతుల నిందారోపణలతో పెక్కు రచనలు వెలువడినవి.

ఇట్టి వానిలో "సఫ్రే" పండితునిచే హిందీలో వ్రాయబడిన గ్రంథమొకటి. దానిని శ్రీ చర్లనారాయణశాస్త్రి గారనువదించిరి. మహాభారతమేకకర్తృకము కాదనియు, పాండవులు భారతీయులే కారనియు, భారతరచనాకాలమునుగూర్చియు పెక్కు విరుద్ధాంశములను ప్రకటించిరి.

ఝాన్సీ పట్టణవాసులైన మహామహోపాధ్యాయ మధురాప్రసాదు దీక్షితులనువారు "అయోధ్య" అను పత్రికలో సంస్కృతమున ననేకవ్యాసములను పుంఖానుపుంఖముగా ధారావాహికముగా ప్రకటించిరి. ఈ వ్యాసములన్నియు మహాభారతకథాంశములపై నిందాగర్భితములు. వారు కౌరవపాండవ న్యాయాన్యాయవిచారమను పేర కౌరవులది న్యాయమనియు పాండవులది యన్యాయమనియు వివరించిరి. ఈ వాదమున పండిత చన్ద్రశేఖరశర్మ, శ్రీ రామ బాలకశర్మ మున్నగువారు ప్రతిలేఖారూపమున ఖండించుటయు జరిగెను. "సఫ్రే" పండితులయు, మహామహోపాధ్యాయ మధురాప్రసాదదీక్షితులవారి వాదమును బురస్కరించుకొని వారిఛాయలనే తెనుగునను అనేక గ్రంథములు వెలువడినవి. అట్టి వానిలో శ్రీ పెండ్యాల సుబ్రహ్మణ్యశాస్త్రిగారి మహాభారతచరిత్రము ప్రముఖమయినది. పెండ్యాల వారే రాజసూయరహస్యము, ఉత్తర భారతమను పేర మరిరెండు గ్రంథములను రచించిరి. శ్రీ కృష్ణునిజీవితచారిత్రమను పేర శ్రీ లాలాలజపతిరాయిగారు హిందీలో వ్రాసిన గ్రంథము తెనిగింపబడినది. శ్రీకృష్ణ చరిత్రమని మరియొక గ్రంథమును బంకించంద్రచటోపాధ్యాయులవారు హిందీలో రచించిరి. కురుక్షేత్రసంగ్రామ మనుగ్రంథమున కౌరవులదే ధర్మవర్తనమనియు ,

పాండవులది అధర్మవర్తనమనియు స్థాపించుచు శ్రీ త్రిపురనేని రామస్వామి చౌదరిగారొక గ్రంథమును రచించిరి. "కురుపాండవ దాయ భాగనిర్ణయమని " కౌరవులదే రాజ్యాధికారమని ప్రతిష్ఠించుచు కాశీభట్ల బ్రహ్మయ్యశాస్త్రి గారొక గ్రంథమును రచించిరి.

కర్ణుని సౌశీల్యమును కొనియాడుచు అన్యాయముగా నాతడు భారత యుద్ధమున కృష్ణార్జునులచే వధింపబడెనని వాదించుచు శ్రీ వజల చిన సీతారామస్వామిశాస్త్రి గారు కర్ణచరిత్రమును రచించిరి. ధర్మము దుర్యోధనుని పక్షమునందే కలదనియు, వాస్తవముగా రాజ్యాధికారము సుయోధనునిదే యనియు నన్యాయముగా పాండవులచే సుయోధనుడు ధర్మయుద్ధమున మోసగించి వధింపబడెనని ప్రతిష్ఠించుచు సుయోధనవిజయమను పేర కోటమర్తి చినరాఘవరావు గారొక గ్రంథమును రచించిరి. వ్యాసుడు భారతమున పాండవపక్షపాతియని యసత్యములను వ్రాయుటేకాక కౌరవుల నధర్మవర్తనులగాను పాండవులను ధర్మవర్తనులగాను చిత్రించెనని, వ్యాసునిపై నిందారోపణలను జేయుచు పెండ్యాలవారి శిష్యులయిన శ్రీ చండ్వపట్ల రామారావుగారు భగవద్గీతానాటకమును రచించిరి. మొత్తముమీద పైనపేర్కొన్న గ్రంథములన్నియు పెండ్యాలవారి మహాభారతచరిత్రమునసనుసరించి వ్రాయబడినవే. మహాభారతచరిత్రచ్ఛాయలలో దానికనుజన్ములుగానో, పుత్రికలుగానో విలసిల్లనవి.

పెండ్యాలవారి మహాభారత చరిత్రమునకు బ్రతిగా వెలువడిన శ్రీ మహాభారత సంశయవిచ్ఛేదమునందును, శిష్టాసూర్యనారాయణశాస్త్రిగారి మహాభారత రహస్యమునందును పెక్కు విరుద్ధాంశములు చోటుచేసికొన్నవి.

ఈ విమర్శనగ్రంథములకు సంప్రదాయక విమర్శకాగ్రేసరులయిన పండితులు మల్లాది రామకృష్ణచయనులుగారు చాలాకాలముక్రిందట మహాభారతతత్త్వనిర్ణయమను పేర నొక గ్రంథమును రచించిరి. వారి శిష్యులు బ్రహ్మశ్రీ ములుకుట్ల నర్సింహావధాని పాకయాజిగారు శ్రీ మహాభారతసారోద్ధారమను పేర మహాభారతమునందలి పదునెనిమిది పర్వములను మిక్కిలి సంగ్రహించి సంప్రదాయ పద్ధతిలో సంస్కృతమూలశ్లోకములతో నాంధ్రతాత్పర్యసహితముగా సవిమర్శముగా గ్రంథగ్రథనమొనర్చిరి. తరువాత మహాభారతచరిత్రానిరాకరణమను పేర కవిసార్వభౌమ మహామహోపాధ్యాయ శ్రీ పాదకృష్ణమూర్తి శాస్త్రిగారు రచించిరి. శిష్ట్లావారి మహాభారతరహస్యము పెండ్యాలవారి మహాభారతచరిత్రమునకు ఖండనమే గాని. ఇందును విరుద్ధాంశములే యున్నవి. అందుచే

కవిసార్వభౌములే మహాభారతరహస్యఖండనమును వ్రాసిరి. ఈ గ్రంథములన్నియు నేడు లభ్యములుగావు.

సుమారేబది సంవత్సరములకు బూర్వము ఎంతో విపులముగ, శాస్త్ర ప్రమాణములతో సహేతుకముగ పిఠాపురవాస్తవ్యులగు వారణాసి సుబ్రహ్మణ్యశాస్త్రి గారు మహాభారతతత్త్వకథనమనుపేర పెండ్యాల సుబ్రహ్మణ్యశాస్త్రిగారి మహాభారతచరిత్రమునందలి ప్రత్యక్షరమును ఖండించుచు నారు సంపుటములుగల మహాగ్రంథమును రచించిరి. ఇందలి భాష జటిలము. గ్రంథమంతయు ఖండన మండనములతో నిండియున్నది. మహాపండితులకే కాని సామాన్యపాఠకులకు దురవగాహము గ్రంథము అలభ్యము.

తరువాత నండూరి సుబ్రహ్మణ్యశర్మగారు మహాభారతోపన్యాసములను పేర అయిదు సంపుటములలో మహాభారతకథను పర్వానుక్రమమున రచించిరి. బాహుకాలము వారు పలువేదికలపై భారతోపన్యాసములను గావించి ధన్యత నొందినవారు. వారును ప్రసక్తానుప్రసక్తముగా ధర్మశాస్త్రవిషయములను స్పృశించుచు రచన గావించినారు. కాని శ్రోతలకంత ముఖ్యము గాదనుతలంపుతో గాబోలును శాస్త్ర ప్రమాణములనెక్కువగా జూపలేదు.

ఇటీవల బలభద్రపాత్రుని హనుమంతరాయశర్మగారు మహాభారతవిమర్శన మనుపేర నొక వేయిపుటలుగల బృహద్గ్రంథమును రెండు సంపుటములుగా వెలయించిరి. ఇయ్యది వారణాసి సుబ్రహ్మణ్యశాస్త్రిగారి మహాభారతతత్త్వకథనమునకు పూర్తిగా ననుసరణము. దానికి పుత్రిక, దీనిని పర్వానుక్రమమున గాక పాత్రానుక్రమముగా వ్రాసిరి. భారతమందలి యొక్కొక్క ముఖ్య పాత్రను గైకొని వారి చరిత్రాంశములను ధర్మాధర్మపరిశీలనముచేసి విశదీకరించిరి. ఈ గ్రంథముకూడ గ్రంథమును ప్రకటించిన సంఘసభ్యులకు, భక్తిశ్రద్ధలు గలవారికి కొందరకు బహుప్రయత్నమున లభించునేమో గాని అందరకు లభింపదు.

ఈ గ్రంథములన్నియు గ్రంథకర్తల వివిధ దృక్పథములమేరకు చాలావరకు

మహాభారతమునందలి సూక్ష్మధర్మస్వరూపము నావిష్కరించినవియే.

## ప్రస్తుతగ్రంథవైశిష్ట్యము :

శ్లో ॥ కానీనస్య మునేః స్వసోదరవధూవైధవ్యవిధ్వంసిన:
నప్తారః ఖలు గోళకస్య తనయాః కుండాస్తథా పాండవాః,
ఏతే చాపి సమానయోనిరసికాస్వాద్యైకజాతా భువి
తచ్చారిత్రమఘౌఘనాశకమహో ధర్మస్య సూక్ష్మా గతిః ॥

ఇది ప్రచారములోనున్న పూర్వకవి శ్లోకము. యమునానదికి నావను నడుపుచున్న మత్స్యగంధితో పరాశరమహర్షి సంగమించుటచేత సద్యోగర్భమున దండకమండలాలతో వ్యాసమహర్షి పుట్టుకొని వచ్చెను. బిడ్డపుట్టినను మత్స్యగంధి కన్యాత్వము చెడలేదు. తరువాత ఆవిడ శంతనమహారాజునకు భార్యయై ఇద్దరు మగబిడ్డలను కన్నది. వారు చనిపోతే వారి భార్యలై విధవలైన మరదండ్రతో సంగమించి వ్యాసమహర్షి ధృతరాష్ట్రుని, పాండురాజుని కన్నాడు. పాండురాజుభార్యలైన కుంతియు మాద్రియు పాండురాజు జీవించి యుండగానే పరపురుషులవలన పంచపాండవులను కన్నారు. వారైదుగురు ఒకేస్త్రీకి భర్తలై పిల్లల్ని కన్నారు. ఇదీ వ్యాసమహర్షి చరిత్ర. దీనిని వ్యాసమహర్షియే వ్రాసికొనినాడు. ఇది పంచమవేదమని ప్రఖ్యాతిగాంచినది. ఈ కథ వింటే పాపాలు పోతాయంటారు పెద్దలు. ఈ గాథలో ఏదో ధర్మసూక్ష్మము ఉండిఉండాలని పై శ్లోక తాత్పర్యము. శ్రీ వేదుల సూర్యనారాయణశర్మగారు భారతగ్రంథాన్ని ముక్తి సాధనమార్గానికి సాత్విక -తామసగుణాలపోరాటంగా అన్వయించి అంతరార్థమహాభారతం రచించారు.

మహాభారతగాథలో ధర్మమునతిక్రమించుటయు, సాహసకృత్యములు కనిపించును. మునీశ్వరులయొక్కయు, దేవతలయొక్కయు, మాహాత్మ్యమువలన పురుషసంయోగమును పొందియు కన్యాత్వమునకు హానికలుగదని కాశికాగ్రంథపదమంజరీవ్యాఖ్య చెప్పుచున్నది.

"ధర్మవ్యతిక్రమో దృష్టో మహతాం సాహసం తథా
తదన్వీక్ష్య ప్రయుంజానస్సంసీదత్యవరోఽబలాత్,
తేజోమయాని పూర్వేషాం శరీరాణీంద్రియాణి చ
దోషైస్తైర్నోపలిప్యంతే పద్మపత్రమివాంభసా॥"

మనుస్మృతి -మహాభారతసారోద్ధారమునుండి. ఆది.పు

మనుస్మృతియందు గొప్పవారలవిషయమున నచ్చటచ్చట ధర్మమునతిక్రమించుటయు, సాహసకృత్యము కనబడుచున్నది. దానిని చూచి మరియొక సామాన్యుడు మాహాత్మ్యము లేనివాడగుటచే నట్లు ప్రవర్తించినచో నశించును. పూర్వులయొక్క శరీరములును, ఇంద్రియములును తేజోమయమయినవి. అందుచే వారిని దోషములు నీరు తామరాకునువలె నంటజాలవని చెప్పబడినది.

దృష్టో ధర్మవ్యతిక్రమస్సాహసం పూర్వేషాం తేజోవిశేషేణ ప్రత్యయవాయో న విద్యతే. తదన్వీక్ష్యప్రయుంజానస్సీదంత్యవరాః ఇతి.

ఆపస్తంబసూత్రం- మహాభారతసారోద్ధారమునుండి ఆ.ది.పు

పైన చెప్పిన విషయమే యిందును పునరుద్ఘాటింపబడినది.

శ్లో॥ అనుష్ఠితం తు యద్దేవైర్మునిభిర్యదనుష్ఠితం ।
నానుష్ఠేయం మనుష్యైస్తదుక్తం కర్మ సమాచరేత్ ॥

బోధాయనమహర్షి -మహాభారతసారోద్ధారము నుండి....

బోధాయనమహర్షి దేవతలచేత నేదిచేయబడినదో మునులచే నేది ఆచరింపబడినదో అట్టి సాహసకృత్యమును మనుష్యులు ఆచరింపరాదు. వారిచే బోధింపబడిన ధర్మాదికర్మలను మాత్రమే మన మాచరింపవలెనని చెప్పెను.

దీని తత్త్వమెరుంగని విద్యావంతులైన విమర్శకులు కొందరు మహాభారత హృదయమునందు ప్రమాణబుద్ధిలేకయు, హ్రస్వదృష్టితో వ్యాసమునివిరచిత భారతగాథలను వక్రీభవించి నిందారోపణలతో ధర్మవర్తనులను అధర్మవర్తనులగాను, నధర్మవర్తనులను ధర్మవర్తనులుగను చిత్రించుచు పుంఖానుపుంఖములుగా విమర్శనగ్రంథములను రచించిరి. అందుచేత వారు వ్రాసిన కల్పితగాథలు వక్రభాష్యములు సత్యములని భ్రమించుటవలన వారియందు భారతగ్రంథముపైనను తత్కర్తయగు వ్యాసమునీంద్రునిపైనను భక్తిభావము సన్నగిల్లుచున్నది. సంప్రదాయజ్ఞులైన మహాపండితులు కొందరు పూనుకొని పై విమర్శలను ఖండించుచు బృహద్గ్రంథములను రచించిరి. ధర్మసూక్ష్మములను విశదపరిచిరి. శాస్త్రప్రమాణములను జూపించిరి. కాని వారి రచనలలోని భాష జటిలము. సాధారణవిద్యావంతులకు దురవగాహము, నిందారోపణ

గ్రంథమునందలి ప్రత్యక్షరమును ఖండించుటయే ధ్యేయముగా సాగిన యీ గ్రంథములు ఖండనమండనములతో గూడి పాఠకులకు దుర్గ్రాహ్యములైనవి. సరికదా ఆ గ్రంథములేవియు ప్రకృతకాలమున నెచ్చటను లభ్యములు కావు. కనుక సాధారణవిద్యావంతులైన పాఠకులకే సంప్రదాయగ్రంథములు గగనకుసుమములైనవి. మహాభారతగాథ జనసామాన్యమునకు ముఖ్యముగా విద్యావంతులందరకు సుపరిచితమే. దీనికి తోడు మహాభారతకథలు వచనరచనలు బహుళముగా జనసామాన్యమున కందుబాటులోనికి వచ్చినవి. నాటకములు, సినిమాలు, రేడియోలు, టి.వి. మూలమునకూడ భారతకథ జనసామాన్యమునకు సుపరిచితమయినది. కాని యీ రచయితలకు ప్రచారసాధకులకు మహాభారతమునందంతగా ప్రమాణబుద్ధి లేకయు, జనరంజకములగు కొన్ని తమకు తోచిన మార్పులు చేర్పులు చేసి మహాభారతవాస్తవగాథలకు విరుద్ధాంశములతో ప్రజాబాహుళ్యముపై రుద్దుచున్నారు. దీనివలన విద్యావంతులలో సయితము భారతగాథలయందలి ధర్మప్రబోధముపైన భక్తిప్రవత్తులు నశించుచున్నవి. ఇదివరలో సంప్రదాయపద్ధతిలో మహాపండితులచే రచింపబడిన గ్రంథములు పరమప్రమాణములయ్యు, శాస్త్రప్రమాణములతో ధర్మసూక్ష్మతను స్థాపించునవేయయ్యు నవి ఖండనగ్రంథములు, ప్రతివిమర్శనగ్రంథములగుటచే వారిదృక్పథము భిన్నముగా నున్నది. వారు ధర్మమని తలచినదానిని స్వీయమయిన భావములతో రచించుటకు వారికి స్వేచ్ఛ కలదు. అందుచే ఆ రచనలకొక నిబద్ధత, ప్రణాళికాబద్ధత లోపించినదనవచ్చును. ఎవరి బుద్ధికుశలత కొలది వారు తమతమ అభిప్రాయముల నందు వెల్లడించిరి కాని అందుకేకరూపత తక్కువ.

పరాశరునివలన వ్యాసభగవానునికి జన్మనిచ్చిన సత్యవతియొక్క కన్యాత్వము దూషితము కాకుండుటెట్లు ? విచిత్రవీర్యుని భార్యలు వితంతువులయందు వ్యాసుని వలన ధృతరాష్ట్ర పాండురాజులు జన్మించుట ధర్మవిరుద్ధము కాదా ? ఆపద్ధర్మమయిన నియోగపద్ధతియొక్క ధర్మము నిందార్హమేలకాదు ? సూర్యభగవానుని యనుగ్రహమున కుంతియందు కర్ణుడు జన్మించుటచే కుంతికన్యాత్వము దూషితము కాదా ? శుక్ర శోణితసంయోగములేకయే ద్రౌపది అయోనిజగా జన్మించుట అసంభవము గాదా? యజ్ఞములవలన సంతానము కలుగునా ? మంత్రాలకు చింతకాయలు రాలునా? మంత్రములు వేదచోదితమయిన కర్మలు తప్పక సంతానమును కలిగించుననియు,

వేదచోదితములయిన వేదమంత్రములతో గూడిన కర్మకాండలు వారివారి ప్రాపంచిక కోర్కెలను తప్పక ప్రసాదించగలవు. అట్లే వేదచోదితమయిన కర్మకాండచే పారలౌకిక శాంతిని మోక్షమును పొందగలరనుట నిత్యసత్యము. ద్రౌపది పంచభర్తృక గనుక ఆమె పతివ్రత యెట్లగునని శంకించువారున్నారు. ద్యూతమున ద్రౌపది ధర్మవిజితయా, అధర్మవిజితయా అసలు ద్యూతము సుహృద్ద్యూతమా, మోసపూరితమా, ధర్మజుడు, జూదరియా, ధర్మజుడు రణరంగమున భీష్మని మరణరహస్యము నాతనివలన గ్రహించి పడగొట్టుట ధర్మసమ్మతమా ? ధర్మజుడు 'అశ్వత్థామా హతః కుంజరః' అని అనృతమాడుట - ద్రోణాచార్యుని వధించుట ధర్మమా ? ధర్మజుని కసత్యదోషము లేదా ? కర్ణుడు అన్యాయముగా వధింపబడెనా ? భీముడు సుయోధనుని గదాయుద్ధమున నాభిక్రిందిభాగమున -ప్రహరించి తొడలు విరుగగొట్టి, సుయోధనుని తలను తన యెడమకాలితో తన్నుట దోషము కాదా ? అసలు రాజ్యాధికారము కౌరవులదా పాండవులదా ? పంద్రెండు సంవత్సరములరణ్యావాసము ఒక యేడజ్ఞాతవాస కాలమున రాజ్యమునకు దూరమయిన పాండవులు రాజ్యముపై హక్కు కోల్పోయినట్లు కాదా ? భారతసంగ్రామమున పాండవులు అధర్మయుద్ధమును చేసి కౌరవులను జయించి వధించలేదా ? ఇటువంటి శంకలు మధ్యమాధికారులైన విద్యావంతులలో బలముగా నాటుకున్నవి. ఇట్టి విరుద్ధభావములకు నేటి సినిమాలు, రేడియోలు, టి.వి.ల వంటి ప్రసారసాధనములు మిక్కిలి బలపరచుచున్నవి. ఫలితముగా విద్యావంతులలో నయితము మహాభారతముపైనను తద్గ్రంథకర్తయగు వ్యాసభగవానునిపైనను భక్తి విశ్వాసములు సన్నగిల్లుచున్నవి.

వెనుకటి ప్రకరణములో పేర్కొనబడిన సంప్రదాయబద్ధములు, పరమ ప్రామాణికములును నగు గ్రంథములు నేటికాలమున విద్యావంతులకును, ధర్మ రహస్యములను తెలిసికొనదలచిన పాఠకులకును అందుబాటులో లేవు సరికదా అందలి విషయములు క్లిష్టములై దురవగాహములుగా నున్నవి.

కనుక ప్రముఖములైన వివాదాంశములను గ్రహించి వానిని ధర్మ శాస్త్రప్రమాణములతో, నిబద్ధతో విశ్లేషించి, విశదీకరించి సప్రమాణముగా, ధర్మాధర్మములను చర్చించి, అందిమిడియున్న ధర్మసూక్ష్మమును ప్రదర్శించుట ప్రతిష్ఠించుట అనునదే నా ధ్యేయము.

ఈ ప్రయత్నమున కిదియే వైశిష్ట్యము. ఈ ప్రక్రియతో కవిత్రయమువారి ఆంధ్రమహాభారతమే ప్రధానప్రాతిపదిక అయినను ఆంధ్రీకరణమున స్పష్టముగా లేని తావులందును, వ్యాసభారతము మిక్కిలిగా సంగ్రహింపబడిన చోట్లను, కొలదిగా భేదించుటయో ఉపేక్షించుటయో జరిగినచోటులందును వ్యాసభారతాంశములను స్పృశింపక మార్గాంతరము లేదు. కనుక ఆంధ్రభారతమునందలి ధర్మసూక్ష్మములను విశదీకరించుటలో సమగ్రతను ప్రామాణికతను సాధించుటకు యత్నించితిని. ఈ ప్రయత్నములో నేనెంతవరకు కృతకృత్యుడనయితినో సహృదయపాఠకుల నిర్ణయమే శిరోధార్యము.



# 2. వ్యాసావతరణము

i) వేదవ్యాసుని జన్మవృత్తాంతము - పూర్వకథ
ii) వ్యాసుడు - వివిధనామములు - అర్థములు
iii) వ్యాసునిగురించిన వివిధవాదనలు
iv) వ్యాసప్రశంస - వివిధ ఆకరములు
v) వ్యాసజననములోని ధర్మసూక్ష్మములు

## వేదవ్యాసుని జన్మవృత్తాంతము - పూర్వకథ

వ్యాసాయ విష్ణురూపాయ వ్యాసరూపాయ విష్ణవే
నమో వై బ్రహ్మనిధయే వాసిష్ఠాయ నమో నమః ॥

దేవలోకమున నొకప్పుడు యాగము జరుగుచుండెను. యజ్ఞమున పశ్వాలంభన విషయమున దేవతలకును ఋషులకును వివాదమేర్పడెను. దేవతలు మేకను హోమము చేయవలసినదని బ్రాహ్మణులకు చెప్పిరి. అజమనగా ఛాగమే. అనగా మేకయే. వేరొక పశువు కాదు అని వారి సిద్ధాంతము. కాని ఋషులీ అభిప్రాయముతో నేకీభవింపలేదు. ధాన్యములచే యజ్ఞములయందు హోమముచేయదగినదని వేదశ్రుతి కలదు. అందువలన 'అజా' అను పేరుగల బీజములు హోమము చేయదగినవి. ఛాగమును చంపుట తగదు. వసువనువాడు దేవతల మతమునే ఆశ్రయించి పక్షపాతముచే మేకయే హోమము చేయదగినదని సిద్ధాంతీకరించెను. అందుచే ఋషి శాపమున వసువు భూలోకమున జన్మించెను. అతడు ఇంద్రునిగూర్చి గొప్ప తపస్సు చేయగా ఇంద్రుడాతని తపమునకు మెచ్చి ఒక దివ్యవిమానమునొసంగెను. అతడా విమానమునెక్కి ఆకాశమున సంచరించుచుండుటచే ఉపరిచరవసువను పేరుకలిగెను.

ఉపరిచరవసువు భార్య గిరిక. ఆమె ఋతుమతిగానుండగ పితృదేవతలామెకు మృగమాంసమును తెచ్చిపెట్టుమని చెప్పిరి. ఆ రాజును మృగమాంసముకొరకై వేటకు వెళ్ళెను. ఆ రాజు తన భార్యయొక్క సౌందర్యవిశేషములనే తలపోయుచుండుటచే నాతనికి వీర్యస్ఖలనమయ్యెను. ఆ వీర్యమునొక దొప్పలోనుంచి ఒక పరిచారికకిచ్చి భార్యకు పంపెను. ఆ పరిచారికయు డేగరూపమును ధరించి వీర్యమును

గొనిపోవుచుండగా వేరొకడేగ దానిని మాంసఖండముగా భ్రమించి ఆ డేగతో తలపడెను. ఆ పోరు జరుగుచుండగా ఆ వీర్యము క్రింద యమునానదిలో పడెను. బ్రహ్మశాపముచే ఆ నదిలో చేపగానున్న అద్రిక ఆ వీర్యమును మ్రింగి గర్భమును ధరించెను. పదియవ మాసమున ఆ చేప జాలరులకు చిక్కగా , దాని పొట్ట కోయగా అందుండి ఒక మగ పిల్లవాడు, ఒక ఆడపిల్ల బయల్పడిరి. ఆ శిశువులను పల్లీయులకు నాయకుడగు దాశరాజు కొనిపోయి వసురాజున కీయగా నాతడు కుమారుని తీసికొని మత్స్య దేశమునకు ప్రభువును గావించెను. ఆడపిల్ల చేపలకంపు కొట్టుచుండుటచే దాశరాజునకే పెంపకమునకిచ్చెను. ఆమె దాశరాజునింట మత్స్య గంధిగా పెరుగుచుండెను. ఆమెయే సత్యవతి.

సత్యవతి పూర్వజన్మగాథ మహాభారతమునందిట్లు చెప్పబడినది. సోమలోకవాసులు, దేవగణసేవితులు, మరీచీపుత్రులు, అగ్నిష్వాత్తు లనుపితృదేవతలు కలరు. వారి మానస పుత్రిక 'అచ్ఛోద' ఒకనాడు ఉపరిచరవసువు అద్రికయను నప్సరసతో దివ్యవిమానమున గానిపింపగా అచ్ఛోద వ్యామోహపడి "ఏ తపము చేసిన నీతనికి కూతురనై పుట్టుదునో' ' అని సంకల్పించెను. ఆ సంకల్పదోషముచే అధోముఖత్వము నొంది బాధపడుచుండగా నామెకు పితృదేవతలు కనుపించి భయపడకుమని ధైర్యమును జెప్పి, క్రిందపడకుండ నిల్పి తమయోగదృష్టిచే భావికాలగతులనెఱింగి ఆమె కిట్లు చెప్పిరి. "నీవు వసువును దండ్రిగా గోరితివి గాన నతనికి కూతురవై యష్టావింశతి తమంబగు ద్వాపరయుగంబున నీ యద్రిక మత్స్యరూపధారిణియై యుండ దదీయోదరంబున జన్మింపగలదాన వప్పుడు మహాభిషుండను రాజు శంతనుండై పుట్టిన నతనికిం బత్నివై చిత్రాంగద విచిత్రవీర్యుల పుత్రులం గనియెదవు. నీకన్యాత్వం బేమిటను వైకల్యంబు నొందకయుండు నని చెప్పిరి. ఆ అద్రికయను నప్సరసయే వసురాజు వీర్యమును మ్రింగిన యమునా నదిలోని చేప. కావున సత్యవతియొక్క తల్లిదండ్రులిరువురును దేవతలే. అందువలననే సత్యవతి దేవకన్య. వ్యాసభారతమున సత్యవతీవర్ణనము దీనిని రూఢిపరచుచున్నది. ఆమె తండ్రిచే నియమింపబడి యమునానదిపై జనులను ధర్మార్థముగా నావపై దాటించుచుండెను. యాత్రార్థము చనుదెంచిన పరాశరుడు ఆ నావపై దాటవలసి వచ్చి సత్యవతిని జూచి ఆమె నిట్లుగా కోరెను.

అతీతరూపసంపన్నాం సిద్ధానామపి కాంక్షితాం
దృష్ట్వైవ చ సతాం ధీమాంశ్చకమే చారుహాసినీం,
దివ్యాం తాం వాసవీం కన్యాం రంభోరుం మునిపుంగవః
సంగమం మమ కళ్యాణి కురుష్వేత్యభ్యభాషత.

-మ. భా. వి. పు 6

ఆమె కోరినట్లు యోజనగంధిత్వమును ప్రసాదించి కన్యాత్వము దూషితంబు కాకుండ వరమునను(గహించి, చీకట్లు(క్రమ్మినట్లు మంచును సృష్టించి యామెతో సంగమించెను. సత్యవతి యానాటికి కన్యయే. వివాహిత కాకపోవుటయే కాదు, యౌవనవతియు కాదు. పురుషసంపర్కమునకర్హమగు శరీరధర్మమామెకు లేదు.

తతో లబ్ధవరా ప్రీతా స్త్రీ భావగుణభూషితా
జగామ సహసంపర్కం మృషిణాద్భుతకర్మణా,

-మ. భా. వి. పు 9

స్త్రీ భావగుణ భూషితా = స్త్రీబావే యో గుణః పుష్పవత్త్వం తేన భూషితా , సద్యఃపుష్పవత్యభూదిత్యర్థః

అని నీలకంఠులవారి వ్యాఖ్యాసము. సంతానము కలుగుటకు శుక్రశోణితములు కలియవలయును కదా. స్త్రీ భావగుణభూషితా అనగా శుక్రశోణితసంయోగమున కనువగు యౌవనధర్మములప్పుడు కల్పించెనని యర్థము. మహోజ్జ్వల ప్రతిభా ప్రభావసంపన్ను లవతరించునపుడే యట్టి ఊర్ధ్వరేతస్కులకు సంకల్పము కలుగును. వారివ్యసనము కామము కాదు. పరాశరులవీర్యము నుంచుటయే తడవుగా గర్భోత్పత్తియు వ్యాసజననము కలిగినవి.

పరాశరేణ సంయుక్తా సద్యోగర్భం సుషావ సా
జజ్ఞే చ యమునా ద్వీపే పారాశర్యస్స వీర్యవాన్
జాతమాత్రశ్చ స సద్యః ఇష్ట్యా దేహమబీబృభత్
వేదాంశ్చాధిజగే సాంగాన్ సేతిహాసాన్మహాయశాః

మ. భా. వి. పు.10

వ్యాసమహర్షి పుట్టిన వేంటనే పెరిగి పెద్దవాడయ్యెను. సంకల్పమాత్రముచేతనే

వేదవేదాంగములను, ఇతిహాసములన్నింటిని ఆ మహామహుడధిగమించెను. పని కలిగినప్పుడు స్మరించినచో ప్రత్యక్షమగుదునని చెప్పి తల్లియొద్ద సెలవుతీసికొని వెడలిపోయెను.

సద్యోగర్భంబున నహి
మద్యుతి తేజుండు వేదమయుడఖిల మునీం
ద్రాద్యుడు వేదవ్యాసుం
డుద్యత్జ్ఞానంబుతోడ నుదితుండయ్యెన్.

(ఆ.భా- ఆది. తృతీయ అ. 44)

అని తెలుగుభారతము. విషయమట్లుండగా తెలుగుభారతమున నన్నయ కవీంద్రులు మూలమునందలి విషయమునతిక్రమించి వ్రాసిరి. పరాశరుడు సత్యవతిని జూచునాటికి ఆమెకు పురుషసంపర్కమున కర్హమగు శరీరధర్మమే లేదని మూలము చెప్పుచుండ "ఇట్టేకతంబ యేకవస్త్రయయి యోడ నెక్కువారల........ " అని వ్రాసిరి. ఏకవస్త్రయనగా రజస్వల. వాస్తవమునకామె రజస్వలకాదు. పైగా సత్యవతీపరాశరుల శృంగారమునొక సీసపద్యము వర్ణించి ఎత్తుగీతిలో

"నెంత శాంతులయ్యు నెంత జితేంద్రియు
లయ్యు గడు వివక్తమయినచోట్ల
సతులగోష్ఠి జిత్తచలనమొందుదురెందు
గాముశక్తి నోర్వగలరె జనులు"

(- ఆభా- ఆది - 3 అ -38)

అని వ్రాసిరి. నన్నయ కవీంద్రులు కావ్యరసపోషణ దృష్టితో నిట్లుకల్పించి వ్రాసిరని భావింపవలసియున్నది. కావుననే కేవలమాంధ్రభారతమును మాత్రమే చదివి మహాభారతములోని ధర్మాధర్మములను విమర్శించుట యుక్తముకాదు. ఆంధ్రమహాభారతకర్తలు మహనీయులనుటలో సందియములేదు. కాని వారికి మహాభారతములోని ధర్మసందేహములు వానికి సమాధానమీయదగు ధర్మ సూక్ష్మములపై దృష్టిలేకపోవచ్చును. కథావస్తువును సంగ్రహముగా తెలుగు పాఠకులకందీయుటే వారి కర్తవ్యముగా భావించిరి. ఆంధ్రభాషాసౌకుమార్యమును,

కావ్యరసపోషణముననను, పాత్రచిత్రణముననను వారు చూపిన శ్రద్ధ ధర్మసూక్ష్మ విషయములపై చూపలేదనవలసివచ్చును. మహాభారతమున వివాదగ్రస్తములగు పెక్కు సందర్భములలోని ముఖ్యముగా సభాపర్వముననను నాంధ్రమున చాలసంగృహీత మైనది. కొన్నిచోట్ల వ్యాసహృదయమునకు ఆంధ్రీకరణమున భంగమువాట్లిల్లినది గూడ. అది యటుండనిండు.

ఇక వ్యాసుని పూర్వకథ మహాభారతమునందలి శాంతి పర్వమున నిట్లుకలదు.

పూర్వకాలమున జగత్స్రష్టయగు బ్రహ్మదేవుడు వేదమునుచ్చరించుచు "భో" అను శబ్దము నుచ్చరింపజేసెను. అప్పుడు "అపాంతరతమా" అను వాక్కునుండి పుట్టిన కుమారుడుద్భవించెను. అతడు భూతభవిష్యద్వర్తమానముల నెరింగినవాడును, సత్యవాక్కుగలవాడును, దృఢమైన వ్రతము గలవాడును అయ్యెను. తనకు నమస్కరించుచున్న అట్టి కుమారునిగూర్చి బ్రహ్మదేవుడిట్లనెను "ఓ బుద్ధిమంతుడా ! వేదములను చెప్పుట నీవల్ల శ్రవణముచేయదగి యున్నది. మరియు వైవస్వత మన్వంతరము కాగా కురువంశీయులగు భారతరాజులు పుట్టగలవారు. వారు గొప్పవారును లోకమునందు ప్రసిద్ధి నొందినవారును కాగలరు. నీనుండి పుట్టినవారలకు విరోధము సంభవించును. వశిష్ఠమహర్షినుండి పరాశరుడను మహర్షియు సంభవింపగలడు. వానిని నిమిత్తముగా చేసికొని నీవు భారతమును రచింపగలవు. ఈ విధముగా సరస్వతీదేవి కుమారుడైన అపాంతరతమ ఋషిని గూర్చి బ్రహ్మదేవుడు చెప్పెను. ఆ విధముగా బ్రహ్మయనుగ్రహముచే అపాంతరతమ ఋషియే హరియంశచే మరల వ్యాసుడుగా నవతరించెను. ఈ విధముగా శ్రీమహావిష్ణువే సత్యవతీదేవియందు కృష్ణ ద్వైపాయనుడుగా పరాశరమహర్షివలన నుద్భవించిన వాడాయెను.

## వ్యాసుడు - వివిధ నామముల - అర్థములు

పరాశరేణ సంయుక్తా సద్యోగర్భం సుషావ సా
జజ్ఞే చ యమునాద్వీపే పారాశర్యస్స వీర్యవాన్
వ్యస్తో ద్వీపే యద్బాలః తస్మాద్ద్వైపాయనస్స్మృతః
యో వ్యస్య వేదాంశ్చతురః తపసా భగవాన్ ఋషిః
లోకే వ్యాసత్వ మాపేదే కార్ష్ణ్యాత్ కృష్ణత్వమేవ చ॥

-మహా. భా ఉ. ఆది. పు 25

అని భారతము. నీలకంఠులీ ప్రదేశమున "ఈశ్వరాదనవ్యత్వాత్ కృష్ణత్వం" అని స్వారస్యమును చెప్పిరి. పరాశరునివలన కలుగుటచే పారాశర్యుడనియు, ద్వీపమునందు పుట్టుటచే ద్వీపము అయనము (స్థానము) గలవాడుగాన ద్వైపాయనుడనియు, యమునానది నల్లగానుండును గనుక ఆ ద్వీపమునందు పుట్టుటచేతను, కృష్ణ వర్ణము కలిగియుండుటచేతను కృష్ణద్వైపాయనుడని, సత్యవతీకుమారుడగుటచే సాత్యవతేయుడనియు వేదములను విభజించుటచే వేదవ్యాసుడనియు, నా బాలునకు నామము లేర్పడెను. వ్యాసునకు బాదరాయణుడనియు నామాంతరము.

ద్వీపే బదరికామిశ్రే బాదరాయణమచ్యుతం
పరాశరాత్సత్యవతీపుత్రం లేభే పరన్తపమ్

-మ.భా తత్త్వ పు. 259

అని శ్రుతిప్రకాశిక. బదరీవృక్షములు స్థానముగా గలవాడు బాదరాయణుడు. పరాశరునివలన సత్యవతీదేవి అట్టి ద్వీపమునందు బాదరాయణుని కనిన దని కూడ చెప్పబడినది. దీనివలన బాదరాయణుడే ద్వైపాయనుడు, పారాశర్యుడు సాత్యవతేయుడునని తాత్పర్యము.

## వ్యాసుని గురించి వివిధ వాదనలు

సత్యవతి శూద్రకన్య కనుక ఆమెయందు పరాశరునివలన జన్మించిన వ్యాసుడు నిషాదుడని యొకవాదము. బ్రాహ్మణుడు సితవర్ణుడై యుండవలెను వ్యాసుడు కృష్ణవర్ణుడు కనుక బ్రాహ్మణుడుగాక నిషాదుడే యయి యుండవలెనని మరియొకవాదము.

సత్యవతి శూద్రకన్య కాదు. ఉపరిచరవసువు వీర్యమున అద్రిక యను గంధర్వ కాంత శాపవశమున యమునానదిలో చరించుచున్న చేపకడుపున బుట్టిన క్షత్రియ కాంత యనియు మీదుమిక్కిలి దేవకాంత యనియు ముందే నిరూపించబడినది. వ్యాసుడు నిషాదుడనువారు ఈ క్రింది ప్రమాణమును చూపుదురు.

"బ్రాహ్మణాద్వైశ్యకన్యాయాం అంబష్ఠో నామ జాయతే
నిషాదః శూద్రకన్యాయాం యః పారాశర ఉచ్యతే"

(- మను - 10అ - 8)

బ్రాహ్మణునకు శూద్రస్త్రీయందు బుట్టినవాడు నిషాదుడని పై మనుస్మృతి

శ్లోకమునకు వ్యాఖ్యాత కుల్లూభట్టు కాన్యాయాం ఊఢాయాం అని ప్రత్యాహారము చేసి "శూద్రకన్యాయామూఢాయాం నిషాద ఉత్పద్యతే' అని వ్రాసిరి. అనగా వివాహము చేసికొనిన శూద్రకాంతయందు బ్రహ్మణునకు బుట్టినవాడు నిషాదుడని, కాని యీ విమర్శనమున కిక్కడ తావులేదు. ఏమన మత్స్యగంధి అయిన సత్యవతి శూద్రకాంత కాదు. పరాశరుడామెను వివాహమాడలేదు. దివ్యకాంతయగు నామెయందు పరాశరమహర్షి బీజప్రాధాన్యముగ వ్యాసమహర్షిని సంభవింపజేసెను. కనుకనే

"వ్యాసశ్చ భగవాన్ విప్రో దేవర్షిగణసేవితః" అని మహాభారతములో పెక్కు స్థలములందు నొక్కి వక్కాణింపబడినది. బ్రాహ్మణుడు సితవర్ణుడుగా నుండవలెనని చెప్పినది. మహాభారతము శాంతిపర్వమునందలి 138 అధ్యాయమునందలిదీ క్రింది శ్లోకము.

బ్రాహ్మణానాం సితో వర్ణః క్షత్రియాణాం తు లోహితః
వైశ్యానాం పీతకో వర్ణ శ్శూద్రాణామసితస్తథా.

-మహా. భా శాంతి 138 అ.

బ్రాహ్మణునకు సితవర్ణమని, క్షత్రియులకు లోహితవర్ణమని, వైశ్యులకు పీతవర్ణమని, శూద్రులకు అసితవర్ణమని (నలుపు) అని, కనుక వ్యాసుడు నల్లనివాడు కనుక బ్రాహ్మణుడుకాక శూద్రుడు కావలెనని విమర్శకుల వాదన. కాని యిచట వర్ణమనగా రంగని యర్థము కాదు. నీలకంఠులేమని చెప్పిరి. "సాత్వికం, రాజసం, తామసం, మిశ్రం చేతి స్వచ్ఛత్వాది సామ్యాత్ గుణవృత్తం వర్ణశబ్దేనోచ్యతే", సితః=స్వచ్ఛఃసత్వగుణః, ప్రకాశాత్మా శమదమాదిస్వభావః, లోహితో=రజోగుణః, ప్రవృత్త్యాత్మా శౌర్యతేజ ఆది స్వభావః, పీతకః= రజస్తమోవ్యామిశ్రః కృష్యాదినిహీన కర్మప్రవర్తకః, అసితః=ఆవరణాత్మా తమోగుణః, స్వతఃప్రకాశప్రవృత్తిహీనః శకటవత్పరప్రేర్యః.

దీని వివరణమీలాగున :- ఇచ్చట చిత్తవృత్తిహేతువగు ధర్మము నిరూపించ బడుచున్నది. బ్రహ్మ పూర్వము బ్రహ్మనిష్ఠులగు మరీచి ప్రభృతులైన ప్రజాపతులను సృజించి, సత్యము, యజ్ఞాదిధర్మము, కృచ్ఛ్రచాంద్రాయణాది తపస్సు, నిత్యమయిన వేదము, స్నానాద్యాచారము, ప్రాయశ్చిత్తాదిరూపమయినశౌచము అను స్వర్గసాధనములను విధించెను. దేవదానవగంధర్వాదులయొక్కయు, బ్రాహ్మణాది

చతుర్వర్ణములయొక్కయు వర్ణములను అనగా సాత్త్వికరాజసతామస మిశ్రములనబడు సత్త్వాదిగుణకృతవ్యాపారమును నియమించెను. బ్రాహ్మణులకు సితవర్ణము అనగా ప్రకాశాత్మకమయిశమదమాదిస్వభావముగల సత్త్వగుణము, క్షత్రియులకు లోహితవర్ణము అనగా ప్రవృత్త్యాత్మకమయిన శౌర్యాదిస్వభావముగల రజోగుణము, వైశ్యులకు పీతవర్ణము అనగా కృష్యాదినిహీనప్రవర్తకమయిన రజస్తమోవ్యామిశ్రగుణము,శూద్రులకు అసిత వర్ణము అనగా ఆవరణాత్మకమయిన స్వతఃప్రకాశప్రవృత్తిరహితమయిన తమోగుణము నిర్మించబడెనని చెప్పబడినదే గాని రంగులని చెప్పబడలేదు. ఇది నీలకంఠీయవ్యాఖ్యానము. దీని తత్త్వమెఱుంగక వ్యాసుడు అసితవర్ణుడగుటచే బ్రాహ్మణుడుగాడనుట అజ్ఞానము.

## వ్యాసప్రశంస - వివిధ ఆకరములు

**అచతుర్వదనో బ్రహ్మ ద్విబాహురపరో హరిః**
**అఫాలలోచనశ్శంభుః భగవాన్ బాదరాయణః.**

అని లోకమున ప్రచారములోనున్న ఒక చాటు శ్లోకము. ఇది వేదవ్యాసుని ప్రశంస. వ్యాసులు నాలుగు ముఖములు లేని బ్రహ్మయట. రెండే బాహులున్న శ్రీమహావిష్ణువట. మూడవ నేత్రములేని పరమశివుడట. అనగా త్రిమూర్త్యాత్మకమని యర్థము.

"మునీనామప్యహం వ్యాసః" మునులలో నేను వ్యాసుడనని శ్రీకృష్ణభగవానుడు గీతలో చెప్పెను. సప్తర్షులు, వసిష్ఠ వామదేవమార్కండేయాదులెందరో వయోవృద్ధులు, జ్ఞానవృద్ధులు, మునులుండగా వ్యాసుడే తానని శ్రీ కృష్ణుడు చెప్పుటతో వ్యాసుని విశిష్టత ప్రశంసార్హము.

**వ్యాసాయ విష్ణురూపాయ వ్యాసరూపాయ విష్ణవే**
**నమో వై బ్రహ్మనిధయే వాసిష్ఠాయ నమో నమః ॥**

-మహా. భా. వి. పు 2

ప్రతిద్వాపరాంతమున భగవానుడే వ్యాసరూపమున నవతరించి, వేదవిభజన చేసి పురాణసంహితను ప్రజలకందించును. కృష్ణద్వైపాయనుడు ఇరువది యెనిమిదవ వ్యాసుడు. ఇప్పటికి ఇరువదియేడుగురు వ్యాసులు గతించినారు. వ్యాసుడన్నది ఒకవ్యక్తి నామము కాదు. అది పదవీ నామము. ఆ పదవిలోనున్నవారందరూ వ్యాసులే.

మన్వంతరేషు సర్వేషు ద్వాపరే ద్వాపరే యుగే
ప్రాదుఃకరోతి ధర్మార్థీ పురాణాని యథావిధి
ద్వాపరే ద్వాపరే విష్ణుర్వ్యాసరూపేణ సర్వదా
వేదమేకం స బహుధా కురుతే హితకామ్యయా
అల్పాయుషో అల్పబుద్ధీంశ్చ విప్రాన్ జ్ఞాత్వా కలాపథ
పురాణసంహితాం పుణ్యాం కురుతేఽసౌ యుగే యుగే ॥

-దేవీ. భా. -1 స్క- 3 అ

ఈ విషయమే శ్రీమద్భాగవతము ప్రథమస్కంధము నాల్గవ అధ్యాయమునందు గూడ వివరించబడినది.

"వ్యాసో నారాయణస్సాక్షాత్" అని శ్రీహరిర్వ్యాసరూపేణ జాయతే చ యుగే యుగే

- బృహన్నారదీయము మహాభారత విమర్శనము.

వ్యస్తవేదతయా వ్యాస ఇతి లోకే శ్రుతో మునిః,
అయం సాక్షాన్మహాయోగీ వ్యాసస్సర్వజ్ఞ ఈశ్వరః.

-మహా. వి. పు 4

-సూతసంహిత మ.భా.వి.... నుండి.

కృష్ణద్వైపాయనం వ్యాసం విద్ధినారాయణం ప్రభుం
కో హ్యన్యః పుండరీకాక్షాన్మహాభారతకృద్భవేత్ ॥

-విష్ణుపురాణము, మ.భా.వి.... నుండి

అని చెప్పుచున్నది. వ్యాసమహర్షి సాక్షాన్నారాయణాంశసంభవుడే. కనుకనే శ్రీమద్భాగవతప్రథమస్కంధములో భగవంతుని ఏకవింశత్యవతారములను చెప్పు సందర్భమున వ్యాసుని పదునేడవ అవతారముగ చెప్పినారు.

తతః సప్తదశే జాతః సత్యవత్యాం పరాశరాత్,
చక్రే వేదతరోశ్శాఖా దృష్ట్వా పుంసోఽల్పమేధసః.

-భాగ - 1స్కం

వేదవ్యాసుడు త్రికాలజ్ఞాని. ఋషులు ఆగతానాగత విషయములను ఆర్షదృష్టిచే గ్రహింతురు. వారివాక్కులు త్రోసివేయరాదని భర్తృహరి చెప్పెను. వాక్యపదీయము బ్రహ్మకాండమునందు.........

ఆవిర్భూతప్రకాశానామనుపప్లుతచేతసాం
అతీతానాగతజ్ఞానం ప్రత్యక్షాన్న విశిష్యతే ॥
అతీంద్రియానసంవేద్యాన్ పశ్యంత్యార్షేణ చక్షుషా
యే భావాన్ వచనం తేషాం నానుమానేన బాధ్యతే ॥

-మహా. భా .తత్త్వ. పు 91

అనగా తపస్సుచే క్షీణించిన చిత్తదోషములు కలిగి అనావృతజ్ఞానసంపన్నులైన యోగులకు కలుగు అతీతానాగతజ్ఞానము అస్మదాదిప్రత్యక్షమువంటిది. ఏ ఋషులు అతీంద్రియపదార్థములను యోగశక్తిరూపమయిన ఆర్షజ్ఞానముచే గ్రహించుచుండిరో వారివాక్కు అవ్యవస్థితములైనట్టివియు, నతీంద్రియపదార్థములయెడ నుపయోగింపనట్టియు నూహలచే బాధితములు గానేరవు.

ఈ యార్షజ్ఞానమునుగూర్చి వైశేషికదర్శనమిట్లు చెప్పుచున్నది.

సూ ॥ ఆర్షం సిద్ధ దర్శనం చ ధర్మేభ్యః సూ 354.

అనగా ఋషులకు అతీంద్రీయపదార్థములవిషయమయిన ఆత్మమనస్సంయోగము వలన ధర్మాతిశయమునుబట్టి కలిగెడు యథార్థజ్ఞానము ప్రాతిభమనియు, ఆర్షమనియు చెప్పబడును. అది ఋషులకు దేవతలకు బహుళముగా నుండును. వేదవ్యాసుడు తాను అఖండతపస్సు చేసి త్రైకాలికజ్ఞానమును పొందినట్లు తన శిష్యులకు చెప్పెను.

పరాశరసుతఃశ్రీమాన్ వ్యాసో వాక్యమథాऽబ్రవీత్,
మయా హి సుమహత్తప్తం తపఃపరమదారుణమ్.
భూతం భవ్యం భవిష్యం చ జానీయామతిసత్తమాః,
తస్య మే తప్తతపసో నిగృహీతేన్ద్రియస్య చ.
నారాయణప్రసాదేన క్షీరోదస్యానుకూలతః,
త్రైకాలికమిదం జ్ఞానం ప్రాదుర్భూతం యథేప్సితమ్.

తచ్ఛృణుధ్వం యథాన్యాయం వక్ష్యే సంశయముత్తమమ్
యథావృత్తం హి కల్పాదౌ దృష్టం మే జ్ఞానచక్షుషా॥

మహాభారతం శాన్తిపర్వం, 340 వ అధ్యాయం

అనగా నేను భూతభవిష్యద్వర్తమానవృత్తాంతములను తెలిసికొనుటకై దారుణ తపస్సు చేయగా నారాయణానుగ్రహమువలన త్రైకాలికజ్ఞానము నేను కోరినట్లు లభించినది. కల్పాదియందేది జరిగెనో దివ్యదృష్టికి గోచరించినది, చెప్పెదను వినుడని భావము. కనుకనే

అయం స్సాక్షాన్మహాయోగీ వ్యాసస్సర్వజ్ఞ ఈశ్వరః
మహాభారతమాశ్చర్యం నిర్మమే భగవాన్ గురుః.

-మహా. భా .తత్త్వ. పు 93

అనుచు వ్యాస మహర్షి మహత్త్వము కీర్తింపబడెను.

వ్యాసమహర్షి యొకప్పుడు కేవలము వాయుభక్షకుడై శివునిగూర్చి నూరు సంవత్సరములఖండమగు తపమొనర్చెను.

న చాస్య హీయతే ప్రాణః న గ్లాని రుపజాయతే,
త్రయాణామపి లోకానాం తదద్భుతమివాభవత్.
జటాశ్చ తేజసా తస్య వైశ్వానరశిఖోపమా,
ప్రజ్వలంత్యః స్మ దృశ్యంతే యుక్తస్యామితతేజసా.
ఏతా అద్యాపి కృష్ణస్య తపసా తేన దీపితాః
అగ్నివర్ణా జటాస్తాత ప్రకాశంతో మహాత్మనః.

-మహా. శాంతి.324 అ.

ఆయనకెట్టి శ్రమయు కలుగలేదు. ఆయనయొక్కజడలు అగ్నిశిఖలవలె నేటికిని అగ్నివర్ణమున ప్రకాశించుచున్నవి. " పింగాంశుజటాచ్ఛటాభరణు" అని

"ఉద్యద్దివాకరరుక్పింగజటాకలపు" ఆది, 3అ, 3ప.

"సువర్ణవల్లరీజాలమువోని పింగళవిశాలజటాచయమొప్పగా" ఆది, 4అ, 239ప.

"తస్య కృష్ణస్య కపిలా జటా దీప్తే చ లోచనే " ఆది, 106 అ, 5శ్లో.

అని ఆయన జడలుగోరోచనవర్ణము కలిగియున్నట్లు భారతమున ననేక స్థలముల వర్ణింపబడినది.

**తతోఽస్య తేజసా వ్యాప్తం విశ్వం సర్వం చరాచరం,**
**అగ్నివర్ణా జటా జాతాః పారాశర్యస్య ధీమతః**

-దే.భా- 1స్కం- 10 అ

అని దేవీభాగవతము ప్రథమస్కంధము పదియవ ఆశ్వాసమునందుగూడా కలదు. త్రికాలజ్ఞానసంపన్నుడగు శ్రీవేదవ్యాసమహర్షి జ్ఞానభిక్షనొసంగి లోకులనుద్ధరింపగోరి అప్పటి కేకరూపముననున్న వేదమును నాలుగుభాగములుగ విభజించి ఋగ్యజుస్సామాధర్వణములను పేరు పెట్టెను. పిమ్మట ఉపనిషత్సారభూతమగు వేదాంత తత్త్వమును బ్రహ్మసూత్రములుగా రచించెను. దానికే శారీరకమీమాంసాశాస్త్రమని నామాంతరము. పిమ్మట పదునెనిమిది మహాపురాణములను రచించెను. అవి ఇవి. 1) మత్స్య పురాణము, 2) మార్కండేయ పురాణము, 3) భవిష్యత్పురాణము, 4) భాగవత పురాణము, 5) బ్రహ్మపురాణము, 6) బ్రహ్మాండ పురాణము 7) బ్రహ్మవైవర్త పురాణము, 8) వామనపురాణము, 9) వాయుపురాణము, 10) విష్ణుపురాణము, 11) వరాహపురాణము, 12) అగ్నిపురాణము, 13) నారదపురాణము, 14) పద్మపురాణము, 15) లింగపురాణము, 16) గరుడపురాణము, 17) కూర్మపురాణము, 18) స్కాందపురాణము.

ఈ పదునెనిమిది మహాపురాణములలో చెప్పక విడిచిన విషయములను సంశయించువారి సందియముల నివారింపబూని మరల పదునెనిమిది ఉపపురాణములను రచించెను. అవి.

1) సనత్కుమారం, 2) నారసింహం, 3) నారదీయం, 4) శివం, 5) దుర్వాసనం, 6) కపిలం, 7) మానవం, 8) ఔశనసం, 9) వారుణం, 10) కాలితా, 11) సాంబం, 12) నందికృతం, 13) సౌరం, 14) పరాశరం, 15) ఆదిత్యం, 16) మహేశ్వరం, 17) భాగవతం, 18) వాసిష్ఠం.

ఈ మహాపురాణములు, ఉపపురాణములను గూర్చిన వివరములు దేవీభాగవత ప్రథమస్కంధము మూడవ అధ్యాయమున కలవు.

## వ్యాసజననములోని ధర్మసూక్ష్మములు

వ్యాసునిగూర్చిన వివిధవాదనలు అనునంశముక్రింద వ్యాసజననమును గూర్చిన సత్యవతి జాలరివనిత. ఆమెయందు పరాశరునివలన జన్మించిన వ్యాసుడు నిషాదుడను విమర్శ నిరాధారమై పరాస్తమైనది. ఇక పరాశరునివలన వ్యాసుని కని మరల సత్యవతి కన్య ఎట్లయ్యెనను దానికి సమాధానము పరామర్శింతము. కాశికాగ్రంథ వాఖ్యయగు పదమంజరియందిట్లుకలదు. మునీశ్వరులయొక్కయు, దేవతలయొక్కయు మాహాత్మ్యమువలన పురుషసంయోగమును పొందియు కన్యాత్వమునకు హాని కలుగదు. ఇందుకు దృష్టాంతము సత్యవతి కుంతి " కన్యాయాః కనీన చ"

కాశికా - "కాన్యాయా అపత్యం కానీనః కర్ణః కానీనో వ్యాసః"

**కాశికావ్యాఖ్యాపదమంజరీ :-** మునిదేవతామాహాత్మ్యాత్ యా పుంయోగేఽపి కన్యాత్వం న జహాతి. యథా కున్తీ యథా సత్యవతీ సాఽత్రోదాహరణమితి తదాహ కానీనః కర్ణః కానీనో వ్యాస ఇతి.

**కైయట గ్రంథః -** మునిదేవతామాహాత్మ్యాత్ పుంయోగేఽప్యక్షతయోనిర్భవతి. యథా కున్తీ మన్త్రాహూతదినకరోత్పాదితకర్ణాఖ్యపుత్రాపి పునః కన్యైవాభూత్ తదపత్యం కానీనశబ్దాభిధేయమ్. - మ. భా.తత్త్వ. పు 193

దీని తాత్పర్యమేమనగా కానీనశబ్దమునకు కన్యయొక్క పుత్రుడని యర్థము. కన్యయైనచో పుత్రుడెట్లు ? పుత్రుడున్నచో కన్య యెట్లగును ? అని విరోధము తటస్థింపగా మునిమహిమచేతను దేవతామహిమచేతను పురుషసంబంధము కలిగినను ఏ స్త్రీ అక్షతయోనిత్వరూపమయిన కన్యాత్వము కలిగియుండునో అట్లు కుంతీదేవియు, సత్యవతీదేవియు నుదాహరణమగును. కనుక విరోధము లేదు. వీరి కన్యాత్వము పుత్రులను కనిన పిమ్మటకూడ దూషితము కాలేదు. మరియు కుంతీసత్యవతులు పురుష సంబంధ వాంఛలేని దశలోనున్నప్పుడే సూర్యపరాశరులవలన వారికి సంతతి కలిగింపబడినందున నా సంతతికలిగెడి కాలమునకుగూడ వారిది కన్యాత్వమే యయినందున వారికన్యాత్వమునకు విచ్ఛేదము కలుగులేదని భావము.

అంతేకాక స్మృతియందు గొప్పవారలవిషయమున నచ్చుటచ్చుట ధర్మము

నతిక్రమించుటయు, సాహసకృత్యములు కనబడుచున్నవి. వానిని చూచి మరియొక సామాన్యుడు మాహాత్మ్యములేనివాడగుటచే నట్లుప్రవర్తించినచో నశించును. పూర్వులయొక్క శరీరములును, ఇంద్రియములును తేజోమయమయినవి. అందుచే వారిని దోషములు తామరాకును నీరువలె నంటజాలవని చెప్పబడినది.

ఆపస్తంబ సూత్రం :- దృష్టో ధర్మవ్యతిక్రమస్సాహసం పూర్వేషాం తేజో విశేషేణ ప్రత్యవాయో న విద్యతే ॥ తదన్వీక్ష్య ప్రయుంజానస్సీదంత్యవరాః ॥ఇతి॥

పూర్వుల చరిత్రలలో నచ్చటచ్చట మొదలుగాగల విషయమిచ్చట చెప్పబడినది. బోధాయనమహర్షియును...

అనుష్ఠితం తు యద్దేవైర్మునిభిర్యదనుష్ఠితం,
నానుష్ఠేయం మనుష్యైస్తదుక్తం కర్మ సమాచరేత్.

- మ.భా.సా.పు. 56

దేవతలచేత నేది చేయబడినదో, మునులచే నేది చేయబడినదో అట్టి సాహసకృత్యము మనుష్యులచే నాచరింపదగనిది. వారిచే బోధింపబడిన ధర్మాది కర్మలను మాత్రమే మన మాచరింపవలయునని చెప్పెను. పురాతనులగు ఋషులచే సంకల్పమాత్రముచేతనే పుత్రులు పుట్టింపబడిరి. భారతము అనుశాసనిక పర్వమునందిట్లు చెప్పబడినది. పూర్వకాలమునగల మహర్షులు ప్రత్యక్షము చేసికొనబడిన ఆత్మస్వరూపముగలవారగుటచే వారి కులజన్మాదులనుగూర్చి విచారింపబనిలేదు. వారు ఆత్మజ్ఞానులగుటచే వారికర్మచే వారికి పాపములేదు. స్వర్గాది లోకహానియు వారికి గలుగజాలదు. ఏలయన వేదమునందు ప్రతిపాదింపబడిన ఋషులందరును బ్రహ్మజ్ఞానులే. వారలు ప్రమాణభూతమైన శ్రుత్యాదులకు ప్రమాణభూతులు. తపోజ్ఞాననిష్ఠులగు మహాత్ములగుటచే వారిచే ప్రవర్తింపజేయబడిన కార్యములే మనకు ప్రమాణములు. ఏ విధముగా అగ్ని సర్వగతుడై యుండునో మహాత్ములతేజస్సుకూడ సర్వగతమయియుండును. ఆప్తకాములగు వారి కామక్రోధాదులు లోకానుగ్రహము కొరకే అని తెలియవలెను.

అయితే పరాశరునివలన సత్యవతికి జన్మించిన వ్యాసుడు క్షత్రియుడేల కాలేదు? బ్రాహ్మణుడెట్లయ్యెనని ప్రశ్న. బీజక్షేత్రప్రాధాన్యములతో నిక్కడ బీజమునకే

ప్రాధాన్యము. కనుకనే సత్యవతికి పరాశరునివలన కలిగిన వ్యాసుడు విప్రుడయ్యెను. ఈ సత్యవతికే తరువాత శంతనునివలన కలిగిన చిత్రాంగదవిచిత్రవీర్యులు క్షత్రియులైరి. తరువాత అంబికాంబాలికలయందు వ్యాసునకు గలిగిన ధృతరాష్ట్ర పాండురాజులు క్షత్రియులైరి. దాసియందు వ్యాసునివలన బుట్టిన విదురుడు శూద్రుడయ్యెను. ఈ విపర్యయమునకు సమాధానము " క్రతుమయః పురుషః" అని శ్రుతి. అనగా సంకల్పమునను సరించియే బీజక్షేత్రప్రాధాన్యము. "స్త్రీపురుషయోర్మధ్యే యస్య సంకల్పో ధృఢః తస్యైవ పుత్రః".

స్త్రీ పురుషులమధ్య యెవరి సంకల్పము దృఢమయినదో వారి సంతానమన్నమాట. పరాశర, సత్యవతులలో పరాశరునిసంకల్పము దృఢమగుటచే సత్యవతికి అసలు సంకల్పమే లేకపోవుటచే వారిసమాగమమున పుట్టిన వ్యాసుడు పరాశరాత్మజుడు విప్రుడన్నమాట.

"వ్యాసశ్చ భగవాన్ విప్రో దేవర్షిగణసేవితః"



# 3. ధృతరాష్ట్ర పాండురాజుల జననము

శంతనమహారాజు పుత్రులు, చిత్రాంగదుడు, విచిత్రవీర్యుడు. చిత్రాంగదుడు గంధర్వులతో యుద్ధమునందు మరణించెను. విచిత్రవీర్యుడు రాజై అంబికాంబాలికలను వివాహమాడి రాజ్యముచేయుచు సంతానములేకయే మరణించెను. ఆ సమయమున సత్యవతి భీష్మునితో.........

క॥ ఇక్కురువంశంబున నీ
వొక్కండవ యున్నవాడ వుర్వీరాజ్యం
బొక్కటి సేకొని తేజము
దిక్కుల వెలిగింపు సంతతియు బడయు మొగిన్

క॥ "నిరతంబు బ్రహ్మ మొదలుగ
వరుసగ యెడతెగక యిట్లు వచ్చిన వంశం
బురుభుజ నీవుండగ నీ
తరమున విచ్ఛిన్నమగుట ధర్మమె యనినన్"

(ఆ. భా- ఆది 4 అ 221-222)

భీష్ముడు సత్యవతికోర్కెను మన్నించలేదు. తాను తాల్చిన బ్రహ్మచర్య వ్రతమునకు భంగమువాటిల్లుట కెంతమాత్రమియ్యకొనలేదు. ఇచ్చట సత్యవతి యానతి స్పష్టముగా లేదు. తేజము దిక్కుల వెలిగింపు సంతతియు బడయు మొగిన్ అని మాత్రమే కలదు. అనగా భీష్ముడు వివాహముచేసికొని సంతానమును కనవలెననియా? అట్లయిననాడు భీష్ముడు దాశరాజుసమక్షమున గైకొన్న భీషణ బ్రహ్మచర్యవ్రతప్రతిజ్ఞకు భంగమువాటిల్లును. సత్యవతిసంతానమునకు రాజ్యాధికారము భంగమొనర్చినట్లగును. అట్లు కాక విచిత్రవీర్యుని భార్యలయందు నియోగవిధిననుసరించి భీష్ముడు సంతానమును కని కురువంశమును నిలుపవలెననియా? ఆ సంతానము విచిత్రవీర్యుని క్షేత్రజసంతానమగుటవలన నెట్లును సత్యవతిసంతతికి రాజ్యమును సంక్రమింపచేసి నట్లగును ? కాని భీష్మునిబ్రహ్మచర్య వ్రతమునకు తప్పక భంగమువాటిల్లియే తీరును. ఇందు సత్యవతీదేవియొక్క యానతి

స్పష్టముగాలేదు. మూలభారతమున విచిత్రవీర్యు డపుత్రకుడై గతింప భీష్మునితో నీవు సర్వధర్మవిదుడవు, ఈ భరతవంశము నిన్నాధారపడియున్నది.

కార్యే త్వాం వినియోజ్యామి తచ్ఛ్రుత్వా కర్తు మర్హసి
మమ పుత్రస్తవ భ్రాతా వీర్యవాన్ సుప్రియశ్చ తే
బాల ఏవ గతస్స్వర్గ మపుత్రః పురుషర్షభ
ఇమే మహిష్యౌ భ్రాతుస్తే కాశిరాజసుతే శుభే
రూపయౌవనసంపన్నే పుత్రకామే చ భారత
తయోరుత్పాదయాపత్యం సంతానాయ కులస్య నః
మన్నియోగాన్మహాబాహో ! ధర్మం కర్తు మిహార్హసి
రాజ్యే చైవాభిషిచ్యస్వ భారతాననుశాధి చ
దారాంశ్చ కురుధర్మేణ మా నిమజ్జీః పితామహాన్"

-మ.భా. తత్త్వ పు 157

నిన్నొకకార్యమందు నియోగించుచున్నాను. నీవట్లు చేయదగినవాడవు. నా పుత్రుడు నీ సోదరుడు నైన విచిత్రవీర్యుని భార్యలు పుత్రార్థినులై యున్నారు. వంశవృద్ధికై నానియోగముచే నీవు వారలకు సంతతి కలిగింపుము. ఈ ధర్మమంగీకరింపుము. లేక రాజ్యమందైనను నభిషిక్తుడవు గమ్ము. బ్రహ్మచర్యవ్రతసంకల్పము మొదలుకొని త్యజింపబడిన దారలను సంతతికై యంగీకరింపుము. ఇది సత్యవతి భీష్ముని కుపదేశించిన విషయము. ఇచ్చట వంశవృద్ధియు, రాజ్యపరిపాలనము ప్రకృతాంశములు. ఈ సందర్భమున నీ సోదరునిభార్యలను దారలుగా గ్రహించి సంతానమును గనుమని ప్రతిపాదింపబడినట్లు కొందరు భ్రమపడుచున్నారు. అది పొరపాటు. "విధవావిధో వృక్తం విధవావేదనం పునః" అను దానికి వ్యాఖ్యానము. "న చ వివాహవిధాయకశాస్త్రేఽన్యేన పురుషేణ పునర్వివాహో ఉక్తః అని వితంతూద్వాహము వివాహవిధాయక శాస్త్రమందు చెప్పబడలేదని మనుస్మృతి ఘోషించుచుండుటనుబట్టికూడ సత్యవతి విచిత్రవీర్యుని భార్యలైన వితంతువులను వివాహమాడుమని కోరినట్లు కాదు. సత్యవతీదేవి భీష్మునికుపదేశించిన విషయములు మూడు. అందొకటి "తయోరుత్పాదయాపత్యం మన్నియోగాత్" నా నియోగమువలన అంబికాంబాలికయందు సంతతినను గ్రహింపుము. రెండవది 'రాజ్యే చైవాభిషిచ్యస్వ' రాజ్యమునందైన

నభిషిక్తుడవుగమ్ము. మూడవది. "దారాంశ్చ కురు ధర్మేణ బ్రహ్మచర్యవ్రతసంకల్పాత్ప్రభృతి త్యక్తాన్ సంతత్యర్థమంగీకురు" బ్రహ్మచర్యవ్రతసంకల్పము మొదలుకొని త్యజింపబడినదారలను సంతతికై గ్రహింపుమని అంతేకాని సోదరభార్యలైన వితంతువులను దారలగా గ్రహింపుమని కాదు. వారియందు సంతతిని కనుట ధర్మమే కాని తరువాత వారలను దారలనుగా స్వీకరించుట హేయము.

దేవరాద్వా సపిండాద్వా స్త్రియా సమ్యఙ్నియుక్తయా
ప్రజేప్సితాధిగంతవ్యా సంతానస్య పరీక్షయే మను. 9అ. శ్లో 59.

సంతానములేనపుడు ఒక స్త్రీ తనమగడు, గురువు, తల్లిదండ్రులు వీరి యనుజ్ఞవడసి మరదివలనగాని సపిండదాయాదివలనగాని, కోరిన సమర్థుడయిన పుత్రుని బడయవచ్చును. కనుక నియోగవిధివలన సోదరభార్యలయందు సంతతి కనుమనుట యుక్తమే.

విధవాయాం నియోగార్థే నిర్వృత్తే తు యథావిధి
గురువచ్చ స్నుషావచ్చ వర్తేయాతాం పరస్పరమ్ మను. 9అ. 62 శ్లో.

అనగా నియోగఫలము సిద్ధించిన తరువాత నా పురుషుడు గురువువలెను, స్త్రీ కోడలువలెను వర్తించవలెనని భావము. భీష్ముడీ మూడుప్రతిపాదనలను నిరాకరించెను. ధర్మమార్గమయినట్టియు సనాతనమయినట్టియు నొకప్రత్యామ్నాయమును సూచించెను.

"........ శంతను సంతానంబు శాశ్వతంబగునట్లుగా క్షత్రధర్మంబు జెప్పెద నా చెప్పిన దానిని ధర్మాధర్మవిదులయి లోకయాత్రానిపుణులైన పురోహితనిఖిల బ్రాహ్మణ వరులతో విచారించి చేయునది యని భీష్ముడందరు విన నిట్లనియె.

చ॥ పితృవధజాత కోపపరిపీడితుడై జమదగ్నిసూనుండు
ద్ధత బలు హైహయున్ సమరదర్పితు జంపి యశేషధారుణీ
పతులను జంపె గర్భగత బాలురు నాదిగ నట్టిచోట ద
త్పతులకు దొల్లి ధర్మవిధి సంతతి నిల్పరె భూసురోత్తముల్
(ఆ.భా. ఆది 4 అ 225-226)

అని చెప్పిన దీర్ఘతముని వృత్తాంతమును నిరూపించెను. మరియు నవ్విధంబున నుత్తమక్షత్రియక్షేత్రంబులందు ధర్మమార్గంబున బ్రాహ్మణులవలన బుట్టి వంశకరులైన క్షత్రియులనేకులు కలరు.

క॥ కావున నియతాత్ముజగ
త్పావను ధర్మస్వరూపు బ్రాహ్మణుంబడయం
గా వలయు వాడు సంతతి
గావించు విచిత్రవీర్య క్షేత్రములన్.

(ఆ.భా. ఆది. 4అ-238.)

అంత సత్యవతి తాను కన్యగానున్నపుడు పరాశరుననుగ్రహంబున వ్యాస జననంబును, తనకన్యాత్వంబు దూషితంబుగాకుండుటయు దెల్పి, భీష్మననుమతంబున పారాశర్యుం దలంచుడు నాక్షణంబ వ్యాసుడు తల్లిముందట ప్రత్యక్షంబయ్యె. అంత సత్యవతి వ్యాసునితో నీయనుజులైన విచిత్రవీర్యుని క్షేత్రములందు సంతతి బడయుమని కోరినది. వ్యాసుండును నట్లే యని ఈ కాశీరాజదుహితలు తాను చెప్పబోవు వ్రతమును ఒక సంవత్సరమాచరింపవలెనని నిర్దేశించినాడు. సత్యవతి ఒక సంవత్సర కాలవిలంబమునకు ఒప్పుకొనలేదు. కావున ఒక సంవత్సర కాలమాచరించవలసిన వ్రత విధానమునడుగలేదు. వ్యాసుడు చెప్పను లేదు. ఆ అంబికాంబాలికలయందు వెంటనే పుత్రులను బడయవలెను మరియు విలంబమయినచో రాజ్యము అరాజకమగును. మరియు నిట్లు చెప్పెను.

చ॥ అవని యరాజకంబయిన యప్పుడ భూప్రజయందు సర్వధ
ర్మములు దొలంగు దేవముని ముఖ్యులు వాయుదురోలివృష్టిలే
దవు మరియర్చుపుల్ తఱుఁగు నందురు గావున గాలయాపనం
బవితథ వాక్య చేయక నయంబున రాజ్యము నిల్పుమిత్తరిన్.

(- ఆ. భా - ఆది. 4అ. 250)

ఇది యిచ్చట జరిగిన సన్నివేశము. ఇక మూలమును బరికింతము.

న త్వం వ్యపేక్షయా భ్రాతుస్సంతానాయ కులస్య చ
భీష్మస్య చాస్య వచనాన్నియోగాచ్చ మమానఘ !

అనుక్రోశాచ్చ భూతానాం సర్వేషాం రక్షణాయ చ
ఆనృశంస్యాచ్చ తద్బ్రూయాం తచ్ఛ్రుత్వా కర్తుమర్హసి
యవీయసస్తవ భ్రాతుర్భార్యే సురసుతోపమే
రూపయౌవనసంపన్నే పుత్రకామే చ ధర్మతః
తయోరుత్పాదయాపత్యం సమర్థో హ్యాసి పుత్రక!
అనురూపం కులస్యాస్య సంతత్యాః ప్రసవస్య చ.

-మహా. భా.ఆది.105 అ.

వ్యపేక్షయా =స్నేహానుబంధేన., నియోగాత్=ఆజ్ఞాతః., అనుక్రోశాత్ =కృపాతః., ఆనృశంస్యాత్=అనైష్ఠుర్యాత్., అనగా నీవు నీ సోదరుని స్నేహానుబంధమునుబట్టియు భీష్మునివాక్యమునుబట్టియు, భూతదయనుబట్టియు మృదుస్వభావమునుబట్టియు, భరతవంశమునకు సంతానముకొరకును ప్రజారక్షణకొరకును నేను చెప్పబోవు నియమమును విని యీ పనిని చేయదగిన వాడవు. నీ యనుజునిభార్యలు ధర్మబుద్ధితో పుత్రసంతతిని గోరుచుండిరి. నీవు తపోబలమున సమర్థుడవు. భరతవంశమునకు అనురూపమయిన పుత్రసంతతి ననుగ్రహింపుము. అంతట వ్యాసుడు తల్లితో.........

"వేత్థ ధర్మం సత్యవతి ! పరం చాపరమేవ చ
తథా తవ మహాప్రాజ్ఞే ! ధర్మే ప్రణిహితా మతిః"

-మహా. భా. ఆది 105అ

పరం ధర్మం = నివృత్తిరూపమ్., అపరం ధర్మం=ప్రవృత్తిరూపమ్ ఆముష్మిక, మైహికమితి వా,

తస్మాదహం త్వన్నియోగాద్ధర్మముద్దిశ్య కారణమ్
ఈప్సితం తే కరిష్యామి దృష్టం హ్యేతత్సనాతనమ్
భ్రాతుః పుత్రాన్ ప్రదాస్యామి మిత్రావరుణయోస్సమాన్.

-మ.భా. ఆది. 105అ

తల్లీ ! నీవు ఐహికాముష్మికధర్మములు తెలిసినదానవు. నీ బుద్ధియు ధర్మానుబద్ధమే.

కనుక నీ యాజ్ఞవలన ధర్మమునుద్దేశించి నీ సంకల్పము నెరవేర్తును. ఇది ప్రమాణసమ్మతమే. నీ వెరుగని ధర్మము లేదు. ప్రవృత్తినివృత్తిరూపములగు రెండు ధర్మముల నెరుంగుదువు. ప్రవృత్తి ధర్మమనగా భార్యాబిడ్డలనభివృద్ధినొందించుకొని భోగభాగ్యములు పొందుటకై చేయు పుణ్యకర్మలయొక్క విధానము. నివృత్తి ధర్మమనగా మోక్షపురుషార్థమును సాధించుటకొరకై చేయువైదికసాధనలు. ఈ రెండును స్థూలసూక్ష్ములై యున్నవి. అట్టి ధర్మద్వయములోని సూక్ష్మములను గూడా నీవెరుగుదువు. "తథా తవ మహాప్రాజ్ఞే ధర్మే ప్రణిహితా మతిః" ధర్మాచరణమున నిర్దిష్టమగు బుద్ధికలిగిన పండితురాలవు. సత్యవతినిగూర్చిన యీవర్ణన ఆంధ్రభారతమున ననువదింపబడలేదు. అనువాదమునకు రానివిట్టివెన్నో విషయము లున్నవి. తల్లీ నీ కోర్కెను నెరవేర్తును. మిత్రావరుణసదృశులగు పుత్రులను సోదరునకు ప్రసాదించెదను. కాని

వ్రతం చరేతాం తే దేవ్యౌ నిర్దిష్టమిహ యన్మయా
సంవత్సరం యథాన్యాయం తతశ్శుద్ధే భవిష్యతః
న హి మామవ్రతోపేతా హ్యుపేయాత్కాచిదంగనా

-మహా.ఆది-105 అ

నేనొకవ్రతమును నిర్దేశించెదను. దానిని రాజభార్యలిరువురు ఒక సంవత్సరకాలము యథాన్యాయముగా నెరవేర్చవలెను. అప్పుడు వారు పరిశుద్ధురాండ్రగుదురు. వ్రత సంపన్నురాలు కాని యే స్త్రీయు నన్ను సమీపించలేదని చెప్పెను. అంతట సత్యవతి నాయనా ! రాజ్యము అరాజకమయి ప్రజలు అనాథులై నశింతురు. వైదికక్రియలు జరుగవు. వర్షములుండవు దేవతలుండరు. కావున సంవత్సర కాలమాగుటకు వీలులేదు. వెంటనే గర్భమునేర్పాటు చేసినచో పుత్రులు పెద్దవాండ్రగువరకు భీష్ముడు రాజ్యమును రక్షింపగలడని చెప్పెను. అంతట వ్యాసమునీంద్రుడు తల్లితో -

యది పుత్రః ప్రదాతవ్యో మయా భ్రాతురకాలికః
విరూపతాం మే సహతాం తయోరేతత్పరం వ్రతం
యది మే సహతే గన్ధం రూపం వేషం తథా వపుః
అద్యైవ గర్భం కౌసల్యా విశిష్టం ప్రతిపద్యతామ్.

-మహా. భా .ఆది-105 అ.

నేను చెప్పియున్నట్లు కాక యిపుడే పుత్రదానము చేయవలసియున్నచో నా విరూపత్వమును సహింపవలెను వారికిది గొప్పవ్రతము. నా రూపవేషగంధశరీరములను సహించెనేని యా కౌసల్యకుత్తమసంతానము కలుగును. ఇచ్చట ముఖ్యమయిన విషయమేమనగా వ్యాసమహర్షి సంతానముననుగ్రహించుటకు రాజభార్యలకు ఒక సంవత్సరము వ్రతనియమము నిర్దేశించెను. సత్యవతి యాదేశించినది సద్యోగర్భము. ఆ సద్యోగర్భమునకు మహర్షి యీ నియమమును నిర్దేశించినాడు. సత్యవతియు మహర్షి యానతిని ఒకనాడు తన పెద్దకోడలైన అంబాలికను ఋతుమతియు శుచిస్నాతయునగు నట్టిదానిని క్షేత్రజ్ఞుండైన వాడు సుపుత్రుండు గావున ధర్మ్యంబైన విధానంబున నీవు రాజ్యధురంధరుండైన కొడుకుం బడసి భరతవంశంబు నిలుపు మెల్లధర్మంబుల కంటె కులంబునిలుపుటయే మిక్కిలి ధర్మంబు నేటి రాత్రి నీకడకు దేవరుండువచ్చు. తదాగమనంబు బ్రతీక్షించియుండునది యని ప్రబోధించినది.

అవసరజ్ఞుండయి వ్యాసుడేతెంచె నంత నత్తపసి
కవిలగడ్డంబును గవిలజడలును గవిలకన్నులును
దవినయన్నున నల్లనైన దీర్ఘపుం దనువును జూచి
యువిద కన్నుంగవ మొగిచి తెరవక యుండె భయమున

(ఆ.భా - ఆది - 4అ-254)

కృష్ణద్వైపాయనుండును దానికిం బుత్రదానంబుసేసి యీయంబికయందు బలపరాక్రమవంతుండైన కొడుకు పుట్టు వాడు మాతృదోషంబున నంధుండగుననిన విని విషణ్ణచిత్తయయి సత్యవతి వెండియుం గృష్ణద్వైపాయనుం బ్రార్థించి యింక నంబాలికయందు నొక్కకొడుకుం బడయుమని నియోగించిన నెప్పటియట్ల నమ్మునివరుండు నంబాలికయందు మహాబలపరాక్రమగుణవంతుండు వంశకరుండునగు పుత్రుండు పుట్టు వాడును మాతృదోషంబున పాండుదేహుండగునని చెప్పి యరిగిన.......

అంత సత్యవతి వ్యాసభట్టారకుని మరల ప్రార్థించి ఈయంబకు ప్రథమపుత్రుం డంధుండయ్యె నింకొక్క కొడుకు రూపవంతుం బడయుమని ప్రార్థించి నియోగించె. అంబాలిక వికృతవేషరూపుడైన వ్యాసునికడకు తాను బోనొల్లక దాసినొకదానిని యలంకరించి పంపె. వ్యాసుండా దాసికే పుత్రదానంబు చెసెను.

చండకోపుడయిన మాండవ్య మునివరు
శాపమున జముండు సంభవిల్లె
విదురుడనంగ ధర్మవిదుడు పారాశర్యు
వీర్యమునను భువి నవార్యబలుడు.

(- ఆ. భా. ఆది. 4అ- 260)

ఇది ధృతరాష్ట్రపాండురాజవిదురులజననకథాక్రమము. ఈ ఘట్టమునం దనేకములయిన ధర్మసూక్ష్మముల కాలవాలమయిన విశేషాంశములు మూలభారతమున గలవు. అట్టి విశేషాంశము లేవియు తెనుగున ననువదింపబడలేదు. ఇక మూలభారతము నరయుదము.

మహర్షియొక్క వికృతవేషరూపగంధముల కోపకయే కదా అంబిక కన్నులు మూసికొన్నది. అంబాలిక వెల్లనై యున్నది. ఆవేషరూపగంధాదులెట్టివి ? వ్యాసభగవానులు మహారాజు కాడు. అతడొక తాపసి. ఆమూర్తియందు శృంగారరసము లేదు. నల్లనిశరీరము దీర్ఘబాహువులు మోకాళ్ళను తాకియున్నవి. సుదీర్ఘ జటామండలము కపిలవర్ణముతో వెలుగొందుచున్నది. ముఖమండలమంతయు దీర్ఘశ్మశ్రువులతో నిండి చెక్కిళ్లనుండి శృంగారరసమునందించుట లేదు సరికదా ఆ నేత్రములు దీప్తములయి వెలుగుచున్నవి కూడ. అవి తాపననేత్రములు కదా! వారి చూపులు భక్తానుగ్రహమాత్రమునకే గాని ముద్దరాండ్ర నాకర్షించునవి కావు.

యది పుత్రః ప్రదాతవ్యో మయా భ్రాతురకాలికః
విరూపతాం మే సహతాం తయోరేతత్పరం వ్రతం
యది మే సహతే గన్ధం రూపం వేషం తథా వపుః
అద్యైవ గర్భం కౌసల్యా విశిష్టం ప్రతిపద్యతామ్

-మ. భా. తత్త్వ. పు -164

అను వ్యాసవచనమునందు ప్రయుక్తమగుటచే వ్యాసునిశరీరమునుండి భరింపరాని చేపలవాసన వచ్చుచుండుటచే అంబిక కన్నులుమూసికొన్నది. అంబాలిక వెల్లనైనది అని కొందరు వ్యాఖ్యానించుచున్నారు. సంప్రదాయజ్ఞులైన మహాభారతోపన్యాసకర్తలు కూడ నట్లే వ్రాయుట చింత్యము. భరింపరాని చెడువాసన వచ్చుచున్నప్పుడు ముక్కులు

మూసికొనవలెను గాని కన్నులు మూసికొనుట వెల్లనగుట ప్రయోజనకరములు కావు. వారు ముక్కులు మూసికొన్నటుల గ్రంథమునందెచ్చటను చెప్పబడలేదు. మత్స్యగంధి ఐన సత్యవతి మత్స్యగంధమును తొలగించి యోజనగంధము ననుగ్రహించిన పిమ్మటనే వ్యాసభగవానుడవతరించినది. ఇక వ్యాసభగవానుని శరీరమునందు చేపలకంపెక్కడిది ? కనుకనే మహాభారతమున...

" అయం సాక్షాన్మహాయోగీ వ్యాసస్సర్వజ్ఞ ఈశ్వరః" అని చెప్పబడినది. మహాభారతసారోద్ధారమున నీ సందర్భమున నీ క్రింది విధముగా వ్యాఖ్యానించబడినది.

యోగివిషయే తావత్ మార్కండేయపురాణే
అకాల్యమారోగ్యమనిష్ఠురత్వం గంధశ్శుభో మూత్ర పురీషమల్పం
కాంతిః ప్రసాదస్వరసౌమ్యతా చ యోగప్రవృత్తేః ప్రథమం హి చిహ్నం॥
ఇతి ప్రతిపాదితం భారతేఽ పి తస్య కృష్ణస్య కపిలాజటా దీప్తే చ లోచనే ఇత్యాద్యుక్తత్వాచ్చ బ్రహ్మసూత్రేష్వపి - విరోధః కర్మణేతి చేన్నానేక ప్రతిపత్తేర్దర్శనాత్ ॥
1-3.27 బ్రహ్మసూత్రభాష్యం.

స్మృతి రపి - శ్లో. ఆత్మనో వై శరీరాణి బహూని భరతర్షభ,
యోగీ కుర్యాద్బలం ప్రాప్య తైశ్చ సర్వైః మహీం చరేత్.
ప్రాప్నుయాద్విషయాన్ కైశ్చిత్ కైశ్చిదుగ్రం తపశ్చరేత్
సంక్షిపేచ్చ పునస్తాని సూర్యో రశ్మిగణానివ.

దేవతాధికరణే - సూ. భావం తు బాదరాయణోఽస్తి హి తత్రభాష్యం

అస్తి హ్యైశ్వర్యయోగాద్దేవతానాం జ్యోతిరాద్యాత్మభిశ్చావస్థాతుం యథేష్టం చ తం తం విగ్రహం గ్రహీతుం సామర్థ్యమ్. శ్రూయతే చ మేధాతిథిం హ కాణ్వాయన మింద్రో మేషో భూత్వా జహార, ఇతి. స్మృతిరపి-ఆదిత్యః పురుషో భూత్వా కుంతీముపజగామ హ, ఇతి చ.

తస్మాత్ వ్యాసశరీరే విద్యమానం గన్ధం యోగజం ఇతర మానవ అసాధారణం స్త్రీణాం హఠాదాపతితం చేత్ గన్ధాతిశయాదసహ్యః పుణ్యగన్ధ ఏవేతి స మత్స్యదుర్గన్ధ ఇతి మన్తవ్యః. -మహా. భా .సా . ఆది. పు 136

అని మహాభారతము ఆదిపర్వము 106వ అధ్యాయమున చెప్పబడినది.

యోగులవిషయమున మార్కండేయపురాణమునందు మంచి ఆరోగ్యము కఠినుడుగా లేకపోవుట మంచిగంధము స్వల్పమయిన మూత్రపురీషములు, శరీరమునకు విలక్షణమయిన కాంతి, నైగనిగ్యము, కంఠస్వరము మృదువుగానుండుట ఇవన్నియు యోగసాధనకు మొట్టమొదటి గుర్తులని చెప్పబడినది. భారతమునందును ఆ వ్యాసుడు పచ్చటి జడలును, ప్రకాశించుచున్నట్టి నేత్రములును కలవాడుగా చెప్పబడి యున్నది. " విరోధః కర్మణేతి చేన్నానేకప్రతిపత్తేః దర్శనాత్ ( 1-3-27) అని బ్రహ్మసూత్రము నందును దాని భాష్యమునందును, ఈ యోగకర్మకు విరుద్ధము కాదా అను ప్రశ్న రాగా అట్లు కాదు ఏలయన యోగాభ్యాసముచే అనేకసిద్ధులు కలుగునని చెప్పుచుండుటచే కర్మతో విరోధము లేదని ప్రతిపాదింపబడినది.

స్మృతియు యోగి తనయోగబలమునుపొంది తనయొక్క అనేకశరీరములను పొందగలడు. ఆ శరీరములతో భూమినంతను సంచరించగలడు. కొన్ని శరీరములతో దేశములందు సంచరించగలడు. మరికొన్ని శరీరములతో ఉగ్రమయిన తపస్సు చేయగలడు. మరలవాటినన్నిటిని సూర్యుడు తనకిరణములవలెనే తనలో అంతర్ధానమును పొందించగలడని చెప్పుచున్నది. సూత్రభాష్యమున దేవతాధికరణమునందు "భావన్తు బాదరాయణో೭స్తి హి"అను సూత్రభాష్యమున గొప్ప యోగప్రభావమువలన దేవతలకు జ్యోతిరాది రూపములతో నుండుటకును వారియిష్టము వచ్చినట్లు ఆయా శరీరములను గ్రహించుటకును సామర్థ్యము గలదు. ఇంద్రుడు మేషరూపమును పొంది కణ్వవంశమునందు పుట్టిన మేథాతిథియను వానిని హరించెననియు స్మృతి చెప్పుచున్నది కదా! అట్లే భారతస్మృతియు సూర్యుడు స్వస్వరూపమును ధరించి కుంతిని పొందెనని చెప్పుచున్నది. కాన దేవతలకును, యోగులకును అసాధ్యమగునది యేదియు లేదు. కాన వ్యాసుని శరీరమందలి గంధము యోగమహిమవలన బుట్టినదియు ఇతరమానవులందు లేనిదియు హఠాత్తుగా సంభవించి స్త్రీలకు సహింపశక్యముకాని పుణ్యగంధమేయనియు మత్స్యగంధము కాదనియు గ్రహించదగినది.

వ్యాసుడంబిక శయ్యామందిరమును ప్రవేశించినాడు.

" తస్య కృష్ణస్య కపిలాం జటాం దీప్తే చ లోచనే
బభ్రూణి చైవ శ్మశ్రూణి దృష్ట్వా దేవీ న్యమీలయత్

-మహా. భా.సా.ఆది. పు 134

ఆ వ్యాసునియొక్క పింగళవర్ణములైన యా జడలు రూపములు, గడ్డము తేజోవంతమయిన ఆ కండ్లు చూచి యంబిక భయముతో నాయనను చూడలేక కండ్లు మూసికొనెను. ఇచ్చట చేపలవాసనప్రసక్తి లేదు సరికదా ముక్కుమూసికొనినట్లు కూడా లేదు. బయటకి రాగానే సత్యవతి నాయనా! ఈమెయందు గుణవంతుడగు రాకుమారుడు కలుగునా అని ప్రశ్నించినది.

అందుకాయన సమాధానము...

నాగాయుతసమప్రాణో విద్వాన్ రాజర్షిసత్తమః
మహాభాగో మహావీరో మహాబుద్ధిర్భవిష్యతి
తస్య చాపి శతం పుత్రా భవిష్యంతి మహాత్మనః
కింతు మాతుస్స వైగుణ్యాదంధేన చ భవిష్యతి.

-మహా. భా. ఆది. పు. 106 అ

ఈమెకు వెయ్యి ఏనుగుల బలము గలవాడు, విద్వాంసుడు, రాజర్షిశ్రేష్ఠుడు, మహాభాగ్యశాలి, మహాప్రతిభాసంపన్నుడు, మహాబుద్ధిమంతుడునగు పుత్రుడు కలుగును. అతనికిగూడ నూరుగురు కుమారులు కలుగుదురు. కాని మాతృదోషమున నత డంధు డగునని చెప్పెను. ఆ మాట విని సత్యవతి ..

నాంధః కురూణాం నృపతిరనురూపస్తపోధన
ద్వితీయం కురువంశస్య రాజానం దాతుమర్హసి

-మహా. ఆది. పు 106అ

ఆ మాట విని వ్యాసునితో సత్యవతి నాయనా ! గ్రుడ్డివాడు ప్రభువు కాదగినవాడు కాడు. కనుక పితృవంశవర్ధనుడు కురువంశమునకు ప్రభువు కాదగిన రెండవ వానిని ప్రసాదించవలెనని కోరెను. ఈ ప్రసంగమువలన ధృతరాష్ట్రుడు రాజ్యార్హుడు కాడనియు పాండురాజే ప్రభువనియు స్పష్టము. ఆంధ్రభారతమున " ఇట్లు ధర్మోత్తరంబుగా ప్రజాసమృద్ధియు సస్యసమృద్ధియు నగుచుండ నాంబికేయు ధృతరాష్ట్రుడు రాజ్యాభిషిక్తుం

జేసి" అని వ్రాయుట ప్రామాదికము. ఈ విషయమునుగూర్చి శాస్త్ర ప్రమాణములతో వేరొకప్రకరణమున విస్తృతముగా చర్చించబడును.

మహర్షి అంబాలికదగ్గరకు వెళ్ళగా
" అంబాలికా మథాభ్యగా ద్దృషిం దృష్ట్వా చ సాऽపి తమ్
వివర్ణా పాడుసంకాశా సమపద్యత భారత"

-మ.భా. ఆది. 106 అ.

ఆ ఋషిని జూచి ఆమె భయముతో వెలవెలపోయెను. విరూపినగు నన్ను జూచిన నీవు పాండుత్వమును పొందితివి గాన నీ పుత్రుడు పాండుత్వము కలవాడగును. అతని పేరును అదియే అనగా పాండువే యగును అని చెప్పెను. ధృతరాష్ట్రుని యంధత్వము రాజ్యానర్హతకు కారణమైనట్లు పాండురాజుపాండుత్వము రాజ్యానర్హతగాదు. సంస్కృతాంధ్ర భారతములనెందును నాతనిని పాండురోగి యని చెప్పలేదు. ఇచ్చట పాండుత్వము శరీరవైవర్ణ్యమే గాని పాండురోగము కాదు. ఒకవేళ అంబాలిక పాండురోగియే అయినచో కుమారుని కనుమని వ్యాసభగవానుని యొద్దకు ఆమెను సత్యవతి నియోగించునా ? నన్నయభట్టారకుడు కూడా " అమ్మునివరుండు నంబాలికయందును మహాబలపరాక్రమగుణవంతుండు వంశకరుండును నగు పుత్రుండు పుట్టు వాడును మాతృదోషంబున బాండుదేహుండగునని చెప్పియుండిన " అనియే కలదు. కావుననే సత్యవతి ధృతరాష్ట్రుడు గ్రుడ్డివాడని వినినప్పుడు వెంటనే వ్యాసమహర్షితో గ్రుడ్డివాడు రాజ్యార్హుడు కాడు కనుక రాజుకాదగిన రెండవవాని నిమ్మని కోరెను. అయితే పాండురాజు రాజ్యార్హుడే యయినచో మరొకకుమారునిమ్మని యేల కోరెనని ప్రశ్న రావచ్చును. దీనికి నన్నయభట్టారకులే సమాధనమును చెప్పిరి. "ఆంబికేయు జాత్యంధుం జూచి దుఃఖితయయి సత్యవతి వెండియుం బారాశర్యుం దలంచుడు నాక్షణంబు యమ్మునివరుండు వచ్చి పనియేమియన్న నంబికకు బ్రథమ పుత్రుం డంధుడయ్యె నింకొక్కకొడుకు రూపవంతుడయిన పుత్రుని యంబికకు ప్రసాదింపుమని కోరెను. " కాని పాండురాజు రాజ్యానర్హుండని కాదు. అందులకే మూడవ కుమారుని కొరకు కూడ మరల యంబికనే సత్యవతి నియోగించెను

త్రికాలజ్ఞుడు మహర్షియునగు వ్యాసుడు గర్భస్థశిశువుల జాతకములనే గుర్తించి చెప్పగలిగి దాసితో సంబంధమునకెట్లు సమ్మతించెనని ప్రశ్న. దాసియని తెలియకయా? తెలిసియా ? సర్వజ్ఞుడు అతీంద్రియజ్ఞానసంపన్నుడు నగు వ్యాసమహర్షి దాసియని

గుర్తించియే మాండవ్యమహర్షిశాపమువలన యమధర్మరాజు భూలోకమున శూద్ర స్త్రీయందు జన్మించవలసియున్నాడు. అని యెఱింగి అందుకవకాశమేర్పరచెనని సమాధానము.

మనుష్యవర్గముకంటె దేవవర్గము నసురవర్గము నెట్లు విలక్షణమో అట్లే ఋషి వర్గముకూడ విలక్షణమయినదే. " దేవా మనుష్యా అసురా పితర ఋషయః"

" మనుష్యజాతి శ్శ్రేయసీ న వా శ్రేయసీత్యేనం పరిపుష్టే విభజ్య వచనీయం ప్రశ్న పశూనధికృత్య శ్రేయసి, దేవానృషీ నధికృత్య నేతి " యోగదర్శనము..

ఈ వచనములచే పశువులకంటె నధికులు, ఋషులకంటె హీనులు, నగు మనుష్యులయొక్క శక్తికంటె ఋషిశక్తులు విలక్షణములు అట్టి ఋషులనుగూర్చి ఆపస్తంబుని సూత్రములో నిట్లున్నదని మహాభారతతత్త్వకథనమున చెప్పబడినది.

" దృష్టో ధర్మవ్యతిక్రమస్సాహసం చ పూర్వేషామ్
తేషాం తేజోవిశేషేణ ప్రత్యవాయో న విద్యతే "

-మహా. భా .తత్త్వ. పు 177

ఛాందోగ్యమున నిట్లున్నది. తద్యథేషీకాతూలమగ్నౌ ప్రోతం ప్రదూయేతైవం హాస్య సర్వే పాప్మానః

ప్రదూయన్తే య ఏతదేవం విద్వానగ్నిహోత్రం జుహోతి..

ఈ వచనములచేతను మహాత్ములగు ఋషులకు విహితాచరణమువలన గాని, నిషిద్ధాచరణమువలనగాని, జన్మాంతరహేతువులగు పుణ్యాపాపములు సంక్రమింపవని స్పష్టము. కనుకనే " జ్ఞానాగ్నిస్సర్వకర్మాణి భస్మసాత్కురుతేఽర్జున " అని భగవద్గీత యందు బోధించబడినది. జన్మాంతరహేతువులయి తమచే జేయబడిన పుణ్యాపాపములెవ్వరికనుభవింపక తప్పదో అట్టి మనుష్యులే సుఖప్రాప్తికిని, దుఃఖనివృత్తికిని, విధినిషేధశాస్త్రములననుసరించి సంచరింప దగినవారు.

జ్ఞానులగు ఋషులశరీరములు ప్రారబ్ధకర్మఫలోపభోగహేతువులే గాని కర్మహేతువులు గావు. తిర్యగ్జంతువుల శరీరములును నట్టివే.

ఈ ధర్మతత్త్వము నెఱుంగక వ్యాసమహర్షి అంబికాంబాలికలకు సంతానమును

ప్రసాదించుటకాతని కామప్రవృత్తియనియు, విధవాసంగమముచే తననైష్ఠిక బ్రహ్మచర్యమునకు భంగము వాటిల్లినదనియు నాక్షేపించుచున్నారు. అట్టి యాక్షేపణ యజ్ఞానవిలసితము.ధర్మము సహజధర్మమనియు, ఆపద్ధర్మమనియు,సూక్ష్మధర్మమనియు విశేషధర్మమనియు పెద్దలు విభాగించియున్నారు. కురుసామ్రాజ్యమునకు అప్పుడేర్పడిన విపత్కరపరిస్థితిలో నట్టియాపత్కాలములో నాచరించదగినది ఆపద్ధర్మమే కాని అధర్మముకాదు. మనువు స్త్రీలయొక్క ఆపద్ధర్మములను లెస్సగా నిర్వచించెను. ఇక నియోగధర్మమును గూర్చిన విధివిధానములను, ధర్మాధర్మములను ఒకింతవివరింతును.

అతఃపరం ప్రవక్ష్యామి యోషితాం ధర్మమాపది
భ్రాతుర్జ్యేష్ఠస్య భార్యా యా గురుపత్న్యనుజస్య సా
యవీయసస్తు యా భార్యా స్నుషా జ్యేష్ఠస్య సా స్మృతా
జ్యేష్ఠో యవీయసో భార్యాం యవీయాన్వాగ్రజస్త్రియం
పతితౌ భవతో గత్వా నియుక్తావప్యనాపది.

మను - 9అ.56-57-58 శ్లో.

పుత్రులు లేక వంశమునశించునట్టి యాపత్కాలమున స్త్రీలయొక్క ఆపద్ధర్మమును చెప్పుచున్నానని మనువు చెప్పినాడు. కనుక నీ చెప్పబోవునది ధర్మమే కాని అధర్మము కాదు. అన్న భార్య తమ్మునికి గురుభార్యకు సమానమయినదనియు, తమ్ముని భార్య అన్నకు కోడలికి సమానమయినదనియు శాస్త్రమందు చెప్పబడినది. అన్న, తమ్ముడు వీరల ఉభయులసంతతి నశించునట్టి ఆపత్కాలమునందు కాక తక్కిన యప్పుడు పెద్దలయనుమతిచేనైనను ఒకనిభార్యనొకడు కూడిన పతితులగుచున్నారు.

దేవరాద్వా సపిండాద్వా స్త్రియా సమ్యఙ్నియుక్తయా
ప్రజేప్సితాధిగంతవ్యా సంతానస్య పరీక్షయే
విధవాయాం నియుక్తస్తు ఘృతాక్తో వాగ్యతో నిశి
ఏకముత్పాదయేత్పుత్రం న ద్వితీయం కథంచన.

మను - 9 అధ్యా - 59 - 60 శ్లో.

పుత్రులు లేక వంశమునశించుపరిస్థితిలో ఆ స్త్రీ తనమగడు మామగారు

మొదలైనవారలవలన నియోగింపబడి అనగా ననుజ్ఞను పొంది తనబావ లేక మఱిది వలనగాని సపిండునివలనగాని అనగా తనపురుషుని కేడుతరములకు లోబడిన దాయాదివలనగాని తనకులమునకు దగిన యొకపుత్రుని గనవచ్చును. పెద్దలయనుమతి వడసివిధవతో గూడబోవువాడు తన దేహమునంతను నేతిని బూసికొని మౌనిఅయి మాటాడక రాత్రియందు ఒకపుత్రుని గలుగజేయవలెను.

ద్వితీయ మేకే ప్రజనం మన్యంతే స్త్రీషు తద్విద:
అనిర్వృతం నియోగార్థం పశ్యంతో ధర్మతస్తయో:

మను. 9 అధ్యా. 61 శ్లో.

దీనికి కుల్లూకభట్టువ్యాఖ్య యిట్లున్నది. "ద్వితీయమితి అన్యే పునరాచార్యా: నియోగాత్ పుత్రోత్పాదనవిధిజ్ఞా: అపుత్ర ఏక పుత్ర ఇతి శిష్టప్రవాదాదనిష్పన్నం నియోగ ప్రయోజనం మన్యమానా: స్త్రీషు పుత్రోత్పాదనం ద్వితీయం ధర్మతో మన్యంతే." కనుక ఒక పుత్రుడు కలవానిని బిడ్డలు లేనివాడని లేక లేనివానితో సమానుడని శాస్త్రము చెప్పుచున్నందున రెండవపుత్రునిగూడ కలిగించవచ్చునని శాస్త్రజ్ఞులు చెప్పుచున్నారు. ఒక బిడ్డపుట్టి వాడాకులమునకు తగని వాడైనప్పుడు నియోగము యొక్క ప్రయోజనము సిద్ధించలేదు కనుక రెండవబిడ్డను కలుగజేయవచ్చునని కొందరభిప్రాయపడుచున్నారు.

విధవాయాం నియోగార్థే నిర్వృతే తు యథావిధి
గురువచ్చ స్నుషావచ్చ వర్తేయాతాం పరస్పరమ్
నియుక్తౌ యౌ విధిం హిత్వా వర్తేయాతాం తు కామత:
తావుభౌ పతితౌ స్యాతాం స్నుషాధ గురుతల్పగౌ

మను. 9 అధ్యా 62 - 63 శ్లో.

ఆ విధవతో విధిప్రకారముగూడి గర్భము కలిగించిన పిమ్మట నొకరినొకరు గురువువలెను, కోడలివలెను తలచి మునుపటివలెనే మర్యాదగా ప్రవర్తించవలెను. పెద్దలచే నియమింపబడిన స్త్రీ పురుషులు మీదచెప్పిన ప్రకారము నడువక కామప్రవృత్తితో సంచరించినట్లయిన కోడలితో కలసినవానివలెను గురుపత్నితో కలిసినవానివలెను

జ్యేష్ఠకనిష్ఠభ్రాతలు పతితులగుదురు. ఆపత్కాలమున ననగా సంతతిలేక వంశమునశించునట్టి పరిస్థితులేర్పడినప్పుడు భర్తను గోల్పోయి విధవైయున్న స్త్రీ పెద్దలచే నియుక్తురాలై బావగారివలనగాని సపిండునివలన గాని కామప్రవృత్తి యే మాత్రములేక కేవలధార్మికప్రవృత్తితో నియోగధర్మమునను సరించి సంతానమును గనవచ్చునని మనుస్మృతి చెప్పుచున్నది. ఇది ధర్మమే. కనుకనే వేదవ్యాసమహర్షి యందులకు సమ్మతించెను. కామప్రవృత్తి కలుగకుండుటకై దేహమునందు నేతిని పూసికొనుట, మౌనముగనుండుట మున్నగునియమములు విధింపబడినవి. ఈ సందర్భమున నారదమహర్షి మరికొన్ని నియమములను చెప్పెనని మహాభారత విమర్శకర్తలు వ్రాసిరి.

ముఖాన్ముఖం పరిహరన్ గా త్రైర్గాత్రాణ్యసంస్పృశన్
కులే తదవశేషే చ సంతానార్థం న కామతః

కులక్షయము ప్రాప్తించినప్పుడు నియోగవిధినాశ్రయించి స్త్రీపురుషులు ముఖ సంబంధమును (ముద్దుముచ్చటలు) పరస్పరశరీరసంబంధమును ( ఆలింగనాదులు) వర్జించి సంతానార్థమే ప్రవర్తింపవలెను, కాని కామముతో ప్రవర్తింపరాదు. నియోగవిధి యందు కామప్రవృత్తి పూర్తిగా నిషేధింపబడెను ఏలయన

" నియుక్తాయామపి పుమాన్ నార్యాం జాతో విధానతః
నైవార్హః పైతృకం రిక్థం పతితోత్పాదితో హి సః
యా నియుక్తాఽన్యతః పుత్రం దేవరాద్వాప్యవాప్నుయాత్
తం కామజమరిక్థీయం వృథోత్పన్నం ప్రచక్షతే

మహాభారత విమర్శనము నందుదాహృతము.

నియుక్తురాలైన స్త్రీయందు నియోగధర్మమునకు వ్యతిరేకముగా బుట్టినవాడు పతితలకు పుట్టినవాడు కాన తండ్రి ధనమున కర్హుడుకాడు. స్త్రీ పురుషులిరువురు నియోగవిధిననుసరించి కాక, కామప్రవృత్తితో గన్నపుత్రుడు దాయభాగమునకర్హుడు గాడనియు నిష్ప్రయోజనముగా బుట్టినవాడనియు పెద్దలు చెప్పుచున్నారు. నియోగధర్మముననుసరించి కామప్రవృత్తి లేక కనిన సంతానమే క్షేత్రము గలవాని

సంతానముగా పరిగణింపబడి అతని ధనమున కర్హుడగును. మరియు నట్టిపుత్రుడు చేయు పిండోదక క్రియలన్నియు నా తండ్రికే చెందును. నియోగధర్మమునుల్లంఘించి కామప్రవృత్తితో గన్నసంతానము భ్రష్టసంతానమయి తండ్రి ఆస్తికి అర్హతను కోల్పోవుటయే గాక అట్టి పుత్రుడు చేయు పిండోదకక్రియలు ఆ తండ్రికి చెందవు. నియోగవిధియందు కామప్రవృత్తి పూర్తిగా నిషేధింపబడినది. భార్యాభర్తృ భావమునందు నిట్టి నిర్బంధములు లేవు. కామప్రవృత్తి యచట నింద్యము కాదు. నియోగవిధి అసిధారావ్రతము.

ఈ నియోగవిధి బ్రాహ్మణులకు వర్తింపదు.

**నాన్యస్మిన్ విధవా నారీ నియోక్తవ్యా ద్విజాతిభిః**
**అన్యస్మిన్ హి నియుంజానా ధర్మం హన్యుస్సనాతనం"..**

మను 9 అధ్యా. 64 శ్లో.

బ్రాహ్మణాదులు విధవయగు స్త్రీని భర్తకంటె వేరొక్కనియందు నియోగింపజనదు అట్లు స్త్రీని పతీతరునియందు నియోజించువారు స్త్రీలయొక్క పాతివ్రత్యమును అనాదిధర్మమును చెరచినవారగుదురు.

ఈ నియోగపద్ధతి కలియుగములో నిషేధించబడినది.

**తతఃప్రభృతి యో మోహాత్ ప్రమీత పతికాం స్త్రియం**
**నియోజయత్యపత్యార్థం తం విగర్హంతి సాధవః** మను. 9 - 68.

వేనుని కాలమునుండి మృతభర్తృక యగు స్త్రీని, శాస్త్రార్థజ్ఞానము లేమిచే దేవరాదుల యందెవ్వరు సుతోత్పత్తికై నియోగించుచున్నారో వారిని పెద్దలు దూషించెదరు. నియోగమును మనువే మొదట విధించి దానిని నిషేధించుటచే నిది యుగాంతము వరకే గాని కలియుగమునకు నిషిద్ధమని భావము.

దీనికి కుల్లూకభట్టువాఖ్యానమునిట్టు చెప్పెను.

" తతః ప్రభృతీతి వేనకాలాత్ప్రభృతి యో మృతభర్తృకాదిస్త్రియం

శాస్త్రార్థాజ్ఞానాదపత్యనిమిత్తం దేవరాదౌ నియోజయతి తం సాధవో నియతం గర్హయంతే. అయం చ స్వోక్తనియోగనిషేధః కలియుగవిషయం తదాహ బృహస్పతిః...

శ్లో. ఉక్తో నియోగో మునినా నిషిద్ధా స్వయమేవ తు ।
యుగక్రమాదశక్యోఽయం కర్తుమన్యైర్విధానతః ॥
తపోజ్ఞానసమాయుక్తాః కృతత్రేతాయుగే నరాః
ద్వాపరే చ కలౌ నృణాం శక్తిహానిర్హి నిర్మితా!
అనేకధా కృతాః పుత్రా ఋషిభిశ్చ పురాతనైః

-మను. పు 469

శాస్త్రమవకాశమిచ్చినది గదాయని అనర్హులుగూడ నిందు ప్రవర్తించి వర్ణసాంకర్యమునకు పాల్పడుదురని మనువే కృతత్రేతాద్వాపరయుగములందు ఈ నియోగధర్మమును చెప్పి కలియుగమున తానే నిషేధించెను.



# 4. పాండవుల జననము

పాండురాజు మమతాహంకారవిముక్తుడై ధర్మపత్నులిరువురు తపస్వినులై వెంటరాగా శతశృంగంబునం దుత్తరభాగంబున తపస్సు సేయుచుండెను. పాండురాజు తపమొనరించిన శతశృంగపర్వతప్రాంతము ఇప్పటి పాండుకేశ్వరము. "ప్రమోదూతవత్సరే చాశ్వయుజమాసే శుక్లపంచమ్యాం పాండురాజశతశృంగపర్వతసామా" అనుటవలన పాండురాజు శతశృంగపర్వతమున చేరినది ప్రమోదూతనామసంవత్సర ఆశ్వయుజశుక్లపంచమి యని తెలియుచున్నది. అంతనొక్కనాడు ఊర్ధ్వలోకంబున కరిగెడు మునిసంఘంబుల జూచి ఎక్కడికి వెళ్ళుచున్నారని ప్రశ్నింప వారిట్లనిరి. "నేడు అమావాస్య బ్రహ్మదేవుని గొలువగా మహర్షి గణములు, పితృసంఘములు బోవుచున్నవి. మేమును అందులకే పోవుచున్నా"మని చెప్పిరి. పాండుభూపతియు వారలతో నేగ నభిలషింప అనపత్యులకు జొరగాదనిన, పాండుభూపతికి ఆ మహర్షులు యోగదృష్టి ననాగతం బెరింగి, "నీవు అపుత్రకుండవుగావు, దైవాధిష్ఠితంబైన సంతానంబు నీకు ధర్మానిల శక్రాశ్వినులవరంబున నక్షయలోకంబులుం బడయుదువు గావున సంతానార్థంబు యత్నంబుసేయు" మని ప్రబోధించిరి.

పాండురాజు కుంతీదేవిని సంతానమును గనుమని పెక్కువిధముల బోధించెను. వ్యుషితాశ్వుడనురాజు క్షయవ్యాధిపీడితుండై పుత్రులులేక మరణించియు తన భార్యయయిన భద్రయను భార్యాప్రార్థనముచే తన మరణానంతరము కూడ నామెకు సంతానమును కలుగజేసెను. కాని పాండురాజు తానంతటి శక్తిమంతుడనుకానని చెప్పెను. అంతియగాక "పురుషుండు పుట్టుచుండి దేవఋషిపితృమనుష్యుల ఋణంబుల నాల్గింటితోడం బుట్టి యథాకాలవిధుల వానివలన విముక్తుండు కావలయు నట్లుకానివానికి బుణ్యలోకంబులు లేవు. యజ్ఞంబులంజేసి, దేవతల ఋణంబును, తపస్స్వాధ్యాయబ్రహ్మచర్యవ్రతంబులజేసి ఋషులఋణంబును, శ్రాద్ధ పుత్రలాభంబులంజేసి పితరుల ఋణంబును నానృశంస్యంబునజేసి మనుష్యుల ఋణంబును బాపవలయు నందు బితరులఋణంబుదక్క దక్కిన మూడు ఋణంబులవలన విముక్తుండనయితి " ఆంధ్ర మహాభారతము.

కుంతీదేవి పరులవలన సంతతి వడయుటకంగీకరింపలేదు. అందులకు

సమాధానముగా పాండుభూపతి కుంతీదేవికి ధర్మస్థితిని వివరించెను.

భర్తచేత నియోగింపబడక సతికి
నెద్దియునుజేయగా దగదెద్దియైన
భర్తచేత నియోగింపబడిన దాని
జేయకునికి దోషంబని చెప్పె మనువు. - ఆ.భా.ఆది. 5అ-88

పతినియోగించిన దానిం జేయనినాడు భార్యకు బాతకంబని యెఱంగి కాదే తొల్లి సౌదాసుండైన కల్మాషపాదుండను రాజర్షిచేత నియుక్తఅయి వానిభార్య మదయంతి యనునది వసిష్ఠునివలన నశ్మకుండను పుత్త్రుంబడసె. నస్మజ్జన్మంబు నిట్టిద మహాముని యయిన కృష్ణద్వైపాయనువలన గురుకులవృద్ధి పొంటె మేముద్భవిల్లితిమి కావున నీవిన్నికారణంబులువిచారించి నానియోగంబుసేయుము అని ప్రార్థించెను.

ఔరస క్షేత్రజ దత్తతగూఢోత్పన్నాపవిద్ధులను నార్వువు పుత్రులు బంధువుల దాయాదులు నగుదురు. కానీన సహోఢ క్రీత పౌనర్భవ స్వయందత్త జ్ఞాతులను నార్వురుంబంధువులగుదురు కాని దాయాదులు కారని ఆంధ్రభారతము చెప్పుచున్నది.

ఉత్తమాద్దేవరాత్పుంసః కాంక్షన్తే పుత్రమాపది
అపత్యం ధర్మఫలదం శ్రేష్ఠం విన్దన్తి మానవాః
ఆత్మశుక్రాపది పృథే మనుః స్వాయంభువోऽ బ్రవీత్
తస్మాత్ప్రహేష్యామ్యద్య త్వాం హీనః ప్రజననాత్స్వయం
సదృశాచ్ఛ్రేయసో వా త్వం విద్ధ్యపత్యం యశస్విని
మన్నియోగాద్యతక్షిప్రమపత్యోత్పాదనం ప్రతి ॥

మ. భా. ఆదిప. 140.

నీలకంఠీయమ్ :- ప్రణీతే (క్షేత్రజే) విశేషమాహ ఉత్తమాదితి।
శ్రేష్ఠం పితుఃకులాదపి యః శ్రేష్ఠః ప్రశస్యతమః తజ్జం
శ్రేష్ఠమపత్యమితి సామానాధికరణ్యం-శ్రేష్ఠాదనన్యత్వా
దపత్యస్య ప్రహేష్యామి - గతివృద్ధికర్మణోః హినోతే రూపం-
అద్యేతి క్షిప్రవచనం సంయోగాల్లుట్ । త్వాం శరణం గతోऽస్మి
వర్ధయామి వేతి చార్థః

ఆపత్కాలమందు దేవరునివలనగాని, యుత్తమునివలనగాని, క్షేత్రసంతతిని గోరుట కలదు. పితృకులముకంటెను శ్రేష్ఠునివలన కలిగినసంతతి ధర్మఫలప్రదమని స్వాయంభువమనువు చెప్పెను. ఈ కార్యసిద్ధిలో శరణ్యము నీవే. నీ నియోగమున సమానునివలనగాని శ్రేష్ఠునివలనగాని సంతతినిమిత్తము నీవు ప్రయత్నింపుము.

పాండురాజు కుంతీదేవికి ఈ సందర్భమున ద్వాదశవిధసంతానములను వాని తారతమ్యమును కూడ నిరూపించెను.

ఇమే వై బంధుదాయదా: షట్పుత్రా ధర్మదర్శనే
షడేవా ऽబంధుదాయాదా: పుత్రాంస్తాన్ శృణు మే పృథే!
స్వయంజాత: ప్రణీతశ్చ పరిక్రీతశ్చ యస్సుత:
పౌనర్భవశ్చ కానీన: స్వైరిణ్యాం యస్య జాయతే
దత్త: క్రీత: కృత్రిమశ్చ హ్యుపగచ్ఛేత్స్వయం చ య:
సహోఢో జ్ఞాతిరేతాశ్చ హీనయోనిర్ధృతశ్చ య:

-మహా. భా .సా. పు. 171

అని మహాభారతము ఆదిపర్వము ఆరవ అధ్యాయము. అనగా ధర్మశాస్త్రమునందు బంధు దాయాదులగు నార్గురు పుత్రులు చెప్పబడిరి. అట్లే అబంధుదాయాదులగు నార్గురు పుత్రులు చెప్పబడిరి. "ఓ కుంతీ ! వారలను గూర్చి చెప్పుచున్నాను వినుము బంధుదాయాదులు (1) స్వయంజాతుడు, (2) ప్రణీతుడు, (3) పరిక్రీతుడు, (4) పౌనర్భవుడు, (5) కానీనుడు, (6) స్వేచ్ఛాసంచారిణియందు పుట్టినవాడు........ ఇక అబంధుదాయాదులు... (1) దత్తుడు, (2) క్రీతుడు, (3) కృత్రిముడు, (4) సహోఢుడు, (5) జ్ఞాతియొక్కరేతస్సుచే పుట్టినవాడు, (6) తక్కువజాతిస్త్రీ యందు పుట్టింపబడినవాడు.

అబంధుదాయాదులకంటె బంధుదాయాదులు శ్రేష్ఠులు. ఏలయన ధర్మశాస్త్రము నందు బంధుదాయాదులనగా తనతో భాగమును వంచుకొనువారు అబంధుదాయాదులనగా బంధుదాయాదులకంటె భిన్నులు.

పూర్వం పూర్వతమాభావే మత్వా లిప్సేత వై సుతం
ఉత్తమాన్ దేవరాత్ పుంస: కాంక్షంతే పుత్రమాపది

అపత్యం ధర్మఫలదం శ్రేష్ఠం విందంతి మానవాః
ఆత్మశుక్రాదపిపృథేమనుస్స్వాయంభువో<sup></sup>ऽబ్రవీత్

మ.భా. ఆది. 6 అధ్యా

కనుక ఓ కుంతీ ! సంతానములేనప్పుడు వీరలలో పూర్వపూర్వుడు శ్రేష్ఠులని తలచి అటువంటి కుమారుని పొందవలెనని కోరవలెను. ఉత్తమునినుండికాని మరిదినుండికాని ఆపత్తునందు పురుషులు పుత్రుని పొందగోరుచున్నారు. ఓ కుంతీ! ధర్మఫలమునొసంగునట్టి శ్రేష్ఠమగు సంతానమును మనుష్యులు తన శుక్రమునుండికాని, శ్రేష్ఠులగువారి శుక్రము నుండికాని పొందదగునని స్వాయంభువమనువు చెప్పెను. "ప్రణీతా విశేషమాహ ఉత్తమాదితి॥ శ్రేష్ఠం పితుః కులాదపి యః ప్రశస్యతమో భవతి తజ్జం శ్రేష్ఠమపత్యమితి సామానాధిరణ్యా శ్రేష్ఠాదనన్యత్వాద పత్యస్య" ద్వాదశవిధసంతానములలో స్వయంజాతున కవకాశము లేనప్పుడు, తండ్రియొక్క కులముకంటె ఎవడు ఉత్తమకులజుడో వాని నుండియు, దేవతలనుండియు బుట్టినవాడు శ్రేష్ఠమగు సంతానమగుటచే శ్రేష్ఠునిచే పుట్టినవాడు శ్రేష్ఠుండగునది సమానాధికరణము చెప్పబడినది.

ఇట్లు పాండురాజు పరిపరివిధములకుంతిని వేడుకొనుటచే తుదకు కుంతీదేవి యమధర్మరాజును, వాయుదేవుని, ఇంద్రుని దూర్వాసోమహర్షి యనుగ్రహించిన మంత్రప్రభావమున వారినాహ్వానించి యుధిష్ఠిర, భీమసేన, అర్జును లనుసంతానమును పొందినది. పాండురాజు పనువున కుంతి మాద్రికి కూడా ఆ మంత్రమునుపదేశించినది. మాద్రి అశ్వినీదేవతలనారాధించి నకులసహదేవు లనుకవలను కనినది. పాండురాజు నాల్గవసంతానమునుకూడ కనుమని కుంతిని ప్రోత్సహించెను కాని ఆమె నిరాకరించినది.

నాతశ్చతుర్థప్రసవమాపత్స్వపి వదంత్యుత
అతఃపరం స్వైరిణీ స్యాద్బంధకీ పంచమే భవేత్.

-మ.భా. సా. ఆదిపు 202.

నాలుగవ సంతానమున మహాపత్తునందును పొందరాదని చెప్పుచున్నారు. ఇక కనినచో స్వైరిణిని అగుదును. అయిదవ సంతానమును కనినచో బంధకిని కాగలను. బంధకియన్నను స్వైరిణి లేక జారిణియే గాని "బధ్నాతి ఉదాసీనమపి పురుషం స్వవశం కరోతి బంధకి" అనగా తటస్థుడుగానున్న పురుషునికూడా స్వాధీనపరచుకొనునది బంధకియని కొంచెము విశేషము.

**ఇక పాండవుల జన్మాదిక విశేషములు.......**

ధర్మరాజు జననము :-

ఇంద్రే చంద్రసమాయుక్తే ముహూర్తేఽభిజితేఽష్టమే
దివామధ్యగతే సూర్యే తిథే పూర్ణేఽతిపూజితే
సమృద్ధయశసం కుంతీ సుషావ ప్రవరం సుతం

-మహా.ఆది.6అ

అనగా ఇంద్రుడు చంద్రునితో గూడి కూడియున్న ఎనిమిదవ అభిజిన్ముహూర్తమున పగటియందు సూర్యుడు మధ్యగతుడై యుండగా మిక్కిలి పవిత్రమయిన సంపూర్ణ తిథియందు గొప్పయశశ్శాలియు శ్రేష్ఠుడునగు కుమారుని కుంతి కనెను.

వ్యాఖ్యానము :- ఇంద్రే జ్యేష్ఠానక్షత్రే - అభిజితే - దివసస్య అష్టమే ముహూర్తే దివా శుక్లపక్షే మధ్యగతే తులాయనగతే తిథౌ- పూర్ణే -పూర్ణాయాం । పంచమ్యాం అయం యోగః ప్రాయేణాశ్విన శుక్ల పంచమ్యాం భవతి తథైవ ధర్మరాజస్య జన్మేత్యర్థః॥

అష్టావింశతితమే ద్వాపరే తురీయభాగే అష్టావింశాధికేషు శతవర్షేషు మాసపంచక దివసేష్వవశిష్టేషు తదానీం వర్తమానప్రజోత్పత్తి సంవత్సరాశ్విన శుక్లపంచమ్యాం జ్యేష్ఠానక్షత్రధనుర్లగ్నే క్రీస్తోఃపూర్వం ది. 16.08.3130 ఇతి॥

ఇంద్రుడు జ్యేష్ఠానక్షత్రమునందుండగా అభిజిన్ముహూర్తమున పగటియందు శుక్లపక్షమధ్యమందు సూర్యుడు తులాయనమునందుండగా సంపూర్ణమయిన తిథియందు తరచుగా ఆశ్వయుజశుద్ధపంచమియందు ఈ యోగము సంభవించును. ఇరువది యెనిమిదవ ద్వాపరయుగమునందు చివరిభాగమున 128 సం. 5 మా- 26

రోజులు మిగిలియుండగా అప్పటి ప్రజోత్పత్తి నామసంవత్సర ఆశ్వయుజశుద్ధపంచమి యందు జేష్ఠానక్షత్రమునందు ధనుర్లగ్నమునందు మధ్యాహ్నకాలమున ధర్మరాజు జననము. అనగా క్రీ. పూ. 16.8.3130 ధర్మజుని జననముగా పరిగణింపబడినది.

భీమసేనుని జననము :-

మఘే చంద్రచామసా యుక్తే సింహే చాభ్యుదితే గురౌ
దివామధ్యగతే సూర్యే తిథౌ పుణ్యే త్రయోదశే
పిత్ర్యే ముహూర్తే సా కుంతీ సుషువే భీమమచ్యుతం.

-మ.భా.ఆది 6 అ

వాయుదేవునినుండి ఆజానుబాహువును భయంకరమయిన పరాక్రమము కలవాడగు భీముడు పుట్టెను. మఘానక్షత్రము చంద్రునితో గూడియుండగా సింహమునందు గురువు ఉదయించగా పగటియొక్క మధ్యమందు సూర్యుడుండగా పుణ్యమగు త్రయోదశితిథియందు పితృదేవతాకమగు పదమూడవముహూర్తమున భీమసేనుని కుంతీదేవి కనెను.

వ్యాఖ్యానము :- మఘానక్షత్రగతే చంద్రే సింహే గురౌ తులాయాం రవౌ స్థితే పుణ్యే తిథౌ పిత్ర్యే ముహూర్తే దివసస్య త్రయోదశే భాగే అపరాహ్ణే కుంతీ భీమం సుషువే ఇతి . తథా చ తులాయాం పూర్తే వర్తమానే చాశ్వయుజమాసో భవేత్ తదాశ్విన శుక్లపూర్ణిమాయామశ్వనీనక్షత్రమాయాతి. తదుపరి మేఘాభిధం దశమనక్షత్రం భవతి తథా చ తథా క్రీస్తోఃపూర్వం ది. 27.06.3128.

చంద్రుడు మఘానక్షత్రమునందుండగా బృహస్పతి సింహరాశి యందుండగా సూర్యుడు తులారాశియందుండగా పుణ్యమయిన తిథియందు పితృదేవతాకమయిన ముహూర్తమందు అనగా పగటియొక్క పదమూడవభాగమయిన అపరాహ్ణమునందు కుంతి భీముని కనెను. తులారాశియందు పూర్ణిమయందు ఆశ్వయుజమాసమగును. అప్పుడు ఆశ్వయుజశుక్లపూర్ణిమయందు అశ్వినీనక్షత్రము వచ్చుచున్నది. అశ్వనీ నక్షత్రము తరువాత మఘానక్షత్రము పదియవది. అనగా ఆంగిరసనామసంవత్సర ఆశ్వయుజ కృష్ణనవమియందు భీమసేనుని జననము.

ఆ ముహూర్తముననే దుర్యోధనుడు. కీచకుడు బకుడు హిడింబాసురుడు

జరాసంధుడు కిమ్మీరుడు జన్మించిరనియు వీరందరు ఒకే గురువు యొద్ద విద్యనభ్యసించిరనియు నొకగాథ ప్రచారములో కలదు. అది అభూతకల్పనగా కనిపించుచున్నది. భీముడు, దుర్యోధనుడు తప్ప తక్కినవారందరు ఒకే వయసు వారు. వారు ఒకే ప్రాంతమువారును కారు. భీమునితో కీచక, బకాసుర, హిడింబాసుర, జరాసంధ కిమ్మీరులకు పూర్వపరిచయమున్నట్లెచ్చటను చెప్పబడలేదు. శ్రీ కృష్ణుడు - అర్జునుడు ఒకే వయసు వారు. భీముని కంటె ఏడాది చిన్నవాడు. శ్రీ కృష్ణునికి మేనమామ కంసుడు. వయసులో శ్రీకృష్ణుని కంటె చాలా పెద్దవాడు. అట్టి కంసునికి పిల్లనిచ్చిన మామగారు జరాసంధుడు. అట్టి జరాసంధుడు భీముడు ఒకే ముహూర్తమున జన్మించిరనుట అభూతకల్పనకాక మరేమి ?

అర్జునుని జననము :-

ఉత్తరాభ్యాం తు పూర్ణాభ్యాం ఫల్గునీభ్యాం తతో దివా
జాతస్తు ఫాల్గునే మాసి తేనాసౌ ఫల్గునస్మృతః

-మహా. భా . ఆది 7 అ

ఆ అర్జునుడు ఫాల్గుణమాసమునందు నిండైన ఉత్తరఫల్గుణీనక్షత్రములతో కూడికొనయున్న పగటియందు పుట్టుటచే ఫల్గుణుడను పేరునువడసెను.

**వ్యాఖ్యానము** :- పూర్వోత్తరఫల్గుణీనక్షత్రయుక్త శ్రీముఖవత్సరఫాల్గుణశుక్ల పూర్ణిమాయాం అర్జునస్య జననం. తదా క్రీస్తోఃపూర్వం ది. 6.2.3127 ఇత్యర్థః.

శ్రీ ముఖసంవత్సరే ఫాల్గుణపూర్ణిమాయాం ఉత్తరాఫల్గునీనక్షత్రే అర్జునస్య జననం భారతే 34 అధ్యాయే శ్లో. అర్జునాత్కేశవో జ్యేష్ఠః సప్తమాసైర్మహద్యుతిః తథా చ శ్రీముఖవత్సరే శ్రావణకృష్ణాష్టమీతిథౌ రోహిణ్యామర్ధరాత్రౌ వృషభచంద్రయుత మీనం గతేషు సర్వేషు గ్రహేషు భగవాన్ శ్రీకృష్ణో జాతః

శ్రీముఖసంవత్సరఫాల్గుణశుద్ధ పూర్వోత్తరఫల్గుణీనక్షత్రముతో కూడుకొనిన పూర్ణిమయందు అర్జునుని జననమని అర్థము. అప్పుడు క్రీ.పూ 6.2.3127 సం, శ్రీముఖసంవత్సర ఫాల్గుణశుద్ధ ఉత్తరఫల్గుణీనక్షత్రయుక్తపూర్ణిమయందు అర్జునుని జననము. భారతమున అర్జునునికంటె కేశవుడు ఏడు మాసములు పెద్దవాడని చెప్పుట శ్రీ ముఖసంవత్సర శ్రావణబహుళ అష్టమీతిథియందు రోహిణీనక్షత్రమున అర్ధరాత్రి యందు చంద్రుడు వృషభలగ్నము నందుండగా సర్వగ్రహములు మీనరాశియందుండగా

భగవంతుడగు శ్రీకృష్ణుడు జన్మించెను. శ్రీ మద్భాగవతద్వాదశ స్కంధ ద్వితీయాధ్యాయమునను

శ్లో. శ్రీముఖాబ్దే శ్రావణే చ కృష్ణపక్షేఽష్టమీతిథౌ రోహిణ్యామర్ధరాత్రే చ వృషభే చంద్రసంయుతే మీనం గతేషు సర్వేషు గ్రహేషు భగవాన్ హరిః దేవత్యాం దేవరూపిణ్యాం అవతారం చకార హ ఇతి. తతః తత్రైవ ధర్మజాత్ సం. 1.10.12 దినాని న్యూనాని శ్రీకృష్ణ జననస్యేత్యర్థః అస్మిన్ విషయే శ్రీమద్భాగవతే.

అటులనే శ్రీ మద్భాగవత ద్వాదశస్కంధ ద్వితీయాధ్యాయమున శ్రీముఖసంవత్సరశ్రావణమాసమున కృష్ణ అష్టమితిథియందు చంద్రుడు వృషభలగ్నమునందుండగా సర్వగ్రహములు మీనరాశియందుండగా శ్రీహరి దేవరూపియగు దేవకియందు అవతరించెను. అచ్చటనే ధర్మరాజు కంటె శ్రీ కృష్ణుడు 1సం. 10 మా. 12 దినములు చిన్నవాడని చెప్పబడినది.

నకులసహదేవుల జననము :-

భావసంవత్సరఫాల్గుణకృష్ణఅమావాస్యాయాం అశ్వనీనక్షత్రే మధ్యాహ్నవేలాయాం నకులసహదేవనామకౌ మాద్ర్యాం యమళౌ జాతావితి వ్యజ్యతే -మహా. భా.సా ఆది పు 206

భావనామసంవత్సర ఫాల్గుణబహుళఅమావాస్యాయాం అశ్వనీనక్షత్రమందు మధ్యాహ్నసమయమున మాద్రియందు నకులసహదేవు లనుకవలలు పుట్టిరని తెలియుచున్నది. నకులసహదేవుల జననము క్రీ.పూ. 21.1.3126.

శ్లో॥ శంఖాంశజో ధర్మజస్తు గదాంశో మారుతిస్తథా
చక్రాంశజోఽర్జునః స్తన్వత్ఖడ్గాంశో నకులస్వయం
శారాంశస్సహదేవాఖ్యః శ్రీహరేః పంచసాయకాః
అథ విష్ణోః పంచాయుధస్తోత్రముచ్యతే.

మహాభారతసారోద్ధారమునుండి

శంఖం -ధర్మః

శ్లో. విష్ణోర్ముఖోత్థానిలపూరితస్య యస్య ధ్వనిర్దానవదర్పహంతా
తం పాంచజన్యం శశికోటిశుభ్రం శంఖం సదాఽహం శరణం ప్రపద్యే.

విష్ణువు ముఖమునుండి వెలువడిన వాయువుచే పూరింపబడినట్టియు దేనియొక్క ధ్వని రాక్షసులదర్పమును హరించునో, అట్టి కోటిచంద్రులవలె పరిశుద్ధమయిన పాంచజన్యమను శంఖమును నేనెల్లప్పుడు శరణు పొందుచున్నాను.

గదా కౌమోదకీ భీమసేన:

శ్లో. హిరణ్మయీం మేరుసమానసారాం కౌమోదకీం దైత్యకులైకహంత్రీం
వైకుంఠవామాగ్రకరాభిమృష్టాం గదాం సదాఽహం శరణం ప్రపద్యే.

బంగారు వికారమయినదియు మేరుపర్వతముతో సమానమయిన జిగినికలదియు రాక్షసకులమును సంహరించుటలో ప్రధానమయినదియు, శ్రీహరి యొక్క కరాగ్రముచే స్పృశింపబడిన కౌమోదకియను గదను నే నెల్లప్పుడును శరణుపొందుచున్నాను.

చక్రం -అర్జున:

శ్లో. స్ఫురత్సహస్రారశిఖాతితీవ్రం సుదర్శనం భాస్కరకోటితుల్యం
సురద్విషాం ప్రాణవినాశి విష్ణోశ్చక్రం సదాఽహం శరణం ప్రపద్యే

ప్రకాశించుచున్న వేయిఅంచులతో మిక్కిలి వాడియైనదియు, కోటి సూర్యులతో సమానమయినదియు, రాక్షసుల ప్రాణములను తీయునట్టి శ్రీహరియొక్క సుదర్శనమను పేరుగల చక్రమును నెల్లప్పుడును శరణుపొందుచున్నాను.

ఖడ్గం - (నందకం) నకుల:-

శ్లో. రక్షోసురాణాం కఠినోగ్రకంఠచ్ఛేదక్షురశ్శోణితదిగ్ధధారాం
తం నందకం నామ హరేః ప్రదీప్తం ఖడ్గం సదాఽహం శరణం ప్రపద్యే

రాక్షసులయొక్కయు అసురులయొక్కయు కఠినమయిన శరీరమును ఛేదించుటచే వారిరక్తముచే పూయబడిన అంచులుగల కాంతిమంతమయిన శ్రీ హరి యొక్క నందకమను ఖడ్గమును నేనెల్లప్పుడునూ శరణుపొందుచున్నాను.

శార్ఙ్గం (ధనుః) సహదేవ:

శ్లో॥ యజ్జ్యానినాదశ్రవణాత్సురాణాం చేతాంసి నిర్ముక్తభయాని సద్యః
భవంతి దైత్యాశనిబాణవర్షైః శార్ఙ్గంసదాఽహం శరణం ప్రపద్యే

దేనియొక్క నారిధ్వనిని విని దేవతలమనస్సులు వెంటనే భయము లేనివగుచున్నవో ఏది తన బాణవర్షములచే రాక్షసులను కూల్చుచున్నదో అట్టి శ్రీహరి యొక్క శార్ఙ్గమను ధనస్సును నేను శరణుపొందుచున్నాను.

ఇది శ్రీ మహావిష్ణువు యొక్క పంచాయుధస్తోత్రము. ఈ పంచాయుధస్తోత్రము వ్యాఖ్యాసహితముగ మహాభారత సారోద్ధారమునుండి గ్రహింపబడినది. శ్రీ మహావిష్ణువు యొక్క పంచాయుధముల యంశలే పంచపాండవులు.

-మ.భా.సా. ఆది పు 180-181

నాటి సమాజము పాండవుల జననమును శంకించిరా ? యను ప్రసంగము.......

శతశృంగపర్వతమున పాండురాజు మృతుడు కాగా, అచటి మహర్షులు కుంతీదేవిని పంచపాండవులను గైకొని కురుదేశమునకు చనుదెంచిరి. వారు కౌరవప్రముఖులతో పాండవులజననవృత్తాంతమును, పాండురాజుమృతియు, మాద్రి సహగమనము వివరించి కుంతీపాండవులను కౌరవులకునప్పగించి అంతర్హితులైరి. ఐయితే శాపగ్రస్తుడై తపోవృత్తినున్న పాండురాజునకు కుమారులెట్లు కలిగిరని నాటి సమాజము శంకించి యుండలేదా అని మన విమర్శకుల యాక్షేపము. దీనికి సమాధానము నరయవలెనన్న గ్రంథవిషయమును పరిశీలింపవలెను.

ఈ ఘట్టమున నాంధ్రభారతమున నన్నయకవీంద్రులు ఆదిపర్వము, పంచమాశ్వాసమున నిట్లు వివరించిరి.

ఉ ॥ భానునిభుండు పాండుజనపాలుడు ఘోరతపంబుచేసి ధ
ర్మానిలవాసవాశ్వినుల దైవవరంబున శక్తి పేర్మితో
నీనరనాథనందనుల నేవుర వంశవృద్ధిపొందె బం
చానల సత్త్వులం బడసె నా శతశృంగమహానగంబునన్

క॥ త్రిదశాధినాథసదృశుడు
త్రిదశాలయమునకు మాద్రిదేవియు దానున్
ముదమొనర నరిగె నేటికి
బదియేడగునాడు దురితబంధచ్యుతుడై

క॥ కమనీయలీల నొక్కట
సమరపురంబునకు జనిన యయ్యిరువుర యం
గములిలి పితృమేధవిధి
క్రమమొనరగ సంస్కరింపగ గడగుడు వీనిన్.

వ. ఈ దేవియును పతితోడన పోవసమకట్టినం బుత్త్రరక్ష ణార్థంబు మునిగణ ప్రార్థితయై యెట్టకేనియు ధృతప్రాణయయ్యె నిక్కుమారులు కురుకులవిస్తారకులు దేవమూర్తులు యుధిష్ఠిరభీమార్జుననకులసహదేవులనంగా దేవాధిష్ఠితనామంబులు తాల్చి బ్రహ్మర్షి ప్రణీతోపనయనులై శ్రుత్యధ్యయనసంపన్నులగుచు బెరుగుచున్నవారు వీరలం జేకొని కురువృద్ధులు ధర్మబుద్ధి రక్షించునది యనిచెప్పి సిద్ధచారణంబులతో నమ్మహామునులంతర్ధానంబు చేసిరంత వ్యాసభీష్మధృతరాష్ట్రుల యనుమతంబున.
-ఆ.భా.ఆది-5అ-153-154-155-156

వ. అంత గృష్ణద్వైపాయనుండు వారికందరకు దుఃఖోపశమనంబుసేసి యొక్కనాడు సత్యవతికి నేకాంతంబున నిట్లనియె.

కం॥ మతి తలపగ సంసారం
బతిచంచల మెండమావులట్టుల సంప
త్ప్రతతు లతిక్షణికంబులు
గతకాలము మేలు వచ్చు కాలము కంటెన్.

కం॥ క్రూరులు విలుప్త ధర్మా
చారులు ధృతరాష్ట్ర సుతుల సద్వృత్తులు ని
ష్కారణవైరులు వీరల
కారణమున నెగులు పుట్టు గౌరవ్యులకున్..

దాని ధృతరాష్ట్రుండు తాన యనుభవించు గాని మీరీదారుణంబు, జూడక వీరివిడిచి తపోవనంబున కరుగుండని చెప్పి చనిన, సత్యవతియు బారాశర్యునుపదేశంబు భీష్మవిదురులకెఱింగించి, కోడండ్ర నంబికాంబాలికలం దోడ్కొని వనంబునకుం జని

తానును వారు నతిఘోరతపంబుసేసి కొండొకకాలమునకు శరీరంబులు విడిచి పుణ్యగతిం బోయిరి..

-ఆ.భా. ఆది. 56. 159-160-161

ఇక వ్యాసభారతమున నీ వృత్తాంతము మరింత వివరముగా గలదు.

యస్మిన్వర్షే సముత్పన్నః పార్థస్తస్య చ ధీమతః
తస్మిన్నుత్తరఫల్గున్యాం ప్రవృత్తే స్వస్తి వాచనే
రక్షణే విస్మితా కుంతీ వ్యగ్రా బ్రాహ్మణభోజనే
మాద్రీం మైథునధర్మేణ సోऽన్వగచ్ఛద్బలాదివ
స తయా సహ సంగమ్య భార్యయా కురునందన
పాండుః పరమధర్మాత్మా యుయుజే కాలధర్మాణా

-మహా. భా .సా. ఆది. పు. 210

ధీమంతుడగు అర్జునునకు పదునాలుగు సంత్సరములు నిండగ, ఆ పాండురాజున కేనక్షత్రమునందు అర్జునుడుదయించెనో, ఆ ఉత్తరఫల్గునీనక్షత్రము రాగా బ్రాహ్మణులాశీర్వచనము చేయుచుండగా కుంతీదేవి బ్రాహ్మణభోజనమునందు నిమగ్నురాలైయుండి పాండురాజును రక్షించుటయందు ఏమరుపాటు చెందియుండ నాతడు బలాత్కారముగా మాద్రీదేవితో గూడినవాడాయెను. పాండురాజు భార్యయగు మాద్రితో గూడి శాపవశమున కాలధర్మమునొందెను.

వ్యాఖ్యానము :- ఫాల్గుణపూర్ణిమాయాం ఫల్గునస్య చతుర్దశసంవత్సరప్రాప్తిః తదాది ఉత్తరఫల్గునీ సప్తవింశతిదివసే ఆగమిష్యదితి తథా చ తస్మిన్ దినే చైత్రశుద్ధద్వాదశీ భవతీతి సం॥ సర్వధారిసంవత్సర చైత్రశుద్ధఏకాదస్యాం శతశృంగే పాండురాజస్య మరణం.

అనగా శ్రీముఖనామసంవత్సరఫాల్గుణశుద్ధపూర్ణిమయందు అర్జునకు పదునాలుగు సంవత్సరములు ప్రాప్తించెను. అది మొదలుకొని ఉత్తరఫల్గునీనక్షత్రము 27వ దినమున రాగలదు. కావున చైత్రశుద్ధ ద్వాదశి కాగలదు. సర్వధారినామ సంవత్సర చైత్రశుద్ధ ఏకాదశియందు శతశృంగపర్వతమున పాండురాజు మరణము.

"యుధిష్ఠిరస్తు ధర్మాత్మా బభౌ షోడశవార్షికః" అనుటవలన ధర్మరాజు వయస్సు పదునారు సంవత్సరములు నిండినది. మాద్రి పాండురాజుతోపాటు సహగమనము

చేసినది. "యోగభూమౌ మృతత్వాచ్చ న మంత్రా ఊర్ధ్వదైహికమ్." అనుటవలన నది యోగభూమి యగుటవలన వారలకు మంత్రములతో దహనాదిసంస్కారములు లేవు. అచ్చటి ఋషులు వారిలో వారాలోచించుకొని పాండురాజుయొక్క భార్యను, పుత్రులను, మాద్రీపాండులయొక్క శల్యములను తీసికొని కురుదేశమునకు వచ్చిరి.

పురవాసులందరు సకుటుంబములతో వచ్చిరి. భీష్ముడు, సోమదత్తుడు, బాహ్లికుడు, ప్రజ్ఞాశాలి యగు విదురుడు, సత్యవతీదేవి, గాంధారీదేవి, ధృతరాష్ట్రుని పుత్రులు దుర్యోధనాదులు నూర్గురు, వివిధభూషణాలంకృతులై ఆ ఋషుల సందర్శనార్థమయి వచ్చిరి. వచ్చినవారందరు ఋషిగణమునకు వినమ్రతతో నమస్కరించిరి. ఆ ఋషీంద్రులు కౌరవులతో......

"బ్రహ్మచర్యవ్రతస్థస్య తస్య దివ్యేన హేతునా
సాక్షాద్ధర్మాదయం పుత్ర స్తత్ర జాతో యుధిష్ఠిరః"

-మహా. బా. ఆది. 8 అ

బ్రహ్మచర్యవ్రతమందున్న పాండురాజునకు దివ్యమగు హేతువుచే సాక్షాత్ యమధర్మరాజువలన ఈ యుధిష్ఠిరుడు పుత్రుడుగా జన్మించెనని. అట్లే భీమార్జున నకులసహదేవుల జననమును సవిస్తరముగా చెప్పిరి. "దివ్యేన హేతునా" అను దానికి నీలకంఠులవారు "దివ్యేన హేతునా - మంత్రేణ దేవతాహ్వానాద్యలౌకికకారణేన" అని వ్యాఖ్యానించిరి.

పాండవుల జన్మమును నాటిసమాజము శంకింపలేదా అనిగదా ప్రశ్న. సమాజమన్న తరువాత భిన్నమయిన సంస్కారము మనస్తత్వము కలవారుందురు. "లోకో భిన్నరుచిః" ఉత్తమసంస్కారులు శంకింపలేదు. కాని, సంస్కారము లేనివారు, నిత్యశంకితులు అల్పజ్ఞానులు కొంద రదేసమాజమున నుందురు కదా ! వారు శంకించుటకవకాశమున్నది. ఈ విషయమును గ్రంథసందర్భమును నిశితముగా బరిశీలించినచో విశదము కాగలదు. మరియు ఋషులీ విధముగా జెప్పిరి.

పితృలోకం గతః పాండురితస్సప్తదశేఽహని
ప్రవిష్టా పావకం మాద్రీ హిత్వా జీవితమాత్మనః
ఇమే తయోశ్శరీరే ద్వే పుత్రాశ్చేమే తయోర్వరాః
ఇయం కున్తీ మహాసాధ్వీ సతీ దేవర్షిసమ్మతా

ఏవం మహర్షయస్సర్వే ప్రోచ్యేమాన్ సమంతత:
దేవదుందుభినిర్ఘోష: పుష్పవృష్టిశ్చ చాపతత్.

-మహా. భా . ఆది.8 అ

నేటికి పదునేడవ రోజున పాండురాజు పితృలోకమును పొందెను. మాద్రి తన జీవితమును విడిచి వానితోపాటు అగ్నిని ప్రవేశించినది. ఇవి రెండు వారి శరీరములు. వీరైదుగురు వారి పుత్త్రులు. ఈమె మహాపతివ్రతయు దేవఋషి సమ్మతురాలగు కుంతీదేవి. ఈ విధముగా మహర్షులందరు చెప్పుచుండగా అంతటను దేవదుందుభులు మ్రోగినవి. పుష్పవృష్టి కురిసినది. ఈ విధముగా ఋషులు పాండవులను సర్వధారిసంవత్సర చైత్రకష్ణత్రయోదశియందు భీష్మాదులకప్పగించిరి. మరియు నా ఋషులు ఆ మాద్రికిని పాండురాజునకును అనంతరకర్తవ్యమేమి కలదో దాని నాచరింపుడని బోధించిరి. అట్లే ధృతరాష్ట్రుడు పాండురాజునకును మాద్రికిని రాజలాంఛనములతో అన్ని ప్రేతకార్యములను చేయించెను. ధృతరాష్ట్రుడీ సందర్భమున శ్రేష్ఠుడగు రాజగు పాండువు పాపరహితుడు, దు:ఖింపదగినవాడు కాడు. అతనికి వీరులును దేవతాపుత్రులతో సమానులగు అయిదుగురు కుమారులు కలరు. గాన దు:ఖింపనవసరము లేదని పలికెను.

న శోచ్య: పాండురనఘ: ప్రశస్య చ నరాధిప:
యస్య పంచసుతా వీరా జాతాస్సురసుతోపమా:

-మహా. భా . ఆది. 8అ

పాండురాజు చక్రవర్తి కనుక ఆయనకు పరిపూర్ణరాజలాంఛనములతో ప్రేతకృత్యములు నిర్వహింపబడెను. ఇచ్చట "రాజవద్రాజసింహస్య మాద్ర్యాశ్చైవ విశేషత:' అని ధృతరాష్ట్రుని వాక్యము. ధృతరాష్ట్రుడు విదురునితో "విదురా! పాండురాజునకును మాద్రికిని విశేషముగా రాజలాంఛనములతో అన్ని ప్రేతకార్యములు చేయించుము." అని చెప్పెను. "వత్రృత్యయమస్య వతి స్వార్థే ఇత్యర్థ:" అని నీలకంఠులవ్యాఖ్య. అనగా వత్‌ప్రత్యయము వత్‌స్వార్థే అని చెప్పబడుటచే స్వార్థమునందు వచ్చినది. రాజు కాని వానికి రాజునకువలె అని అర్థము కాక రాజునకే యని యర్థము.

చుక్రుశు: పాండవాస్సర్వే భీష్మశ్చ సబాంధవా:
బభూవ పాండవైస్సార్థం నగరం ద్వాదశక్షపా:

-మహా. భా .సా. ఆది. 8 అ

పాండవులందరు భీష్ముడును బంధువులతోగూడి విలపించిరి. పండ్రెండు రోజులు గడిచిన తరువాత పాండవుల నగరము కేతెంచిరి

నీలకంఠీయవ్యాఖ్యా :- బభూవేతి - ద్వాదశక్షపా ఇత్యత్ర సర్వధారివత్సర చైత్రబహుళత్రయోదశిప్రభృతి వైశాఖశుద్ధదశమిపర్యంతం పాండురాజస్య మాద్రీసహితస్యోత్తరక్రియానిర్వర్తనమభవదితి సూచ్యతే ! తదా యుధిష్ఠిరస్య వయః 16 సంవత్సర 5 మాసే 25 దినాని జ్ఞాయతే ! తదా ఇదానీంతన క్రీస్తోఃపూర్వం 11.12.3112 ఇతి సుస్పష్టం వ్యజ్యతే.

"బభూవ ద్వాదశక్షపాః" అనుచోట సర్వధారి సంవత్సరచైత్ర బహుళత్రయోదశి మొదలు వైశాఖశుద్ధదశమిపర్యంతము మాద్రితోగూడిన పాండు రాజునకు ఉత్తరక్రియలు జరుపబడినవని సూచింపబడుచున్నది. అప్పుడు ధర్మరాజు వయస్సు 16 సంవత్సరముల 5 మాసముల 25 దినములని తెలియుచ్నుది. అప్పుడు క్రీ.పూ. 11.12.3112 మని సుస్పష్టముగాతోచుచున్నది.

మందం మందముపేత్య తత్ర సదసో మత్పాండుపుత్రాంకురాః
క్వేతి ప్రేమపురఃప్రసారితకరః కుర్వన్ దృఢాలింగనమ్
స్పర్శం స్పర్శమిమాన్నిజాంకగమితాన్ భ్రాతుస్స్మరన్నోరవ
శ్చ్యేదద్భిర్నయనాంబుభిస్స విదధే లోకం నదీమాతృకమ్

వ్యా. భా. ఆదిప. 8 అధ్యాయం.

ధృతరాష్ట్రుడు సభనుండి గ్రుడ్డివాడగుటచే మెల్లమెల్లగా ముందుకువచ్చి నా సోదరుడగు పాండురాజు పుత్రులెచ్చటనున్నారు. అనుచూ ప్రేమతో ముందుకు చాచబడిన చేతులుకలవాడయి వారిని గాఢాలింగనము చేసికొనుచు తనతొడను ఎక్కిన పాండవులను మాటిమాటికి స్పృశించుచు ప్రేమపూర్వకముగా సోదరుని స్మరించుచు, ఎడతెగని కన్నీటికాలువలచే ఈ లోకమునంతను నదీమాతృకమయిన దానినిగా చేసెను.

ఆహుః కేచన తస్యైతే తస్యైత ఇతి చాపరే
యదా చిరం మృతః పాండుః కథం తస్యేతి చాపరే.

వ్యా.భా. ఆదిప. 8 అధ్యాయం.

నీలకంఠీయమ్ :- నత్వస్త్యైత ఇతి -పిత్రపేక్షయా ఽత్యుదార మూర్తిత్వాత్ ! తస్త్యైత ఇతి - మాత్రోస్పతీచ్ఛాత్ !

అతిదుష్టానాముక్తిర్యదేతి - చిరమృతః చిరం శాపదగ్ధః అల్పకాలాశ్చ శిశవ ఇతి సందేహబీజమ్.

స్వాగతం సర్వథా దిష్ట్యా పాండోః పశ్యామ సన్తతిమ్

ఉచ్యతాం స్వాగతమితి వాచోఽశ్రూయన్త సర్వశః ม. భా. ఆది. 8 అ.

నీలకంఠీయమ్ :- స్వాగతం శోభనమాగమనం యుష్మాకం యతో వయం దిష్ట్యా భాగ్యేన పాండోఃసంతతిం పశ్యామేతి పౌరైరుక్తే సమ్యగాగత మస్మాభిర్యుష్మాన్ ప్రతీతి ఉచ్యతాం వదతాం పాండవానామపి వాచః అశ్రూయన్త సర్వశస్సర్వైః

తస్మిన్నుపరతే శబ్దే దిశస్సర్వా నినాదయన్

అంతర్హితానాం భూతానాం నిస్వనస్తుములోఽ భవత్

వ్యా. భా. ఆది.ప 8వ అ.

నీలకంఠీయమ్ :- సందిగ్ధానాం సందేహాపనోదకం తదా దేవచేష్టితమాహ ద్వాభ్యాం - నిఃస్వనః నిశ్చితస్వనః పాండవాపత ఇత్యేవంరూపశ్శబ్దః !

పుష్పవృష్టి శ్శుభా గంధా శ్శంఖదుందుభినిస్స్వనాః

ఆసన్ ప్రదేశే పార్థానాం తదద్భుతమివాఽ భవత్ !

........ అద్భుతం పుష్పవృష్ట్యాది అత్యాశ్చర్యం

తత్రప్రీత్యా చైవ సర్వేషాం పౌరాణాం హర్షసంభవః

శబ్ద ఆసీన్మహాంస్తత్ర దివస్పృక్కీర్తి వర్ధనః

..........తత్రప్రీత్యా తేషు పాండవేషు ప్రపీత్యా ప్రేమ్ణా హర్షసంభవః సాధుశబ్దః ॥ -మ.భా. ఆది.8 అ

ఇది గ్రంథస్థవిషయము. మనోహరమూర్తులైన పాండుపుత్రులను ధృతరాష్ట్ర భవనమునకు తీసికొనివచ్చి ఋషులు వీరు పాండుపుత్రులని చెప్పి, యచ్చటి వారితో వీరు మీకు పుత్రులు అనియు, మీకు భ్రాతలనియు మీకు శిష్యులనియు మిత్రులనియు యథోచితముగా చెప్పి యంతర్హితులైరి.

తత్ర త్రయోదశాబ్దాని ధార్తరాష్ట్రే స్సహోషితాః
ధార్తరాష్ట్రైశ్చ సహితాః క్రీడంతో ముదితాస్సుఖం ॥

-మహా. భా. ఆది.8 అ

వ్యాఖ్యానము :- త్రయోదశ ఇత్యత్ర తదాది త్రయోదశాబ్దాని ధార్తరాష్ట్రైస్సహ పాండవా ఉషితా ఇతి ద్యోతతే తథా చ సర్వధారివైశాఖశుద్ధదశమీ ఆరభ్య ప్లవసంవత్సర వైశాఖశుద్ధదశమిపర్యంతం పాండవాః కౌరవైస్సహోషితాః ఇత్యర్థః తదా క్రీస్తోపూర్వం దినాది 11.12.3099 ఇతి తదానీం యుధిష్ఠిరస్య వయః, సం. 29.5.25 ఇతి సిధ్యతి ।

తతో ప్లవసంవత్సర వైశాఖశుక్ల పూర్ణిమాయాం ద్రోణాచార్యేణ నిర్దిష్టకుమారాస్త్ర సందర్శనాఖ్యా విద్యా పరీక్షా చ॥

తదనుపదమేవ ప్లవసంవత్సరవైశాఖకృష్ణపంచమ్యాం గురుదక్షిణార్థం భీమార్జునాభ్యాం ద్రుపదబంధనం పశ్చాద్ద్రోణాజ్ఞయా విమోచనం చాభవత్ తత్కృత్యం సం. 1.4.5 దినాన్యభవత్ ! తథా చ శుభకృత్సంవత్సర భాద్రపదశుద్ధపౌర్ణమీ పర్యంతమభూత్ ! తథా క్రీస్తోఃపూర్వం ది. 6.4.3098 ఇతి చతురశ్రం॥

అనగా త్రయోదశ యనుచోట అప్పటినుండి అనగా పాండురాజుమరణము నుండి 13 సంవత్సరములు పాండవులు కౌరవులతోగూడి నివసించిరి, అని తెలియుచున్నది. ఆవిధముగా సర్వధారిసంవత్సర వైశాఖశుద్ధదశమినుండి ప్లవసంవత్సరవైశాఖశుద్ధదశమి వరకు పాండవులు కౌరవులతోనుండిరని అర్థము. అప్పుడు క్రీ.పూ. 11.12.3099. అప్పుడు ధర్మరాజు వయస్సు 29 సంవత్సరముల 5 మాసముల 5 దినములని సిద్ధించుచున్నది.

తరువాత ప్లవసంవత్సరవైశాఖశుద్ధ పూర్ణిమయందు ద్రోణాచార్యులచే చేయబడి కుమారాస్త్రసందర్శమనెడి విద్యాపరీక్ష జరుపబడెను.

దాని వెంటనే ప్లవసంవత్సరబహుళపంచమియందు గురుదక్షిణకొఱకు భీమార్జునులచే ద్రుపదుని బంధించుటయు, తరువాత ద్రోణాజ్ఞచే విడిచిపెట్టుటయు సంభవించెను. ఆ పనియంతయు 1 సం. 4 నెలల 5 దినములు ఆయెను. అనగా శుభకృతుసంవత్సరభాద్రపదశుద్ధపౌర్ణమి వరకు జరిగెను. అప్పుడు క్రీ. పూ. 6.4.3098 అని సిద్ధించుచున్నది.

అయితే ఆనాటిసమాజము పాండవులజన్మమును సంశయింపలేదా అను ప్రశ్నకు సమాధానము నరయవలసియున్నది.

ఋషులచే తెలుపబడిన పాండుపుత్రులను జూచి సాధువులైన పౌరులు కౌరవులు హర్షధ్వానములు చేసిరని గదా చెప్పబడినది. ధృతరాష్ట్రుడు తన తమ్ముని కుమారులనెంతప్రేమయు, వాత్సల్యముతో నాదరించెనో చూచితిమి. కదా ! అయితే జనులలో భిన్నాభిప్రాయములు కలిగినవి. ఆ కుమారులు తండ్రి కంటె అత్యుదారమూర్తులై యున్నందున వీరు పాండుపుత్రులు కానేరరని కొందరును, తల్లులగు కుంతీమాద్రులు సతీమణులగుటవలన తప్పక పాండుపుత్రులేయని మరికొందరును ఆయా హేతువులనుబట్టి పరిపరివిధముల యనుకొనిరి. ఆ హేతువులను గణింపకయే చిరకాలమయి పాండురాజు శాపదగ్ధుడైయుండ నల్పవయస్కులుగల యీ శిశువులు పాండుపుత్రులెట్లగుదురని అతిదుష్టులైన వారనుకొనిరి. పౌరులు పాండవులను స్వాగతమడిగి పాండుపుత్రులను దర్శింపగలుగుట మాభాగ్యమని వారు శుభాగమనమును తెలిపిరి. తరువాత పాండవులనుగూర్చి సందిగ్ధులైన వారిసందేహమును తొలగింపబూని దేవతలు అంతర్హితులై యుండి వీరు పాండుపుత్రులేయని వెల్లడించిరి. ఆ పై పాండవులున్న ప్రదేశములో దివ్య పుష్పములవృష్టియు సుగంధప్రసారము ఆశ్చర్యముగా జరిగినది. అంతట పాండవులపై ప్రేమచే పౌరుల హర్షధ్వనులు విజృంభించినవి. వెనుక పాండవజన్మమునుగూర్చి మొదట సందేహించిన వారిసందేహముకూడా పూర్తిగా తొలగినదనుట స్పష్టము.

అప్రత్యక్షవిషయములను నిర్ధారణచేయుటకు ఆప్తవాక్యములే ప్రమాణములు మహర్షులు యథార్థవాదులు . వారి వాక్యము లాప్తవాక్యములు.

రజస్తమోభ్యాం నిర్ముక్తాస్తపోజ్ఞానబలేన యే
యేషాం త్రికాలమమలం జ్ఞానమవ్యాహతం తథా ॥
ఆప్తాశ్శిష్టా విబుద్ధాస్తే తేషాం వాక్యమసంశయమ్
సత్యం వక్ష్యన్తి తే కస్మా దసత్యం నీరజస్తమాః ॥
"తత్రాప్తాగమస్తావద్వేదః । యశ్చాఽన్యోఽపి కశ్చిద్వేదార్థా

దవిపరీతః పరాక్షకైః ప్రణతశ్శిష్టానుమతో
లోకానుగ్రహప్రవృత్తశ్శాస్త్రవాదస్స చాప్తాగమః

-మహా. భా .తత్త్వ పు. 570

అని చరక సంహిత -తిస్రైషణీయాధ్యాయమున చెప్పబడినది.

అనగా నాప్తులెవరనగా తపోజ్ఞానములచే నెవ్వరు రజస్తమస్సుల నంతరింపజేసినవారో, ఎవరు అవ్యాహతమయిన త్రికాలజ్ఞానము కలవారో ఎవ్వరు శిష్టులనియు, జ్ఞానులనియు, ప్రశంశింపబడువారో వారే ఆప్తులు. వారి వాక్యములు నిస్సంశయములు. వారు సత్యమునే చెప్పుదురు. రజస్తమోరహితులు చెప్పిన దసత్యమెట్లగును ? వేదము ఆప్తాగమము. వేదార్థమున కవిరుద్ధము, ప్రామాణిక, ప్రణీతము, శిష్టానుమతము, లోకానుగ్రహప్రవృత్తము నగు శాస్త్రవాదముకూడ ఆప్తాగమమే. సర్వులకు శిరోధార్యము.

నాటి వారికి దేవదుందుభిస్వనములు, జయజయధ్వానములు, దేవతావాక్యములు, పుష్పవృష్టియు ప్రత్యక్షములు కనుక వారి శంకతొలగినది. నేటి వారికవి అప్రత్యక్షములు కావున వీరికి శంక తొలగకపోవచ్చును.

ఇది వీరి దురదృష్టము, చేయునది లేదు.



# 5. కర్ణుని జన్మ వృత్తాంతము

మహాభారతమున కర్ణుని జన్మవృత్తాంతము మూడుచోట్ల కలదు. ఒకటి నన్నయ, ఆదిపర్వమున, రెండు శంభుదాసుని ఆరణ్యపర్వమున, మూడు తిక్కనసోమయాజి ఆశ్రమవాసపర్వమున. కర్ణుని జన్మ ప్రస్తావన సంస్కృతాంధ్రభారతముల రెండింటను మూడు చోట్ల ప్రస్తావింపబడిన దనుట స్పష్టము. అట్లు మూడుచోట్లనేల ప్రస్తావింప బడినదని ప్రశ్న. దీనికి సమాధానమిది.

ఆదిపర్వమున సంభవగాథలను వినుచున్న జనమేజయుడు, "భగవన్ శ్రోతుమిచ్ఛామి పుర్వోంశకరాన్" అని ప్రశ్నింప వైశంపాయనుడు పురువంశ్యులచరిత్రను చెప్పుకొనివచ్చుచు ధృతరాష్ట్రాదులజన్మమును చెప్పి పాండురాజు వివాహప్రసంగముతో కుంతీచరిత్రములో నీ గాథను చెప్పెను. వ్యాసభారతమున కర్ణుడుసూర్యసంబంధ నిమిత్తమున జన్మించినట్లు మాత్రమే చెప్పబడెను. గాని సద్యోగర్భజనితుడుగా చెప్పబడలేదు. నన్నయభట్టారకులు మాత్రము ఔచిత్యపరి పోషణ దృష్టితో కావలయును మూలము నతిక్రమించి సద్యోగర్భజనితుడుగా వ్రాసిరి. సంస్కృతభారతములో సంభవపర్వమున కర్ణునియుత్పత్తి మాత్రము చెప్పి వనపర్వమున గర్భధారణగోపనకాలప్రసవాదులు చెప్పబడినవి. శంభుదాసుడీ ప్రకరణమును విపులముగా యథామాతృకముగానే యనువదించెను.

ఇక ఆశ్రమవాసపర్వమున కుంతి తాను తన కన్యాత్వదశ యందు దూర్వాసమహర్షి వరమును పరీక్షింపనెంచి సూర్యునాహ్వానించి వానివలన కర్ణుని కనుటవలన తన కన్యాత్వము దూషితము కాకున్నను తాను చేసినది పుణ్యమో, పాపమో అని తన్ను పీడించుచున్నదని వ్యాసమహర్షితో చెప్పికొన్న సందర్భములోనిది. ఈ ప్రకరణమును కూడ తిక్కసోమయాజి యథామాతృకముగానే యనువదించెను.

ఆదిపర్వము పంచమాశ్వాసమునందు కుంతి దూర్వాసమహర్షియొసంగిన మంత్ర ప్రభావము నెరుంగగోరి సూర్యునాహ్వానించెను. సూర్యుడు ప్రత్యక్షమై "మదీయ దర్శనంబు వృథకాదు నీయభిమతంబు సేయుదుననిన గుంతి యిట్లనియె.

ఏను మంత్రశక్తి యెఱుగక కోరితి
గన్య కిదియుగుణము కాదు నాక
నాకు గర్భమయిననా తలిదంద్రులుఁ
జుట్టములును నన్నుఁజూచి నగరే !

వ. అనిన విని సూర్యుండు దానికిఁగరుణించి నీకు సద్యోగర్భంబున
(బుత్త్రుఁడు ద్భవిల్లు నీ కన్యాత్వంబునుదూషితంబు గాదని వరంబిచ్చినఁ
దత్క్షణంబ

యక్కన్యకకు నంశుమంతు నంశంబునం గానీనుండై.

చ. సలలితమైన పుట్టుఁగవచంబు నిసర్గజమైన కుండలం
బుల యుగళంబు నొప్పగ సుపుత్త్రుఁడు కర్ణుఁడు పుట్టె సూర్యమం
డలమొకొ భూతలంబున బెడంగయి దీప్తిసహస్రకంబుతో
వెలిగెడు నా నిజద్యుతి సవిస్తరలీల వెలుంగుచుండఁగాన్.

వ. అంతనాదిత్యుం డాకాశంబున కరిగినఁగొడుకుం జూచి కుంతి
తద్దయు విస్మయంబంది యెద్దియుం జేయునది లేక.

(ఆ. మ. భా -ఆది 5ఆ 23-27)

అరణ్యపర్వసప్తమాశ్వాసమునందు- దూర్వాసుననుగ్రహమున పొందిన మంత్రశక్తిని పరీక్షింపగోరి కుంతి యొక్కనాడు సూర్యునారాధించిన సూర్యుడు ప్రత్యక్షమయ్యెను. కుంతియు నాశ్చర్యమునంది బాల్యచాపల్యమున మంత్రము జపించితిని. నా కిపుడు కుమారుడు వలదు. నేను కన్యను. కన్యనైన నాకు సుతునొసగిన నా కన్యాత్వము దూషితమగును. తల్లిదండ్రులు బంధుగులు నన్ను దూరెదరు. అని ఎన్నియోవిధముల సూర్యుని వారించినది. కాని సూర్యుడు తన రాక వృధకాజాలదనియు తాను మరలిపోయిన దేవతలెల్లరు చూచుచున్నవారు పరిహసించెదరని చెప్పి కుంతికి దివ్యదృష్టి ప్రసాదించి వారల జూపెను. తన్ను వృధ పుచ్చినచో కుంతియొక్క గుణశీలముల నెరుంగక మంత్రమును ప్రసాదించిన మహర్షిని బంధుగులనుగూడ భస్మమొనర్తునని హెచ్చరించెను. తుదకామెకన్యాత్వము దూషితముకాకుండ వరమొసగి

ఆమెకు గర్భాధానంబుసేసి. గగనంబున కరిగె నంత (బూర్వపక్షంబున చంద్రుండునుంబోలె గర్భంబును (గ్రమంబున బ్రవర్ధనంబు నొందుచు నభివ్యక్తంబయ్యును బ్రభాకరుమహిమంజేసి లోక విదితంబు గాకుండె (దత్ప్రకారంబు దాది కూతురొక్కతియ యెఱుంగు నిట్లు వర్ధిల్లుచుంబది యగు మాసంబునం గన్యాంతఃపురంబునందు

ఆ॥ కొడుకుఁగని యె సహజ కుండల కవచాభి
రాము విమల కోమల కోమలాక్షు
దీర్ఘబాహుఁజారు దృఢదేహు (దరుణార్క
తేజుఁగుంతి భోజ రాజపుత్రి

ఆం.భా. అరణ్య 7 అ - 339-340

ఆశ్రమవాసద్వితీయాశ్వాసమున నీలాగున కలదు.

"---------------- గురుని

నిరపరాధుని శాపనిహతుగాఁ జేయుట

కోర్వక పుత్త్రకు నొసఁగు దేవ

తే॥ కృపభవత్సము ననిన నయ్యపరిమేయ
తేజుడాత్మతేజమున నా దృఙ్మఖేంద్రి
యములు మనసును సమ్మోహితములు సేసి
యపుడు తనయుండుపుట్టెడు మనియెఁబిదప.

వ. అని నిర్దేశించి

తే॥ నీకుఁగన్యాత్వ వికలతగాక యుండ
వరము నిచ్చితి ననుచు దివమున కరిగె
జనక ముఖ బంధుచిత్తవంచనము నడిపి
గూఢ మందిరాంతరమునఁగొడుకుఁగంటి.

ఆ. మ.భా. ఆశ్రమవాస. ద్వితీయా. 101.102-103

వ్యాసభారతమున నాదిపర్వమున కర్ణుని జన్మవృత్తాంతమిట్లు చెప్పబడినది.

మన్త్రప్రసాదా న్న తే రాజ్ఞి భవితా దోష ఇత్యుత
ప్రకాశకర్తా తపస స్సంబభూవ తయా సహ
తత్ర వీర స్సమభవత్సర్వశస్త్రభృతాం వరః
ఆముక్తకవచ శ్శ్రీమాన్ దేవగర్భశ్శ్రియాన్వితః
సహజం కవచం బిభ్ర త్కుండలోద్యోతితాననః
అజాయత సుతః కర్ణ స్సర్వలోకేషు విశ్రుతః.

-మహా. భా. ఆది శ్లో. 5 అ

ఇచ్చట సూర్యసంబంధనిమిత్తమున జన్మించినట్లు మాత్రమే చెప్పబడెను. సద్యోగర్భజనితుడుగా చెప్పబడలేదు. పైనచెప్పినట్లు నన్నయగారి యనువాదము యథామాతృకము కాదు.వ్యాసభారతమున వనపర్వములో కర్ణోత్పత్తి వృత్తాంతమిట్లు కలదు.

తతో గర్భస్సమభవత్పృథాయాః పృథివీపతే।
శుక్లే దశోత్తరే పక్షే తారాపతి రివాంబరే ॥

-మహా. భా .తత్త్వ. పు. 99

వ్యాఖ్యానము :- చైత్రాది దశోత్తరే మాఘే శుక్లపక్షే ప్రతిపది చంద్ర ఇవ కర్ణ ఉద్భూత ఇత్యర్థః మాఘశుక్లప్రతిపది కర్ణనిషేకజన్మ ఇత్యర్థః భారత సారే :-

శ్లో ॥ సద్యోగర్భధరా కుంతీ కర్ణం ప్రాసూత తం సుతం.

అనగా చైత్రము మొదలుకొని పదకొండవది యగు మాఘమాసమున శుక్లపక్షమునందు పాడ్యమిరోజున చంద్రునివలె కర్ణుడు ఉద్భవించెను. అనగా మాఘ శుక్ల ప్రతిపత్తునందు కర్ణునియొక్క నిషేకజన్మ కుంతీసూర్యుల సమాగమము గర్భోత్పత్తియని నీలకంఠీయవ్యాఖ్య. కుంతి వెంటనే గర్భమును ధరించి ప్రసవ కాలమున కర్ణుని కనెనని భారతసారమున కలదు.

"సా బాంధవభయాద్బాలా గర్భం తం వినిగూహతీ
ధారయామాస సుశ్రోణీ న చైనాం బుబుధే జనః

న హి తాం వేద నార్యన్యా కాచి ద్ధాత్రేయికామృతే
కన్యాపురగతాం బాలాం నిపుణాం పరిరక్షణే
తతః కాలేన సా గర్భం సుషువే వరవర్ణినీ
కన్యైవ తస్య దేవస్య ప్రసాదాదమరప్రభమ్" మ.భా. తత్త్వ పు .99

మహాభారతము ఆశ్రమవాసపర్వమునందును కర్ణుని జన్మవృత్తాంతము కలదు. ఈ వృత్తాంతము వ్యాసమహర్షితో కుంతీదేవి తన బాల్యమున జరిగిన నీ వృత్తాంతమును విన్నవించి తాను చేసినది పాపమో పుణ్యమో తన్ను పీడించుచున్నదని చెప్పకొన్న సందర్భములోనిది.

అథ హర్మ్యతలస్థాఽహం రవిముద్యంతమీక్షతీ
సంస్మృత్య తదృషేర్వాక్యం స్పృహయన్తీ దివాకరమ్
స్థితాఽహం బాలభావేన తత్ర దోషమబుధ్యతీ
అథ దేవస్సహస్రాంశు ర్మత్సమీపగతోఽ భవత్
ద్విధా కృత్వాఽత్మనో దేహం భూమౌ చ గగనేఽ పి చ
తతాప లోకానేకేన ద్వితీయే నాగమత్స మామ్
స మా మువాచ వేపన్తీం వరం మత్తో వృణీష్వ హ
గమ్యతామితి తం చాహం ప్రణమ్య. శిరసాఽవదమ్
స మామువాచ తిగ్మాంశు ర్వృథాహ్వానం న మే క్షమమ్
ధక్ష్యామి త్వాం చ విప్రం చ యేన దత్తో వరస్తవ
తమహం రక్షతీ విప్రం శాపాదనపకారిణమ్
పుత్రో మే త్వత్సమో దేవ భవేదితి తతోఽబ్రువమ్
తతో మాం తేజసా విశ్వం మోహయిత్వా చ భానుమాన్
ఉవాచ భవితా పుత్రస్తవే త్యభ్యగమ ద్దివమ్

తతోఽ హ మన్తర్భవనే పితుర్వృత్తాన్తరక్షిణీ
గూఢోత్పన్నం సుతం బాలం జలే కర్ణమవాసృజమ్.

-మ. భా. ఆశ్రమ - 30 అ

దివాకరుడు కుంతియాహ్వానమున ప్రత్యక్షమయి వృధగా తన్నాహ్వానించరాదని చెప్పెను. ఆమె అంగీకరించనిచో మంత్రము ననుగ్రహించిన మహర్షిని ఆమె తల్లిదండ్రులను శపింతుననియు, తన్ను నిరాకరించుటను ఇంద్రాది దేవతలు దివాకరుని పరిహసించుచున్నారని, కుంతికి దివ్యదృష్టిని ప్రసాదించి వారలనామెకు చూపెను. తుదకామె కన్యాత్వంబు దూషితముకాకుండ వరంబిచ్చి ఆమెకు గర్భాధానముసేసి.

తే॥ నీకు (గన్యాత్వవికలత గాకయుండ
వరము నిచ్చితి ననుచు దివమున కరిగె
జనకముఖబంధు చిత్తవంచనము నడపి
గూఢ మందిరాంతరమున (గొడుకు(గంటి

- ఆ.మ.భా. ఆశ్రమ -ద్వితీయా 103 ప

అని కుంతి వ్యాసమహర్షితో స్వయముగానే చెప్పెను. కనుక కర్ణుడు సద్యోగర్భమున జనించె నను మాట మిథ్య, అంత వ్యాసమహర్షి కుంతీదేవి బాల్యచేష్ట పాపముకాదు, దూషితము కాదని సహేతుకముగా సప్రమాణముగా నిరూపించెను.

"సాధు సర్వ మిదం భావ్య మేవ మేత ద్యదాత్థ మామ్
అపరాధశ్చ తే నాస్తి కన్యాభావం గతా హ్యసి
దేవా శ్చైశ్వర్యవన్తో వై శరీరాణ్యా విశన్తి వై
సన్తి దేవనికాయాశ్చ సంకల్పాజ్జనయన్తి యే
వాచా దృష్ట్యా తథా స్పర్శా త్సంఘర్షేణేతి పంచధా
మనుష్యధర్మో దైవేన ధర్మేణ హి న దుష్యతి
ఇతి కున్తి విజానీహి వ్యేతు తే మానసో జ్వరః.

-మహా. భా .తత్త్వ. పు. 182-183

వ్యాసభగవాముని సమాధానము సుస్పష్టముగా సప్రమాణముగా నున్నది. నీవెట్లు చెప్పితివో అట్లది జరుగవలసిన విధి యైయున్నది. నీకు సుతుడు సూర్యాంశమున గూఢముగా పుట్టి దూరమైపోయి దుర్యోధనునిజేరి యుద్ధహేతువు గావలసిన విధి యట్లున్నదని భావము. నీ కపరాధములేదు. నీవు కన్యకవై కదా అప్పుడుంటివి ! అణిమాది సిద్ధులుగల దేవతలు శరీరముల నావేశింతురు సంకల్పముచేతను, వాక్కుచేతను, దృష్టిచేతను, రతిచేతను అయిదు విధములుగా దేవతలు సంతతి నిచ్చుచుందురు. దేవధర్మముచే మనుష్యధర్మము దూషితము కాదు. కనుక నీ తప్పులేదు. నీకు మనోవ్యధతో బనిలేదు. ఆ ఘటనయంతయు నీ కన్యాదశయందు నీ కట్టి యిచ్ఛలేనప్పుడు కదా తటస్థించినది. "అపరాధశ్చ తే నాస్తి మనుష్య ధర్మే దేవేన ధర్మేణ హి న దుష్యతి ఇతి కున్తి విజానీ హి వ్యేతు తే మానసో జ్వరః" అని నీకు పాపమేలేదని వ్యాసభగవానుడు బోధించెను.

నేటి యాధునికవిద్యావంతులు ఆర్ష సంప్రదాయముల నెరుగకపోవుటచేతను పౌరాణికకథనములందు ప్రమాణబుద్ధిలేకపోవుటచేతను సూర్యుడు శరీరధారియై వచ్చుటయు సంతానమునిచ్చుటయు నమ్మశక్యములుగావని తలంతురు. ఇందుకు శాస్త్రమర్యాద నెరుంగుట యావశ్యకము.

బ్రహ్మసూత్రములందలి దేవతాధికరణమున సూ ॥ విరోధః కర్మణీతి చేన్న అనేకప్రతిపత్తేర్దర్శనాత్. -బ్రహ్మ-- 1.3.27.

'అనేక ప్రతిపత్తేర్దర్శనాత్' అనగా ఒకదేవత ఒకేపర్యాయం అనేకశరీరములు పొందినట్లు వేదములలో చెప్పబడినది. ఒకదేవత ఒకేసమయలో అనేకదేహములను ధరించవచ్చును. అందుకు ప్రతిబంధకము ఏమీ లేదు. 'స ఏకధా భవతి, త్రిధా భవతి' అని శ్రుతియు చెప్పుచున్నది.

భాష్యమ్ :- అస్తి హ్యైశ్వర్యయోగాద్దేవతానాం జ్యోతిరాద్యా త్మభిశ్చావస్థాతుం యథేష్టం చ తం తం విగ్రహం గ్రహీతుం సామర్థ్యం తథా హి శ్రూయతే --- మే

థాతిథిం హ కాణ్వాయనమిన్ద్రో మేషో భూత్వా జహార.

"స్మర్యతే చ - ఆదిత్యః పురుషో భూత్వా కున్తీముపజగామ హ"

మ.భా. తత్త్వ.పు 188

యోగశక్తులను బట్టి సూర్యాదిదేవతలకు జ్యోతిర్మండలాదిరూపములలో నుండుటకును, ఇష్టమువచ్చిన విగ్రహము ధరించుటకును గూడ సామర్థ్యము గలదు. కనుకనే ఇంద్రుడు మేషమై మేథాతిథిని ఎత్తుకొనిపోయెనని వేదమందును, సూర్యుడు పురుషరూపమును ధరించి కుంతీదేవిని పొందెనని ఇతిహాసమందు చెప్పబడినది. మంత్రార్థవాదములందు ఇంద్రాదిదేవతల కెట్టిస్వరూపము మనకవగతమగుచున్నదో దానిని శబ్దము ప్రమాణమనువాడు, నిరాకరింపవీలులేదు. మంత్రార్థవాదమూలములైన పురాణేతిహాసములు కూడ దేవతాదివిగ్రహములను సాధింప సమర్థములగుచున్నవి. కావుననే వేదవ్యాసాదిమహర్షులు దేవతలలో ప్రత్యక్షముగా వ్యవహరించిరనునది అసంభవము కాదు. ధర్మాతిశయమునుబట్టి పూర్వులు. దేవతలతో ప్రత్యక్షముగా వ్యవహరించుట నిర్వివాదము. యోగశాస్త్రోక్తమై అణిమాదిశక్తిసంపాదకమైయున్న యోగమును సాహసమాత్రమున శంకించుట అజ్ఞానము. వేదముకూడ యోగమహిమలను ప్రతిపాదించుచున్నది. మంత్రద్రష్టలగు మహర్షులయొక్క సామర్థ్యముకూడ మనసామర్థ్యము వంటిదే యని భావించుట మౌఢ్యము. పురాణేతిహాసములు సప్రమాణములే యని విశ్వసింపకతప్పదు. కనుక కర్ణజననము వలన కుంతీదేవి కన్యాత్వము దూషితము కాలేదనుటయు నిర్వివాదమని తాత్పర్యము.



# 6. ద్రౌపది అయోనిజ

అగ్నివేశుని ఆశ్రమమున ద్రోణుడు ద్రుపదుడు సహాధ్యాయులు, విద్యాభ్యాసమయిన తరువాత ద్రుపదుడు పాంచాలరాజయ్యెను. ద్రోణుడు దారిద్ర్యబాధకోర్వజాలక పూర్వస్నేహమును పురస్కరించుకొని ద్రుపదునికడకేగి సహాయమర్థించెను. ద్రుపదుడు తాను రాజు కనుక పేదబాపడయిన ద్రోణుని మైత్రిని అధిక్షేపించి, అవమానించి పంపెను. కొంతకాలమునకు ద్రోణుడు కురుపాండవులకస్త్రవిద్యాగురువై గురుదక్షిణగా అర్జుననిచే ద్రుపదుని బంధించి తెప్పించి పరాభవించెను. ద్రుపదుడు ప్రతీకారవాంఛతో ద్రోణుని సంహరించగల కుమారుని కొరకు యజ్ఞముచేయ సమకట్టి యాజోపయాజులనాశ్రయించెను. అంత ఉపయాజులు ఆ యజ్ఞమును చేయింప సమర్థుడైన తనయన్న యాజునికడకు ద్రుపదుని పంపెను. ద్రుపదుడును సంహితాధ్యయనాదులయిన పంచమహాయజ్ఞములుచేయుచు శిలోంఛన వృత్తి భైక్షసంధారితకుటుంబభారుండై ఘోరతపోవృత్తి నున్న యాజుంగని నమస్కరించి యిట్లనియె.

క॥ మునినాథ నాకు సత్సుత
జననం బగునట్టి క్రతువు సద్విధిఁ గావిం
చినఁ గృతకృత్యుడ నగుదుం
గొను మిచ్చెద నీకు లక్షగోధేనువులన్

క॥ భారతవంశాచార్యుఁడు
భారద్వాజుండు నా కపాయము చేసెన్
ఘోరాజినతని నోర్చున
పారపరాక్రము సుపుత్త్రుఁబడయఁగ వలయున్

-ఆభా-ఆది-76-9-15

వ॥ అయ్యాజుండును యాజకత్వమున కొడంబడి నీ కోర్కికిం దగినయట్టి

కొడుకునుం గూఁతురుం బుట్టుదురోడకుండుమని యజ్ఞోపకరణద్రవ్యంబులు సమకట్టికొని యథావిధి నుపయాజుండు సహాయుండుగా సౌత్రామణియయిన కోకిలాదేవి పత్నిగా ద్రుపదునకుం బుత్త్ర కామేష్టి చేయించిన నందు మంత్రాహుతులం దృప్తుండయిన యగ్నిదేవువలన

క॥ జ్వాలాభీలాంగుఁడు కర
వాల బృహచ్చాపధరుఁడు వరవర్మకిరీ
టాలంకారుఁడు వాహ్ని య
పోలె రథారూఢుఁడొక్క పుత్త్రుఁడు పుట్టెన్

వ॥ మఱియు

తరలము॥ కులపవిత్ర సితేతరోత్పల కోమలామల వర్ణయు
త్పలసుగంధి లసన్మహోత్పలపత్రనేత్ర యరాళ కుం
తలవిభాసిని దివ్యతేజముఁ దాల్చి యొక్క కుమారిత
జ్జ్వలనకుండమునందుఁబుట్టెఁబ్రసన్నమూర్తి ముదంబుతోన్

వ॥ ఇట్లు పుట్టిన కొడుకునకుం గూఁతునకు ధృష్టద్యుమ్నుం
డును కృష్ణయు నునునామంబులాకాశవాణి జనవినుతంబుగా
నుచ్చరించె----------

ఆం. మ-భా- ఆది ప - సప్తమా 13-14-17-18-19-20-21.

ఇది శ్రీమదాంధ్రమహాభారతము ఆదిపర్వము సప్తమాశ్వాసమునందు నన్నయభట్టారకులు వక్కాణించిన ద్రౌపదీజననప్రకారము.

ఈ గాథ మూలభారతమునందలి విషయములకు వ్యత్యస్తముగానున్నది. ద్రుపదుని అభ్యర్థననాలించి యాజుడిట్లు పలికెను.

ద్రోణాత్పరిభవం ప్రాప్య ద్రుపదస్తు మహీపతిః
యాజినం చోపయాజినం చ వరయామాస ఋుత్విజౌ
ద్రోణాంతకం సుపుత్రం చ కన్యాం చై వార్జునప్రియామ్

తయోః పుంజననార్థం వై హావయమాస దీక్షితః
యాజస్తు హవనస్యాంతే దేవీ మాజ్ఞాపయత్తదా
ప్రైహి మాం రాజ్ఞి పృషతి మిథునం త్వాముపస్థితం

రాజ్ఞ్యువాచ
అవలిప్తం ముఖం బ్రహ్మన్ దివ్యాన్ గంధాన్బిభర్మి చ
సుతార్థే నోపలబ్ధాస్మి తిష్ఠ యాజ మమ ప్రియే

యాజ ఉవాచ

యాజేన శ్రపితం హవ్య ముపయాజాభిమంత్రితం
కథం కామం న సందధ్యా త్సాష్ఠ త్వం విప్రైహి తిష్ఠ వా

మ.భా.సా.ఆది. 312-314

ద్రుపదుడు ద్రోణునివలన పరాభవమును పొంది యాజోపయాజు లను ఋత్విక్కులను వేడుకొనెను. ద్రోణుని చంపునట్టి ఒకపుత్త్రుని, అర్జునునికి భార్య కాదగు నొకకన్యారత్నమును నా కనుగ్రహించుడని ద్రుపదుడు కోరుకొనెను. వారు పుత్రుడు పుట్టుటకై ద్రుపదునిచే ఒక యజ్ఞమును చేయించిరి . ఈ యజ్ఞమును పుత్రకామేష్టి యని నన్నయగారు వ్రాసిరి కాని మూలభారతమున పుత్రకామేష్టి యని చెప్పబడలేదు.

యాజులు హోమాంతమున మహారాణినుద్దేశించి " ఓ అమ్మాయీ ! నా యొద్దకు రమ్ము. నీకు ఒక పుత్రుడు, ఒక పుత్రికయు కలుగనున్నారు. ఈ హవిస్సును గ్రహించుము" అనెను. ఆ రాణి "ఓ బ్రాహ్మణుడా ! నా ముఖము మలినమైయున్నది. నీ శరీరము సుగంధముతో నిండియున్నది. ఓ యాజా! శుచినైన తరువాత రాగలను. కాన నాయందభిమానముచే అంతవరకాగుము." అని కబురంపెను. అందుకు యాజులు " ఓ రాణీ ! మా కోరిక యెట్లు నెరవేరకుండును ? నీవు వచ్చినను సరియే. లేక దూరముగానున్నను సరియే మా మంత్రసామర్థ్యముచే పుత్రికాపుత్రులు పుట్టగలరు" అని యీ విధముగా పలికి యాజునిచే సంస్కరింపబడిన హవిస్సును అగ్నియందు హోమముచేయగా అగ్నినుండి దేవతలతో సమానుడైన కుమారుడును, సాక్షాత్తు

స్వర్గలక్ష్మియే మానుషదేహమును ధరించి యవతరించినట్లు ద్రౌపదియను కుమార్తెయు నవతరించిరి.

"కృష్ణేత్యేవాబ్రువన్ కృష్ణాం కృష్ణా భూతా హి వర్ణత: "

ఈమె నల్లనివర్ణము కలది యగుటచే కృష్ణ యయినది.

ఈ సందర్భమున నీలకంఠీయవాఖ్య నరయునది -

అవలిప్తం = దూషితం। లాలాదిసహితత్వాదితి భావ:। గంధాన్ = అంగరాగాది జాన్। అస్నాతాఽస్మీతి భావ: ॥

శ్రు ॥ యా దతో ధావతే తస్యై శ్యావదన్
యా స్నాతి తస్యా అప్సు మారుక ఇత్యుక్త్యా ॥ అపి చ

శ్రు॥ తిస్రో రాత్రిర్వ్రతం చరేదితి
విహితాదౌ అస్పృశ్య ధర్మావేతా॥
సుతార్థేనోపలబ్ధాస్మి - ఉపలబ్ధుం -స్ప్రష్టుం యోగ్యా నాస్మి॥

శ్రు ॥ తస్మాన్మలవద్వాససా న సంవదేతేతి తయా సహ
సంవాదస్యాపి నిషిద్ధత్వాత్. అతో హేతో: హే యాజ!
మమ ప్రియే సుతార్థే - సుతప్రయోజనే తిష్ఠ।
శుచికాలం ప్రతీక్షస్వేత్యర్థ:" -మ.భా.సా.పు.314

(భారతసారోద్ధారమునుండి గ్రహించబడినది)

అనగా - అవలిప్తం =ముఖము దూషితమైనది. చొంగతో గూడుకొని యండుటచే నని భావము. గంధాన్=అంగరాగాది గంధములను, స్నానము చేయలేదని భావము. వెలుపలయుండి ఏ స్త్రీ దంతములను తోముకొనునో ఆమెకు పిప్పిపళ్ళుగల పుత్రుడు పుట్టును. ఎవతె స్నానము చేయునో ఆమెకు నీటిగండము కలవాడు పుట్టును. అని శ్రుతి చెప్పుచున్నది. మరియు మూడు రాత్రులు వ్రతము నాచరించవలయును. ఎవరిని తాకకూడదు. ఇది ముఖ్యధర్మము.

సుతార్థేనోపలబ్ధాస్మి = తాకుటకు యోగ్యమయిన దానిని గాను. కావున వెలుపల ఉన్నస్త్రీతో మాట్లాడకూడదు అని శ్రుతి చెప్పుచున్నది. మాట్లాడుటకూడ నిషిద్ధ మగుటచే హే యాజ ! నాకు ప్రియమైన కుమారుడనే ప్రయోజనమునందు-తిష్ఠ- శుచికాలము కొరకు నిరీక్షించుము - అని యర్థము. అందుకు యాజుల సమాధానమిట్లు వ్యాఖ్యానించ బడినది. : కామం కథం న సందధ్యాత్,

ఆవయోస్సామర్థ్యాత్ మిథునం ఉత్పాదయేదిత్యర్థ:।

విప్రైహి - దూరం వాగచ్ఛ . ప్రయోగవిధిస్తు న విలంబం సహత ఇత్యర్థ:.

అనగా కామం =కోరిక కథం న సందధ్యాం = మా యొక్క సామర్థ్యమువలన పుత్రికాపుత్రులను పుట్టించగలము. నీవు దూరముగానున్నను సరియే. నీ కొరకు ఇచ్చట యజ్ఞకలాపము ఆలస్యము చేయదగదు - అని భావము.

ద్రుపదుని భార్య నేను రజస్వలనై అస్పృశ్యురాలనై యుంటిని, స్నానపర్యంతము నిరీక్షింపవలసిన దని వార్తపంపినను యాజులు నిరాకరించి నీవు వచ్చినను రాకున్నను యజ్ఞఫలమాగబోదని, నామంత్రశక్తిచే నీవు రాకున్నను అగ్నియందు హవిస్సులను నియోగించి శుక్రశోణితసంబంధములేకయే మా సామర్థ్యముచే స్త్రీ పురుష యుగ్మము నుద్భవింపగలదని అట్లే చేసి ధృష్టద్యుమ్న ద్రౌపదుల నావిర్భవింపజేసెను.

శుక్రశోణితసంయోగము లేక జీవులు జన్మించుట అసంభవమనియు, ఇందుకు శాస్త్రములేవియు నంగీకరింపవనియు ఆధునికవిమర్శకులు సర్వశాస్త్రకోవిదులవలె నాక్షేపించుచున్నారు. దీనికి సమాధానమది.

"తత్ర శరీరం ద్వివిధం యోనిజ మయోనిజం చ "

-వైశేషికదర్శనము. 174 సూ.

భాష్యమ్ :- తత్రాయోనిజ మనపేక్ష్య శుక్రశోణితం దేవర్షీణాం శరీరం ధర్మవిశేషసహితేభ్యోऽణుభ్యో జాయతే , క్షుద్రజంతూనాం యాతనాశరీరాణ్యధర్మవిశేష సహితేభ్యోऽణుభ్యో జాయన్తే సూత్రోపస్కార: :- అయోనిజం చ దేవానా మృషీణాం చ శ్రూయతే హి బ్రహ్మణో మానసా మన్వాదయ ఇతి । కారణమన్తరేణ కథంకారమితి చేత్ - యోనేశ్శరీరత్వావచ్ఛేదేనాకారణత్వాత్ ఊష్మజ కృమి మశకాది శరీరే వ్యభిచారాత్".

"స్తన్య యోనిజా:" -వైశేషికదర్శనము. 179 సూ.

-మ.భా. తత్త్వ.పు. 89

ఇచ్చట యోనిజములు అయోనిజములు అని శరీరము ద్వివిధమనియు, శుక్రశోణిత సంబంధములేకయే ధర్మవిశేషముచే కలుగునట్టి దయోనిజమనియు, అట్టిది దేవతలయొక్కయు ఋషులయొక్కయు శరీరమనియు, అట్టి యయోనిజులుండిరనియు చెప్పబడినది. జరాయుజ అండజ, స్వేదజ ఉద్భిజ్జములన బడు ప్రాణులలో శుక్రశోణిత సంబంధము తప్పక కలదని చెప్పజాలము. స్వేదజములనబడు క్రిమికీటకమశకాదులలో శుక్రశోణితసంబంధము లేదు. అయోనిజగ పుట్టుట సంభవమే.

వైశేషిక దర్శన 174 వ సూత్రభాష్యమున నిట్లుకలదు.

శరీరములు రెండు రకములు : యోనిజములు, అయోనిజములు. అందులో నయోనిజమయిన శరీరములు శుక్రశోణితసంబంధమును కోరక, దేవతలయొక్కయు

ఋషులయొక్కయు దేహములు శరీరధర్మములుగల అణువులనుండి పుట్టుచున్నవి. దేవతలయొక్కయు ఋషులయొక్కయు దేహములు అయోనిజములనియు వారికి సంస్కారములు వ్యర్థములనియు శ్రుతియందు చెప్పబడినది. బ్రహ్మనుండి మన్వాదిమహర్షులు మానసముగ బుట్టిరనుట ప్రసిద్ధము.

"అత: పరం తు మైత్రేయ ప్రజా మైధున సంభవా ఇతి విష్ణుపురాణే ఉక్తత్వాత్"

కనుక మన్వాదులసృష్టి యంతయు స్త్రీ పురుషసంబంధమూలమున బుట్టినది. గాదని విష్ణుపురాణము చెప్పుచున్నది. ప్రతిశరీరమునకును శుక్రశోణితసంబంధమ కారణముకాదు.

"దర్శనాచ్చ" బ్ర. సూ. 3-2-20

లోకంలో కనబడే ప్రతిజీవికి పంచాహుతి. సంఖ్యానియమం లేదు. జరాయుజము, అండజము, స్వేదజము, ఉద్భిజ్జము అని ప్రాణులు నాలుగు రకములుగ నున్నవి. వీనితో స్వేదజములు, ఉద్భిజ్జములు స్త్రీ పురుషసంయోగము లేకుండనే పుట్టుచున్నవి. కాబట్టి పంచాహుతి సంఖ్యానియమం సర్వప్రాణులకు ఆదరణీయముకాదు.

"తృతీయశబ్దావరోధ స్సంశోకజస్య" -బ్ర. సూ 3-2-21

స్వేదజమును మూడవదైన ఉద్భిజ్జశబ్దముచేతనే గ్రహించవలెను. ఉద్భిజ్జము భూమిని ఛేదించుకొని పుట్టును. స్వేదజము జలమును ఛేదించుకొని పుట్టును. ఛేదించుకొని పుట్టడమనే సామాన్యధర్మముచేత ఉద్భిజ్జశబ్దముచేతనే స్వేదజము కూడా పేర్కొనబడుచున్నది. ఈ రెండింటినీ కలిపే శ్రుతిలో ఉద్భిజ్జమని పేర్కొనబడినది. అటులనే మిగిలిన సందర్భములందు పంచాహుతి సంఖ్యానియమము లేకయే సృష్టిజరుపవచ్చునని భావము. అయిదవ ఆహుతి యందు ఉదకము పురుష వాక్కుగలవగును.

**పంచమాసమాహుతౌ వాప: పురుషవచసో భవంతి ఇత్యే తచ్ఛ్రుత్యర్థ ప్రతిపాదనసందర్భే**

**బ్రహ్మసూత్రే చ తద్భాష్యే చైవ ముపపాదితేతి॥**

"న తృతీయోపలబ్ధే:" - బ్ర సూ 3-1-18

మూడవదైన మార్గములో పోయేవారివిషయములో దేహమును పొందుటకు సంఖ్యానియమములేదు. నూతనదేహము లభించుటకు అయిదు ఆహుతులను పూర్తి చేయుటకు అందరూ చంద్రలోకమునకు పోవలసిఉంటుందనే నియమము, ఆహుతుల అవసరములేకుండగనే పుడుతూ చస్తూ ఉండే జీవులకు వర్తించదు. 'పంచమ్యా

మాహుతావాపః పురుషవచసో భవన్తి' అన్నచోట పురుషశబ్దముచేత మానవశరీరమునకు హేతువుగా ఆహుతిసంఖ్య చెప్పబడినది. పశుపక్ష్యాదిశరీరహేతువుగా ఆహుతిసంఖ్య చెప్పబడలేదు.

అందుచేత ఆరోహణావరోహణాదులుకలవారికి పంచమాహుతి యందు దేహారంభము కలుగుతుంది. మూడవస్థానములోనివారికి ఈ ఆహుతి ంఖ్యానియమము లేకుండానే దేహారంభము కలుగుతుంది.

"స్మర్యతేऽపి చ లోకే " - బ్ర సూ 3-1-19

అనగా పురాణములలో ద్రోణుడు , ద్రౌపది, ధృష్టద్యుమ్నుడు, సీత మొదలైన వారయోనిజులు అయిదవ ఆహుతి లేకుండానే (స్త్రీపురుషసంయోగం లేకుండానే) అయోనిజులైనట్లు ప్రసిద్ధము.

కాబట్టి పంచమాహుతి సంఖ్యానియమం అంతటా లేదని భావము.

సారాంశమేమన ఏ పుణ్యాత్ములు చంద్రలోకమునకు వెళ్ళి అక్కడ భోగము లనుభవించి మరల జన్మింతురో వారికి మాత్రమే ఆ ద్యులోకము, దానినుండి పర్జన్యుడు, ఆపై వర్షధారలద్వారా భూమిలోని సస్యములు, ఆపైని అన్నము ద్వారా పురుషుడు అతనినుండి శుక్రముద్వారా స్త్రీ అను అయిదు స్థానములందు యథాక్రమముగా ప్రవేశము కలుగును గాని, అన్యులకు కలుగు జన్మములో నా అయిదు స్థానములలో సంబంధమపేక్షితము కాదు. ఆశ్రుతిలో అయిదవ స్థానముయిన స్త్రీ యందు దేహోత్పత్తి చెప్పబడినదేగాని నాలుగు, మూడు మొదలగు నితర స్థానములలో దేహోత్పత్తి కలుగదని చెప్పబడలేదు. మరియు ద్రోణ ధృష్టద్యుమ్నాదులయొక్కయు సీతాద్రౌపదీప్రభృతులయొక్కయు అయోనిజత్వము లోకప్రసిద్ధమై యున్నది. ద్రోణాదులకు అయిదవ స్థానమమైన స్త్రీ యందు ప్రవేశము లేకయే దేహోత్పత్తి యైనది. ధృష్టద్యుమ్నాదులకు స్త్రీపురుషరూపములయిన అయిదునాలుగు స్థానములతో నిమిత్తములేకయే దేహోత్పత్తి యయినది. అట్లే అన్యులవిషయమునకూడ నగును నెమలికి, బలాకపక్షికి రేతస్సేకము లేకయే గర్భధారణమగునని లోకప్రసిద్ధి. ఈ యంశమే నీలకంఠీయమున నిట్లు చెప్పబడినది.

"అగ్నీన్ పంచక్రమా త్ప్రాప్య హవ్యమేతి మనుష్యతామ్
అగ్నయస్త్వగ్నిరర్కః క్ష్మా పురుషో యోషిదిత్యపి
అగ్నౌ ప్రాస్తాహుతి స్సమ్యగాదిత్యముపతిష్ఠతే
ఆదిత్యాజ్జాయతే వృష్టి ర్వృష్టే రన్నం తతః ప్రజాః

ద్రోణో వహ్నిచతుష్కోత్థో యోషిదగ్నేరభావత:
అగ్నిత్రయోత్థితా సీతా భూత్వాపిత్రోరభావత:
క్షిప్తమాత్రం హవిర్వహ్నౌ మిథునత్వముపాగతమ్
ఏకాగ్నిజావత: పుత్రౌ ద్రుపదస్య సురాధికౌ !

-మహా భారతతత్త్వకథనమునుండి. పు. 900-901

సారాంశమేమనగా నీ సృష్టిక్రమ విషయమున ఏ జీవులకు స్వర్గాదిలోకములకు, వెళ్ళుట మరల భూలోకమునందవతరించుట సంభవించుచున్నదో వారలకు మాత్రమే అయిదవ ఆహుతియందు దేహము ఉద్భవించుచున్నది అయిదాహుతులనగా ద్యు-పర్జన్య -పృథివీ -పురుష- యోషిత్తులు. ఈ జీవుడు స్వకృత పుణ్యాపాపపరిపాక విశేషమున స్వర్గనరకాదిలోకముల నివసించి ఆ ప్రారబ్ధము పూర్తికాగా భూలోకమున కవతరించుటలో మొదట ఆకాశము, అందుండి మేఘమును, మేఘమునుండి వర్షద్వారమున భూమిని, భూమినుండి అన్నముద్వారా పురుషుని, పురుషుని శుక్రము ద్వారా స్త్రీని ప్రవేశించి, అచ్చటనుండి అభివృద్ధినొంది అభివ్యక్తరూపములో ఆవిర్భవించును. ఇదియే పంచాహుతిక్రమము.

అనేకమంది జీవులు వారివారి ప్రారబ్ధము ననుసరించి మధ్యయందే తిరుగుచు అభివ్యక్తరూపము నొందకయే సుడిగుండములో పడిన పురుగువలె దరి చేరకపోవచ్చును. ఇదంతయు జీవుల కర్మానుసారమున భగవదధీనమైన విషయము. అందు జీవుని ప్రయోజకత్వమేమియు లేదు. పునర్జన్మమును పొందుటలో ఎంతకాలవిలంబము శ్రమయు కలదో తెలిసికొని జన్మించిన జీవి తరణోపాయము నాశ్రయించి ముక్తి నొందకుండిన కలుగు అనర్థమును బోధించుటకే ఇది వేదాంత శాస్త్రమున చెప్పబడియున్నది. ఆరోహణ అవరోహణ క్రమములున్నవారికి పంచాహుతిక్రమము తప్పదు. ఆరోహణ అవరోహణములు లేని ఇతరులకు ఆహుతి సంఖ్యానియమము లేకయే మరియొక భూతముతో సంబంధించిన ఉదకముల చేతనే దేహము ఆరంభింపబడును.

మనుష్యులు నాలుగు రకములు.

1. జ్ఞానులు. వారే జీవన్ముక్తులు

" న తస్య ప్రాణాహ్యుత్క్రామన్తి " వీరి ప్రాణము లెక్కడికిపోవు.

2. నిష్కామకర్మానుష్ఠాతలు దేవయానమార్గము.

"బ్రహ్మణా సహముక్తి" వీరు తిరిగి జన్మకురారు.

3. కామ్యకర్మాను ష్ఠాతలు. (పితృయానమార్గము)

ద్యు-పర్జన్య - పృథివీ -పురుష -యోషిత్తులను అయిదు మార్గములద్వారా తిరిగి జన్మకు వత్తురు. ఇదియే పంచాగ్నిహోత్రవిద్య.

4. నిషిద్ధ కర్మానుష్ఠాతలు

దేవయానమార్గము పితృయానమార్గము కాకుండా జననమరణావృత్తి రూపమయిన మూడవ మార్గము. అనగా ఇక్కడనే పుట్టుచు చచ్చుచు నుందురు. .... ఈ విషయము ఛాందోగ్యోపనిషత్తులో పంచాగ్నివిద్యలో చెప్పబడినది.

స్మర్యతేऽ పి చ లోకే - బ్ర సూ 3-1-19

అను బ్రహ్మసూత్ర భాష్యములో శంకరులవారిట్లు సెలవిచ్చిరి.

"అపి చ స్మర్యతే లోకే ద్రోణ ధృష్టద్యుమ్న ప్రభృతీనాం సీతా ద్రౌపదీ ప్రభృతీనాం చ అయోనిజత్వం తత్ర ద్రోణాదీనాం యోషిద్విషయకాహుతిర్నాస్తి . ధృష్టద్యుమ్నాదీనాం తు యోషిత్పురుషవిషయే ద్వే అప్యాహుతీ న స్తః

బలాకాऽప్యంతరేణైవ రేతస్సేకం గర్భం ధత్త ఇతి లోకే రూఢిః"

- మ.బా. తత్త్వ పు 899

ధృష్టద్యుమ్నాదులకు పురుషస్త్రీరూపమయిన రెండాహుతులు లేవు. మిగతా మూడాహుతులు కలవు. కావున సృష్టికంతకు అయిదాహుతులుండవలెనను నియమము లేదు. పంచాహుతులనుమాట అధికముగా సృష్టి అట్లు జరుగునని చెప్పబడినదేగాని పంచాహుతి లేక సృష్టి జరుగదనుతాత్పర్యముకలది కాదు.

మరియు స్కాందపురాణమున అఘటనఘటనాపటీయసియగు మాయ యీశ్వరునివశమై యున్నది. పూర్వము యూపకేతువనురాజచంద్రుని శుక్రము నీటిలో పడినది. ఆ శుక్రముతోగూడిన నీటిని త్రాగి యొక వేశ్యాస్త్రీ గర్భము ధరించినది. అట్లే విభండకమహర్షియొక్క శుక్రముతోగూడిన ఉదకమును త్రాగి ఒక ఆడులేడి గర్భమును ధరించి ఋష్యశృంగుని కనెను. సురాష్ట్రుడను రాజుయొక్క చేతిని స్పృశించి ఒకానొక ఆడులేడి ఆక్షణముననే గర్భవతియై ఒక తాపసోత్తముని కనెను. ఒక గేదె యొక్క గర్భమునుండి మహిషాసురుడు పుట్టెను. మునిశాపమున శ్రీ కృష్ణపుత్రుడగు సాంబుని గర్భమునుండి ఇనుపరోకలి పుట్టెను. యవనాశ్వునికి గర్భము మునీశర్వరులయొక్కమంత్ర ప్రభావమున కలిగెను.

ఇట్లెన్నియో నిదర్శనములు వేదపురాణములందు కనబడుచున్నది. శుక్రశోణితసంయోగములేక జీవులుద్భవించుట అసంభవమని, ద్రౌపది యయోనిజ యనుమాట విశ్వసనీయముకాదని శాస్త్రవిరుద్ధమని అధిక్షేపించు బుద్ధిమంతులను చూచి జాలిపడుట తప్ప చేయగలిగినదిలేదు.

• • • • • •

# 7. ద్రౌపదీ వివాహము శాస్త్రసమ్మతమా?

మహాభారతము కేవలము వేదోక్త ధర్మశాస్త్ర సమ్మతమనుటకు వీలులేదు. అందనేక ధర్మేతర సాంప్రదాయములున్నవి. ముఖ్యముగా ద్రౌపదికి అయిదుగురు భర్తలుండుట సర్వశాస్త్ర విరుద్ధము. గౌతమ బ్రాహ్మణమునందును, ఐతరేయ శ్రుతి యందును నీవిధముగా గలదు.

శ్రు॥ "తస్మాత్ ఏకస్య బహుభ్యో జాయా న భవంతి
నైకస్యా బహవః పతయః"

ఈ విధముగనే ధర్మశాస్త్రములందును కలదు. మరల నిట్టి ద్రౌపదీదేవి కులటగాక సుప్రసిద్ధ స్మరణీయురాలగుటెట్లని గొప్ప సందేహము. దీనికి సమాధానము తెలియవలెనన్న ద్రౌపది పూర్వజన్మ వృత్తాంతము తెలియవలెను. ద్రౌపది సామాన్య కన్య కాదు. త్రేతాయుగమున రావణ సంహారార్థము కల్పింపబడిన మాయాశక్తి. రావణ సంహారానంతర మా మాయాశక్తి శ్రీరామునిచే విడువబడి ఒక మహామునికి నాలాయనియై జన్మించి అష్టసిద్ధులు కలిగిన మౌద్గల్యుడను ఒక మహామునిని పెండ్లి యాడెను. ఆ మహర్షి యామె పాతివ్రత్యమును పరీక్షింపనెంచి కుష్ఠువ్యాధి పీడితుని వలెను, మహా కోపిష్ఠివలెను చరించుచు నీమెచే నుపచరింపబడుచుండెను. ఒకనాడు అతని వ్రేలు ఊడి భోజనమునందు పడెను. నాలాయనియు ఏమాత్రము అసహ్యించు కొనక, ఆ ఊడిన వ్రేలును తీసి ప్రక్కనునుంచి భుక్తశేషమును భుజించెను. ఆమె పాతివ్రత్యమునకు ఆ ముని సంతసించి ఆమెను ఏకరూపముతోను, అయిదు రూపములతోను రమించి సంతోషపెట్టెను. ఇట్లుండ కొంతకాలమునకాతడు బ్రహ్మనిష్ఠాసక్తుడై పోవుచుండగా, వారించి తన మనోరథమింకను తీరలేదని ఆ మునిని నిలువరింప నాతడు కోపించి "ఓ నాలాయనీ ! నీవు భూలోకమున ద్రుపదుని యజ్ఞకుండమున జన్మింతువు. అప్పుడు నీకైదుగురు భర్తలు కలుగగలరని యానతిచ్చి వెడలిపోయెను. ఆ నాలాయని పరమేశ్వరునిగూర్చి తీవ్రమయిన తపస్సు చేసెను. ఆమె తపమునకు మెచ్చి పరమేశ్వరుడు సాక్షాత్కరించి 'నీవు పై జన్మములో ఉత్తమ స్త్రీవై జన్మింతువు. నీకు మహేంద్ర సమాన స్వరూపులును, మహేంద్ర విక్రములు, లోక విఖ్యాతులునగు నైదుగురు భర్తలు కలుగుదు'రని వరమిచ్చెను. అప్పుడామె యీశ్వరునితో "నేనేకభర్తనే కోరియుండగా నైదుగురు భర్తలంటివేమి? ఒక స్త్రీకొక భర్తయే కదా! బహు భర్తలుండరాదే!" అనగా పరమేశ్వరుడు - "నీ కోరికను నాకు వెల్లడించుటలో 'పతిం దేహి - పతిం దేహి' అని అయిదుసార్లు నీవనుటచే నీకట్టి

వరమీయవలసి వచ్చినది" అనెను., అప్పుడు ఆ నాలాయని "స్త్రీకొక్కడే పతి యగుట ధర్మమనియు, బహు పత్నులు కలిగియుండుట పురుషులకు ధర్మమనియు మునులచే పూర్వము నిర్ణయింపబడినది. స్త్రీకొక్కడే పతియగుట లోక ప్రసిద్ధము. ఆపత్కాల మందు నియోగవిధినిబట్టి భర్తకంటె నన్యుడైన పురుషుడు చెప్పబడెను. తృతీయ పురుష సంబంధము ప్రాయశ్చిత్తావహము. చతుర్థ పురుష సంబంధమున పతితురాలగును. పంచ పురుష సంబంధముచే బన్ధకియగును. ధర్మమార్గ మిట్లుండుటచే నేను బహు పురుషులను గోరజాలను. లోక విరుద్ధమయిన ఈ దోషము నుండి నాకు విముక్తి యెట్లని ప్రశ్నించెను. ఒకవేళ నాకు పంచపతిత్వము తప్పని యెడల -

"యది మే పతయః పంచ వరమిచ్ఛామి యాచితుమ్
కౌమారం చ భవే త్సర్వేస్సంగమే సంగమే చ మే."

-మహా. భా .తత్త్వ పు. 856

అంతట ద్రౌపది నాకా పంచపతిత్వము తప్పనియెడల నాయాచన నాలకించి యొక వరమనుగ్రహింపుము. ఏకైక పతి సాంగత్యమునందును నాకు కన్యాత్వ సిద్ధి కలుగుచుండునట్లు వరమిమ్ము. అంతట పరమేశ్వరుడు "పంచభిః ప్రాప్య కౌమారం మహాభాగా భవిష్యసి" అనెను. అనగా నీవు జన్మాంతరమందు రూపసౌభాగ్య గుణాన్వితురాలవై యేకైక పతి సాంగత్యముతో కన్యాత్వమునే వహించుచు పంచపతులతో పూజ్యురాలవై యుందువని యనుగ్రహించెను.

ఆవిధముగా ద్రౌపది ద్రుపదుని ఇంట యజ్ఞకుండమున జన్మించెను. ఆమెకు యౌవనము రాగా నాతడు స్వయంవరమును చాటించెను. ఒక మత్స్య యంత్రమును నిర్మించి దానిని ఛేదించినవానిని తన కుమార్తె పరిణయమాడునని ప్రకటించెను. పాండవులు స్వయంవరమున పాల్గొనదలచి పాంచాలదేశమును ప్రవేశించి ద్రుపదుని యాస్థానమున స్వయంవర మందిరమును బ్రాహ్మణవేషములతో ప్రవేశించిరి. ధృష్టద్యుమ్నుడు స్వయంవర సభలో సభాసదులైన రాజకుమారుల నుద్దేశించి :-

భూపతులారా! ఇది ధనుస్సు. ఇది లక్ష్యము. ఇవి బాణములు. ఈ అయిదు బాణములొక్కసారి ప్రయోగించి చల యంత్రచ్ఛిద్రము నుండి లక్ష్యమును గొట్టవలయును. కులమునకుగాని, బలమునకుగాని, రూపమునకుగాని తీసిపోనట్టి వాడెవ్వడీ పని చేయునో అతనికి నా సోదరి భార్యయగును.

"కులేన రూపేణ బలేన" అనియనెను. ఆపై క్షత్రియులందరు క్రమముగా లేచి యత్నించియు ధనుస్సునే ఎక్కుపెట్టలేకపోయిరి. కర్ణుడు లేచి ఎక్కుపెట్టుట

ఉచ్ఛరించువాని పవిత్రతావిశేషమును బట్టి మంత్రము నందొకానొక శక్తి యావిర్భవించునట్లును, నకులదన్త సంబంధమునుబట్టి యోషధులందొ కానొక శక్తి యావిర్భవించునట్లును, పుణ్యాత్ముల సంపర్కమును బట్టి ఆయా స్థలములయందు ఒకానొక శక్తి యావిర్భవించునట్లును, ధర్మాత్ముల అంతఃకరణ ప్రవృత్తుల యందును, ఆచరణయందును ధర్మ్యతయే యుండుననియు తన్త్రవార్తికము, న్యాయసుధయు చెప్పుచున్నవి. అయినను ద్రుపదునకు సందేహము తీరలేదు. ఒక స్త్రీకి పెక్కండ్రు పతులు కలుగుట అధర్మమని యాతడు తలచెను. అందుకు ధర్మజుడింకను ఇట్లు చెప్పెను.

సూక్ష్మో ధర్మో మహారాజ నాఽస్య విద్మో వయం గతిమ్
పూర్వేషా మానుపూర్వ్యేణ యాతం వర్మాఽనుయామహే
న మే వాగనృతం ప్రాహ నాఽధర్మే ధీయతే మతిః
ఏవం చైవ వదత్యంబా మమ చైత న్మనోగతమ్"

- మ.భా. తత్త్వ పు . 934

టీక : సూక్ష్మః "నైకస్యై బహవస్సహ పతయః" ఇతిశ్రుత్యా సహేతి యుగపద్బహు పతిత్వనిషేధో విహితో నతు సమయ భేదేన, తతశ్చాఽనిషిద్ధం, మాత్రా సమేత్య భుజ్యే త్యాజ్ఞప్తం చ నలంఘనీయమ్. పిత్రో రాజ్ఞయా నిషిద్ధమపి కర్తవ్యం, పరశురామ కృత మాతృవధవత్, కిముతానిషిద్ధమితిభావః. పూర్వేషాం ప్రచేతః ప్రభృతీనాం, త్రైర్యాతీం వర్త్మ బహూనా మేకపత్నీత్వ మనుయామహే, తచ్చానుపూర్వ్యేణైవ న త్వక్రమేణ."

"మహారాజా! ఇది స్థూలదృష్టికి గోచరింపని సూక్ష్మధర్మము. దీని గతిని మనము గ్రహింపజాలము. వేదములో "నైకస్యై బహవస్సహ పతయః తస్మాన్నైకా ద్వౌ పతీ విన్దతే' ' అనునపుడు 'సహపతయః' అను శబ్దమునుబట్టి ఏకకాలమందనేక పతిత్వ నిషేధమేకాని సమయభేదమున నిషేధము కాజాలదు. కనుక నిషిద్ధమనుటకు వీలులేదు. కలిసి యనుభవింపుడను మా తల్లి యాజ్ఞ అనుల్లంఘనీయము. నాది యనృతవాక్కు కాదు. నాది యధర్మబుద్ధి కాదు. బహు పురుషుల కేకపత్నీత్వమను పద్ధతి పూర్వులగు ప్రచేతః ప్రభృతుల యందున్నదే" అని అనెను.

ఇంతలో వ్యాస భగవానుడు వచ్చెను. ద్రుపదుడు తన సంశయమును వెల్లడించెను. "అనుజుని భార్యను సచ్చరిత్రముగల జ్యేష్ఠుడు భార్యనుగా గ్రహించుటెట్లు?" అని ధృష్టద్యుమ్నుడు పలికెను. ధర్మజుడు "మహర్షీ! నావాక్కు అనృతమాడి యెరుగదు. నా బుద్ధి అధర్మమునకు పోదు. పంచకమున కేకపత్నీత్వ విషయమై నా మనస్సు ప్రవర్తించుచున్నది. కనుక నిది యేవిధముగను అధర్మము కానేరదు. ఇది యెచ్చటను లేనిది కాదు. మహా ధర్మాత్మురాలగు జటిలయను స్త్రీ

ఋషిసప్తకమునకు పత్నియయ్యెననియు, తపస్సంపన్నులును, సోదరులును, ఏకనామము కలవారునునగు పదిమంది ప్రచేతసులకు మునికన్యయగు వార్షి పత్నియయ్యెననియు పురాణములందు వినబడుచున్నది. అంతేకాక గురువులలో పరమ గురువు మాత. ఆమె వాక్యము ధర్మబద్ధము. ఆమె కూడ కలిసి యనుభవింపుడని పలికినది.

"గురోర్హి వచనం మాతు ర్ధర్మ్యం ధర్మజ్ఞసత్తమ
గురూణాం చైవ సర్వేషాం మాతా పరమకో గురుః"

-మ.భా. తత్త్వ పు. 942

ఇన్ని విధముల చూడగా నిది ధర్మమనియే నేను తలచుచున్నా'నని పలికెను.

వేద వ్యాసుడు ద్రుపదుని చేయిపట్టుకొని భవనములోనికి గొంపోయి పంచేంద్రోపాఖ్యానమును దూరదర్శన యంత్రమున చూపినట్లు చూపెను.

పూర్వము యముడు సత్రయాగ దీక్షితుడై ప్రాణిహింస చేయకుండెను. అందుచే మానవులకు మరణము లేక అమరులైరి. దేవతలు తమవలెనే మానవులు అమరులగుట సహింపజాలక బ్రహ్మతో మొరవెట్టిరి. ఆ సత్రయాగమును జాడబోవుచు నింద్రుడు దారిలో గంగాజలమున ఒక తేజశ్శాలియైన స్త్రీ విలపించుచుండుటయు, ఆమె కన్నీటి బిందువులు నీటిలో పడి బంగారు పద్మములగుటయు చూచి ఇంద్రుడు "నీవెవ్వతవు? ఇట్లు విలపించుటకు కారణమేమి?'' అని అడిగెను. అంతనా స్త్రీ ఇంద్రుని చేయి పట్టుకొని ఒక పర్వతాగ్రమునందొక స్త్రీతో పాచికలాడుచున్న యువకుని చూపెను. ఆ యువకుడింద్రుని లక్ష్యపెట్టకుండుటచే ఇంద్రుడు కుపితుడై వజ్రాయుధమును ప్రయోగింప నుద్యమింపగా ఆ పురుషుడు మందహాసము చేసి తన దృష్టి ప్రసారము చేతనే ఇంద్రుని స్తంభింపజేసెను. ఆ పురుషుడే ఈశ్వరుడు. ఆతని యానతి ననుసరించి ఆ పర్వతగుహ కడ్డుగానున్న బండరాతిని తొలగించి గుహలో చూడగా తనతో సమానులైన నలుగురను చూచి తనకు గూడ నిట్టి గతి పట్టునేమో యని భీతిల్లెను.

సత ద్వివృత్య వివరం మహాగిరే స్తుల్యద్యుతీమ్
శ్చతురోऽన్యాన్ దదర్శ స తా నభిప్రేక్ష్య బభూవ
దుఃఖితః కచ్చిన్నాऽహం భవితా వై యథే మే

మ.భా. తత్త్వ. పు. 942

ఇంద్రుడా గిరిగుహను వివరించి తనతో సమానులైయున్న నలుగురి నా గుహలో జూచి తనకుగూడ నట్టి యవస్థయే వచ్చునని దుఃఖించెను అని మూలమున నుండగా నన్నయభట్టారకులు తెలుగు భారతమున

"..............
తనయట్టివారల ఘనశరీరులనందు
నలువుర నన్యుల వెలయఁ జూచి
యేనిట్టువేలకో యేనుప్రకారంబు
లయతి నిందనుచు విస్మయముఁబొంది"

ఆం.భా. ఆది 7-27 అ.

అనిమూలమునకు భిన్నముగా వ్రాసిరి. ఇచ్చట తానే అయిదు ప్రకారముల నయినని విస్మయమందినట్లున్నది. మూలమున నట్లుగాక తనతో సమానులైన నల్వురి నా గుహలో జూచి తనకుగూడ నట్టి యవస్థయే వచ్చునేమో యని దుఃఖించినట్లున్నది.

వారలను ఈశ్వరుడు మీరు మనుష్య జన్మమెత్తవలయును. అందుమీరసాధారణ కార్యములుజేసి, అనేకుల వధించి మరల ఇంద్రలోకమున రాగలరని చెప్పెను. అప్పుడా పూర్వేంద్రులిట్లనిరి.

గమిష్యామో మానుషం దేవలోకా
ద్దురాధరో విహితో యత్ర మోక్షః
దేవాస్త్వస్మానాదధీరన్ జనన్యాం
ధర్మో వాయుర్మఘవానశ్వినౌ చ

-మహా. భా. తత్త్వ పు 942

దానికి సమాధానముగా వారుపరమేశ్వరా! నీ యాజ్ఞానుసారము మేము మనుష్య లోకమున జన్మింతుము. మమ్ము జననీగర్భమున ధర్మదేవ వాయుదేవ దేవేంద్ర అశ్వనీ దేవతలు ప్రవేశపెట్టునట్లు అనుగ్రహింపుము. మేమచ్చట దివ్యాస్త్రములతో యుద్ధము చేసి కృతకృత్యులమై తిరిగి ఇంద్రలోకమునకు వత్తుము అని చెప్పగా నప్పటి ఇంద్రుడు తానాధికారిక పురుషుడై యున్నందున స్వయముగా జన్మించుటకాక శుక్రము ద్వారా తన యంశమును జన్మింపజేయుదునని చెప్పుకొనెను. పూర్వమింద్ర పదవి నధిష్ఠించి విరమించిన విశ్వభుక్, భూతధామ, శిబి, శాంతి అనువారు నలుగురును అప్పటి ఇంద్రుని యంశమొకటి కలిసి పంచేంద్రులైరి.

"విశ్వభుక్ భూతధామా చ శిబి రిన్ద్రః ప్రతాపవాన్
శాన్తి శ్చతుర్థస్తేషాం వై తేజస్వీ పంచమః స్మృతః"

-మహా. తత్త్వ. పు 943

అని వ్యాస భారతమునందే కలదు. 'తేజస్వీ ఇన్ద్రాంశః' అని నీలకంఠుల టీక. మార్కండేయ పురాణములో నీగాథ మరియొక విధముగానున్నది. ఒకప్పుడు

దేవేంద్రుడు త్రిశరుని వధింపగా బ్రహ్మహత్యను బట్టి ఇంద్రుని తేజస్సు పోయి యమధర్మరాజునందు ప్రవేశించెను. మరియొకప్పుడు వృత్రాసురుని వధింపగా నా దోషము వలన నింద్రుని శక్తి వాయుదేవునందు ప్రవేశించెను. మరియొకప్పుడు అహల్యా జారత్వ దోషము వలన నింద్రుని శక్తి అశ్వినీ దేవతలందు ప్రవేశించెను. ఆయా దేవతలు తమ అంశలను కుంతీదేవియందు విడువగా పంచపాండవులుద్భవించిరి. ఆంధ్ర భారత కథనము వలన ద్రౌపదికేకపతిత్వము సిద్ధించునుకదా! ఇది ఔచిత్య పరిపోషణముగాదా! అని సమర్థింపబూనుట అనుచితము.

మనకు వ్యాసభగవానుని భారతకథనమే ప్రమాణముకాని మార్కండేయ పురాణాంతర్గత కథనముగాని, ఆంధ్రీకృత భారత కథనముగాని ఈ సందర్భమున ప్రమాణములుకావు. ఏలయన అవి మూలభారతమునకు విరుద్ధములు కనుకను, మహాభారతమునందలి సూక్ష్మధర్మపరిశీలనమే ప్రకృతాంశము కనుకను, అయిదుగురు భర్తలయ్యునునామె పతివ్రతయని వ్యాసభగవానులు వక్కాణించుచుండగా, జటిలా వార్క్షిల చరిత్రల నాధారముండగా, ఈశ్వరుడు సహితము ద్రౌపదికి పంచ పాండవులయందును ప్రత్యేక కన్యాత్వమును ప్రసాదించియుండగా ఆమెకొక్కడే భర్తయని సాధించుట యెందులకు? పైగా -

"తతో ద్వైపాయనస్తస్మై నరేన్ద్రాయ మహాత్మనే
ఆచఖ్యౌ తద్యథా ధర్మో బహూనా మేక పత్నితా"

-మహా. తత్త్వ. పు. 954

ఇది ధర్మ విరుద్ధమని సందేహించుచున్న ద్రుపద మహారాజునకు పంచ పాండవులకు ద్రౌపదీదేవి యొక్కతే పత్నియగుట యెట్లు ధర్మమో వ్యాస మహర్షి వివరించి సమ్మతింపచేసిన తరువాత కూడ ద్రౌపదీదేవికి ఇంద్రుడొక్కడే భర్తయని మనము సాధింపబూనుట యసంగతము.

ఇట్లు వ్యాస మహర్షి బోధించుట చేతనే ద్రుపదుడు
"యది చైవం విహితశ్శంకరేణ
ధర్మోఽ ధర్మో వా నాత్ర మమాపరాధః
గృహ్ణాత్విమే విధివత్పాణి మస్యాః
యథోపజోషం విహితైషాం హి కృష్ణా"

-మహా. భా .ఆది..14 అ

శంకరుడే యిట్లు విధించినప్పుడు అది ధర్మమైనగానిమ్ము, అధర్మమయిన గానిమ్ము నేనపరాధినిగాను. వీరికీమె పత్నిగా విధింపబడినది గనుక ఈమె పాణిగ్రహణము పాండవులు విధ్యుక్తముగా జేయుదురుగాకయని ద్రుపదుడు పలికెను.

ఏకదినమందే ఆ పాణిగ్రహణము పాండవులందరిచేత చేయింపక, దినభేదముచే చేయించుటకు ఈశ్వర వరప్రభావమున ద్రౌపదీదేవి కేదినమున కాదినమే కన్యాత్వము సిద్ధియగుట కారణమని చెప్పబడినది.

ఇదంచ తత్రాఽద్భుతరూప ముత్తమం
జగాద విప్రర్షి రతీతమానుషమ్
మహానుభావా కిల సా సుమధ్యమం
బభూవ కన్యైవ గతే గతేఽహని.

-మహా. భా. తత్త్వ. పు. 950

## ఆంధ్రమహాభారతములో కూడ -

"........ ముందఱ ధర్మపుత్రునకు ద్రుపద రాజపుత్రిం బాణిగ్రహణంబు చేయించి తొల్లి యేవురకు వివాహంబు చేయునప్పుడు కన్యాత్వంబు దూషితంబు గాకుండ నీశ్వరు వరంబునం గౌమారత్వంబు వడసిన యక్కన్యకంగ్రమంబున భీమార్జున నకుల సహదేవులకుం బాణిగ్రహణంబు చేయించిన" - అనియే చెప్పబడినది.

ఆ.భా. ఆది. 7-286

ఇట్టి వివాహమును గూర్చి ఏ శ్రుతి స్మృతులలోను చెప్పబడియుండలేదు కనుక నిది శాస్త్రదూష్యమని కొందరాక్షేపించవచ్చును. ఈ వివాహ విధి వేదమునందు కానరాని మాట నిజమే. ఒకవేళ వేదములలో చెప్పబడియున్నను ఆ వేద ప్రమాణములు మనకు లభ్యములుకావు. అవి రాగిరేకులపై చెక్కబడిలేవుకదా! వేదములు అనుశ్రుతముగా పఠన పాఠనముల వలన వచ్చునవి. అందువలన "తదభావే తన్మూల ధర్మ శాస్త్రావగ మ్యా" - అని. కనుక ఆ వేదములలోని విషయములనే ఆచరణ యందుంచిన, ఆచరణశీలుర ఆచారములు కూడ ప్రమాణములే కావచ్చునను ధర్మములను గూడ ఆపస్తంబాదులు నిర్ణయించుట వేదమూలముననే యని యర్థము. "ప్రయోగాదను మీయతే ప్రయోగః స్మృతి నిబంధన మనుష్ఠానం చ" అని ఆపస్తంబులు చెప్పినారు. అనగా మన్వాది స్మృతులును, ఆ స్మృతుల ననుసరించి నడచు నడకలున్నూ వేదములలోని విషయమున కాధారము. అందుకే "సూక్ష్మో ధర్మః", "ఆనుపూర్వ్యేణ పూర్వేషాం" అనియు వాకొని యున్నారు. అనేక భర్తలు కల మహాసాధ్వులు జటిల, వార్క్షియనువారల వృత్తాంతములు పూర్వమున్నవే కదా.

సర్వసాధారణమయిన వివాహ విధులను గూర్చి ధర్మశాస్త్రములు చెప్పును. ఇది అట్టి సామాన్యమైనదికాదు. ఇది కేవలము ద్రౌపదీ పాండవులకు మాత్రమే ప్రత్యేక విధానముగ ఈశ్వర నిర్దిష్టమయిన వివాహము. ధర్మశాస్త్రమునకు ప్రామాణ్యము ధర్మశాస్త్రకర్తల యొక్క ప్రామాణ్యమును బట్టి వచ్చినదే కదా.

"మన్వత్రి విష్ణు హారీత యాజ్ఞవల్క్యో శనోంగిరా:
యమాపస్తంబు సంవర్తా: కాత్యాయన బృహస్పతీ
పరాశరవ్యాసశంఖలిఖితా దక్షగౌతమౌ
శాతాతపో వసిష్ఠశ్చ ధర్మశాస్త్రప్రయోజకా:"

-మహా. తత్త్వ పు. 953

ఈ ధర్మశాస్త్ర కర్తలలో పేర్కొనబడినవాడే వ్యాసమహర్షి కూడ. ఆ వ్యాస మహర్షి ద్రుపదునితో బోధించునపుడు -

"ఆచఖ్యౌ తద్యథా ధర్మో బహూనా మేక పత్నితా"

అనేకమందికి ఒక స్త్రీ భార్యయగుట యెట్లు ధర్మమో బహు నిదర్శనములతో చెప్పబడ్డది. ధర్మశాస్త్ర కర్తలలో నొకరగు వ్యాస మహర్షి ధర్మమని నిరూపించి దగ్గర యుండి జరిపించిన ఈ వివాహము ధర్మశాస్త్ర సమ్మతమేల కాకపోవును?

ధర్మము స్థూలమని, సూక్ష్మమని రెండు విధములు.

"మందమతిభిరపి సుఖేన బుధ్యమానశ్శౌచాచ మనసంధ్యావందనాధి:స్థూలో ధర్మ:"

మందమతులకు కూడ సుఖముగా తెలియబడునట్టి శౌచ, ఆచమనము, సంధ్యా వందనాదులు స్థూల ధర్మములు.

శాస్త్రపారంగతై: పండితైరేవ బోద్ధుం యోగ్య: ఇతరేషాం
అధర్మభ్రాంతివిషయ: ద్రౌపదీవివాహాది: సూక్ష్మో ధర్మ:

-మహా. భా .తత్త్వ పు. 954

శాస్త్ర పారంగతులగు పండితులకు మాత్రమే తెలిసికొనదగినదై అన్యులకు అధర్మ భ్రాంతిని కలిగించునట్టి ద్రౌపదీ వివాహాదికము సూక్ష్మ ధర్మము. కనుకనే ద్రుపదున కా వివాహము అధర్మమనిపించినది. అది ధర్మమేయని భారతములో బహు విధముల ప్రతిపాదింపబడినది. అందుచే నది సూక్ష్మ ధర్మమయినది. ద్రౌపదీ వివాహము ధర్మశాస్త్రవిరుద్ధమనువారు ధర్మసూక్ష్మమెరుంగని యవివేకులు. ఈపై విషయము పరాశర మాధవీయములో విద్యారణ్య స్వామివారిచే చెప్పబడినది.

అందువలననే

'అహల్యా ద్రౌపదీ తారా తారా మండోదరీ తథా
పంచకన్యా: పఠేన్నిత్యం మహాపాతక నాశనమ్'

అని పంచ కన్యలలో ద్రౌపది కూడ ఒక్కతెగా స్మరింపబడినది.



# 8. ఏకలవ్యుని వృత్తాంతము

"తత్ నిషాదరాజస్య హిరణ్యధనుషస్సుత:
ఏకలవ్యో మహారాజ! ద్రోణ మభ్యాజగామ హ
న స తం ప్రతిజగ్రాహ నైషాదిరితి చింతయన్
స తు ద్రోణస్య శిరసా పాదౌ గృహ్యా పరంతప:
అరణ్యమను సంప్రాప్త: కృత్వా ద్రోణం మహీమయం
తస్మి న్నాచార్యవృత్తిం చ పరమా మాస్థితస్సదా
పరయా శ్రద్ధయా యుక్తో యోగేన పరమేణ చ
విమోక్షాదానసంధానే లఘుత్వం పరమాప స:.

-మభా. పు 61

హిరణ్య ధనుష్కుడను కిరాత రాజుయొక్క కొడుకు ఏకలవ్యుడనువాడు ద్రోణాచార్యుని యొద్దకు వచ్చి తన్ను శిష్యునిగా చేసికొమ్మని అర్థించినాడు. ఏకలవ్యుడు నిషాదుడగుటచే ద్రోణుడు దాని కంగీకరించలేదు. అప్పుడు పరంతపుడైన ఏకలవ్యుడు ద్రోణుని పాదాలకు శిరసా నమస్కరించి అరణ్యములోనికి పోయి మహీమయునిగా ద్రోణుని నిలిపికొని అతడే తనకు గురువుగా భావించి గొప్ప శ్రద్ధతోను పరమమైన యోగముతోను గూడినవాడై విమోక్షాదానసంధానమందు గొప్ప నేర్పును పొందెను.

ఒకనాడు వేటకై వెళ్ళిన రాజకుమారుల వెంట వెళ్ళిన కుక్క అడవిలో ఏకలవ్యుని జూచి మొరుగుచుండగా నాతడు దానికి చేటు కలుగకుండ నోటిలో ఏడు బాణముల నొకే పర్యాయము ప్రవేశపెట్టెను. పాండవు లాతని ప్రయోగ కౌశలమున కాశ్చర్యపడిరి. 'నీవెవ్వరివని' ఆతని ప్రశ్నింప నాతడు తాను ద్రోణాచార్యుని శిష్యుడనని చెప్పెను, అర్జునుడు ద్రోణుని సమీపించి "ధనుర్ధరులలో నాయంతవాడు వేరొకడు లేకుండునట్లుగా పలికితిరి మరి యిప్పుడు మీ శిష్యులలో నాకంటె గొప్ప ధనుర్ధరుడు కలడే! అది ఎట్లు? మీ వాగ్దాన మనృతమయ్యెగదా' అని అధిక్షేపించెను, తరువాత ద్రోణు డర్జున సమేతముగా నడవికి వెళ్ళి, ఏకలవ్యుని జూచి యాతని గురువెవరని ప్రశ్నింప ద్రోణాచార్యుడని చెప్పెను. అంత ద్రోణాచార్యుడు ఏకలవ్యుడు తన శిష్యుడే

యైనచో తనకు గురుదక్షిణ నిమ్మని యాతని కుడిచేతి బొటన వ్రేలిని గ్రహించెను. ద్రోణుడు ఏకలవ్యుని గురుభక్తికి మెచ్చి నీవిటు మీదట శరసంధానము నిట్లు సేయుమని తర్జనీమధ్య మాంగుళులచే బాణములెట్లు వేయవలెనో తానువేసి చూపెను.

"ఏవం కర్తవ్యమితి తర్జనీమధ్యమాభ్యాం శరం
ధృత్వా జ్యాకర్షణం కర్తవ్య మిత్యభినీయ దర్శయతి"

-మహా. భా .వి. పు.455

అని నీలకంఠీయము.

ఈ ఇతి వృత్తములో రెండు ఆక్షేపణీయాంశములు కలవు ఒకటి నిషాదుడైనందున ఏకలవ్యుని తన శిష్యునిగా స్వీకరించక పోవుట, రెండు తాను విలువిద్యను గఱుపకపోగా తనకు శిష్యుడనని చెప్పిన ఏకలవ్యుని కుడిచేతి బొటనవ్రేలిని గురుదక్షిణగా స్వీకరించుట. ఈ రెండవ అంశమే విమర్శకు ఎక్కువగా గుఱియగుచున్నది.

నిషాదుడైన ఏకలవ్యుని ద్రోణుడు తన శిష్యునిగా స్వీకరింపక పోవుటలో నాయన ఆంతర్యమిది. హిరణ్యధనుష్కుని కుమారు ఏకలవ్యుడు "హిరణ్మయేన పాత్రేణ సత్యస్య పిహితం ముఖం'' అన్న ఉపనిషద్వాక్యమునకు హిరణ్య పాత్రలో సత్యస్వరూపుడైన భగవంతుని ముఖము కప్పివేయబడిన దని అర్థము, భగవంతుడు ప్రకృతి యొక్క మాయా వృతుడు. కనుక ప్రకృతి యొక్క మాయ తన కంటకుండ కాచుకొని జాగ్రత్త పడుజ్ఞానసాధకునిలోని సాధనావృత్తియే హిరణ్యధనుష్కుడు, ఇక ఛేదించబడిన లవ్యము' అనగా ప్రకృతి కలవాడు ఏకలవ్యుడు. భగవంతుడు మయావృతుడు కదా! మాయ ఛేదించబడుటచేత ఏకలవ్యుడు ఒకే ఒక శుద్ధ పరమాత్మ సాక్షాత్కారము లభించినవాడు అనగా 'సోఽహం' సాధన జయించిన వాడు, 'అహం బ్రహ్మాఽస్మి' అను దానికే ఏకలవ్య సాధన యని పేరు, పైగా అతడు నిషాదుడు* అట్టి ఏకలవ్యునకు ద్రోణునియొక్క అనగా బుద్ధి యొక్క గురుత్వము అవసరము లేదు. వీనికి జ్ఞానమనోవృత్తి యొక్క అపేక్ష నామమాత్రమే. అందుచేతనే ద్రోణుడు ఏకలవ్యుని శిష్యత్వమును నిరాకరించెను. పిమ్మట ఏకలవ్యుడు అరణ్యములో (ధ్వని లేని చోట) ద్రోణుని మహిమయునిగా జేసికొని విశ్వస్వరూపముగా గురువునే సర్వ వ్యాపకుడైన పరమాత్మగా ధ్యానించి 'సర్వం ఖల్విదం బ్రహ్మ' సాధన సాగించే ప్రయత్నములో మోక్షాదానసంధాన అనగా 'సర్వం ఖల్విదం బ్రహ్మ' అనే కైవల్యసాధనాన్ని

సాధించెను. సారాంశమేమన నైషాదికి మోక్షసాధనకు గురుత్వము అవసరము లేదు కనుకనే ద్రోణాచార్యులు ఏకలవ్యుని శిష్యునిగా అంగీకరించలేదని భావము.

అంతరార్థమహాభారతం.

స్థూల దృష్టితో విచారించినచో ఏకలవ్యుడు *నిషాదుడు కనుకను ఉపనయన సంస్కారములేనివానికి ధనుర్వేదము నేర్పరాదు కనుకను ఏకలవ్యుని శిష్యునిగా స్వీకరింపలేదు.

న స తం ప్రతిజగ్రాహ నైషాదిరితి చింతయన్

మ.భా - ఆది

అతడు అరణ్యమునకు మరలివెళ్ళి ద్రోణాచార్యుల వారి మట్టిబొమ్మను తయారు చేసి ఆ బొమ్మకు భక్తిశ్రద్ధలతో నమస్కరించి ఆ బొమ్మ కెదురుగా విలువిద్య నభ్యసించి మేటి విలుకా డయ్యెను. ఆ మట్టి బొమ్మ ఏకలవ్యునికి ధనుర్విద్యారహస్యములు బోధింపగలదా? లేనిచో ఏకలవ్యుడు తాను ద్రోణాచార్యుల శిష్యుడనని ఏల చెప్పుకొనెను? ఏకలవ్యుడ సత్యమాడెనా? లేదు. అతడు సత్యమునే చెప్పెను, ఆ మట్టి బొమ్మయే అతనికి ధనుర్విద్యారహస్యములను బోధించినది. ఇదియే భారతీయవిజ్ఞానములోని రహస్యము అంతరాత్మ చైతన్యము నాధారముగా గొని దాని యంశమున వెలుగొందునదే జీవుని అంతఃకరణము. సృష్టి ఖండ మంతయు మనస్సు యొక్క వరప్రసాదమని భారతీయతత్త్వశాస్త్రములు చెప్పుచున్నవి. మానవుడు తనమనస్సు చేత ఒక జడ పదార్థమునందు చైతన్యవిశేషమును భావించగా నాజడము చైతన్య మూర్తియై తనను భావించిన భావుకునికి భావనా వైభవమునందించునని భారతీయశాస్త్రములు ఘంటాపథముగా వక్కాణించుచున్నవి.

"మంత్రే తీర్థే చ దైవే చ దైవజ్ఞే భిషజౌ గురౌ
యాదృశీ భావనా యత్ర సిద్ధిర్భవతి తాదృశీ"

మంత్రమునందు, తీర్థమునందు, దేవునియందు, జ్యోతిష్కునియందు, వైద్యుని యందు, గురువునందు, ఎవరికెట్టి భావము కలుగునో వారికట్టి సిద్ధియే కలుగును కదా! కనుక ఏకలవ్యుడు ముమ్మాటికి ద్రోణాచార్యుల శిష్యుడే. అతడు అర్జునుని కంటె మేటివిలుకాడే, తనశిష్యులతో నర్జునుని అధికుని చేతునన్న ప్రతిజ్ఞకు భంగము

---

* ని+పాద= నిషాద నితరాం అనగా మిక్కిలి, పాదము = అనగా స్వచ్ఛత గలవాడు అనగా మిక్కిలి స్వచ్ఛమైన అంతరంగము కలవాడు.

వాటిల్లినది సత్యమునకు కట్టుబడియే ఏకలవ్యుడు తాను ద్రోణుని శిష్యుడనని చెప్పికొనెను, ద్రోణుడును అర్జునుని పట్ల తాను చేసిన వాగ్దానసత్యమునకు కట్టుబడి గురుదక్షిణగా నేకలవ్యుని కుడిచేతి బొటనవ్రేలిని కోరవలసి వచ్చినది.

ద్రోణు డేకలవ్యుని శిష్యునిగా స్వీకరించక పోవుటకు అతడు నిషాదుడగుటయే కారణము. అనుపనీతునికి వేదాధ్యయనాధికారము మనుస్మృతి నిషేధించినది.

నాభివ్యాహారయేద్బ్రహ్మ స్వధానినయనాదృతే
శూద్రేణ వా సమస్తావద్యావద్వేదేన జాయతే
కృతోపనయనస్యాస్య వ్రతాదేశనమిష్యతే
బ్రహ్మణో గ్రహణం చైవ క్రమేణ విధిపూర్వకమ్.

మను. 2-172-173

ఉపనయనమగువరకు శ్రాద్ధకాలమున చెప్పవలసిన మంత్రములు తక్క మరి యేవేద మంత్రములు చెప్పరాదు. ఉపనయనసంస్కారముపర్యంతము బ్రాహ్మణుడు శూద్రతుల్యుడే. ఉపనయనము చేసికొన్నవానికే సమిదాధానము, వేదాధ్యయనము శాస్త్రవిధిచొప్పున విధింపబడినవి.

ఇచ్చట అత్యంతముఖ్యమయిన మరియొక ధర్మశాస్త్రరహస్యము నెరుంగవలసియున్నది. వేదము గురువునొద్ద చదువక నేర్వరాదు.

బ్రహ్మ యస్త్వననుజ్ఞాతమధీయా నాదవాప్నుయాత్
స బ్రహ్మస్తేయ సంయుక్తో నరకం ప్రతిపద్యతే

మను. 2-116

ఎవడు అభ్యాసమునిమిత్తము వల్లించువానికడనుండి గాని, వేరొకనికి చదువుచెప్పుచున్నట్టి వానికడనుండిగాని యతని యనుజ్ఞ లేక వేదము నభ్యసించునో వాడు వేదము నపహరించుట యను పాపమునొనర్చి నరకము నొందును. కనుక ఏ శిష్యుడైనను సాక్షాత్తు గురుముఖమునుండి యే విద్య నభ్యసించవలెను. అందుకు యవక్రీత చరిత్రయే నిదర్శనము.

యవక్రీతుడనువాడు గురుముఖమున వేదములను పొందుటకు చాలా కాలము పట్టును కనుక తపస్సుచేసి సకలవేదములను సర్వజ్ఞానమును పొంద సంకల్పించెను. అందుకు నిరాకరించి ఇంద్రుడు "బ్రహ్మర్షీ ! అది మార్గము కాదు తపస్సుతో నీవు వేదములను పొంద నిశ్చయించుట మంచిది కాదు. నీవు గురుముఖమున నధ్యయనము

చేయుము. గురువులేని విద్యావంతులు వెంటనే నశించెదరు" అని చెప్పెను. ఈ విధముగానే గురువులేకుండా వ్యాకరణాధ్యాపకులగు మతంగాదులు నశించిరని తెలియుచున్నది. కావున జీవించియున్న గురుముఖమునుండియే విద్యను గ్రహించవలెను. నిర్జీవములైన ప్రతిమలు మొదలగు వానిచే విద్య నార్జించుట నిరర్ధకము, అశ్రేయస్కరమునై యున్నదని ఇంద్రుడు చెప్పెను.

నన్నయ భట్టారకుల మహాభారతము ఆరణ్యపర్వ తృతీయాధ్యాయమున యవక్రీతు చరిత్రము కలదు. పూర్వము రైభ్య-భరద్వాజ మహర్షులిరువురు తపోనిష్ఠ నరణ్యమున నుండిరి. రైభ్యుని కుమారుడు అర్వావసువు - పరావసువు అనువారలు వేద వేదాంగ పారంగతులు. భరద్వాజుని కుమారుడు యవక్రీతుడను వాడు వీరల జూచి మత్సరగ్రస్తుడై యుండెను. అతడు తపోబలమున నఖిల వేద శాస్త్రాగమములు పొందతలచి ఉగ్రమయిన తపస్సు చేసెను. ఇంద్రుడు ప్రత్యక్షమై నీ వెందుకీ ఉగ్రతపము చేయుచున్నావని ప్రశ్నించెను. అందుకు యవక్రీతుడు.

ఆ. చదువకయును నాకు సర్వవేదంబులు
సర్వశాస్త్రములును సంభవిల్ల
వలయునని తలంచి వదలక నిష్ఠతో
నుగ్రతపముఁజేయుచున్నవాఁడ

వ. అనిన వాని కింద్రుం డిట్లనియె

కః గురుముఖమునఁ బడయక దు
ష్కరతపమునఁ జేసి వడయఁగాఁబడు విద్యల్
పరమార్థము మదమును మ
త్సరమును గావించు నెట్టి సాధులకైనన్

ఆ.భా. ఆరణ్యా. 3-254-256

విద్యోపార్జనకిది మార్గము కాదని వాసవుడు వారించినను యవక్రీతుడు తన ఉగ్రతపమును మానలేదు. పిమ్మట ఇంద్రుడు వృద్ధబ్రాహ్మణరూపమున వచ్చి గంగయొడ్డున నిలిచి గుప్పెళ్ళతో నిసుకను చల్లు చుండెను. యవక్రీతుడది చూచి 'నీవేమి చేయుచుంటి' వనిన 'సేతువును కట్టుటకై యిసుకను చల్లుచుంటి'నని చెప్పెను. ఈ యిసుకవలన గంగపూడునా అని హేళన చేయగా నింద్రుడు "నీవు చేయు చున్నది

మాత్రము అసంభవము కాదా! తపస్సు వలన విద్య వచ్చునా? దానిని మానుమని చెప్పెను. యవక్రీతుడు విద్యవచ్చు వరకు తపము మానననని మొండిపట్టు పట్టగా ఇంద్రుడు నిజరూపమును జూపించి యవక్రీతునకు విద్య నొసంగెను. యవక్రీతుడు సంతోషించి విజయగర్వముతో నాసంగతి తండ్రికెరింగించెను. దానికి సమాధానముగా తండ్రి నీకు గర్వమున్నది. తగదు. రైభ్యుని పుత్రులతో నిర్మత్సరుండవై యుండుమని చెప్పెను. యవక్రీతుడు రైభ్యుని ఆశ్రమమున కేగి అచ్చట రైభ్యుని కోడలిని కామించెను. ఆమెయు యవక్రీతుని తపశ్శక్తికి భయపడి అట్లేయని చెప్పి ఆవిషయము రైభ్యుని కెరింగించెను. ఆయన మిక్కిలి ఆగ్రహించి హోమము చేసి ఒక సుందరాంగిని, ఒక రాక్షసుని సృజించెను. ఆ సుందరాంగి యవక్రీతుని కమండలమును గైకొనెను. రాక్షసుడు యవక్రీతుని వెంటపడగా నాతడు సముద్రమున ప్రవేశింప సముద్ర మింకిపోయెను. తండ్రి యొక్క అగ్నిహోత్రమున దాగగా అగ్నిహోత్రము చల్లారిపోయెను. రాక్షసుడు యవక్రీతుని సంహరించెను. కొంత కాలమునకు బృహద్ద్యుమ్నుడనురాజు చేయు యాగముకడకు వచ్చుచున్న రైభ్యుని కుమారుడు పరావసువు కోరికపై దేవతలు యవక్రీతుని బ్రతికించిరి, అపుడు యవక్రీతుడు దేవతల నిట్లు ప్రశ్నించెను.

తే॥ ఏను బహువేదశాస్త్రమ్ము లెఱింగి వ్రతము
నెల్లఁ జేయుచు రైభ్యుచే నిట్లు హతుఁడ
నైతి నాకంటె రైభ్యున కధికశక్తి
యైన తెఱఁగెట్టు లనిన నిట్లనిరి సురలు

క॥ గురు శుశ్రూష యొనర్చుచుఁ
బరమక్లేశమునఁ జేసి పడసిన విద్యల్
స్ఫురియించుఁ గాక గురుముఖ
విరహితముగఁ బడసినవియు వెలయునె యెందున్.

వ॥ నీవు గురుముఖంబునం బడయక యొండు విధంబునం బడయుటం జేసి నీ యధ్యయనశ్రుతంబులు నిర్వీర్యంబులయ్యె. గురుశుశ్రూషా సంతోషకరుండై రైభ్యుండు బ్రహ్మజ్ఞానంబుపార్జించెంగావున నాతండట్టి శక్తి వడసెనని దేవతలు దివంబున కరిగిరి.

ఆ.భా. అరణ్య. 3-281-283

అందుచేత గురుశుశ్రూష యొనర్పక లభించిన విద్య సర్వథా అనర్థదాయకము.

కనుకనే ఏకలవ్యుడు గురుశుశ్రూషాదులు లేక పరోక్షమున నేర్చిన విద్య నిరర్థకము కావలసివచ్చినది.

మహానుభావుడైన ద్రోణాచార్యుడు ఆడితప్పుట యసంభవము. "పార్థ ఏవ ధనుర్ధరః" అను లోక విఖ్యాతి కలిగింతునని పార్థునకు జేసిన ప్రతిజ్ఞ వ్యర్థముకారాదు. ధనుర్విద్యలో కొన్ని నియమములున్నవి. ఏకలవ్యుడు నిషాదుడు కనుక ధనుర్వేద ముపదేశింపరాదు.

"న స తం ప్రతిజగ్రాహ నైషాదిరితి చింతయన్" అని శాస్త్రము.

మతొకవిషయము. ద్రుపదుని యజ్ఞకుండమునుండి ద్రోణుని వధించుటకే కదా ధృష్టద్యుమ్నుడు జన్మించినది. అట్టి ధృష్టద్యుమ్ననే ద్రోణుడు తన యింట చేర్చుకొని అస్త్రవిద్యను నేర్పెను. ధృష్టద్యుమ్నుడు సుక్షత్రియుడు విద్య నేర్పననుట కెట్టి కారణము లేదు. కర్ణుడు సూతుడు కనుక అన్ని విద్యలు నేర్పెను. బ్రహ్మాస్త్రమును నేర్పుటకు కాదనెను. ద్రోణుడు కాదన్నను ఏకలవ్యుని కంత పట్టుదల యెందులకు? అతడు సామాన్య నిషాదుడు కాడు. ఉత్తమ క్షత్రియుడే. అందుకే ఆ అభినివేశము. ఏకలవ్యుడు శ్రీకృష్ణుని మేనత్తలలో నొక మేనత్త కొడుకని హరివంశమున కలదు.

వ॥ ఆ వసుదేవునకు ........................

శ్రుతకీర్తియు, శ్రుతదేవయు, శ్రుతశ్రవయు, (

బృథయు రాజాధిదేవియు నన నేవురు

చెలియండ్రు గలిగిరి వారిలోన .................,

వ. శ్రుత దేవకుం గేక యేశ్వరు వలన నేకలవ్యుండు పుట్టి నిషాదులలోనం బెఱిఁగె.....

హరివంశము. పూ.భా-3 అ.159-160.

శ్రీకృష్ణునకు మేనత్త లైదుగురు.

1. శ్రుతకీర్తి. భర్త కరూశదేశపు రాజు వృద్ధశర్మ. వాని పుత్రుడు దంతవక్త్రుడు.
2. శ్రుతదేవ. కేకయరాజు. పుత్రుడు ఏకలవ్యుడు.
3. శ్రుతశ్రవ. చేదిదేశపు రాజు దమఘోషుడు. వాని పుత్రుడు శిశుపాలుడు.
4. పృథ (కుంతి). ఆమె భర్త పాండురాజు. వాని పుత్రులు పాండవులు.

5. రాజాధిదేవి అవంతి దేశపు రాజు జయత్సేనుడు. వాని పుత్రులువిందాను విందులు.

ఈ వివరములు హరివంశ పూర్వభాగ తృతీయాధ్యాయమున చెప్పబడినవి.

ఘటోత్కచుడు కర్ణుని చేత చచ్చినపుడు శ్రీకృష్ణుడు మిగుల సంతసించెను. 'ఇట్టి దుఃఖ సమయమున నీకెట్లు సంతోషము కలిగినది' అని అర్జును డడుగగా కృష్ణుడిట్లు చెప్పెను.

"జరాసంధశ్చేదిరాజో నైషాదిశ్చ మహాబలః
యది స్యుర్న హతా పూర్వం ఇదానీం స్యుర్భయంకరాః
దుర్యోధనస్తా నవశ్యం వృణు యా ద్రథసత్తమాన్
తేఽస్మాసు నిత్య విద్విష్టాః సంశ్రయేయుశ్చ కౌరవాన్
త్వద్ధితార్థం చ నైషాది రంగుష్ఠేన వియోజితః
ద్రోణేనాచార్యకం కృత్వా ఛద్మనా సత్యవిక్రమః
సబద్ధాంగుళి త్రాణో నైషాది ర్దృఢవిక్రమః
అతిమానీ వనచరో బభౌ రామ ఇవాపరః
ఏకలవ్యం చ సాంగుష్ఠమశక్తా దేవదానవాః
సరాక్షసోరాగాః పార్థ విజేతుం యుధి కర్హిచిత్".

మ.భా. వి. పు 459

జరాసంధుడు, శిశుపాలుడు, ఏకలవ్యుడు పూర్వము చంపబడకున్నచో నిపుడు భయంకరులై యుండెడివారు, దుర్యోధనుడు తప్పక వారి సహాయము కోరెడివాడు. నీ హితమును గోరి ద్రోణాచార్య ఆచార్యకత్వము నెపమున వాని అంగుష్ఠము లేకుండ చేయబడినది. అతడే బొటనవ్రేలు కలిగియున్నచో దేవ దానవాదులు గూడ నతనిని గెలువజాలరు సుమా అని కృష్ణుడు చెప్పెను.

కనుక ఏకలవ్యుని కుడిచేతి బొటన వ్రేలును ద్రోణాచార్యులు గురుదక్షిణగా గోరి గ్రహించుట కేవలము ఈశ్వర సంకల్పమేయని తెలియవలెను.

# 9. సుహృద్ద్యూతము

## 1. పూర్వరంగము :

సుహృద్ద్యూతమునకు పూర్వరంగము రాజసూయము. ధర్మజుని రాజసూయము మహా వైభవముగా దిగ్విజయముగా ముగిసినది. శ్రీ కృష్ణుని ధిక్కరించిన శిశుపాలుడు వధింపబడెను. ఆ సమయమున కొన్ని ఉత్పాతములు గోచరించినవి. నారదుడు కూడ క్షత్రియనాశమును జననష్టమును జరుగునని చెప్పెను. ధర్మజుడు వ్యాస భగవానుని ప్రశ్నింపగా ఆయన ఈ ఉత్పాతముల దుష్టఫలితములు పదమూడు సంవత్సరములలో ఫలించునని చెప్పెను. దుర్యోధనుని దురాలోచన మూలమున ధర్మజునిచే క్షత్రియసంహారము జరుగునని ఇది విధి నిర్ణయమని, దీనిని తప్పింపరాదని చెప్పి వెడలిపోయెను. ధర్మజుడే రాబోవు క్షత్రియనాశమును తప్పించుటకై ఒక ప్రతిజ్ఞ చేసెను.

"నేను ఈ రోజు మొదలు పదమూడు సంవత్సరములు సోదరులకు గాని ఇతరులకు గాని జ్ఞాతులకు గాని ఎదురు చెప్పక వారి యాజ్ఞలనే పాలించుచు క్షమాన్వితుడనై యుండుట నా నిశ్చయము. నా పుత్రులకు గూడ నేను వశమై యుండుదునే గాని బదులు పలుకుట జరుగదు" అని శపథము చేసెను. ఈ ప్రతిజ్ఞ వలన ప్రయోజన మేమన యుద్ధము భేదమూలకము. భేద భావములు లేకున్న యుద్ధములు రావు, యుద్ధములు లేక క్షత్రియనాశము జరుగదు కావున ధర్మజుడీ ప్రతిజ్ఞ వలన యుద్ధము క్షత్రియనాశము తప్పించుటకై తన పురుష ప్రయత్నమును నిర్ణయించుకొనెను.

రాజసూయమునకు వచ్చిన రాజశ్రేష్ఠులందరు తమతమ రాజ్యములకు మరలిపోయిరి. బలరామకృష్ణులు ద్వారక కేగిరి. దుర్యోధనుడు శకునియు మాత్రమే రాజసూయము జరిగిన మయసభా విశేషములను తిలకించుటకు మిగిలిపోయిరి. సోదరామాత్య సహితుడై ధర్మరాజు కూడ పురమునకు వెళ్ళిపోయెను.

మూలము :-

> గతే ద్వారవతీం కృష్ణే సాత్వత ప్రవరే నృప
> ఏకో దుర్యోధనో రాజా శకునిశ్చాపి సౌబల:

తస్యాం సభాయాం దివ్యాయా మూషతుస్తౌ నరర్షభౌ
కృత మంగళ కల్యాణో భ్రాతృభిః పరివారితః
గతేషు క్షత్రియేంద్రేషు సర్వేషు భరతర్షభ
యుధిష్ఠిరః సహామాత్యః ప్రవివేశ పురోత్తమం
దుర్యోధనో మహారాజః శకునిశ్చాపి సౌబలః
సభాయాం రమణీయాయాం తత్రైవాస్తే నరాధిప ।

- మ.భా. సభా. 45 అధ్యా

దుర్యోధనుడు, శకుని యీ యిరువురు మాత్రమే ఆ సభలో నుండిరి. కనుక దుర్యోధనుడు మయసభలో కలయతిరిగి అవమానముల పాలైనపుడు వానిని చూచి నవ్వుటకు అచట ద్రౌపది లేనేలేదు, కృష్ణుడును లేడు.

వ॥ వివృతంబైన ద్వారదేశంబు సంవృతంబుగా
వగచి చొరనొల్లక సంవృతంబైన దాని వివృతంబుగా
వగచి చొరంబోయి లలాట ఘట్టితగృహ ద్వారుండయి
సమప్రదేశంబున్నతంబుగా వగచి యెక్కసమకట్టి
నీలాశ్మరశ్మిస్థగితంబైన విమలమణిస్థలంబు
జలాశయంబుగా వగచి పరిధానం బెగఁద్రోచికొని
స్ఫటికదీప్తి జాల పరివృతం బైన జలాశయంబు
స్థలంబుగా వగచి కట్టిన పుట్టంబు దడియం
జొచ్చి క్రమ్మఱిన వానింజూచి పాంచాలియుఁ
బాండుకుమారులును నగిరంత. ఆ.భా. సభా-2-86.

అని నన్నయగారు మూలమునకు విరుద్ధముగా పాంచాలియు నవ్వినదని వ్రాసిరి. వారికి లభించిన మూలప్రతిలో అట్లుండువచ్చునని తోచుచున్నది.

త్రోవలో దుర్యోధనుని చింతకు కారణమడిగిన శకునితో దుర్యోధను డిట్లు చెప్పెను.

"సోహం శ్రియం చ తాం దృష్ట్వా సభాం తాం చ తథావిధాం
రక్షిభిశ్చాపహాసంతం పరితప్యే యథాగ్నినా"

-మహా. భా .సా. ఆది. పు.476

శకుని మయసభలో దుర్యోధనుని భంగపాటునకు ప్రత్యక్షసాక్షియే కదా! ఆతనితో దుర్యోధనుడు నేనా ధర్మజుని యైశ్వర్యసమృద్ధిని జూచి, అపూర్వమయిన ఆమయసభను జూచి, ఆరక్షకులయొక్క అపహాసమును జూచి పరితపించుచున్నానని చెప్పెను. అంతేగాని ద్రౌపది తన భంగపాటునకు నవ్వినదని చెప్పలేదు. దుర్యోధనునికి ధర్మజుని యైశ్వర్యము, మయసభా వైభవమే సహింపరానిదయ్యెను.

వహ్నిమేవ ప్రవేక్ష్యామి భక్షయిష్యామి వా విషమ్
అపో వాపి ప్రవేక్ష్యామి న హి శక్ష్యామి జీవితుమ్

-మహా. భా .సా. పు. 476

నే నగ్నిలోనో, జలములోనో పడిపోదును, విషమునైనను తిందును జీవింపజాలనని ఎంతగానో విలపించెను. అపుడు శకునియు దుర్యోధనుని ఈ విధముగా నూరడించినాడు.

'ప్రవృద్ధస్తేజసా తేషాం తత్ర కా పరివేదనా'

-మహా. భా .సా. పు. 477

'దుర్యోధనా' వారి పరాక్రమముచే వారి సామ్రాజ్యమును వారు వృద్ధి కావించుకొనగా నీకెందు కీ విషాదము?

"దుర్యోధన న తేఽమర్షః కార్యః ప్రతి యుధిష్ఠిరమ్
భాగధేయాని హి స్వాని పాండవా భుంజతే సదా"

-మహా. భా .సా. పు. 476

ధర్మనందనుని ఐశ్వర్యమునకు నీవు అసూయపడుట యుక్తము కాదు. వారి యైశ్వర్యము పైతృకముకాదు కదా! స్వార్జితమగు వారి సామ్రాజ్య లక్ష్మికి నీకేల యీ పరితాపము అని హితమును బోధించి దుర్యోధనుని సామ్రాజ్యలక్ష్మిని గూడ వర్ణించి

నూర్వురు తమ్ములు నీకు వశమై యుండ భీష్మద్రోణులు నీసామ్రాజ్యలక్ష్మికి రక్షకులైయుండ పాండవులకు తీసిపోతినని బాధనొందనేల? నేనును కర్ణుడును నీకు వశమై యుంటిమి కదా! అని ఊరడించెను. ఇట్లూరడించుట ఆంధ్రభారతమున లేదు.

ధర్మరాజున కవబృథస్నానము జరిగినప్పుడును -

ధృష్టద్యుమ్నః పాండవాశ్చ సాత్యకిః కేశవోఽష్టమః
సత్వస్థా వీర్యసంపన్నా హ్యన్యోన్యప్రియ దర్శనాః
విసంజ్ఞాన్ భూమిపాన్ దృష్ట్వా మాం చ తే ప్రాహ సంస్తదా.

మ.భా. సభా 53 అధ్యా

మూలమున ధృష్టద్యుమ్నుడు, సాత్యకి, కృష్ణుడు పాండవులైదుగురు మొత్తమెనిమిది మంది తమ్ముచూచి నవ్విరని చెప్పినట్లుండగా ధృష్టద్యుమ్నుని వదలి ఆయనకు బదులు ద్రౌపదిని తెచ్చిపెట్టినారు నన్నయ్యగారు.

ఆ॥ యేను మొదలుగా మహీపతులెల్లను
దీప్తి దఱిఁగి యుండఁ దివిరిమమ్ము
నగిరి కృష్ణ పాండునందనద్రౌపదీ
సాత్యకులు ఁగరంబు సంతసమున

ఆ.భా. సభా. 2 అ.119

తుదకు మేనల్లుని యసూయదురాశలవలన జనించిన దుఃఖమును గ్రహించినాడు శకుని. పాండవరాజ్యలక్ష్మిని తెచ్చి మేనల్లునివశమొనర్తునని వాగ్దానము చేసినాడు.

కం॥ భాను ప్రభులగు పాండుమ
హీనాథాత్మజుల లక్ష్మి యెల్లను నీకున్
నేనపహరించి యిత్తు ధ
రానుత మాయా దురోదరవ్యాజమునన్

వ॥ ధర్మతనయుండు జూదంబునకుఁ బ్రియుండు
గాని యందుల యుక్కివంబెఱుంగం డే నక్ష
విద్యయం దతి దక్షుండ నాతని నశ్రమంబున
నోడించి తదీయ రాజ్యవిభూతి నీకిచ్చెద

వగవకుండుము.

ఆభా. సభా - 2 అ. 122-123

అని శకుని సుయోధనులిరువురును గ్రుడ్డిరాజును ఒప్పించి పాండవులను ద్యూతమునకు తోడ్కొని వచ్చుటకు విదురుని పంపించిరి.

## 2. ద్యూతమనర్థమని యెఱింగియు ధర్మజుడు ద్యూతమున కేల అంగీకరించెను?

ధృతరాష్ట్రుడు అది నెదయుచితము గాదని వగచుచు నాత్మజునకు నాహ్లాదముగా రమ్యముగా నొక సభ నిర్మింపజేసిన తరువాతనే విదురునితో సంప్రదించుటకు విదురుని రావించినాడు

విదురుండును :-

ఆ॥ ఇట్టి కార్యమునకు నేనవశ్యంబును
నొడఁబడంగనోప నుక్కివమున
సుతులతోడ నేల సుతులకు భేదంబు
చేయఁగడఁగితిదియు ఁజెట్టుయనక

తే॥ ఒలసి నీపుత్రులెల్ల వొండరులతోడ
వెట్లొడంబడి యుండుదు రట్ల చేయ
వలయుఁ దమలోన జూదంబు వాదునగుటఁ
గలహమూలంబ యెట్టి శాంతులకు నైన

వ॥ నీనేర్చు విధంబున శకుని దుర్యోధనుల దుర్వ్యవసా
యంబుడిగించి యుక్కురువంశంబు రక్షింపుమనిన

ఆ.భా. సభా-130-131-132

విదురుని వాక్యంబులు పెడచెవిని పెట్టి గ్రుడ్డిరాజు తనశాసనముగా పాండవుల రావింప విదురుని పంపెను. విదురుడును ఇంద్రప్రస్థపురంబునకేగి ధర్మజునిచే యభ్యర్చితుండై తాను తెచ్చిన ధృతరాష్ట్ర సందేశమును వినిపించెను. దానికి ధర్మరాజు

"ఓ మహనీయా? ద్యూతము కలహహేతువు, తెలిసిన వాడు దాని కిష్టపడునా? మేమిప్పు డేమి చేయుట యుక్త మనెదవు, నీమాటలకు బద్ధుల" మనెను. యుధిష్ఠిరుడు ద్యూతవ్యసనియగుచో నాహ్వానమందగనే బయలుదేరువాడు. కాని విదురునితో ద్యూతమువలని కీడును స్పష్టముగా పేర్కొని తన అనంగీకారమును వ్యక్తపరచినాడు. దానికి విదురుడు ఈ ద్యూతప్రయత్నము మాన్పుటకు తాను చేసిన విఫల ప్రయత్నమును వివరించి, ఏది శ్రేయమో దాని నాచరింపుము. క్షత్రియుడగువాడు యుద్ధమునకు గాని జూదమునకు గాని ఆహ్వానింపబడి నేను రానని నిరాకరించగూడదు. ఇది క్షత్రియధర్మము. కౌరవసభలో పరాభవింపబడిన ద్రౌపది దీనావస్థను జూచి సహింపజాలని భీమసేనుడు యుధిష్ఠిరుని నిష్ఠురోక్తులాడగా ఆతని ననునయించుచు అర్జును డీవిధముగానే చెప్పెను.

"ఆహూతో హి పరై రాజా క్షాత్రం వ్రతమనుస్మరన్
దీవ్యతే పరకామేన తన్నః కీర్తికరం మహత్"

-మహా. భా .సా. పు. 520

పరులాహ్వానించుటవలన క్షాత్ర ధర్మముననుసరించి ధార్మికుడగు మన సోదరుడు ద్యూతమున కంగీకరించెను. అది మనకు కీర్తికరమే. అది యట్లుండ ధర్మజునకది శాశ్వతవ్రతము. అదియునుగాక పదమూడు సంవత్సరములవరకును జ్ఞాతులు మొదలుగా గలవారు తన్నేమి యాజ్ఞాపింతురో దానిని తాను శిరసావహింతునని ప్రతిజ్ఞ చేసెను కదా? అందులో ఈ ఆహ్వానము తనకు పితృ సమానుడు అంతకంటె మిన్నయయిన పెద తండ్రియాజ్ఞయాయెను. మీరుటెట్లు? అతిక్రమ్య మర్యాదాం సేవితుం శీలం అస్య సః అతిదేవీ యుష్మద్దేహదారాదిక ఫణిష్యతీత్యర్థకృతహస్తః = యథేష్ట పక్షపాతనే కుశలం అని నీలకంఠీయవ్యాఖ్య, రాజాతిదేవీ కృతహస్తో మతాక్షః అని శకునికి రెండువిశేషణములు వాడబడినవి. రాజాతిదేవీ అనగా మర్యాద నతిక్రమించి ఆడువాడని యర్థము.

ఆ యీ విశేషణములలోని భావము యుధిష్ఠిరునికి రాబోవు అనర్థమంతయు కన్నులకు గట్టినట్లయినది. 'ధృతరాష్ట్రేణ చాహూతో కాలస్య సమయేన చ' అని మూలము. నేడు ధార్తరాష్ట్రులు దురాశాపీడితులై ఆహ్వానించినది మృత్యుదేవతను మాత్రమే.

ధర్మజుడు జూదరియని ద్యూతవ్యసనియనియు భ్రమించువారు కలరు. ద్యూతవ్యసని యైనచో జూదగాంఁడ్రపిలుపుతోడనే వచ్చిపడెడువాడు - ధృతరాష్ట్రుని యానతి యెందులకు? ధర్మజుడు పితృాజ్ఞను బట్టి వచ్చినవాడు కాని ద్యూతవ్యసనమునుబట్టి వచ్చినవాడు కాడు. లేక తన ద్యూతప్రౌఢిని ప్రదర్శించు సంకల్పముతో వచ్చిన వాడును కాడు. ధృతరాష్ట్రుని యాహ్వానమును, కాలప్రభావమును తన ప్రతిజ్ఞను, సమన్వయించుకొన్న ధర్మసూతి విదురుని యాహ్వానమునంగీకరించి హస్తినాపురమునకు తన సోదరామాత్యపురోహిత ద్రౌపదీసహితముగా పయనమయ్యెను. జూదమునకు పోవువాడు ద్రౌపదినేల తోడ్కొని వెళ్ళెనని ప్రశ్నింతురు. సర్వకౌరవ సంహారమునకు సమయమాసన్నమయినదని ధర్మజునకు తెలియును. దైవ నిర్ణయమయిన రాబోవు నుత్పాతమును ధర్మజుడెట్లును నివారింపజాలడు. కనుకనే సకల కౌరవసంహారమునకు ప్రధానకారణమయిన శక్తి స్వరూపిణియని గుర్తించియే తన తమ్ములతోపాటు ద్యూతమునకు ద్రౌపదిని తీసికొని వెళ్ళెను.

## ద్యూతసరళి

క॥ పరమసుఖోపాయంబునఁ
బరసంపద చేకొనంగఁ బడునేని నరే
శ్వర యంతకంటె మిక్కిలి
పురుషార్థంబెద్ది యొండు భూనాథులకున్

ఆ.భా. సభా. 2అ. 142.

దుర్యోధనుని పురుషార్థమిది. అతడు అసూయాగ్రస్తుడు. దురాశాపరుడు పరమలోభి, కుత్సితబుద్ధి మిక్కిలి సుఖోపాయము చేత పరుల సంపదను చేకొనుటయే వాని పరమావధి అందుకే యీ ద్యూతదురాలోచనము.

ద్యూతసభలో పాండవులు ప్రవేశించుటయే తడవుగా శకుని "యుధిష్ఠిరా! సభ సిద్ధముగా నున్నది. నీకై అందరు వేచి యున్నారు. ఇది సమయ"మని ఆహ్వానించెను అందుకు యుధిష్ఠిరుడు "ద్యూతము మోసము, పాపము. ఇందు పరాక్రమము గాని, నీతిగాని లేదు. నీవు ద్యూతమును శ్లాఘింతువేమి? జూదగాని మోసములోని ఘనత ప్రశంసాపాత్రము కాదు. శకునీ! ఘాతుకునివలె నీవు మమ్మపమార్గమున నోడింపబోకు"

మని పలికెను. దానికి శకుని నీవిట్లువచ్చి నన్ను మోసగానివలె తలచి భయపడుదు వేని ద్యూతమునుండి తొలగుమనెను. దానికి యుధిష్ఠిరుడు :-

ఆహూతో న నివర్తేయమితి మే వ్రత మాహితం
విధిశ్చ బలవాన్ రాజన్ ! దేవనం మే భవిష్యతి.

- మ.భా. సా.పు -490

జూదమునకు ఆహ్వానింపబడినవాడనై నేను నిరాకరించను. ఇది నా నియమము. విధి బలవత్తరమైనది కదా ! ఎవనితో నేను జూదమాడవలయును అని ధర్మజుడు ద్యూతమున దిగెను. అంతేకాని ధర్మరాజు ద్యూతపరవశుడై, వ్యసనియై ద్యూతమాడలేదు. ధర్మమునకు వశుడై విధి ప్రేరణచే ప్రతిజ్ఞాపాలనము కొరకు ద్యూతమాడెనే కాని వేరుకాదు.

దుర్యోధనుడు కల్పించుకొని ప్రతిపణముంచువాడనునేను, నా పక్షమున మా శకుని యాడును. దానిపై ధర్మరాజు ద్యూతమొకనిద్దై యుండ మరియొక డాడుట విషమముగానున్నది. అట్లేకానిమ్మనెను.

జూదమారంభమైనది. అతడు పందెమునందోటువడిన గాని ధర్మజుని చేతికి పాచికలురానేరవు. ఈ ద్యూతమున శకుని చేతినుండి ధర్మజునిచేతికి పాచికలందకుండగనే శకుని గెలుపొందుట జరిగినది. దీనినే విదురుడు శకునిని వర్ణించినపుడు మతాక్షః, కృతాహస్తః అని చెప్పినాడు ధర్మజుడు పందెమొడ్డుట 'జితం' అని శకుని పలుకుట శకుని జయమొందుటే గాని ఓటువడుట యనునది లేదు. ధర్మజుని సంపదనంతను శకుని గెలుచుకొన్నాడు, తరువాత క్రమముగా నకులుని, సహదేవుని, అర్జునుని, భీముని తుదకు తన్ను పణముగాపెట్టి ఓటువడినాడు. కాని నన్నయగారు మాత్రము సహదేవునే ముందుగా పణముగా పెట్టినట్లు వ్రాసినారు.

సహదేవనకుల వాసవసుత భీములఁ
గ్రమమున నలువురఁ గౌరవేంద్రుఁ
డొక్కొక్కయొడ్డున నొడ్డి తన్నును నొడ్డి
యుక్కితవంబున నప్పు డోటువడిన

ఆ.భా. సభా -2అ. 196.

ఇది మూలమునకు విరుద్ధము. మూలమున మాత్రము నకులునే ముందుగా పందె మొడ్డినట్లున్నది.

"శ్యామో యువా లోహితాక్షః సింహస్కంధో మహాభుజః
నకులో గ్లహ ఏకైకః విధ్యే తన్మమ తద్ధనమ్"

-మహా. భా .సా. పు. 496

అందగాడు ఎఱ్ఱని చారలుగల నేత్రాంత భాగములు కలవాడు, బలమైన భుజములు కలవాడు నకులుడు పందెము పెట్టబడుచున్నాడని మూలము. అతడు ద్రౌపదిని ఎత్తుకొనలేదు. తన్ను తా నోటువడి ధర్మజుడు మౌనము వహింపగా శకునియే ద్రౌపదిని ప్రత్యేకధనముగా నిర్ణయించి పణమునుంచుమని ధర్మజుని ప్రేరేపించెను.

మూలమున శకుని ధర్మజునితో

అస్తి తే వై ప్రియా రాజన్ గ్లహ ఏకోఽపరాజితః
పణస్వ కృష్ణాం పాంచాలీమ్ తయాఽత్మానం పునర్జయ

-మహా. భా.సా.పు.498

నీవోడి పోనట్టి ధనము నీభార్య యున్నది. ఆమెను పందెమొడ్డుము. నీవు గెల్చినచో నామెమూలమున నీదాస్యమును తొలగించుకొనవచ్చు"నని పల్కినాడు. "అధిప నీకు నొండుధనము కలదు మఱచితెట్లు కమలాక్షి పాంచాలకన్య నీకు ధనముకాదె" అని. (ఆం.భా.సభా-26.196) ధర్మజుడు మారుమాట్లాడలేదు. వివాదము చేయలేదు. తానప్పటికే జితుడు కనుక శకుని యానతిపై ద్రౌపదిని పణముగా పెట్టి ఓటువడెను. ఆంధ్రభారతమున "అలయక వెండియుం గడఁగి యక్షరతుండయి" ద్రౌపదిని పణముగా పెట్టినట్లు వ్రాసిరి. ఈ నన్నయకవీంద్రుల వ్రాత మూలమునకు విరుద్ధము. అక్షరతుడనగా ద్యూతవ్యసనుడన్నమాట. ఇట్టివ్రాతయే ఆంధ్రపాఠకుల మనమున ధర్మరాజు ద్యూతవ్యసనియను నపోహకుదోహదమైనది.

మూలమున

"యాదృశం ధర్మకామార్థసిద్ధి మిచ్ఛేన్నరస్త్రియం
తయైవం విధయా రాజన్ పాంచాల్యాహం సుమధ్యయా

గ్లహం దీవ్యామి చార్వంగ్యా ద్రౌపద్యా హంత సౌబల"

మ.భా. సా- పు. 498

నరుడు ధర్మార్థసిద్ధికై ఎటువంటి స్త్రీని భార్యగా గోరునో అటువంటి సౌందర్యవతియగు పాంచాలితో పందెమిడి అయ్యో నేను జూదమాడుచున్నానని ధర్మరాజు పరితపించెను. ఆసమయమున తా నస్వతంత్రుడు కనుకను, దాసుడుకనుకను, యజమానుని యాజ్ఞను శిరసావహింపక తప్పకపోవుట చేతను శకుని యానతిచొప్పున ద్రౌపదిని పందెమొడ్డెను గాని ద్యూతవ్యసనియై కాదు.

ద్రౌపది హస్తిపురప్రవేశము చేసిన తొలిరోజున నామెను వ్యాసుడిట్లు వర్ణించినారు.

యాజ్ఞసేనా: పరామృద్ధిం దృష్ట్వా ప్రజ్వలితామివ
స్నుషస్తా ధార్తరాష్ట్రస్య నాతిఈ ప్రమనసోఽభవన్

-మహా. భా .ఉ. ఆది. పు. 273

ద్రౌపది అగ్నికుండమునుండి ఆవిర్భవించిన పరాశక్తి, ఆమెది దివ్య దేహము కాని పార్థివదేహము కాదు పార్థివశరీరమనగా మనకున్న సామాన్య దేహము. పృథివీతత్త్వ ప్రధానమయినదన్న మాట. ఆమె భౌతికదేహమున ప్రకాశించుచున్న వినూత్న కాంతి. అది అలంకారద్రవ్యముల మైపూతచే వచ్చినది కాదు. అది దివ్యకాంతి. ఈశ్వరాజ్ఞచే తాపసతేజమున దివ్యదేహధారియై మాంసమయశరీరమున పెరుగక మంత్రపూత మయిన హవిస్సుచే వచ్చు యజ్ఞఫలమే ద్రౌపదియని వ్యాసభగవానులు 'యాజ్ఞసేని' యను పదమును వాడిరి. యజ్ఞకుండసముద్భవయని చెప్పుట ఆపదము స్వారస్యము. తరువాత పరామృద్ధిం అనుచోటకూడ ఆమెదేహకాంతి యొక్క ఉత్కృష్టతను పరాశబ్దముచే చెప్పి ద్రౌపది దివ్యత్వమును ప్రతిపాదించిరి. అంతేకాక ఆమె శరీరకాంతిని ప్రత్యేకముగ చెప్పక 'ప్రజ్వలితామివ' అని జ్వలించు అగ్నితేజమునకుపమించినారు' ద్రౌపది "చిదగ్నికుండ సంభూతా దేవకార్యసముద్యతా" దేవ కార్యమునకై యవతరించిన పరాశక్తియని వ్యాసహృదయము. సర్వకౌరవవినాశమను దైవకార్యమునకై యగ్నికుండమున నవతరించినది ద్రౌపది. అందుకే ఆమె ధర్మజుని వెంట జూదమునకు రావలసివచ్చినది.

తనబిడ్డలు పాండవరాజ్యలక్ష్మినంతను గెల్చుకొన్న మహోత్సాహమంతయు

ధృతరాష్ట్రుని హృదయకుహరమున దాగలేదు 'కిం జితం, కిం జితం' ఈ పందెము నందు గెలువబడినదేది అని ఉత్సుకుడై గ్రుడ్డిరాజు మరల మరల ఎదురునడుగు చుండెను. మూలము నందు :-

ధృతరాష్ట్రస్తు సంహృష్టః పర్యపృచ్ఛత్పునః పునః
కిం జితం కిం జితమితి హ్యాకారం నాభ్యరక్షత

మ.భా. సభా -ప్ర 500

ఈ ఘట్టమున ధృతరాష్ట్రుడు సంతోషముతోనున్నట్లు ఆంధ్రభారతమున లేదు. "ఎవ్వరేవస్తువులొడ్డిరని విదురునడుగుచుండె" అని మాత్రమే కలదు.

## ద్రౌపది విజితయా - ధర్మనిర్ణయము

దుర్యోధనుడు ద్రౌపదిని తోడ్కొని వచ్చుటకు ప్రాతికామిని పంపెను. అతడు పోయి ద్రౌపదితో ధర్మజుడు ధరణి రాజ్యమును తనయులను తమ్ములను తన్నును నిన్నును ఓడువడియెనని చెప్పెను. ధర్మజుడు తన్నుతా నోటువడిన పిమ్మటనే ద్రౌపది నోడినట్లే చెప్పెను. అయినను ఈ క్రమమును ద్రౌపది నిర్ధారించుకొనుటకై-

తే॥ మున్ను తన్నోటువడి మఱి నన్ను నోటు
వడియెనో నన్ను మున్నోటువడి విభుండు
క్రన్నఁదన్నోటువడియెనో యన్న నాకు
నెఱిఁగఁజెప్పుము దీని నీవెఱుఁగుదేని.

ఆ.భా. సభా-2అ. 209

ఎఱుగవేని నక్కితవునడిగివచ్చిచెప్పుమన్నది

మూలమున నిట్లున్నది :

"గచ్ఛ త్వం కితవం గత్వా సభాయాం పృచ్ఛ సూతజ
కింతు పూర్వ పరాజైషీ రాత్మాన మథవా ను మాం"

మ. భా.సా. - పు 508

ద్రౌపది ప్రాతికామితో "నీవు వెంటనే వెళ్ళుము అచ్చట సభ యందున్న జూదరియగు ధర్మరాజును ముందు తన్ను తానోడెనో నన్నోడెనో అడుగు" మనెను

ఈ ద్రౌపదీ ప్రశ్నయు అసందర్భమని కొందరాధునికులు ఆక్షేపించిరి. పైగా అలనాటి చంద్రమతి గాని దమయంతికాని అట్లు ప్రశ్నించిరా? అని తమ అతితెలివిని ప్రదర్శించిరి. కాని ఆనాటి సభా సదులెవ్వరు ఇది అసందర్భమైన ప్రశ్న యనలేదు. అది సుసందర్భమయినట్టియు ధర్మసూక్ష్మమిమిడి యున్నట్టియు ప్రశ్నకనుకనే సాక్షాత్తు దుర్యోధనుని తమ్ముడైన వికర్ణుడు సమాధానముచెప్పి ధర్మనిర్ణయము చేసెను. విదురునంతటి ధీశాలియు ధర్మనిర్ణయమును చేసెను. కాని వారి నిర్ణయములు అరణ్యరోదనములైనవి. ఈ ప్రశ్న సమాధానమునీయవలసిన ప్రశ్నకనుకను, ధర్మసూక్ష్మమిమిడియున్నది కనుకనే వారు సమాధానమును చెప్పిరి. భీష్ముడును సమాధానము సవిస్తరముగానే చెప్పెను. కాని స్పష్టముగా చెప్పలేదు. తుదకు భీష్ముడు తనయశక్తతనిట్లుగా చెప్పెను. ధర్మాధర్మవిచారణ వచ్చినప్పుడు కర్ణ దుర్యోధనాది బలవంతులు చెప్పినదే ధర్మమగును. దుర్బలుడు చెప్పినది ధర్మమయినను నధర్మమై పోవును. వికర్ణుని అధిక్షేపించుచు కర్ణుడును కొంత అసంబద్ధ ప్రలాపమును చేసెను. తుదకు దుర్యోధనుడు సహితము ఇది ప్రత్యుత్తరమీయదగిన ప్రశ్న కాదని కాని ఇది అప్రస్తుతప్రసంగమనికాని, అనలేదు.

ఇహైవాగత్య పాంచాలీ ప్రశ్నమేనం ప్రభాషతాం
ఇహైవ సర్వే శృణ్వంతు తస్యా శ్చేతసి యద్వచః

-మహా. భా .సా. పు. 508

ఇక్కడకు వచ్చియే యడుగవచ్చునని దుర్యోధను డనెను.

ఆంధ్రభారతమున :-

సందిగ్ధమయిన యర్థము
నింద ఉసన్నిధిన యడిగి యింద యెఱుంగన్
సుందరి పాంచాలేంద్ర సు
తం దోడ్కొనిరమ్ము పొమ్ము తడవకయనినన్

అనియే కలదు. హరిశ్చంద్రుడు ముందుగా చంద్రమతిలోహితాస్యులను విక్రయించి తన్నుతాను విక్రయించుకొనెను. నలుడు దమయంతిని జూదమున పణముగా నుంచలేదు ఓడిపోనులేదు. అందువలననే చంద్రమతీదమయంతులకీ

ధర్మసంకటమురాలేదు. కనుక ప్రశ్నింపలేదు. ద్రౌపదీవిషయమందుకు భిన్నము. అందు చేతనే ప్రశ్నింపవలసివచ్చినది.

ఇందు భార్యనొడ్డుట ఎట్టి దుష్కృతవుడును ఏనాడునూ చేయలేదే, నాభర్త అట్లు చేయునా అని. ఎవ్వరును దీనికి సమాధానము చెప్పలేదు. విదురుడు మాత్రము ద్రౌపదిదాసి కాదనినాడు, ఆమె అనధికారియై యున్న ధర్మజునిచే పణముగా నుంచబడినది నానిశ్చయమని తన యభిప్రాయమును ప్రకటించెను. దీని నెవ్వరునులెక్కసేయలేదు సరికదా దుర్యోధనుడు విదురుని నిందించెను. ధృతరాష్ట్రుని కుమారుడును దుర్యోధనునికి సోదరుడునైన వికర్ణుడు తీర్పును చెప్పెను. ధర్మరాజు జూదరియైన శకునిచే ప్రేరితుడై విధిలేక శకునియానతిచే ద్రౌపదిని పందెమొడ్డెను. అందులో గూడ నైదుగరకు భార్యయైయున్న ద్రౌపదిని పందెము పెట్టెను. ఆపై ముందు తన్నోడి యుండి ఆమెను పందెమొడ్డెను. అదికూడ స్వయముగా పెట్టక శకుని ద్రౌపదిని పణముగా పెట్టుమని నియోగించినప్పుడు పెట్టెను. ఇదంతయు జూడగా ధర్మజుడు వ్యసనియై యుండుట, జితుడై యుండుట, పరప్రవర్తితుడై యుండుట ద్రౌపది యైదుగురకు భార్యయై యుండుట అనుహేతు చతుష్టయమునుబట్టి యా ద్రౌపదీ పణము చెల్లదు. ఈ ద్రౌపదీదేవి జితురాలు కాదు. అని వికర్ణుడు తన నిశ్చయమును వెల్లడించెను.

భీష్మద్రోణాదులు స్పష్ట మైన ధర్మనిర్ణయమేల చెప్పలేదని విమర్శింతురు. వివాదగ్రస్తమయిన విషయములో నొకపక్షమువారు మాత్రమే దీని ధర్మమును చెప్పుమని ఉభయపక్షములవారి సమక్షములో మధ్యస్థుల నడిగినప్పుడు రెండవపక్షమువారట్లడుగ కుండుటయేగాక అందలి ధర్మమిది యని కలుగ చేసికొని చెప్పుచున్నవారి మాటలను తృణీకరించి తమదేధర్మమని నిశ్శంకగా ప్రవర్తించుచు ఆమధ్యవర్తులను లెక్కపెట్టకున్నపుడు వారి దధర్మ మని ఆమధ్యస్థులకు తెలిసియున్నప్పుడు కూడ వీరు మనము చెప్పినను వినరనియు నిన్నెవరడిగినారని తిరస్కరింతురనియు చెప్పబోరు. అట్లింతకు ముందు చెప్పిన విదురునియొక్కయు వికర్ణునియొక్కయు గతి యేమైనది? ఒకవేళ భీష్మద్రోణాదులు కల్పించుకొని ధర్మనిర్ణయము చేసినను వారిగతియు నింతే యగును.

అయినను ద్రౌపదీ ప్రశ్నకు భీష్ముడు సమాధానము చెప్పకపోలేదు.

న ధర్మసౌక్ష్మ్యాత్సుభగే వివేక్తుం
శక్నోమి తే ప్రశ్న మిమం యథావత్
అస్వ్యామశక్తః పణితుం పరస్వం
స్త్రి యాశ్చ భర్తుర్వ్యశతాం సమీక్ష్య
త్యజేత సర్వాం పృథివీం సమృద్ధాం
యుధిష్ఠిరో ధర్మమథో న జహ్యాత్
ఉక్తం జితోఽస్మీతి చ పాండవేన
తస్మాన్న శక్నోమి వివేక్తు మేతత్
ద్యూతేఽద్వితీయ శ్శకునిర్నరేషు
కున్తీసుతస్తేన విసృష్ట కామః
న మన్యతే తాం నికృతిం యుధిష్ఠిర
స్తస్మాన్న తే ప్రశ్న మిమం బ్రవీత్

మ.భా. వి.పు.401

అమ్మా! ధర్మము సూక్ష్మమగుటచే నీ ప్రశ్నకు ఇదమిత్థమని వివేచించి చెప్పలేకున్నాను. ద్యూతచర్య చూడగా విషమముగా కనబడుచున్నది. తన్నుతానొడ్డి ఆపై నిన్ను పణముగా పెట్టుటకు ధర్మజున కధికారమా కనబడదు. ఆపై పరులసొత్తయియున్న నిన్ను పందెమొడ్డుటకును అధికారము లేదు. ఇక భర్తతోపాటే భార్య అనుపద్ధతిని 'దాస భార్యాపి దాస్యేవ' అని యనుకొందమన్నను ఎవ్వడు పృథివి నైనను త్యజించును కాని ధర్మమునెంత మాత్రము త్యజింపనివాడో అట్టి ధర్మరాజు 'జితౌ స్వః' అని యనక 'జితోఽస్మి' అని యనుటచే తన్నొక్కడినే యోడినట్లును నీసంబధమందుతేనట్లును తెలిపి యుండెను. ఆ ధర్మజుని మాట యటుండనిచ్చి శకుని తాత్పర్యము నాలోచింతము. ద్యూతధర్మము నెరింగినవారిలో శకుని మొదటివాడు. అట్టివాడే ద్రౌపదిని పందెమొడ్డుమని విడిగా పందెముపెట్టించుటచే ధర్మజుని గెల్చుకొనుటలో ద్రౌపదిని గెలుచుకొన్నట్లేయన్న తాత్పర్యము శకునికి కలుగలేదు. ఇట్లు శకుని మతముప్రకారమే ధర్మజునిగూర్చిన గెలుపులో నీగెలుపు చేరలేదని తేలినది. అయినను శకుని అట్లు భావింపకుండెను. ధర్మజుడు కొట్టకొన

నిన్ను పందెమొడ్డుట కనధికారియై యుండియు తనంతట తానొడ్డక పరులయాజ్ఞచే నొడ్డుటను బట్టి అనధికారి యెటులొడ్డినాడని శంకించుటకు వీలులేదు, (వ్యాస భారతమునందలి శ్లోకములకు నీలకంఠీయవ్యాఖ్యానుసారమయిన భావమిది.). అని పలికినాడు భీష్ముడు. ద్రౌపదీమానసంరక్షణమయిన పిమ్మట కర్ణుని ప్రేరణపై దాస్యముచేయుటకొరకు దుశ్శాసనుడు లాగుచుండగా నామె మరల ప్రశ్నింపగా భీష్ముడు తిరిగి ప్రత్యుత్తరమిచ్చెను.

ఉక్తవానస్మి కల్యాణి ధర్మస్య పరమా గతి:
లోకే న శక్యతే జ్ఞాతుమపి విజ్ఞైర్మ మహాత్మభి:
బలవాంశ్చ యథా ధర్మం లోకే పశ్యతి పూరుష:
స ధర్మో ధర్మవేలాయాం భవత్యభిహత: పర:
న వివేక్తుం చ తే ప్రశ్న మిమం శక్నోమి నిశ్చయాత్
సూక్ష్మత్వా ద్గహనత్వా చ్చ కార్యస్యాఽస్య చ గౌరవాత్

మ.భా. వి.పు.403

"అమ్మా! నేను వివేచించి చెప్పలేనని ఇదివరలో చెప్పియే యున్నాను. ధర్మగతి సూక్ష్మమగుటచేనది యెంతవారికిని తెలిసికొనుటకు సుసాధ్యముకాదు. నీవు అజ్ఞత చేతనే చెప్పలేకుంటివా అని అడుగుదువేమో! కాదు. ధర్మాధర్మ విచారణ వచ్చినపుడు కర్ణ దుర్యోధనాదులు ధర్మమని చెప్పినదే ధర్మమగును. దుర్బలుడు చెప్పినది ధర్మమైనను అధర్మమై పోవును. అయితే నీవు బలవత్తురుడవు కనుక సత్యమును చెప్పుమందువా? సూక్ష్మమగుటవలనను, గహనమగుటవలనను, కార్యగురుత్వము వలనను, ఇదమిత్థమని వివేచించి చెప్పలేకున్నాను. నీవు జితురాలవు కావని చెప్పినచో నీకు జరిగిన అన్యాయమునకు కోపించి నీవు కౌరవవినాశము చేయుదువు. కనుక చెప్పినచో కౌరవవినాశదోషము, చెప్పకున్నచో ద్రౌపద్యవమానజన్యదోషము. ఈ రెంటిలో నేది మహాదోషమో నిర్ణయించుట యావశ్యకము. ఇందు ధర్మసూక్ష్మమిమిడి యున్నది. అందుచేత 'సూక్ష్మత్వాత్' అనునది హేతువు. ఒకవేళ కౌరవవినాశముచే దేవకార్యసిద్ధి యగుననుకొందమన్నను వధ్యులగు వారి అందర సంబంధము సమావేశము ఇచ్చట లేదు సరికదా పాండవులు నిరాయుధులు కనుక అది గహనము అనగా 'గహనత్వాత్' పాండవులు కౌరవులకు దాసులై యున్న స్థితిలో తన పతుల కధిపతులైన కౌరవులను

నశింపజేయుట ద్రౌపదీదేవికి కూడ దోషమే. కార్యముయొక్క గురుత్వమిట్లున్నది. కావున 'కార్యస్యాస్య చ గౌరవాత్' అను హేతువును చెప్పెను. అందుకే భీష్ముడు తన ధీశక్తితో చాల యోచించి ద్రౌపది యడిగిన ధర్మనిర్ణయమును సందేహాస్పదముగా నుంచి కౌరవ వినాశమెట్లును తప్పదుగనుక ద్రౌపది తన తపశ్శక్తిని వ్యయించుట కంటె ఓర్పు వహించుట మేలని భీష్ముడు తలంచెను. తుదకు

'యుధిష్ఠిరస్తు ప్రశ్నేఽస్మిన్ ప్రమాణమితి మే మతిః
అజితాం వా జితాం వేతి స్వయం వ్యాకర్తు మర్హతి'

- మ.భా. సభా. 68 అధ్యా

నీ ప్రశ్నకు సమాధానముగా నీవు జితురాలవనియో అజితురాలవనియో చెప్పగలవాడు యుధిష్ఠిరుఁడే యని చెప్పెను.

నన్నయగారి భారతాంధ్రీకరణమున నివేమియు లేవు. "అవ్వా! నీ ప్రశ్నంబునకు నుత్తరంబయ్యుధిష్ఠిరుండు సెప్పవలయు. కానినాడు ధర్మసూక్షత యెవ్వరికినెఱుంగ గహనంబు. దీని ఫలంబు వేగంబ యిక్కురుపాంసను లనుభవింతురు" అని మాత్రము చెప్పినారు.

- ఆం.భా. సభా-26-245

వికర్ణుని ధర్మనిర్ణయమును కర్ణు డధిక్షేపించెను గదా! ఆ కర్ణుని నిర్ణయమును కొంత పరిశీలింపవలసి యున్నది. కర్ణుని వాదమిది.

దాసుడు, పుత్రుడు, అస్వతంత్రురాలగు పత్ని అను ముప్వరును అధనులు. వారికి సొత్తు అనునది లేదు. అట్టి అధనుడైన దాసుని భార్య ఆ దాసుని పాలనలోనిది కాదు. అట్టి దాసుని ధనము కూడ ఆ దాసుని పాలనలోనిది కాదు. ఆ రెండును ఆ దాసునికి పాలకుడైన వానికి సమర్పింపవలసినదే. కనుకనే భార్య, దాసుడు, సుతుడు అనువారికి నాది అనదగినదేమియు లేదనియు, వారు సంపాదించినదేది యయినను వారెవ్వరి అధీనములో నుందురో వానికే చెందుననియు స్మృతి చెప్పుచున్నది. కనుక పతి జితుడైనప్పుడు పత్నియుః జితురాలే.

ఈతని వాదములో ధర్మజుడు జితుడు కాకున్నప్పుడే ఆమె జితురాలైనది చెప్పబడలేదు. ఈ వివాదములోని ప్రధానాంశమే అది. పాండవులు దాసులైనారనియు,

దాసులకు 'నాది' యనదగినదేదియు లేదని దాసభార్య దాసియే యని కదా కర్ణుని నిర్ణయము. అట్లయినచో దాసుడై 'నాది' అనదగినదేమియులేక ఆటకట్టయియున్న ధర్మజునిచే "పణ్యస్వ కృష్ణాం పాంచాలీమ్" అనుచు శకుని ద్రౌపదీ పణము నేల పెట్టించెను? ద్రౌపది యా ధర్మజుని సొత్తు కాదే! దుర్యోధనుని సొత్తయిపోయి యుండెనే. శకుని పొరపడినాడా? అప్పు డింత ధర్మమెరిగిన యీ కర్ణుడేమై పోయినాడు? దానికి విదురుని సమాధానమిది -

ఇమం ధర్మం కురవో జానతాఽశు
ధ్వస్తే ధర్మే పరిషత్ సంప్రదుష్యేత్
ఇమాం చేత్పూర్వం కితవో గ్లహిష్య
ధీరో భవిష్య దపరాజితాత్మా
స్వప్నేయథైత ద్విజితం ధనం స్యా
దేవం మన్యేయస్య దీవ్య త్యనీశః
గాంధారరాజస్య వచో నిశమ్య
ధర్మా దస్మా త్కురవో మాపయాత్.

టీక॥ యస్య యేన ధనే నానీశో దీవ్యతి. తత్ స్వప్నే
యథా ధనమాభాసితం తద్వదిత్యర్థః. "యస్యైతే
తస్య తద్ధనమ్" ఇతి స్మృతిస్తు దాసభావేర్జితమ్
ధనం స్వామి గామీత్యాహ - న తు తతః ప్రాక్తనమపీతి,
మా పయాత, మా గచ్ఛత".

 మ.భా. తత్త్వ. పు 1015

తాను పరాజితుడు కాక పూర్వము ఈ ద్రౌపదిని ధర్మజుడు పందెమొడ్డి యుండెనేని అప్పుడీమె మీకు దాసి కాదగి యుండును. పరాజితుడైనవానిచే పణముగా పెట్టబడిన వస్తువు స్వప్నముతో గెలుచుకొనినట్లు కనబడిన వస్తువుతో సమానము. దాసునకు నాది యనదగిన వస్తువనునది ఏదియు లేదనియు, ఎవ్వరికాతడు దాసుడో అతనికే ఆదాసుని సొత్తు చెందునని చెప్పెడి స్మృతి దాసుడైన తరువాత నాతడు

సంపాదించిన సొత్తును గూర్చి చెప్పుచున్నది గాని దాసుడు కాక పూర్వమే అతనికున్న సొత్తునుగూర్చి చెప్పుటలేదు. కనుక కర్ణుని నిర్ణయమునందు పస లేదు. నిరాదరణీయము. ఈ విషయము కవిత్రయ భారతమున ననూదితము కాలేదు.

తుదకు ద్రౌపదిని సభ కీడ్చుకొని తెచ్చుటకు దుర్యోధనుడు తన సోదరుడైన దుశ్శాసనుని నియమించినాడు. అతడు బలాత్కారముగా ద్రౌపదిని ఈడ్చుకొని తెచ్చుటకు ప్రయత్నింపగా ద్రౌపది "రజస్వల నన్ను ముట్టకు యేకవస్త్రనయి యున్నదాన గురుబంధు జనాధిష్ఠంబైన సభకెట్లు రానేర్తు ...... అని పలికినది. ఇది ఆంధ్ర భారతము నందలి కథనము. అంతకు ముందరి వచనమున "దుర్యోధను దుశ్చేష్టితంబునకును ధర్మరాజు సమ్మతంబునకును వెఱచి యక్కోమలి ప్రాతికామి పిఱుంద న నేక వస్త్రయు నధోనీవియు నవిరళగళిత నయనోదక బిందు సందోహ పరిపీడ్యమాన పీనస్తన పరిధానాంతరయునగుచు సభకుం జనుదెంచి" ........ అని యున్నది.

-ఆం.భా-సభా-2అ.315.

ఆమె ప్రాతికామి వెంట సభకు రాలేదు. ఒకవేళ ప్రాతికామి వెంట వచ్చినచో దుర్యోధనుడు మరల దుశ్శాసనునేల పంపెను? తెలుగు భారతమునందలి రెండు వాక్యములు పరస్పర విరుద్ధములుగా నున్నవి. కథ కలువలేదు. ఇట్లుండ దుర్యోధనుని పట్టుదలను గమనించి ధర్మజుడు నమ్మకమైన ఒక దూతను సందేశముతో ద్రౌపది కడకు పంపెను. ఆ సందేశములో నీవు రజస్వలవైయున్నను అట్లే వచ్చి ధృతరాష్ట్రుని యొద్ద నుండుము. పెద్దలగువారు తమ యంతఃకరణములందు దుర్యోధనునే నిందింతురు. నీవు మాత్రము రాకుండనుండవద్దు అని.

"ఏకవస్త్రా త్వధోనీవీ రోదమానా రజస్వలా
సభామాగమ్య పాంచాలి శ్వశురస్యా గ్రతో భవ"

-మహా. భా .తత్త్వ పు 620

పై శ్లోకమునకు భావమేమన ద్రౌపది రజస్వలయై యున్నందున తదనుగుణమైన ఏకవస్త్రా నధోనీవ్యాదిధారణమయిన రజస్వలా వేషముతోడనే సభలోనికి వచ్చి ధృతరాష్ట్రుని చెంత నుండుము. సభామర్యాదోచితమయిన వేషమక్కరలేదు. రాకుండ నుండవద్దు, నీవట్టి దురవస్థలో నుండగా నిన్ను బలాత్కారముగా సభకు రప్పించినవారే అపఖ్యాతి పాలగుదురని. రజస్వలా స్త్రీకి రజఃప్రవృత్తి మొదలు శుద్ధి పర్యంతము

ఏకవస్త్రమేకాని దానిని మార్చి వస్త్రాంతరము కూడదు. కనుకనే ఆమె ఏకవస్త్ర యనబడినది. రజస్వలావ్రతములుపదేశించుటలో "త్రిరాత్రం మలవద్వస్త్ర ధారణం న స్నాయాత్" అని చెప్పబడినది. అధో నీవీ అనునప్పుడు ఈ నీవీ శబ్దమునకు కటి సూత్ర స్థానీయమైన కౌపీనాధారమైన వస్త్రఖండమర్థము. అది యా సమయమున స్త్రీధార్యమై యుండును. అది వస్త్రాధోభాగమందుండును కనుక అధో నీవి యనబడినది. (A piece of cloth wrapped round the waist, especially as worn by woman అని వామన పురాణమున మోనియర్ విలియమ్స్ అను పండితునిచే చెప్పబడినది.) అనగా ధర్మజుడు ద్రౌపదికి పంపిన సందేశ సారాంశమేమనగా ఏకవస్త్రవై, అధోనీవివై రోదనవై రజస్వలవై సభకు రాదగని స్థితిలో నున్నను తప్పక సభకు రమ్మని బోధించెను.

ద్రౌపదీ వస్త్రాపహరణ ప్రయత్నమగుటయు ఆమె ప్రార్థనపై శ్రీకృష్ణ పరమాత్మ అనంత వస్త్రములు ప్రసాదించి రక్షించుటయు జరిగెను. ఈ దుష్కార్యమునకు ఫలముగా అనేకములైన ఉత్పాతములు గోచరించినవి. ధృతరాష్ట్రుని అగ్ని గృహ ప్రాంగణమున నక్కల కూతలు, గాడిదల యరపులు, రౌద్రములైన పక్షుల భయంకర ధ్వనులు వినబడెను. ఈ ఘోరమైన ఉత్పాతములను గాంచి విదుర గాంధారీ భీష్మ ద్రోణ కృపాచార్య ప్రముఖులు కౌరవవినాశము సమీపించినదని ధృతరాష్ట్రుని కెరింగించిరి. మేధావియైన ధృతరాష్ట్రుడు రాబోవు ఆపదలనుండి తన బిడ్డలను కాపాడదలచి ద్రౌపది నూరడించి యామెకు వరములు కోరుకొమ్మనెను. ధర్మరాజు దాస్య విముక్తుడగుట మొదటి వరము. రెండవ వరముగా మిగిలిన నల్వురు పాండవులు తమ తమ ఆయుధములతో దాస్య విముక్తులగుటయు కోరెను. అట్లే యిచ్చితి మూడవ వరము కోరుకొమ్మనెను, అందుకు ద్రౌపది నిరాకరించి యిట్లు చెప్పెను.

వైశ్య పతికి నొక్క వరము సక్షత్రియ
సతికి రెండు శూద్ర సతికి మూడు
విప్రసతికి నూఱు వేఁడఁ జన్వరములు
గాన యింక వేడగాదు నాకు.
అని పలికినది. -ఆ.భా. సభా.2అ.263.

మూలమున -

లోభో ధర్మస్య నాశాయ భగవన్నాహ ముత్సహే
అనర్హా వరమా దాతుం తృతీయం రాజసత్తమ
ఏకమాహు ర్వైశ్యవరం ద్వౌ తు క్షత్రస్త్రియో వరౌ
త్రయస్తు రాజ్ఞో రాజేంద్ర బ్రాహ్మణస్య శతం వరాః.

మ.భా. సా. సభా. పు 536

ఓ మహారాజా! లోభము ధర్మమును నశింపజేయును. మూడవ వరము పొందుటకు నేను తగను. వైశ్యునకు ఒక వరము, క్షత్రియ కాంతకు రెండు వరములు, రాజునకు మూడు వరములు, బ్రాహ్మణునకు నూరు వరములని చెప్పబడినది.

కౌరవులచే నామె జయింపబడలేదు కనుక ఆమె విజిత కాదు, దాసి కాదు. ఆమెకు దాస్యము లేదు. అందుచే నామె తన దాస్య విముక్తిని గోరనులేదు, ధృతరాష్ట్రుడు ద్రౌపదీ దేవికి దాస్య విముక్తిని ప్రసాదించను లేదు.

పునర్ద్యూతము :- ఇట్లు పాండవులు వరప్రాప్తిచే దాస్యము తొలగి తమ సంపద్వైభవములతో నింద్రప్రస్థమునకు బయనమయిరి. కాని దుష్టచతుష్టయపు దురూహతో ధృతరాష్ట్రునొప్పించి విదురగాంధారీ భీష్మలెంత నిరోధించినను లక్ష్యపెట్టక పుత్ర వ్యామోహమునకు బద్ధుడై కౌరవ వినాశమునకు మూలమైన అనుద్యూతమునకు రావలసినదిగా ధర్మరాజునకు వర్తమానమును పంపెను. పాండవులింద్రప్రస్థమును చేరనేలేదు. మార్గమధ్యముననే తమ పెదతండ్రి మరల జూదమునకు రమ్మన్న పిలుపందినది. ఒకమారు జూదమున సర్వస్వమును గోల్పోయిన ధర్మరాజు అనర్థ దాయకమయిన జూదమున కేలవచ్చెను?

ధాతుర్ని యోగా ద్భూతాని ప్రాప్నువంతి శుభాశుభం
న నివృత్తి స్తయో రస్తి దేవితవ్యం పునర్యది
అక్షద్యూతే సమాహ్వానం నియోగాత్ స్థవిరస్య చ
జానన్నపి క్షయకరం నాతిక్రమితు ముత్సహే
మృగం సువర్ణం నాస్తీతి రామస్యావిదితం కిము
ఇతి బ్రువన్నివవృతే భ్రాతృభి స్సహ పాండవః
జానంశ్చ శకునేర్మాయాం పార్థో ద్యూతమయాత్పునః

మ.బా. సా. సభా. పు .

భూతకోటికి శుభాశుభ ప్రాప్తి విధి బలమున కలుగును. ఇంకను జూదమాడ వలసియున్న యెడల నది యింకను నివర్తింప బడలేదన్నమాట. పెద్దవాడగు తండ్రి యొక్క ఆజ్ఞ ఇట్లున్నదా? జూదము నాశహేతువని తెలిసియు తండ్రి యాజ్ఞను నేను అతిక్రమింపజాలకున్నాను. బంగారులేడి యుండదని శ్రీరామునకు తెలియదా ఏమి? అయినను మాయాలేడి వెంట ఏల పరిగెత్తెను? విధి అనుల్లంఘనీయము. బిచ్చగాండ్రు వచ్చి యాచింతురని అన్నమే వండకుందుమా? లేళ్లు వచ్చి పైరుమేయునని విత్తుటయే మానుదుమా? కాన దోషమును గూర్చి ప్రతిక్రియ చేయవలయునేగాని అసలు పనిని మానగూడదని వితర్కించుకొని శకుని యొక్క మాయను ఎఱింగియు, సోదరులతో గూడి ధర్మరాజు పునర్ద్యూతమునకు హస్తినాపురమునకు వచ్చెను. జూదములో ఓడినచో పండ్రెండు సంవత్సరములరణ్యావాసము అజ్ఞాతవాసము జనపదములలో చేయవలయును. అజ్ఞాతవాస కాలములో నెరుగబడినచో మరల పన్నెండేండ్ల వనవాసము ఒకయేడజ్ఞాతవాసము ఓడినవారు చేయవలెను. పదమూడు సంవత్సరములు విజయవంతముగా నరణ్యావాస అజ్ఞాతవాసములు పూర్తి చేసినవారు మరల రాజ్యమును పొందగలరు.

> "త్రయోదశే చ నిర్వృత్తే పునరేవ యథోచితం
> స్వరాజ్యం ప్రతిపత్తవ్యం ఇతరై రథవేతరైః"

-మహా. భా .సా. పు 548

వెనుకటి వలెనే శకుని చేతికే పాచికలు వచ్చినవి, ధర్మరాజు పందెమున నోడినాడు పాండవులరణ్య వాసమున కేగినారు.

## ధర్మరాజు ద్యూత వ్యసనియా?

ధర్మరాజు ద్యూతవ్యసని యనియు అందువలననే సుహృద్ద్యూతమునకు పునర్ద్యూతమునకు వెళ్ళి జూదమున పాల్గొని యోటువడెనని చెప్పుదురు. ఇది వాస్తవము కాదు. క్షత్రియునకు ధర్మయుద్ధము వలెనే ధర్మద్యూతము కూడ క్షాత్రధర్మమే. ఇందలి ధర్మ తత్త్వమెట్లు గోచరించును. ద్యూతము వ్యసనములలో చేరినదే యైనను అధర్మము కాదు. యుద్ధమునందలి జయాపజయములెట్లు స్వస్వపరాక్రమ నైపుణ్యా పుణ్యాధీనములో యటులనే ద్యూతము నందలి జయాపజయములు కూడ తత్క్రీడా

పాటవ నైపుణ్య పుణ్యాధీనములు. యుద్ధము హింసా జయరంగము కాగా ద్యూత మహింసా జయరంగము. రెండింటను నిర్వహణ పాటవము సమానము. కావుననే క్షత్రియులకు ధర్మమై పిలువబడి పోకుండుట యధర్మముగానే ధర్మజాడు భావించినట్లున్నది.

"ఆహూతో ఒహం న నివర్తే కదాచిత్
తదాహితం శాశ్వతం వై వ్రతం మే"

మ.భా తత్త్వ ను 605.

యుద్ధమునకుగాని ద్యూతమునకుగాని ఆహ్వానింపబడినప్పుడు నేను నిరాకరింప ననునది నా శాశ్వత వ్రతమని ధర్మజాడు పలికెను.

కౌరవ సభలో పరాభవింపబడిన ద్రౌపది దీనావస్థను జూచి సహింపజాలని భీమసేనుడు ధర్మజాని నిష్ఠురోక్తులాడగా అర్జును డాతనినీక్రింది విధమున ననునయించెను.

ఆహూతో హి పరై రాజా క్షాత్రం వ్రత మనుస్మరన్
దీవ్యతే పరకామేన తన్నః కీర్తికరం మహత్

-మభా-సా.పు 520

పరులాహ్వానించుటవలన క్షాత్రవృత్తము ననుసరించి ధార్మికుడగు మన సోదరుడు ద్యూతమున కంగీకరించెను. అది మనకు కీర్తికరమే అని అనగా ద్యూతము క్షాత్రధర్మమనుట విదితము.

అజ్ఞాతవాసకాలమున కంకుభట్టు రూపమున విరాటుని కొలువులో విరాటునితో నెల్లప్పుడు జూదమాడెడువాడు కదా! అనియు నాక్షేపము. వాస్తవమునకు ధర్మరాజు ధృతరాష్ట్రుని యాహ్వానమును కాలప్రభావమును, తన ప్రతిజ్ఞను సమన్వయించుకొనియే సుహృద్ద్యూతమునకు వచ్చెను. పునర్ద్యూతమునకు కూడ తానెంతగానో వితర్కించు కొనియే వచ్చెను. ద్యూతవ్యసనియైనచో జూదరులు పిలిచినదే తడవుగా వచ్చిపడెడు వాడు. అందుకు ధృతరాష్ట్రుని యానతి యెందులకు. ధర్మజాని వ్రతమిది.

"పితా మాన్యో గురుశ్శ్రేష్ఠో యదాహ పృథివీపతిః
అశంకమానై స్తత్కార్య మస్మాభిరితి నో వ్రతమ్".

-మహా. భా .తత్త్వ. పు. 611

పూజ్యుడు, శ్రేష్ఠుడునైన తండ్రి తమకేమి చెప్పినను నిశ్శంకగా చేయుటే ధర్మజుని వ్రతము. కనుకనే ధృతరాష్ట్రుడు వారణావతమునకు వెళ్ళి యుండుడనగా నట్లేయని వెళ్ళియుండిరి. అర్ధరాజ్యము తీసికొని ఖాండవప్రస్థమందుండుడనగా నట్లే చేసిరి. సుహృద్ద్యూతమునకు రండని కబురంపగా నట్లే వచ్చి ఇష్టము లేకున్నను ద్యూతములో పాల్గొనిరి. తరువాత మీమీ ఆయుధ వాహనాదులతో మీరు వెళ్ళుడని పంపగా నట్లే వెళ్ళిరి. అంతలోనే మరల పునరుద్ద్యూతమునకు రమ్మని కబురంపగా నట్లే వచ్చిరి.

ఆంధ్ర భారతమున నన్నయ కవీంద్రులు -

"అలయక వెండియుం గడఁగి యక్షరతుండయి ద్రౌపదిం మహో
త్పల దళ చారునేత్రఁ గులభామఁ బణంబుగఁ జేసి యొడ్డి.
...... ...... ...... ......"

ఆ.భా-సభా-2అ.197

అని అక్షరతుండై ద్రౌపదిని యుధిష్ఠిరుడు పందెమొడ్డినట్లుగా వ్రాసిరి. ఇది మూలమునకు విరుద్ధము. అక్షరతుడనగా ద్యూతవ్యసని యని. ఈ వ్రాతయే ఆంధ్ర భారతము చదివినవారి మనములందు ధర్మరాజు జూదరియను నపోహకు కారణమైనది.

మూలమున-

యాదృశం ధర్మకామార్థసిద్ధి మిచ్ఛేన్నర స్త్రియం
తయైవం విధయా రాజన్ పాంచాల్యాఽహం సుమధ్యయా
గ్లహం దీవ్యామి చార్వంగ్యా ద్రౌపద్యా హంత సౌబల.

-మభా-సా.పు 498

నరుడు ధర్మార్థసిద్ధికై ఎటువంటి స్త్రీని భార్యగా గోరునో అటువంటి సౌందర్యవతి యగు పాంచాలితో పందెమిడి అయ్యో! నేను జూదమాడుచున్నానని ఆక్రోశించెను. ఆ సమయమున తానస్వతంత్రుడు కనుకను, దాసుడు కనుకను యజమాని యాజ్ఞను శిరసావహింపక తప్పక పోవుట చేతను వివాదము చేయక శకుని యానతిపై ద్రౌపదిని పందెమొడ్డెను. అంతేకాని ద్యూతవ్యసనియై కాదు.

అజ్ఞాతవాస కాలమున ధర్మజుడు విరటుని కొలువులో నెల్లపుడు పాచికలాడు చుండెడువాడు కదా? మరి ద్యూతవ్యసని ఏల కాడు అను ప్రశ్నకు సమాధానము. అరణ్య అజ్ఞాతవాస కాలముల తరువాత కౌరవులెట్లును పాండవులకు రాజ్య భాగమీయరు సరికదా అజ్ఞాతవాస కాలమున పాండవుల యునికిని కనిపెట్టివారికి వ్రతభంగము కలిగించి మరల అడవులకు పంపవలెనని దుర్యోధనుడెన్నియో ప్రయత్నములను చేసెను. ఈ కాలమున దుర్యోధనుడు యుద్ధ సన్నద్ధుడై గొప్ప సైన్యమును సమీకరించెను. శల్యుని సైన్యమును, తుదకు శ్రీకృష్ణుని సైన్యమును కూడ తన పక్షమున పోరాడు నేర్పాట్లు సాధించెను. తాను స్వయముగా మూడు సంవత్సరములు కష్టించి గదాయుద్ధమును బలరామదేవునియొద్ద నభ్యసించి లోహముతో భీమవిగ్రహమును చేయించి గదా యుద్ధమును సాధన చేసెను. అదియునుగాక యుద్ధమున పాండవులను గెలువజాలమని దుర్యోధనునకు తెలియును. ధర్మజునకు కూడ కౌరవులు యుద్ధమున తమ్ము గెలువజాలరని తెలియును. ధర్మజుని మరల జూదమాడించి జయించి అడవులకు పంపుటే చక్కని మార్గమని దుర్యోధనుని సంకల్పము. భారత యుద్ధమున ద్రోణునికి సైన్యాధిపత్యము నొసంగిన వెంటనే ద్రోణుడు దుర్యోధనుని ఒక కోరిక కోరుమనినాడు. అంత దుర్యోధనుడు ధర్మజుని ప్రాణములతో పట్టితెచ్చి తన కప్పగింపుమని కోరినాడు. ధర్మజుని మరల జూదమున నోడించి అడవులకు పంపునట్లు. యుద్ధమున నెట్లును పాండవుల గెలువజాలము. ఒకవేళ యుద్ధమున పాండవులందరు మరణించినను శ్రీకృష్ణుడూరకుండడు. కౌరవులను తన చక్రాయుధముచే సంహరించి కుంతికైనను పట్టము కట్టునని దుర్యోధనుడు పలికినాడు. కనుకనే ధర్మరాజుకూడ బృహదశ్వమహర్షివలన అక్ష హృదయము నుపదేశమునొందినాడు. అజ్ఞాతవాస కాలమున విరాట రాజుతో నెల్లప్పుడు పాచికాలాడి తన అక్ష విద్యా కౌశలమునకు మెరుగులు దిద్దుకొన్నాడు. అరణ్యవాస అజ్ఞాతవాస కాలమందు అరుదైన బహు సుందరమైన పాచికలను ధర్మజుడు తన వెంటనే ఉంచుకొన్నాడు.

'కంకో నామ ద్విజో భూత్వా మతాక్షః ప్రియదేవనః'

అని వ్యాసులు వర్ణించినారు. మతాక్షః = బృహదశ్వాత్ జ్ఞాత అక్షతత్త్వః - అః

నీలకంఠుల వ్యాఖ్య. కావుననే ధర్మజునియొద్ద ద్యూతక్రీడకు పనికివచ్చునట్టి పాచికలును ఆపాచికలను రక్షించునట్టి పై ఫలకమునుకూడనున్నది. కాని ఆఫలకమును పాచికలును సామాన్యజూదరులయొద్ద నుండునట్టివి గాక విరాటునకుకూడ ఆశ్చర్యము కలిగించి నీలపీతాది వర్ణములతో కన్పట్టుచు చూడ ముచ్చటై యున్నవి. ఆపాచికల వర్ణమొక్కటే యయ్యును నాలుగువర్ణములై కన్పట్టుట వానిలోని ప్రత్యేకత, వ్యాసభగవాను లిట్లు వర్ణించినారు.

"కృష్ణాక్షాన్ లో హితాక్షాంశ్చ విద్యుత్ స్యామ మనోరమాన్
వైడూర్యాన్ కాంచనాన్ దాంతాన్ ఫలైర్జ్యోతీరసైస్సహ"

 మ.భా. ఉ. విరాట పు 190

బంగారపు చాయగలిగి, పాదరసవర్ణమున మిళితమై ఆపాచికలవర్ణము మనోహరమై యున్నదట "జ్యోతింషి చ, రసాశ్చ జ్యోతీరసా:" జ్యోతీశబ్దము లోహితవర్ణమును, రసశబ్దము తెలుపువర్ణమును చెప్పగా ఆరెండురంగులుకలిపి నాలుగు వర్ణములు కలవియనునట్లునవి. అట్టిపాచికలచే రాజును, అమాత్య అనుచరవర్గమును, రాజబంధువులను ధర్మజుడు మిక్కిలిగా రంజింపజేసెను అని తాత్పర్యము.

కనుక ధర్మసూతి ద్యూతవ్యసని కానేకాడు సరికదా దుర్మార్గుడైన దుర్యోధనుని వ్యూహమును ప్రతివ్యూహమును రచించినాడని గ్రహించవలెను.

## కౌరవ సభలో ద్రౌపదీ వస్త్రాపహరణము ధర్మసమ్మతమా?

ధర్మజుడు తానోడి భార్యనోడుట అపూర్వము. హరిశ్చంద్రుడు భార్యనమ్మి తానమ్ముడు వోయెను కనుక వారి భార్యాభర్తృత్వ సంబంధమునకు బాధలేదు. గృహకర్మకరణమునకు మాత్రమే ఆ దాసత్వము పరిమితము. అతడు యోగ్యుడైన సద్బ్రాహ్మణున కమ్మెను. బ్రాహ్మణ ఋణవిముక్తికై యమ్మెను. ఇక నలుడో దమయంతిని ద్యూతమున పందెమొడ్డలేదు ఓడిపోనులేదు. అయినను ద్యూతమున నోటువడిన నలునికి వస్త్రాపహరణము తప్పలేదు. ఆ పనిని స్వర్ణపక్షులు చేసినవి.

యాజ్ఞవల్క్యస్మృతి మితాక్షరప్రకరణమున దాసులభేదములు పదునైనదనియు నందు పరిణేజితుడొకడనియు వాని స్వరూపమును "యద్యస్మిన్ వివాదే పరాజితో హం తదా త్వద్దాసో భవామీతి పరిభాష్య జిత:" అని చెప్పబడినది. ద్యూతమునందు సర్వమోడినవాని భార్యాపుత్రాదుల నవమానించి భంగపరచుట సాధారణవిషయము.

ఋ॥ అన్యే జాయాం పరిమృశన్త్యస్య
యస్యా గృధద్వేదనే వాజ్యక్షః
పితా మాతా భ్రాతర మేనమాహుః
న జానీమో నయతా బద్ధమేనమ్.

ఋగ్వేదము. అక్షసూక్తము. మం. 10.3సూ

బలీయవిధివంటి యక్షము ఏ కితవుని ధనము నోడించునో ఆ కితవుని భార్యను ప్రతికితవులు కేశాకర్షణ వస్త్రాకర్షణాది క్రియలచే స్పృశించి మానభంగముగావింతురు తండ్రియు తల్లియు సోదరులు నాతనిబంధించి తీసికొని మీ యిచ్చవచ్చినచోటికి గొనిపొండని ప్రతికితవు చెప్పుదురు.

ఋ॥ ప్ర మాయు జే ప్రయుజో జనానాం
వహామి స్మ పూషణ మన్తరేణ
విశ్వేదేవా సోఽ అథ మా మరక్షన్
దుఃశాసు రాగా దితి ఘోష ఆసీత్.

జననాయకులు నన్ను పిలువనంపిరి. నేనెండవేడిని మోయుచుంటిని. దేవతలందరు తరువాత నన్ను రక్షించిరి. దుశ్శాసనుడు వచ్చెనని పెద్ద గోల వినబడెను. కాని ఆ తరువాత దుశ్శాసనుడు వెళ్ళిపోయెనని పెద్దగోల వినబడెను.

ఋ॥ సంమా తపస్త్యభి తస్సపత్నీరివ పర్శవః
నిపాతతే అనుతిర్నగ్నతా। జసుర్వేర్నవేవీయతే మతిః

శత్రువులవలె పర్శువులు చుట్టుముట్టి నాపై బడుచున్నారు. బుద్ధిహీనయు(వ్యక్తి) వస్త్రములేమిచే నేర్పడిన నగ్నతయును నన్ను బాధించుచున్నవి. వ్యాధ భయమున పక్షి వణకినట్లు నామతి కంపించుచున్నది.

ఋ॥ కురుశ్రవణ మావృణి। రాజానం త్రసదస్యవం
మంహిష్ఠం వాఘతాం ఋషిః॥

త్రసదస్యు పుత్రుడై రాజై మహాధనదాతయునైన కురుశ్రవణుని ఋషియైన నేను ఋత్విజులకై ధనముల నర్థించెదను.

పైనుదహరించిన ఋగ్వేదమునందలి అక్షసూక్తఋక్కులను సామూహికముగా పరిశీలించినచో నవి ధర్మజుని ద్యూతమును ద్రౌపదికేశాకర్షణ వస్త్రాపహరణాదులను

వ్యక్తీకరించి ఇంత జరిగినను ద్రౌపది :-

> ధర్మే స్థితో ధర్మసుతో మహాత్మా
> ధర్మశ్చ సూక్ష్మో నిపుణోపలక్ష్యః
> వాచాపి భర్తుః పరమాణుమాత్ర
> మిచ్ఛామి నోష న గుణాన్విసృజ్య.

మ.భా. సభా -67-38

అని ధర్మజుని కనువ్రతగానే యుండుటను సూచించినట్లు వ్యక్తమగును. "దుఃశాసు-కురుశ్రవణ" శబ్దములు ప్రయుక్తములగుట గూడ నిందుకు తోడ్పడుచున్నది. పై ఋక్కులు కితవుల యొక్క సామాన్యవ్యవహారమును చెప్పినవే యైనను ఆవ్యవహారము కొంతవరకు మహాభారత వ్యవహారమును ప్రతిఫలించుచున్నది.

ద్యూత క్రీడ నింద్యమనియు పాపమూలకమనియు ద్యూతమున నోటుపడినవారిక అమానుషమయిన పరాభవములు కలుగుననియు తెలియజెప్పుటే పై ఋగ్వేద సూక్తులప్రయోజనము కాని ద్రౌపదీకేశాపకర్షవస్త్రాపహరణాదులు వేదవిహితములని భ్రమింపరాదు.



# 10. రాజ్యము కౌరవులదా? పాండవులదా?

**1.** గ్రంథ విషయము :

ఆధునిక విమర్శకులు నవీన భావములచే ప్రభావితులై రాజ్యము కౌరవులదేయనియు, ధృతరాష్ట్రుడు జ్యేష్ఠుడగుటవలన నాతని సంతతికే రాజ్యార్హత యనియు అభిప్రాయ పడుచున్నారు. కౌరవులది ధర్మపక్షమని, పాండవులది అధర్మపక్షమని, ఇట్టి సిద్ధాంతములను ప్రచారము చేయుట నవ్యతకు చిహ్నమని మనవారి తలంపు. నేడు ప్రచారములో నున్న పెక్కునాటకములు, నవలారూపములలోనున్న భారతకథలు, సినిమాలు ఈ విధమయిన వికృత భావములకే ప్రోద్బలకములగుచున్నవి. దీనినత్యా నత్యములను, శాస్త్రబద్ధతను, మహాభారతమునందలి పాత్రల యభిప్రాయములను పరిశీలించి నిర్ణయించుట యావశ్యకము.

సత్యవతి యానతిపై భీష్మునియనుమతిని వ్యాసులు అంబికయందు సంగమించిరాగానే "నాయనా ఈమెయందు గుణవంతుడగు రాజకుమారుడు కలుగునా?" అని (సత్యవతి) ప్రశ్నించినది.

అంత వ్యాసులు "అమ్మా! ఈమెకు వెయ్యి ఏనుగుల బలము కలవాడు, విద్వాంసుడు, రాజర్షి శ్రేష్ఠుడు, మహాభాగ్యశాలి, మహాప్రతిభానంపన్నుడు, మహాబుద్ధిమంతుడగు పుత్రుడు కలుగును. అతనికికూడా నూరుగురు కుమారులు కలుగుదురు. కాని మాతృదోషమున నతడు అంధుడగునని చెప్పెను.

తస్య తద్వచనం శ్రుత్వా మాతా పుత్ర మథాబ్రవీత్
నాంధః కురూణాం నృపతి రనురూపస్తపోధన
జ్ఞాతివంశస్య గోప్తారం పితౄణాం వంశవర్ధనం
ద్వితీయం కురువంశస్య రాజానం దాతు మర్హసి.

మ.భా - వి.పు 36

"నాయనా! గ్రుడ్డివాడు ప్రభువుకాదగిన వాడు కాడు. కనుక పితృవంశవర్ధనుడు కురువంశమునకు ప్రభువు కాదగిన రెండవ వానిని ప్రసాదింపుము" అని కోరెను.

అందుకు వ్యాసమహర్షి సమ్మతించి వెడలిపోయెను. పిమ్మట సత్యవతి అంబాలిక నొప్పించి మరల వ్యాసునాహ్వానించెను. ఆ ఋషినిచూచి అంబాలిక భయముతో వెలవెలపోయెను. విరూపినగు నన్ను జూచి నీవు పాండుత్వమును పొందితివి గావున నీ పుత్త్రుడును పాండుత్వము కలవాడగును. అతనిపేరుకూడ పాండువే అగును. అని చెప్పి వ్యాసుడు వెలుపలికి వచ్చునప్పటికి తల్లి ప్రశ్నింప కుఱ్ఱవాని పాండుత్వమును గూర్చి తల్లితో చెప్పెను.

ధృతరాష్ట్రుడే రాజని వాదించువారలు ధృతరాష్ట్రుని యంధత్వమును, రాజ్యానర్హతను కాదనలేక పాండురాజునందు కూడ నయోగ్యతను ఆపాదింప దలచి అతడు పాండురోగి యనిరి. సంస్కృతాంధ్ర భారతములలో నెందును అతడు పాండురోగి యని చెప్పబడలేదు. ఇచ్చట పాండుత్వము శరీరవైవర్ణ్యమేగాని పాండురోగము కాదు. కుంతీ స్వయంవరఘట్టమున మహాభారతమున పాండురాజు సౌందర్యము చాలగొప్పగా వర్ణింపబడినది. వ్యాసుడు అంబాలికతో విరూపినగు నన్ను చూచి పాండుత్వమును పొందినావు కనుక నీకుమారుడు పాండువగునని చెప్పెనే కాని పాండురోగి యని చెప్పలేదు. వ్యాసులు చెప్పినది 'యస్మాత్- తస్మాత్' అని కార్యకారణ సంబంధము.

'యస్మాత్పాండుత్వమాపన్నా విరూపం ప్రేక్ష్య మామిహ
తస్మాదేష సుతస్తే వై పాండురేవ భవిష్యతి'

మ.భా .వి.పు.37 4.అ

అంబాలిక పొందినది శరీరవైవర్ణ్యమైన పాండుత్వమేకాని పాండురోగము కాదు.

సత్యవతి పాండురోగియైన అంబాలికను కొడుకును కనుమని వ్యాసమహర్షి యొద్దకు పంపునా? ఆమె పాండురోగి అయినకదా కుమారుడు పాండురోగి కావలయును. నన్నయభట్టారకులు కూడ

" ------------ యమ్మునివరుండు నంబాలికకడకుం
జనిన నదియుం దనవేషంబునకు వెఱచి వెల్లనై
యున్న నక్కోమలికిం బుత్త్రదానంబు సేసి
యా యంబాలికయందు మహా

బలపరాక్రమవంతుడు వంశకరుండు నగు
పుత్త్రుండు పుట్టు; వాడును మాతృదోషంబునఁ
బాండుదేహుండగు నని చెప్పి యరిగిన ---

ఆం. భా- ఆది -46-255

అనియే చెప్పిరి.

ధృతరాష్ట్రుని యంధత్వమువలె పాండురాజు పాండుత్వము రాజ్యానర్హతకు గారణము కాదు. కావున ధృతరాష్ట్రుడు గ్రుడ్డివాడని విన్నంతనే సత్యవతి గ్రుడ్డివాడు రాజ్యార్హుడు కానందున రాజు కాదగిన రెండవవానినిమ్మని కోరినది. రెండవవాని పాండుత్వమును గూర్చి చెప్పినప్పుడు "పునరేవాన్యమేకం పుత్రమయాచత" అని కోరినది. పాండురాజు రాజ్యార్హుడైనచో వేరొక పుత్రునేలకోరెనని ప్రశ్నరావచ్చును. దానికి సమాధానము నన్నయభట్టారకులే చెప్పినారు." ఆంబికేయు జాత్యంధుం జూచి

దుఃఖితయయి సత్యవతి వెండియుఁ బారాశర్యుం
దలంచుడు నాక్షణంబ యమ్మునివరుండు వచ్చి
పని యేమి యన్న నీ యంబి కకుఁ బ్రథమపుత్రుం
డంధుండయ్యె నింకొక్క కొడుకు రూపవంతుం
బడయు మనిన -------

ఆం.భా. ఆది - 4 అ. - 258

ధృతరాష్ట్రుడు గ్రుడ్డివాడైన కారణమున మరొక రూపవంతుడైన పుత్రుని అంబికకు ప్రసాదించుమని కోరెను. కాని పాండురాజు రాజ్యానర్హుడని కాదు. పాండువు రాజగుటకెట్టి లోపమును లేదు. కావున పాండురాజే రాజుకాని ధృతరాష్ట్రుడు రాజుకాడని స్పష్టము. ఆంధ్రమహాభారతమున పంచమాశ్వాసమున నన్నయభట్టారకులు :

"వ॥ ఇట్లు ధర్మోత్తరంబుగాఁ బ్రజావృద్ధియు నగుచుండ
నాంబికేయు ధృతరాష్ట్రు రాజ్యాభిషిక్తుంజేసి
భీష్ముండు తనకు విల్లును విదురుబుద్ధియును
సహాయంబులుగా రాజ్యంబు రక్షించుచున్నంత-"

ఆ.భా - ఆది - 5అ. 5

అని వ్రాసిరి. దీనిని బట్టి ధృతరాష్ట్రునికే పట్టాభిషేకము జరిగి యాతడే రాజయినట్లు భావించుట కవకాశమేర్పడినది.

వ్యాసభారత ప్రతులలో నొకదానియందు మాత్రము - నిర్ణయసాగర భారతప్రతిలో పాఠక్రమమెట్లున్నదో మహాభారత తత్త్వకథన కర్తలు వివరించిరి.

వైదికాధ్యయనే యుక్తో నీతిశాస్త్రేషు పారగః
భీష్మేణ రాజా కౌరవ్యో ధృతరాష్ట్రోఽభిషేచితః
ధనుర్వేదేఽశ్వ పృష్ఠే చ గదాయుద్ధేఽపి కర్మణి
తథైవ గజశిక్షాయా మస్త్రేషు వివిధేషు చ
అర్థధర్మప్రధానాసు విద్యాసు వివిధాసు చ
గతః పారం యదా పాండుస్తదాసేనాపతిః కృతః

---

ధృతరాష్ట్ర స్త్వ చక్షుష్ట్వా ద్రాజ్యం నప్రత్యపద్యత
పారశవ్యా ద్విదురో రాజా పాండుర్బభూవ హ

మ.భా - ఆది. 18అ. 21,22,23,30.

ఇట్లాప్రతిలో నొక్కస్థలములోనే ధృతరాష్ట్రుడు రాజ్యాభిషిక్తుడును, పాండురాజు సేనాపతియు నయిరనియు, అంధుడగుటచే రాజ్యమును ధృతరాష్ట్రుడు పొందలేదు. పాండురాజే రాజయ్యెననియు పరస్పరవిరుద్ధముగా పాఠక్రమమున్నది. ఈ ప్రదర్శింపబడిన నాల్గుశ్లోకములలో మొదటిశ్లోకమునకాదియందును, మూడవశ్లోకమున కంతమందును ఆప్రతిలో రేఖలుంచబడినవి. నాల్గవశ్లోకమునకట్టి చిహ్నములు లేవు. కనుక నాల్గవశ్లోకమే సంప్రదాయికపాఠమనియు, పై మూడు శ్లోకములు క్వాచిత్కములనియు, వాని సంబంధమనపేక్షితమనియు చెప్పబడినది.

అందుచేత నాల్గవశ్లోకమునందలి పాఠమే సార్వత్రికపాఠము, సంప్రదాయికము, సకల పండిత సమ్మతము, మొదటిమూడు శ్లోకములలో చెప్పబడిన 'ధృతరాష్ట్రోభిషేచితః' అను పాఠము యావద్భారతగ్రంథమునకు విరుద్ధము, నాల్గవ శ్లోకమునందలి పాఠము సాంప్రదాయిక పాఠమయి యావద్భారత గ్రంథమునకు అంగీకృతముగానున్నది. కనుక ధృతరాష్ట్రునకు రాజ్యాభిషేకము జరుగలేదు. ధృతరాష్ట్రుడు రాజుకాడనుట స్పష్టము,

అట్లే పాండు భూపతికే రాజ్యాభిషేకము జరిగి పాండువే రాజయ్యెననుటయు స్పష్టము

అట్లే ఆంధ్రమహాభారతషష్ఠాశ్వాసమున నన్నయభట్టారకులే :-

"వ॥ రాజయ్యెడువాఁడు తన రాజ్యభారంబు తానచూచి
యరయవలయు నేను షడంగసహితంబుగా వేదాధ్యయనం
బు సేసి యర్థశాస్త్రంబులందుఁ గృతనిశ్చయుండనయి
బలంబు గలిగియు నంగవైకల్యంబునం బరచక్రంబులకుం
బ్రతివ్యూహంబులు రచియింపనేరమింజేసి రాజ్యంబునకుఁ
దగకున్న.

ఉ.॥ లోకనుతుండు పాండుఁడమలుండు మహాగుణరత్నపూర్ణ ర
త్నాకరుఁడత్యుదారమతి నంధుఁడనైన నన్ను రాజుఁగాఁ
జేకొని నాకు భక్తిబనిసేయుచు సర్వజగజ్జిగీషుండై
యీకురువంశరాజ్యభర మింతయుఁ దాల్చెఁబరాక్రమంబునన్.

ఆం.భా. ఆది. 66. 124-125.

ఇట్లు నన్నయగారి వ్రాతలే పరస్పరవిరుద్ధముగా నున్నవి. నన్నపార్యుని పంచమాశ్వాసపువ్రాత యావద్భారత గ్రంథమునకు విరుద్ధము కాగా, షష్ఠమాశ్వాసము నందలి పాండువే రాజయ్యెనను వ్రాత యావద్భారత గ్రంథమునకనుకూలముగానున్నది.

## 2. మనుస్మృత్యాది ప్రమాణములు

జాత్యంధులకు రాజ్యాధికారము లేదనియు వారు కేవలము అన్న వస్త్రాదులిచ్చి పోషింపదగిన వారనియు మనుస్మృతి చెప్పుచున్నది.

అనంశౌ క్లీబపతితౌ జాత్యంధబధిరౌ తథా
ఉన్మత్త జడమూకాశ్చ యే చ కేచిన్నిరింద్రియాః
సర్వేషామపి తు న్యాయ్యం దాతుం శక్త్యా మనీషిణా
గ్రాసాచ్ఛాదనమత్యంతం పతితో హ్యదదద్భవేత్.

మను. 9అ. 201-202.

నపుంసకుడు, జాతిభ్రష్టుడు, పుట్టుగ్రుడ్డి, చెవిటి, వెఱ్ఱివాడు, జడుడు, మూగ, మఱుగుజ్జు కుంటి మొదలగువారు పిత్రాదుల ధనమునకు అర్హులు కారు. మఱీ వారిని అన్నపానములను, కట్టుబట్టలను ఒసంగి కాపాడవలయును. పై చెప్పిన వారినందరికిని ఆధనమును గైకొన్న వాడై శాస్త్రజ్ఞుడైన వాడై బ్రతికి యున్నంత కాలము శక్తి కొలదిని పోషింపవలయును. అట్లు పోషింపనివాడు పాపియైపోవును. కనుకనే జాత్యంధుడైన ధృతరాష్ట్రునకు రాజ్యాధికారము లేకపోయినది.

మరియు రాజ్యము యొక్క అవిభాజ్యస్థితిని గూర్చి శ్రీమద్రామాయణ మహాభారతాది రచనోదాహరణములతో వీరమిత్రోదయ రాజనీతి ప్రకాశము నందీ విధముగా చెప్పబడినట్లు మహాభారతతత్త్వ కథనకర్తలు వ్రాసిరి.

రాజ పుత్రులందరు రాజ్య భాక్కులు కారు. అట్లగుట నీతివిరుద్ధము. కనుకనే మహీపతులు జేష్ఠపుత్రులయందే రాజ్యమును సంక్రమింపజేయుచున్నారు. జ్యేష్ఠునియందు దోషమున్నప్పుడు కనిష్ఠులలో గుణవంతుని యందు రాజ్యమును సంక్రమింప జేయుచున్నారు, అనురామాయణవచనమును బట్టియు రాజ్యము విభజించిపుత్రులకీయ దగినది కాదు. అంధుడగుటవలన ధృతరాష్ట్రుడు రాజ్యమును పొందలేదు. పాండురాజే రాజ్యమును పొందెను. జాత్యంధులు పిత్రాది ధన భాక్కులుగారు. వారు గ్రాసాచ్ఛాదనాదులను మాత్రమే యావజ్జీవము పొందదగినవారు, అంధ త్వాది దోషము వలన గాని కారణాంతరమునగాని రాజ్యప్రాప్తి లేనట్టి జ్యేష్ఠులకు రాజ్యములేకపోయినను, వారి పుత్రులకు అసమంజసుని పుత్రుడు అంశుమంతునికివలె రాజ్యము ప్రాప్తించును. ఆ ప్రాప్తించుట ఆరాజ్యమున కన్యుడభిషిక్తుడు కాక పూర్వము మాత్రమే పుత్రుడు పుట్టియున్నప్పుడు సంభవించును. కనిష్ఠునకు రాజ్యాభిషేకానంతరము అట్టిజ్యేష్ఠునకు పుత్రుడు కలిగినను వానికి రాజ్యముప్రాప్తింపక రాజ్యాభిషిక్తుడైన కనిష్ఠునిపుత్రునికే రాజ్యము ప్రాప్తించును. ఈ ప్రమాణమును బట్టియే పాండుభూపతి పుత్రుడైన యుధిష్ఠిరునికి రాజ్యప్రాప్తి యగుటయు అంధుని పుత్రుడగు దుర్యోధనునికి రాజ్యప్రాప్తి లేకుండుటయు నిదర్శనములు.

ఈ విధముగా మనుస్మృతి, యాజ్ఞవల్క్యస్మృతి, వీరమిత్రోదయము అను గ్రంథములు ధృతరాష్ట్రునకును, దుర్యోధనునకును, రాజ్యాధికారయు లేదనియు, పాండుభూపతికి, తరువాత పాండవులది రాజ్యమనియు, ధృతరాష్ట్రధార్తరాష్ట్రాదులు పోష్యవర్గములోని వారనియు సిద్ధాంతరీకరింపబడుచున్నది.

అందుచేతనే ఉద్యోగపర్వమున ధృతరాష్ట్రుడు :-

"పాండుస్తు రాజ్యం సంప్రాప్తః కనీయానపి సన్నృపః
వినాశే తస్య పుత్రాణా మిదం రాజ్య మరిందమ
మయ్యభాగిని రాజ్యాయ కథం త్వం రాజ్యమిచ్ఛసి
అరాజపుత్రో హ్యస్వామీ పరస్వం హర్తు మిచ్ఛసి.

-మ.భా. ఉద్యో. 149 అ.

కనిష్ఠుడైనను పాండు భూపతియే రాజ్యమును పొందెను. అతని యనంతరము పాండుపుత్రులదే రాజ్యము. నేనే రాజ్యభాక్కును కానపుడు నీకురాజ్యమెట్లు? అనధికారివై పరధనమును నీవు హరింపదలంచుచున్నావని ధృతరాష్ట్రుడు దుర్యోధనునకు బోధించెను.

దేవీభాగవత ద్వితీయస్కంధ షష్ఠాధ్యాయారంభ శ్లోకములలో రాజ్యాధికార మెవ్వరిదయ్యెనో చెప్పబడినది :

రాజ్యే సంస్థాపితః పాండుః కనీయానపి మంత్రిభిః
అంధత్వా ద్ధృత రాష్ట్రోఽసౌ నాధికారే నియోజితః
భీష్మస్యానుమతే రాజ్యం ప్రాప్తః పాండుర్మహాబలః
విదు రోఽప్యథ మేధావీ మంత్రకార్యే నియోజితః

దే.భా 2స్కం - 6అ.

అంధుడగుటచే ధృతరాష్ట్రుడు రాజ్యాధి కారి కాలేదనియు మహా బలుడైన పాండురాజే కనిష్ఠుడైనను భీష్మానుమతిని రాజ్యాధి కారియయ్యెననియు నీశ్లోకములలో చెప్పబడ్డది.

### 3. కొన్ని శంకలు - సమాధానములు

పాండువే రాజయిన యెడల తాను దిగ్విజయముచేసి తెచ్చిన ధనమును ధృతరాష్ట్రుననుమతితోడనే వ్యయింపనేలయని యొకసంశయము.

ధృతరాష్ట్రాభ్యనుజ్ఞాత స్స్వబాహు విజితం ధనమ్
భీష్మాయ సత్యవత్యై చ మాత్రే చోపజహార సః

విదురాయ చ వై పాండుః ప్రేషయామాస తద్ధనమ్.

మ.భా. తత్త్వ పు 494

రాజు కావలసిన జ్యేష్ఠుడగు ధృతరాష్ట్రుడు అంధత్వమువలన రాజ్యాధికారి కాకుండుటచే రాజైన పాండురాజు ఆతనికి మనోవ్యధ కలుగకుండుటకై సర్వమాతనితోచెప్పి ఆతని యాజ్ఞానుసారము వ్యవహరించువాడు. భీష్మాదులు రాజ్యవాంఛ లేనివారును ధృతరాష్ట్రాజ్ఞానువర్తియై పాండురాజు వ్యవహరింపవలెనని కోరువారును నగుటచే తదనుగుణముగనే వ్యవహరించువాడు పాండుభూపతి యాప్రవర్తన యాతని సచ్ఛీలతకే నిదర్శనముకాని, ధృతరాష్ట్రుడు రాజ్యాధికారియనుటకు నిదర్శనము కాదు.

ధృతరాష్ట్రుడు రాజుకాని యెడల అశ్వమేధ యాగములెట్లుచేసెనని యొక మీమాంస.

"తస్య వీర్యస్య విక్రాంతైః సహస్రశతదక్షిణైః
అశ్వమేధ శతై రీజే ధృతరాష్ట్రో మహామఖైః"

మ.భా. తత్త్వ పు 701

రాజుకాని వానికి అశ్వమేధాధికారమెట్లులేదో అట్లే అంధునకు శ్రౌతయజ్ఞము లందధికారములేదు, ఒకవేళ ధృతరాష్ట్రుడు రాజేయని ఒప్పుకొందమన్నను అంధుడగుటచే అశ్వమేధాది శ్రౌత యజ్ఞములందధికారములేదు. కనుకనే నీలకంఠులు "అశ్వమేధ శతైః తత్తుల్యైః మహామఖైః పంచమహాయజ్ఞైః గర్భాంధస్య శ్రౌత యజ్ఞేష్వనధికారాత్" అని వివరించిరి.

జాత్యంధుడైన ధృతరాష్ట్రునకు అశ్వమేధాది శ్రౌతయజ్ఞములందధికారములేదు కనుక నూరు అశ్వమేధయాగములతో సమానమయిన పంచమహాయజ్ఞములను చేసెనని యర్థము. ఈ పంచమహాయజ్ఞములు రాజుకాకుండినను చేయదగినవే కనుక రాజు కాకున్నను ధృతరాష్ట్రుడు చేసెనని యర్థము. పంచమహాయజ్ఞములనగా దేవయజ్ఞము, భూతయజ్ఞము, పితృ యజ్ఞము, బ్రహ్మయజ్ఞము, మనుష్యయజ్ఞము అనునవి. ఇవి గృహస్థునకు విహితనిత్యకృత్యములు.

3. దుర్యోధనుడు కర్ణునకంగరాజ్యమిచ్చినపుడు పాండవులేల ఆక్షేపించలేదని మరియొక సంశయము.

కర్ణునకంగరాజ్యమిచ్చినది కుమారాస్త్రవిద్యాప్రదర్శన కాలమున. అప్పటికి ధర్మరాజునకు యౌవరాజ్యపట్టాభిషేకము కాలేదు. అనగా నతడు యువరాజుకాడు దుర్యోధనుడు అప్పటికిని ఎప్పటికిని యువరాజు కాలేదు.

"ఎల్లవారును జూడంగ నీక్షణంబ
రాజు(జేసెద నేనంగరాజ్యమిచ్చి"

వ.॥ అని యప్పుడ భీష్మ ధృతరాష్ట్రులకుంజెప్పి
వారియనుమతంబున---------
అంగరాజ్యమునకభిషిక్తుంజేసిన ------------
అని ఆంధ్రభారతము.

ఆది. 6అ. 48-49.

దుర్యోధనుడు చెప్పినదానికి బద్ధుడై సమ్మతించువాడు ధృతరాష్ట్రుడు. చెప్పిన దానికి బద్ధులై సమ్మతించువారు పాండవులు. కష్టమయినను నష్టమయినను తప్పయినను ఒప్పయినను ధృతరాష్ట్రుడు చెప్పినదానికి కట్టుబడి శంకింపకుండ ప్రవర్తించుట పాండవులకు వ్రతము. అంతే కాని దుర్యోధనుడు తనకధికారముండి రాజ్యమునీయలేదు. అతడు రాజుకాడు, యువరాజునుకాడు. ఒకవేళ ధృతరాష్ట్రుడు రాజందువేని అదియును కాదు. అతనికి అధికారము లేదు. కనుకనే భీష్మునియనుమతి అవసరమైనది.

మధ్వాచార్యులవారి మహాభారతతాత్పర్యములో :

నిరుత్తరే కృతే కర్ణే భీమేనైవ సుయోధనః
అభ్యషేచయదంగేషు రాజానం పిత్రనుజ్ఞయా
ధృతరాష్ట్రః పక్షపాతాత్పుత్రస్యాఽనువశోఽభవత్

మ.భా. తా.18అ. 39.

అని విశదీకరించబడినది. పక్షపాతబుద్ధిచే పుత్రునకు వశుడై యున్న ధృతరాష్ట్రుని యనుజ్ఞపై అంగరాజ్యమును దుర్యోధనుడిచ్చెనని చెప్పబడినది.

**4. కౌరవప్రముఖుల అభిప్రాయములు.**

రాజ్యము కౌరవులదా పాండవులదా యని మేధావులు వాదులాడుకొనుటకంటె కౌరవప్రముఖులైన భీష్మద్రోణాదులును, ధృతరాష్ట్రుడును గాంధారియును తుదకు

అత్యంత ప్రధాన ప్రతిపక్షియయిన దుర్యోధనుని స్వీయాభిప్రాయములను పరిశీలించుట సమంజసము.

1. భీష్ముడు :

దుర్యోధన యథా రాజ్యం త్వమిదం తాత పశ్యసి
మమపైతృక మిత్యేవం తేఽపి పశ్యన్తి పాండవాః
యది రాజ్యంన తే ప్రాప్తాః పాండవేయా యశస్వినః
కుత ఏవ తవాఽపీదం భారతస్యాఽపి కస్యచిత్
అథ ధర్మేణ రాజ్యం త్వం ప్రాప్తవాన్ భరతర్షభ
తేఽపి రాజ్యమనుప్రాప్తాః పూర్వమేవేతి మే మతిః

మ.భా . తత్త్వ పు 737

దుర్యోధనా! అధర్మము తగదుకనుక నీవు పాండవులతో శత్రుత్వము పెట్టుకొనుట నాకిష్టముకాని పని. ఆ వీరులతోసఖ్యపడి అర్ధభూమి వారికిమ్ము కురూత్తములకు ప్రపితామహముగా వచ్చి పిత్ర్యమైన రాజ్యమే యిది. నాపిత్ర్యమని నీవనుకొనుచున్న రాజ్యము మాప్రిత్యమని వారనుకొనుచున్నారు. పాండురాజునకు ఔరససంతానము కాక క్షేత్రజసంతానమయిన పాండవులు రాజ్యము తమప్రిత్యమని ఎట్లుపొందగలరని నీయభిప్రాయము కావచ్చును. ధృతరాష్ట్రుని యౌరససంతానమయిన నేను ప్రిత్యమని పొందగలనని నీవు తలంచుచున్నావేమో? అట్లుజూచిన విచిత్రవీర్యుని ఔరససంతానముగాక క్షేత్రజసంతానమయిన నీతండ్రి ధృతరాష్ట్రునకు పిత్ర్యముగా రాజ్యము ప్రాప్తింపనే లేదు. నీతండ్రికి ప్రాప్తింపని రాజ్యము పిత్ర్యముగా నీకు ప్రాప్తించినదని నీవనుకొనుటెట్లు? ఇక నీతండ్రికి ధర్మముగనే ప్రాప్తించి పిత్ర్యమై నీకు ప్రాప్తించిన దందువా? అట్లైన పాండవులకు ముందే ప్రాప్తించినది. నీతండ్రి యంధుడగుటచేత కనిష్ఠుడై పాండురాజే రాజ్యాభిషిక్తుడయ్యెను. అందుచే పాండవులకు ప్రాప్తించియున్నది. ఆపై ఇంతకు పూర్వమే ధర్మజునకు యౌవరాజ్య పట్టాభిషేకము జరిగి యువరాజయ్యెను కదా!.

భీష్ముని వాక్యములవలన పాండవుల కర్ధరాజ్యమిమ్మనియు, అది వారికి పిత్ర్యంశమైన భాగమనియు చెప్పబడినదిగాని మిగిలినయర్ధరాజ్యము దుర్యోధనునకు పిత్ర్యంశమైనదని చెప్పబడలేదు. తాత్పర్యమేమనగా దుర్యోధనునకు విడువదలచిన

యర్ధరాజ్యము పాండవుల అర్ధరాజ్యమువలె సర్వాధికారములు కలది కాదనియు, పాండవుల పోష్య వర్గములోని ధుర్యోధనాదులకది యావజ్జీవోపభోగ్యమే యనియు విశదీకరింపబడినది.

2. గాంధారి దుర్యోధనునికి ఉపదేశించునప్పుడు గూడ "అలమర్ధం పృథ్వివ్యాస్తే సహామాత్యస్య జీవితుమ్" నీవు సపరివారముగా జీవించుటకర్ధ రాజ్యము చాలుననియే చెప్పినది.

గాంధారియే దుర్యోధనునితో

రాజ్యన్తు పాండోరిద మప్రధృష్యం
తస్యాద్య పుత్రాః ప్రభవన్తి నాన్యే
రాజ్యం తదేత న్నిఖిలం పాండవానాం
పైతామహం పుత్రపౌత్రానుగామి.
న్యాయాగతం రాజ్యమిదం కురూణాం
యుధిష్ఠిర శ్శాస్తువై ధర్మ పుత్రః

మ.భా - ఉద్యో. 147.

రాజ్యము పాండురాజుది. కనుక పితృపైతా మహముగా పాండవులకును వారి పుత్ర పౌత్రులకును రాజ్యమునందధికారము సంక్రమించునని స్పష్టముగా చెప్పినది.

"అన్ధః కరణహీనత్వాన్న వై రాజా పితా తవ"

ధృతరాష్ట్రుడు రాజు కాకపోవుటకు హేతువు అంధత్వమని చెప్పియే పాండురాజు రాజయ్యెనని సహేతుకముగా భీష్ముడు విశదీకరించెను.

ఈ సందర్భముననే ద్రోణాచార్యులును

మమాప్యేషా మతిస్తాత యా భీష్మస్య మహాత్మనః
సంవిభజ్యాస్తు కౌన్తేయ ధర్మఏష సనాతనః

-----

తతస్తే పాండవాఃశ్రేష్ఠాః పూజ్యమానాస్సదా త్వయా
ప్రకృతీనా మనుమతే పదే స్థాస్యన్తి పైతృకే.

మ.భా. తత్త్వ పు 1117

దుర్యోధనా! మహానుభావుడైన భీష్ముడు చెప్పినట్లు చేయుటే నాకును సమ్మతము. పాండవులకర్ధరాజ్యమీయవలసినదే. ఇది సనాతన ధర్మము, ద్రుపదపురమునుండి వారిని సబహుమానముగా రప్పింపుము. తరువాత వారు నీచేతపూజింపబడుచు ప్రజల కనుమతమై పిత్ర్యమైన వారి రాజ్యమందు స్థిరపడుదురు.

ఆంధ్రమహాభారతమున "ద్రోణుండు దుర్యోధనున
కిట్లనియె ------ భవత్పితామహవచనంబు
చేకొనుము.
మానుగ వారలతోడ నీవు విగ్రహం
బొనరింపనేమిటికి గౌరవ సౌబల కర్ణ శిక్షలన్
---. అయ్యులఘులపైతృకంబయిన
యంశమున మిన్నక వజ్రపాణి కైనను గొనబోలు
నయ్య. ఆ.భా. ఆది-8అ. 34-35

ఈ ద్రోణవాక్యములో 'పైతృక' మనుమాటలో పితృపైతామహమనియే యర్థము.

ధృతరాష్ట్రుడును దుర్యోధనునితో :-

పాండుస్తు రాజ్యం సంప్రాప్తః కనీయానపి సన్నృపః
వినాశే తస్య పుత్రాణామిదం రాజ్యమరిందమ
మయ్యభాగిని రాజ్యాయ కథం త్వం రాజ్యమిచ్ఛసి
అరాజపుత్రో హ్యస్వామీ పరస్వం హర్తు మిచ్ఛసి

మ.భా. ఉద్యో 149అ

చిన్న వాడైనను పాండురాజే రాజ్యమును పొందెను. అతడు గతించిన పిమ్మట ఈ రాజ్యమును అతని పుత్రులదే. నాకే రాజ్యములేనప్పుడు నీవెట్లురాజ్యము నపహరించెదవు. నీవు రాజపుత్రుడవుకావు. అధికారివికావు. ఇతరుల సొత్తును హరింపజూచుచున్నావు. ధృతరాష్ట్రుడు మరియు నిట్లు చెప్పెను. మన కురువంశమందలి పూర్వపురుషులలో యయాతి జ్యేష్ఠపుత్రుడు యదువు. కనిష్ఠ పుత్రుడు పూరుడు. ఆ జ్యేష్ఠుడు తండ్రియిష్టానుసారము వర్తింపకపోవుటచే తండ్రి యాతనికి రాజ్యమీయలేదు. తనకు విధేయుడై సంచరించిన కనిష్ఠునికే రాజ్యమిచ్చెను.

ఏవం జేష్ఠో ఽప్యథోత్సిక్తో న రాజ్యమభిజాయతే
యవీయాంసోఽ పి జాయన్తే రాజ్యం వృద్ధోపసేనయా.

మ.భా.త.త్యా.పు.730

ఇట్లు జ్యేష్ఠుడైనను గర్వితుడు రాజ్యార్హుడు కాలేదు. పెద్దల యెడల వినయవిధేయతలు కలవాడు కనిష్ఠుడైనను రాజ్యమును పొందెను.

ధృతరాష్ట్రుడు మరియునిట్లు చెప్పెను. విచిత్రవీర్యునకు పితామహుడు ప్రతీప మహారాజు. అతని పుత్రులలో ప్రథముడు దేవాపి. ద్వితీయుడు బాహ్లీకుడు, తృతీయుడు శంతనుడు, ఆ దేవాపి మహాతేజశ్శాలియై, ధార్మికుడై, సత్యవాదియై, పితృశుశ్రూషా పరాయణుడై యుండు వాడు. అతనికి కుష్ఠువ్యాధి యుండెను. తండ్రి యతనిని రాజ్యాభిషిక్తుని జేయసంకల్పింపగా పౌరులును, జానపదులును, పెద్దలును గలసి యట్లు చేయగూడదని నిషేధించిరి. ఇట్లు దాతయై ధర్మజ్ఞుడై, సత్యసంధుడై, ప్రజాప్రియుడై యుండియు, వ్యాధి దోషముచే దూషితుడయ్యెను. అంగవిహీనుడు రాజగుటను దేవతలభినందించరని యాన్నపశ్రేష్ఠుని రాజ్యాభిషేకమును నిషేధించిరి. ఇక ద్వితీయుడగు బాహ్లీకుడు రాజ్యమునపేక్షింపక పితృభ్రాతృవర్గమును విడిచి సర్వైశ్వర్య సమృద్ధమయిన మాతామహ వంశమునకు జేరియుండెను, తృతీయుడగు శంతన మహారాజు తండ్రి గతించిన తరువాత అన్నయగు బాహ్లీకుని యనుజ్ఞపై తానే రాజయి రాజ్యమును పాలించెను. అట్లే జ్యేష్ఠుడనయిన నేను హీనాంగుడనగుటచే రాజ్య భ్రంశితుడనైతిని. కనిష్ఠుడైనను యోగ్యుడగు పాండురాజు రాజ్యమును పొందెను. అతడు పోవుటచే నీరాజ్యము పాండు పుత్రులదే. నేనే రాజ్యభాక్కును కానపుడు నీవెట్లు రాజ్యమునపేక్షించెదవు? రాజ్యాభిషేకమనునది యొక శాస్త్రీయసంస్కారము, అట్టి సంస్కారమునకు హీనాంగు డనర్హుడు. పాండువు వానప్రస్థమునకు పోవుచు ధృతరాష్ట్రవిదురులకు రాజ్యము న్యాసభూతముగానప్పగించుటవలన ధృతరాష్ట్రునికి రాజ్యముపై యాధిపత్యమువచ్చినది కాని క్రియానుగతముగా వచ్చినది గాదు.

ఆశ్రమవాసపర్వమున వనవాసము చేయసంకల్పించిన ధృతరాష్ట్రునిగూర్చి యాతని సంకల్పమును నెరవేర్చుమని యుధిష్ఠిరునితో వ్యాసభగవానుడిట్లు చెప్పెను. పృథ్వీపతి యయిన నీతండ్రి పాండురాజు ఈ ధృతరాష్ట్రుని శిష్యుడు గురువును పాసించినట్లు పాసించెను. ఈతడు క్రతువులు చేసినాడు. ప్రజలను పాలించినాడు. నీవు వనవాసము చేయునప్పుడు పుత్రాధీనమైన యావద్రాజ్యమును పదమూడు

సంవత్సరములు అనుభవించినాడు, ఈతనికిప్పుడు తపస్సుచేసికొనదగిన కాలమే, "యుధిష్ఠిరుడు ఈతని వనవాససంకల్పము కోపమూలకము కాదు. నీవంగీకరింపు" మని బోధించెను.

మరియు ధృతరాష్ట్రుడు వనవాసమునకు వెళ్ళునప్పుడు తనకనుజ్ఞనిమ్మని కోరుచు ప్రజలతో నిట్లనెను.

సీ.॥ ప్రజామోదమొందగఁ బాలించెఁబుడమిశం
తనుఁడనంతరమ శాంతనవుచేత
రక్షితుఁడగుచు మీరలు ప్రీతిఁబొదలవి
చిత్రవీర్యుండు నిద్ధాత్రియే లెఁ
బదపడి పాండున్నపాలుండు మీరు హ
ర్షింపంగ భూమి రక్షించెఁబిదప
ధర్మనందనుని చందము మీయెఱింగిన
యది సత్యధర్మాత్ముఁడైన యితని

తే.॥ ననుసరింపక యన్యాయమాచరించి
దుర్ణయంబున నిలయేలి త్రుంచెఁగులము
నుర్విగల భూపతులను దుర్యోధనుండు
వాని దుశ్చేష్టలకు మూలమేనకాదె.

వ॥ అది మీ మనంబునలం బెట్టక

క॥ మహిలెస్సఁగ రక్షించిన
మహిత గుణుల యన్న కొడుకు మనుమండని నా
కు హితంబుఁగోరి కరుణా
సహితులకై యుండనుజ్ఞ సద్ర్వతమునకున్.

ఆ.భా - ఆశ్ర. 1అ-87-88-89.

వ్యాసమూలమునకు ఇంచుమించు యథావిధేయమయిన యనువాదమే

యీపద్యములు. దీని భావమిది "శంతనమహారాజు భూమినంతను యథోక్తముగా నెట్లు పాలించెనో, నా తండ్రియగు విచిత్రవీర్యుడు భీష్మరక్షితుడై యథోక్తముగానెట్లు పాలించెనో, నాసోదరుడగు పాండురాజు మీకిష్టుడై యథోక్తముగా నెట్లు పాలించెనో మీకందరకు తెలియును.

పూజ్యులారా! మీకు నేను చేసిన శుశ్రూష యుక్తమో అయుక్తమో క్షమింపుడు. నా మంచి చెడ్డలు మీరేమియు తలంచకుండ గోరెదను. ఇదిగో దోసిలియొగ్గితిని. ఈతడు వృద్ధుడు. హతపుత్రుడు. దుఃఖితుడు పూర్వరాజుల పుత్రుడని భావించి మీరు నాకు వనవాసమున కనుజ్ఞ యీయవలయును.

ఇక దుర్యోధనుడును రాజ్యము తనకు క్రమానుగతముగా ప్రాప్తించలేదని తండ్రితో మొఱలెట్టినాడు.

> పితృత: ప్రాప్తవాన్ రాజ్యం పాండు రాత్మగుణైస్సహ
> త్వ మన్ధగుణసంయోగా త్ప్రాప్తం రాజ్యం న లబ్ధవాన్
> స ఏషపాండోర్దాయాద్యం యది ప్రాప్నోతి పాండవ:
> తస్య పుత్రో ధ్రువం ప్రాప్తస్స్య తోస్యాపి చాపర:

మ.భా-ఆది. 141 అ.

"తండ్రీ! పాండురాజు తండ్రినుండి రాజ్యమును పొందెను. జ్యేష్ఠత్వమును బట్టి ప్రాప్తించినను అంధత్వముచే నీవు రాజ్యమును పొందలేక పోయితివి. యుధిష్ఠిరుడు తన తండ్రిని బట్టి తనకు దాయాద్యమయిన రాజ్యము పొందుటచే వారి సంతతికే రాజ్యము చెందిపోవును. మేమిక మాసంతానముతో గూడ రాజవంశమునకు జెందనివారమై లోకమునకు తిరస్కృతులమై పోవుదుము. మేము పరపిండోప జీవులమై, దుఃఖితులమై యుండకుండుటకు తగిన నీతి నవలంబింపుము. మొదట నీవే కనుక రాజ్యమును పొంది యుంటివేని యీప్రజలు వ్యతిరేకించియున్నను మేము ధ్రువముగా రాజ్యమును పొందియుండెడి వారము. ఆంధ్రమహాభారతమునగూడ నీవిషయమే చెప్పబడినది.

సీ.॥ పైతృకంబగు లక్ష్మి పాండుభూపతిమున్న
తాల్చుట(జేసి తత్తనయుడైన

ధర్మజుడిప్పుడు తాల్చిననాతని
తనయుండు మఱిదానిఁదాల్చుమీఁద
నిప్పాట పాండు వంశేశులవసుమతీ
రాజ్యార్హులగుదురు రాజ్యమునకుఁ
బరువడి మేమింతఁబాపిన మాపుత్ర
పౌత్రవర్గంబున బాయునింక

ఆ॥ నొరులఁగొలిచి కుడువనోపమేమట్లుగా
కుండ మమ్ముఁజేయ నోపుదేని
పాండురాజు తొంటి భక్తియు నప్పాండు
తనయులందు దయయుఁదలపకుండు.

వ॥ ఈ రాజ్యంబు మొదలింటం గోలె భవదీయంబైనం
బ్రకృతిజనులు వశ్యులు గాకున్నను గ్రమాను
గతంబై మాకు నప్రయత్న లభ్యంబగు

ఆ.భా - ఆది. 6అ. 128-129.

దీనిని బట్టి దుర్యోధనుడు పాపభీతిలేని వాడు. ప్రజాభిప్రాయమును లెక్క సేయడు. అట్టి దుర్యోధనుని మతంబునగూడ రాజ్యము మొదటి నుండియు ధృతరాష్ట్రునకు ప్రాప్తించలేదు. కావున తనకు రాజ్యము క్రమానుగతంబు కాదు అందుచే నప్రయత్నలభ్యమును గాదు. కాలేదు అనునది స్పష్టము. అనగా రాజ్యము కౌరవులది కానే కాదు. ముమ్మాటికిని రాజ్యము పాండవులదే యని తాత్పర్యము.



# 11. దేవేంద్రుడు విప్రరూపమున కర్ణుని కవచ కుండలములు హరించుట

దేవేంద్రుడు పాండవ పక్షపాతమున భారత యుద్ధమున కర్ణుని బారినుండి అర్జునుని కాపాడి అర్జునునకు విజయము చేకూర్చుటకై విప్రరూపమున కర్ణుని యాచించి ఆతని కవచకుండలములు హరించెనని లోకమున ఒక అపవాదము కలదు. ఇందలి సత్యాసత్యములను ఉచితానుచితములను పరిశీలింపవలసియున్నది.

"బ్రాహ్మణస్యాపి శాపేన రామస్య చ మహాత్మన:
కుంత్యాశ్చ వరదానేన మాయయా చ శతక్రతో:
భీష్మావమానా త్సంఖ్యాయాం రథ స్యార్థాను కీర్తనాత్
శల్యాతేజో వధాచ్చాపి వాసుదేవ నయేన చ
మద్రస్య దేవరాజస్య యమస్య వరుణస్య చ
కుబేరద్రోణయోశ్చైవ కృపస్య చ మహాత్మన:
అస్త్రాణి దివ్యాన్యాదాయ యుద్ధే గాండీవధన్వనా
హితో వై కర్తన: కర్ణో దివాకరసమద్యుతి:
ఏవం శప్తస్తవ భ్రాతా బహుభిశ్చాపి వంచిత:
న శోచ్య స్స నరవ్యాఘ్రో యుద్ధేహి నిధనం గత:"

మ.భా. శాంతి. 5అ.

అని వ్యాసభారతమున చెప్పబడినది. తిక్కనసోమయాజియు నాంధ్రభారత శాంతి పర్వమున నీయర్థమునే చెప్పెను.

చ॥ వినుము నరేంద్ర విప్రు(డలిగెం జనుదగ్నిసుతుండు శాపమి
చ్చెన మరభర్త వంచనముసేసె వరంబని కోరి కుంతిమా
న్పెనలుక భీష్ముడర్థరథు(జేసి యడంచెకలంచె మద్రరా
జను చితమాడి శౌరి విధియయ్యెనరుండని జంపె కర్ణునిన్.

వ. అట్లుగాక

కం. హరసురపతి యమవరుణులు
గురుకృపులును దివ్యబాణకోటు లొసఁగుటన్
వరుశక్తి కర్ణుతేజ
స్ఫురణము వార్పంగఁజాలె జువ్వె నృపాలా.

ఆం. భా. శాంతి. 1అ. 35-37.

శ్రీకృష్ణుడు అర్జునునితో ననినట్లు లోకములో నీక్రింది పద్యము కూడ ప్రచారములో నున్నది.

కం. నరవర నీచే నాచే
వరమడిగిన కుంతిచేత వాసవు చేతన్
ధర చేత శల్యు చేతను
అరయంగా కర్ణుఁడీల్గె నార్గురి చేతన్.

వనవాసము పన్నెండు సంవత్సరములు ముగియుచుండగా పాండవులకు విజయమును కాంక్షించి దేవేంద్రుడు కర్ణుని కవచకుండలములు హరింపజూచెను. కర్ణుడొకప్రతిజ్ఞ చేసెను. ఘోషయాత్రలో దుర్యోధనుడు సకుటుంబ సపరివారముగా గంధర్వరాజునకు బందీయగుట - ధర్మరాజు విడిపించుట జరిగినది. దుర్యోధనుడా పరాభవాగ్నిని ఉపశమింపచేసికొనుటకై వైష్ణవ యాగమును చేసెను.

ఆ సంతోషసమయములో రాబోవు భారత యుద్ధమున తాను అర్జునుని సంహరించి దుర్యోధనుని రాజ్యాభిషిక్తునిజేసి యాతని తప్పక రాజసూయ యాగము చేయింతునని హామీయిచ్చినాడు కర్ణుడు. అంతవరకు అనగా తానర్జునుని వధింపనంతవరకు పరులచే పాదములుకడిగించుకొనననియు, మద్యమాంసములు ముట్టననియు, ఎవ్వడుదేనికై యాచించినను నాస్తియని చెప్పిపంపననియు తన ఆయుధముపై ప్రతిజ్ఞచేసెను. ఈ ప్రతిజ్ఞ అర్జునుని చంపుటకెట్లుపయోగపడునో తెలియదు పైగా నష్టదాయకము కూడ. ఈ శపథము చేయనిచో విప్రరూపమున వచ్చిన ఇంద్రునికి కవచకుండలము నీయకుండ నిరాకరింప వచ్చునుకదా! ఈ శపథమును పరీక్షించుటకే కదా ఇంద్రుడు వచ్చినది, ఈ శపథముమూలముననే కదా ఇంద్రునకు కవచకుండలములు ఈయక తప్పినది కాదు. కర్ణుడు ఈ శపథము

చేసిన నాటినుండియే దానకర్ణుడయ్యెను కాని అంతకు పూర్వము ఒట్టి కర్ణుడే!.

మహేంద్రుని యాలోచననెరింగిన సూర్యుడు పుత్త్రవాత్సల్యముచే కర్ణునికి కలలో కనిపించి ఈ విధముగా ప్రబోధించెను.

"కవచేన సమాయుక్తః కుండలాభ్యాం చ మానద
అవధ్యస్త్వం రణేऽరీణామితి విద్ధి వచో మమ
అమృతా దుత్థితం హ్యేత దుభయం రత్నసంభవం
తస్మా ద్రక్ష్యం త్వయా కర్ణ జీవితం చేత్ప్రియం తవ"

మ.భా. అరణ్య. 299 అ.

కవచకుండలములున్నచో శత్రువులకు నీవు అవధ్యుడవగుదువు. ఈ రెండు అమృతమునుండి పుట్టినవి కనుక నీవు బ్రతుకగోరెదవేని ఈ రెంటిని కాపాడు కొనుమని. కుంతి ప్రార్థనపై ప్రత్యక్షమయిన సూర్యుడును కుంతితో "నీ పుత్రుడు కవచకుండలములు గలవాడు బలవంతుడు అమరుడు అగును. అమృతమయములైన కవచకుండలములు అభేద్యములు, అదితిదేవి నా కీకుండలము లిచ్చినది. నేను వానిని, ఈ కవచమును నీ పుత్రునకిచ్చెదనని" చెప్పి ఆమె నొడంబరచి సంగమించినట్లు మహాభారతమున చెప్పబడినది.

అంతేకాదు యాచింపవచ్చి యింద్రునితో కర్ణుడును :

కుండలాభ్యాం విముక్తోऽహం వర్మణా సహజేన చ
గమనీయో భవిష్యామి శత్రూణాం ద్విజసత్తమ

మ.భా. అరణ్య - 309 అ.

టీ ॥ గమనీయో వధ్యః, ఈ కవచకుండలములను విడిచియున్నప్పుడు నేను శత్రువులకు వధ్యుడనైపోవుదునని చెప్పెను. కనుక మరణము లేకుండ చేయుటకవి యేర్పడినవనుట స్పష్టము అవి అమృతమయములని వాని ప్రయోజనము సూర్యుడే చెప్పియుండెను గదా?

"ఇంద్రుడు విప్రవేషమునవచ్చి నిన్ను కవచకుండలములను యాచింపబోవు చున్నాడు. వాని నివ్వకుము, కవచ కుండలములున్నచో శత్రువులకు నీ వవధ్యుడ"

వని బోధించెను. అందుకు సమాధానముగా "బ్రాహ్మణులకు ప్రాణములైననిచ్చుట నావ్రతము. ఇది లోకవిదితము. పాండవహితమును గోరి బ్రాహ్మణరూపమున భిక్షించుటకు ఇంద్రుడే వచ్చినయెడల కవచకుండలములను తప్పక యిచ్చెదను. నా కీర్తి నశించకుండు గాక, కీర్తి లేక జీవించుటకంటె మరణమే మేలని చెప్పెను. కర్ణుడు సూర్యునికి చెప్పిన సమాధానము ఆంధ్రభారత అరణ్యపర్వశేషమున శంభుదాసులు చక్కగా వివరించిరి. పాండవపక్షపాతియై విప్రవేషమున భిక్షించుటకై వచ్చిన యింద్రునికి తన కవచకుండలములను తప్పకయిచ్చెదననియే చెప్పెను. అంత సూర్యుడు కవచకుండలములీయక తప్పదేని ఇంద్రునియొద్దనున్న అమోఘమయిన శక్తిని అడిగి తీసికొనుమని చెప్పి అంతర్హితుడయ్యెను. మధ్యాహ్నమున సూర్యస్తుతి గావించు కర్ణుని యొద్దకు ధనార్థులై బ్రాహ్మణులు వచ్చుచుందురు. కర్ణుడును సూర్యుని మాటలు విని ఇంద్రశక్తిని గ్రహింపదలచి ఇంద్రుని రాకకై నిరీక్షించుచుండెను.

కర్ణునకు కవచకుండలములపై నమ్మకము సన్నగిల్లినది. కావున కవచ కుండలముల వలన మరణము లేకుండునుగాని అపజయము లేకుండుటలేదు కాని కవచకుండలములుండియు కర్ణుడు గురుదక్షిణ కొరకు ద్రుపదునిపై దండెత్తి ఆయుద్ధములో ద్రుపదుని కోడిపోయెను.

ద్రౌపదీ స్వయంవరమున అర్జునుని చేతిలో ఓడిపోయెను. దిగ్విజయ సందర్భమున భీముని చేతిలో కర్ణుడోడిపోయెను. ఘోషయాత్రలో గంధర్వరాజైన చిత్రసేనునిచేతిలో నోడిపోయెను. కనుక కవచకుండలములవలన తానమరుడు కాగలడే కాని విజయుడు కాలేడు. రాబోవు భారత సంగ్రామమున నర్జునుని జయింపవలెనన్న ఈ కవచకుండలముల వలని ప్రయోజనము శూన్యము. పైగా సూర్యభగవానుడు ఇంద్రుని యొద్దనున్న శక్తితో శత్రువుని జయింపగలవని చెప్పెను. వందలు వేలుగానున్న శత్రువులను చంపనిదే ఆశక్తి తిరిగి రాదనిచెప్పెను. కనుక తన యొద్దనున్న కవచకుండలములకంటె ఇంద్రునియొద్దనున్న వీరఘ్ని (శక్తి) మిన్న, కనుక తన కవచకుండలములనిచ్చి ఇంద్రునినుండి ఆ వీరఘ్నిని తీసికొనుట మిక్కిలి లాభసాటి యయిన బేరమని కర్ణుడు తీర్మానించుకొన్నాడు, అయినను తన కవచకుండలములను ఈయకుండుట కెంతయో ప్రయత్నించినాడు. తన రాజ్యముతో సహా పెక్కు సంపదలనిత్తునని యాశపెట్టినాడు, కాని ఇంద్రుడంగీకరించలేదు. తుదకు తన కవచకుండలములకు మారుగా ఇంద్రుని వీరఘ్నిని ఇమ్మనినాడు. ఇంద్రు

డంగీకరించినాడు గాని యీ శక్తి యింద్రునియొద్దనున్నప్పుడు ఆతని చేతిచే విడువబడి వందలకొలది వేలకొలది శత్రువులను చంపి మరల నాతని చేతికి వచ్చును. కాని కర్ణుని విషయమున నట్లు కాదు. అట్టిశక్తి కర్ణుని హస్తగతమయి కర్ణునిచే ప్రయోగింపబడి ప్రబలుడై గర్జించుచున్న ప్రతాపశాలి నొక్కనిని మాత్రమే చంపి వెంటనే ఇంద్రునియొద్దకే వచ్చునని చెప్పినాడు. దానిపై కర్ణుడు-

ఏకమేవా హమిచ్ఛామి రిపుం హంతుం మహాహవే
గర్జంతం ప్రతపంతం చ యతో మమ భయం భవేత్

మ.భా. అరణ్యా-309. అ.

నాకు భయహేతువైన శత్రువొక్కడే. అతనినే వధింప నా సంకల్పమనెను. ఆపై ఇంద్రుడు :-

ఏకం హనిష్యసి రిపుం గర్జంతం బలినం రణే
త్వం తు యం ప్రార్థయస్యేకం రక్ష్యతే స మహాత్మనా
యమాహుర్వేద విద్వాంసో వరార్హ మపరాజితం
నారాయణమచింత్యం చ తేన కృష్ణేన రక్ష్యతే.

మ.భా. అరణ్యా - 309 అ.

నీవు ప్రబలుడైన ఒక శత్రువును యుద్ధములో వధింతువు. కాని నీవు ఎవరిని చంపవలెనని అనుకొనుచున్నావో అతడు వేదవేత్తలచే ప్రశంసింపబడు అచింత్యశక్తి గల శ్రీకృష్ణభగవానునిచే రక్షింపబడుచున్నాడని అన్నాడు.

అప్పుడు కర్ణుడు.

'ఏవమప్యస్తు భగవన్నేక వీరవధే మమ అమోఘాం దేహి మే శక్తిం'

మ.భా. అరణ్యా-309అ.

ఏమైనను సరే ఏకవీరఘ్నిని నాకిమ్ము అని కోరి, కవచకుండలములను ఛేదించి యిచ్చి, తన శరీరమునకు గాయముకాని వికృతరూపముగాని లేకుండ సూర్యునితో సమానమయిన వర్ణమును, తేజస్సును ఇంద్రునినుండి పొందెను.

ఇంద్రుడు మరొక్కవిషయమును గూడ కర్ణునకు చెప్పెను.

ఆశత్రువును నిర్జించుటకు సమర్థమయిన ఇతర ఆయుధములున్నప్పుడుగాని, నీకు ప్రాణహాని సమయము ప్రాప్తింపనప్పుడుగాని ఈ ఏకవీరఘ్నిని ప్రమాదమున ప్రయోగించినయెడల అది నీపైననే పడునుసుమా! జాగ్రత్త!" అని హెచ్చరించెను.

ఇదీ జరిగినవిషయము. ఇంద్రుడు సుస్పష్టముగా అన్నివిషయములు, ఈ ఏకవీరఘ్ని యొక్క పరిమితప్రయోజనము, అది అర్జునుని వధింపజాలదనియు తేటతెల్లముగా చెప్పెను. ఇందులో ఇంద్రుడు చేసిన వంచనగాని మాయగాని యేమియులేదు. కర్ణుడన్నిటికిని అంగీకరించియే కవచకుండలములనిచ్చి ఇంద్రునినుండి ఏకవీరఘ్నిని గ్రహించెను. ఇందులో కర్ణుని దానగుణమేమున్నది? బదులుకు బదులిచ్చుటయేకాక లాభసాటి బేరముగా కర్ణుడీ వ్యవహారమును పరిష్కరించుకొనెను.

ఇక నిక్కడ ఒకముఖ్యవిషయము. కృపాచార్యుడు, అశ్వత్థామ, కృతవర్మ చావు లేనివారు. అయినను వారు పాండవులను జయింపలేకపోయినారు. వీరలు రాబోవు మన్వంతరములలో సప్తర్షులలో పుట్టవలసిన వారుకనుక అమరులగుటలో అర్థమున్నది. దేవతలు అమరులే! అయినను రాక్షసుల చేతిలో నెన్నిసార్లు ఓడిపోలేదు? కర్ణుడట్లు కాదు. అతడు సూర్యాంశసంభవుడు. యుద్ధము కల్పించుటకు ప్రజ్వలింపజేయుటకు పుట్టినవాడు, యుద్ధము పూర్తియయి దేవకార్యము ముగిసిన పిమ్మట కర్ణుడుండి యేమిచేయును? యుద్ధము ముగిసిన పిమ్మటకూడ కర్ణుడు జీవించియుండుట నిష్ప్రయోజనము. అమృతమయమయిన కవచకుండలములు కర్ణుని చావులేకుండా చేయగలవు గాని పరాజయము లేకుండా చేయలేవు, పైగా దేవలోకములో నుండువారికి మనుష్యలోకములో నుండుట గొప్పశిక్షయేగాని సౌఖ్యప్రదము కాదు. మనుష్యలోక మెట్టిదనగా ఇక్కడజరిగే యజ్ఞములలో హవిర్భాగములను గైకొనుటకు వచ్చెడి దేవతలు గూడ.

"దేవా అపిమనుష్యగంధమసహమానాః ఛర్దనపూర్వకం
కుత్సయంతో యోజనాదుపరి స్థిత్వా హవిరాదదతే.

మ.భా - వి.పు. 632.

మనుష్య వాసనను సహింపలేక వాంతులు చేసికొనుచు, అసహ్యించుకొనుచు, ఆమడదూరముపై నుండి హవిస్సులను ఆకర్షించి గ్రహింతురట. అంత అసహ్యమైనదీ

మనుష్యలోకము. కనుక ఇక్కడ ఉండుట చాలా బాధాకరము. కవచకుండలములున్నచో కర్ణుడు చావడు కనుక దేవకార్యమయి యుద్ధమయిన తరువాత సూర్యాంశయయిన- అనగా సూర్యుడే అయిన కర్ణుడిక్కడుండుట అనవసరము. పైగా బహుదుఃఖకరము. కర్ణుడు యుద్ధములో చచ్చిపోయినచో వెంటనే సూర్యునిలో కలిసిపోవును. కనుక ప్రతిబంధకములైన కవచకుండలములు లేకుండ చేయవలయును. ఈ పరమార్థము నాశించియే మహేంద్రుడు విప్రవేషమున వచ్చి కర్ణుని భిక్షించి కవచకుండలములను హరించెను. కర్ణుడు మరణించగానే సూర్యమండలములో ప్రవేశించెను కూడా.

ఈ పరమార్థము నెరుంగక ఇంద్రుడు వంచనచేసియు మాయచేసియు విప్రరూపమున వచ్చి కర్ణుని కవచకుండలములను అపహరించెను గాన ఇది అనుచితకార్యమని లోకులు భ్రమింతురు.



ఆశత్రువును నిర్జించుటకు సమర్థమయిన ఇతర ఆయుధములున్నప్పుడుగాని, నీకు ప్రాణహాని సమయము ప్రాప్తింపనప్పుడుగాని ఈ ఏకవీరఘ్నిని ప్రమాదమున ప్రయోగించినయెడల అది నీపైననే పడునుసుమా! జాగ్రత్త!" అని హెచ్చరించెను.

ఇదీ జరిగినవిషయము. ఇంద్రుడు సుస్పష్టముగా అన్నివిషయములు, ఈ ఏకవీరఘ్ని యొక్క పరిమితప్రయోజనము, అది అర్జునుని వధింపజాలదనియు తేటతెల్లముగా చెప్పెను. ఇందులో ఇంద్రుడు చేసిన వంచనగాని మాయగాని యేమియులేదు. కర్ణుడన్నిటికిని అంగీకరించియే కవచకుండలములనిచ్చి ఇంద్రునినుండి ఏకవీరఘ్నిని గ్రహించెను. ఇందులో కర్ణుని దానగుణమేమున్నది? బదులుకు బదులిచ్చుటయేకాక లాభసాటి బేరముగా కర్ణుడీ వ్యవహారమును పరిష్కరించుకొనెను.

ఇక నిక్కడ ఒకముఖ్యవిషయము. కృపాచార్యుడు, అశ్వత్థామ, కృతవర్మ చావు లేనివారు. అయినను వారు పాండవులను జయింపలేకపోయినారు. వీరలు రాబోవు మన్వంతరములలో సప్తర్షులలో పుట్టవలసిన వారుకనుక అమరులగుటలో అర్థమున్నది. దేవతలు అమరులే! అయినను రాక్షసుల చేతిలో నెన్నిసార్లు ఓడిపోలేదు? కర్ణుడట్లు కాదు. అతడు సూర్యాంశసంభవుడు. యుద్ధము కల్పించుటకు ప్రజ్వలింపజేయుటకు పుట్టినవాడు, యుద్ధము పూర్తియయి దేవకార్యము ముగిసిన పిమ్మట కర్ణుడుండి యేమిచేయును? యుద్ధము ముగిసిన పిమ్మటకూడ కర్ణుడు జీవించియుండుట నిష్ప్రయోజనము. అమృతమయమయిన కవచకుండలములు కర్ణుని చావులేకుండా చేయగలవు గాని పరాజయము లేకుండా చేయలేవు, పైగా దేవలోకములో నుండువారికి మనుష్యలోకములో నుండుట గొప్పశిక్షయేగాని సౌఖ్యప్రదము కాదు. మనుష్యలోక మెట్టిదనగా ఇక్కడజరిగే యజ్ఞములలో హవిర్భాగములను గైకొనుటకు వచ్చెడి దేవతలు గూడ.

"దేవా అపిమనుష్యగంధమసహమానాః ఛర్దనపూర్వకం
కుత్సయంతో యోజానాదుపరి స్థిత్వా హవిరాదదతే.

మ.భా - వి.పు. 632.

మనుష్య వాసనను సహింపలేక వాంతులు చేసికొనుచు, అసహ్యించుకొనుచు, ఆమడదూరముపై నుండి హవిస్సులను ఆకర్షించి గ్రహింతురట. అంత అసహ్యమైనదీ

మనుష్యలోకము. కనుక ఇక్కడ ఉండుట చాలా బాధాకరము. కవచకుండలములున్నచో కర్ణుడు చావడు కనుక దేవకార్యమయి యుద్ధమయిన తరువాత సూర్యాంశయయిన- అనగా సూర్యుడే అయిన కర్ణుడిక్కడుండుట అనవసరము. పైగా బహుదుఃఖకరము. కర్ణుడు యుద్ధములో చచ్చిపోయినచో వెంటనే సూర్యునిలో కలిసిపోవును. కనుక ప్రతిబంధకములైన కవచకుండలములు లేకుండ చేయవలయును. ఈ పరమార్థము నాశించియే మహేంద్రుడు విప్రవేషమున వచ్చి కర్ణుని భిక్షించి కవచకుండలములను హరించెను. కర్ణుడు మరణించగానే సూర్యమండలములో ప్రవేశించెను కూడా.

ఈ పరమార్థము నెరుంగక ఇంద్రుడు వంచనచేసియు మాయచేసియు విప్రరూపమున వచ్చి కర్ణుని కవచకుండలములను అపహరించెను గాన ఇది అనుచితకార్యమని లోకులు భ్రమింతురు.



# 12. అరణ్యవాస అజ్ఞాతవాసములు

పాండవుల అరణ్యవాస అజ్ఞాతవాస విషయమున రెండు ప్రశ్నలుదయించును. పాండవులు సంపూర్ణముగా అరణ్యవాస అజ్ఞాత వాసములు పూర్తి చేసినారా? అనగా అరణ్యవాసము పంద్రెండు సంవత్సరములు, అజ్ఞాతవాసము ఒక సంవత్సరము, అర్జునుడు ఉత్తరగోగ్రహణ కాలమున బయల్పడు నాటికి ఈ రెండును పూర్తి యయినవా అనునది మొదటి ప్రశ్న. పదమూడు సంవత్సరములు పాండవులు అరణ్యఅజ్ఞాతవాసములలో నుండగా కౌరవులకు భుక్తమైన రాజ్యముపై పాండవులు తమ హక్కును కోల్పోలేదా అని రెండవ ప్రశ్న.

ఉత్తరగోగ్రహణములో అర్జునుడు బహిర్గతమగు నాటికి పాండవుల అరణ్య అజ్ఞాత వాసకాలము పదమూడు సంవత్సరములు పూర్తి కాలేదని దుర్యోధనునియొక్కయు కర్ణునియొక్కయు వాదము. వారి మతమున పాండవుల అజ్ఞాతవాసము పూర్తికాలేదు కనుక వారు తిరిగి అడవులపాలై పోవలసినదే. భీష్ముని లెక్కప్రకారము పాండవుల అరణ్యవాస అజ్ఞాతవాసకాలపరిమితి పూర్తియైనది. దుర్యోధన కర్ణులకు సరియయిన లెక్కలు లేవు. వారిది మొండివాదము. పాండవులు సరిగా లెక్క చూచుకొనియే యున్నారు.

కీచక వధానంతరము తన సోదరులందరు మరణించినారను కోపముతో సుధేష్ణ ద్రౌపదితో నిట్లన్నది :-

తే॥ నీవు చక్కనిదానవు నెలఁత ధైర్య
రహితచిత్తులు మగవారు రాజు దీనిఁ
దలఁచి భయమంది నిన్ను నీవలచునెడకు
నరుగునట్లుగఁ బ్రార్థించి యనుపుమనియె.

వ॥ అని తనమనంబునం గదిరిన యనుజవియోగతాపం బుత్కటం బగుటయు వెండియు నిట్లనియె.

క॥ బిరుదుగలమగలు గలరని
తరమిడి చంపింపఁ జూచెదవు జనములు నీ

పారువునఁబో వెఱతురు మా
పురమును రాష్ట్రంబు వెడలి పొమ్మెంద్రైనన్.

ఆ.భా. విరా - 3అ - 59-61

అప్పుడు వెళ్ళిపొమ్మన్నచో ద్రౌపది యెక్కడకు వెళ్ళును? తనభర్తలకిక్కడ అజ్ఞాతవాసమింకను పూర్తికాలేదు. తానేమి చేయవలె. ద్రౌపది సమాధానమిది.

ఉ॥ ముందటియట్ల యింక బదుమూఁడు దినంబులు మాత్రకున్ భవ
న్మందిర వాస మియ్యకొనినం గడతేఱు మదీయవాంఛ యం
తం దగంఁదోఁచి మత్పతు లు దాత్తమగతిన్ భవదీయవాంఛితం
బుందలకొల్పఁ జాలుదు రపూర్వమనః ప్రమదంబు సేకురున్

ఆ.భా. విరా. 3అ. 63.

ఈ పద్యమీక్రింది వ్యాసభారత శ్లోకమునకనువాదము

త్రయోదశాహ మాత్రం మే రాజా క్షామ్యతు భామిని
కృతకృత్యా భవిష్యంతి గంధర్వాస్తే న సంశయః
తతో మాముపనేష్యంతి కరిష్యంతి చ తే ప్రియం
ధ్రువం చ శ్రేయసా రాజా యోక్ష్యంతే సహబాంధవైః

మ.భా. వి. పు-362

ఇంకొ్కక పదమూడు రోజులు మాత్రము రాజాగారు సహింతురు గాక, అప్పటికి నాభర్తలు కృతకృత్యులగుదురు. తరువాత నన్ను తీసికొని పోవుదురు. అనగా నాటికి పదమూడు దినములు మాత్రమే అజ్ఞాతవాస పరిసమాప్తికి గడువున్నదన్న మాట. దీనిని బట్టి ద్రౌపదిది ఎంత నిర్దుష్టమయిన లెక్కయో గ్రహింపవచ్చును. ఇంత నిర్దుష్టమయిన లెక్క మహామహుడైన ద్రోణాచార్యులకే లేదు. అతడు రణరంగమున అర్జునుని చూచినంతనే కొంత సందేహము కలిగినది. భీష్మునితో అర్జునుని రాకను ఒరులకు తెలియనీయకుండ నర్మగర్భముగా నిట్లు చెప్పినాడు.

నదీజ లంకేశ వనారికేతుః
నగాహ్వయో నామ నగారిసూనుః

ఏషోంఽగనా వేషధరః కిరీటీ
జిత్వాఽవయం నేష్యతి చాద్య గావః

-మహా. భా ఉ. విరాట పు.329

అర్జునుని వానరధ్వజమును వానరధ్వజమనక 'లంకేశ వనారికేతు' వనినాడు, రావణుని అశోకవనమునకు శత్రువగువానిని జండాగాగలవాడని యర్థము. అర్జునుని పేరును చెప్పక ఒకచెట్టుపేరునుదాహరించినాడు. ఆ చెట్టు అర్జునవృక్షము.

అతడు 'నగారిసూనుః' అనగా పర్వతములకు శత్రువగు దేవేంద్రుని పుత్రుడు ఆ ద్రోణవాక్యమునకు భీష్ముని మౌనమే సమాధానము. భీష్ముని మౌనము వలన పాండవుల అజ్ఞాతవాసము పరిసమాప్తియైనదని ద్రోణుడు గ్రహించినాడు.

అజ్ఞాతవాస కాలము పరిసమాప్తి యైనదా? కాలేదా అని దుర్యోధనుడు భీష్మపితామహునడిగినాడు. భీష్ముడిట్లుచెప్పినాడు.

తేషాం కాలాతిరేకేణ జ్యోతిషాం చ వ్యతిక్రమాత్
పంచమే పంచమే వర్షే ద్వౌమాసావుపజాయతః
ఏషామప్యధికామాసాః పంచ చ ద్వాదశ క్షపాః
త్రయోదశానాం వర్షాణా మితి మే వర్తతే మతిః

మ.భా - వి.పు 363

ఆంధ్రభారతమున తిక్కన సోమయాజి చక్కగా సమాధానమిచ్చెను.

రెండవయేట నొక్కండధిమాసమ
ట్లెక్కినయన్నెలలెల్లఁగూర్చి
కొనుపదమూడు హాయనములు తప్పక
విన్నటి తోడ నిండె ---

ఆ.భా - వి - 4అ. 232.

నీలకంఠీయవ్యాఖ్య :- శార్వరిసంవత్సర శ్రావణబహుళషష్ఠ్యాం పరిసప్తమ్యా మేవ పాండవానాం వ్రతం పరిపూర్ణమభూదితి, సాంప్రత మష్టమీతిథిః ! తస్మాదేవ అర్జునో నిర్గత ఇత్యభిప్రాయః.

అనగా శార్వరి నామ బహుళ శ్రావణ షష్ఠి వెళ్ళగా సప్తమియందే పాండవుల వ్రతము పూర్తియైనది. ఈ రోజు అష్టమితిథి. అందువలననే అర్జునుడు బహిర్గతుడాయెనని భీష్ముని అభిప్రాయము.

కాలాతిక్రమము చేతను జ్యోతిషవ్యతిక్రమము చేతను అయిదు సంవత్సరములకు రెండు అధికమాసములు వచ్చును. పదుమూడు సంవత్సరములలో అధికమాసములు 5 నెలల 12 రోజులు. అనగా రెండవయేట ఒక అధికమాసము, తరువాత నయిదేండ్లకు రెండధికమాసములు, రెండవ అయిదేండ్లకు మరి రెండధికమాసములు, చివరి ఒకసంవత్సరమునకు 12 రోజులు వెరసి అయిదు నెలల పన్నెండురోజులు అధికముగా గణింపవలయును. అయితే ఈ లెక్కలో అధికమాసములను చేర్చుకొనవలెనా? వద్దా? అనగా చేర్చుకొనవలసినదే.

తిథిః కరణముద్వాహః క్షౌరం పర్వక్రియా తథా
వ్రతోపవాసయాత్రాద్యాః క్రియాః చాంద్రేణ గృహ్యతే

-మహా. భా .వి.పు. 364

అని శాస్త్రము. తిథులు, వివాహము, క్షౌరము పర్వక్రియలు, వ్రతోపవాస యాత్రాదులు చేయునపుడు చాంద్రమానమునే గ్రహింపవలెను. శార్వరినామ సంవత్సర బహుళషష్ఠి వెళ్ళగా సప్తమి యందే పాండవుల వ్రతము పూర్తియైనది. ఈరోజు అష్టమి. అందువలననే అర్జునుడు బహిర్గతుడాయెనని భీష్ముని అభిప్రాయము.

వనవాసాజ్ఞాతవాసములు సక్రమముగా నెరవేరినవనుటకు మరికొన్ని నిదర్శనములు కలవు. అందొకటి ధర్మరాజునకు యక్షుడిచ్చిన వరము.

వర్షం త్రయోదశమిదం మత్ప్రసాదా త్కురూద్వహ
విరాటనగరే గూఢా అవిజ్ఞాతా శ్చరిష్యథ॥
యద్యపి స్వేన రూపేణ చరిష్యథ మహీమిమాం
న వో విజ్ఞాస్యతే కశ్చిత్త్రిషు లోకేషు భారత

-మహా. భా వి. పు. 363

నా అనుగ్రహము వలన ఈ 13వ సంవత్సరము విరాటనగరమున నెవరికిని

తెలియకుండ రహస్యముగ సంచరించగలరు. మీరు ఏ యే రూపములను ధరింప సంకల్పించిరో ఆ రూపములను ధరింపగలరు. మీరు స్వస్వరూపములతో భూమిపై సంచరించినను మిమ్ములను మూడు లోకములలోనెవ్వరును తెలిసికొనజాలరు. అట్టి యమధర్మరాజు వరము వృధా పోవునా?

ఇక రెండవది అజ్ఞాతవాసము కొఱకు విరాటనగరమునకు పోవుచు యుధిష్ఠిరుడు దుర్గాదేవిని సాక్షాత్కరింపజేసికొని పొందిన వరము.

మత్ప్రసాదాచ్చ వస్సర్వాన్ విరాటనగరే స్థితాన్
న ప్రజ్ఞా స్యంతి కురవో నరా వా తన్నివాసిన:

-మహా. భా .వి. పు. 672

విరాట నగరములోనున్న మీ అందరును కౌరవులుగాని ఆనగరంలోనున్న ప్రజలుగాని గుర్తింపకుందురు గాక యనివరమిచ్చెను. దుర్గాదేవి వరము రిత్తపోవునా?

ఇక మూడవది స్వర్గలోకములో అర్జునునకు సంబంధమయిన శాపము, ఊర్వశి అర్జునుని షండునిగావలెనని మానవర్జితుడై వర్తింపవలెనని శపించినది. దానికి ఇంద్రుడు

అజ్ఞాత వాసో వస్తవ్యో భవద్భిర్భూతలేఽనఘ
వర్షే త్రయోదశే వీర తం తత్ర క్షపయిష్యతి
తేన నర్తనవేషణ అపుంస్త్వే తత్త్ర థైవ చ
వర్షమేకం విహృత్యైవం తత: పుంస్త్వ మవాస్స్యసి.

మ.భా. వి.పు 672

మీరు అజ్ఞాతవాసము చేయవలసియున్నదిగదా, ఈ శాపమున పదమూడవ సంవత్సరమున నెరవేర్చుము. నర్తకవేషముతో నపుంసకునిగా నొకసంవత్సరము సంచరించి పిమ్మట పుంస్త్వమును పొందెదవని ఇంద్రుడను గ్రహించెను. ఇంద్రుని యానతి ఊర్వశిశాపము అజ్ఞాతవాస సంవత్సరము పూర్తికానిదే అర్జునునికి షండత్వ విముక్తి కానే కాదు కదా! అజ్ఞాతవాస సంవత్సరము పూర్తియయిననే అర్జునునికి ఊర్వశీ శాప విముక్తి, షండత్వ విమోచనము, అర్జునుని షండత్వము పోయినది కదా, అజ్ఞాతవాసము పూర్తి కాకపోవుటేమి?

ఇక రెండవప్రశ్న పంద్రెండేండ్లకే రాజ్యము పరాధీనమయిన పాండవులహక్కు పోవునన్నచో ఇక్కడ పంద్రెండేండ్ల వనవాసముతో పాటు ఒకయేడ జ్ఞాతవాసమెందులకు? అజ్ఞాతవాసము కూడ అడవులలో కాక జనపదములలో నెందుకు విధింపబడినట్లు? పాండవులకు హక్కుపోయిన యెడల వనవాసాజ్ఞాతవాసములు సక్రమముగా పరిసమాప్తి గావించిన పిమ్మట వారి రాజ్యము వారు పొందగలుగు నిబంధన యెట్లు సాధ్యము?

"త్రయోదశే చ నిర్వృత్తే పునరేవ యథోచితమ్
స్వరాజ్యం ప్రతిపత్తవ్యమితరై రథ వేతరై"

-మహా. భా .సా. పు. 548

అని కదా చెప్పబడినది. దీని అంతరార్థమిది. బలవంతులు కనుక పన్నెండేండ్లు వనవాసమెట్లో పూర్తిచేయగలిగినను జగత్ప్రసిద్ధులు గనుక అజ్ఞాతవాసము అసంభవమనియు, తప్పక వారెరుంగబడుదురనియు, ఆవిధము వారికి శాశ్వతముగా రాజ్యానుభవములేకుండ జేసి తామే రాజ్యమెల్ల ననుభవించుచుండవచ్చుననియు దుష్టమైన తలంపుతో దుష్ట చతుష్టయము పన్నిన దుష్టమయిన పన్నాగము.

అందుకే ప్రథమద్యూతములో పాండవులోడిపోయిన రాజ్యసంపదలను ధృతరాష్ట్రుడు వారికి తిరిగి ఇచ్చివేసెను కదా. కనుక ఆరాజ్య సంపదను పునర్ద్యూతమున నొడ్డరాదని శకునిచెప్పెను. కనుకనే పునర్ద్యూతమున పన్నెండేండ్ల అరణ్యవాసము ఒక యేడజ్ఞాతవాసముననునవి.

మరి శాస్త్రమేమి చెప్పుచున్నది :-

'పశ్యతోఽబ్రువతో హానిర్భూ మేర్వింశతివార్షికీ
పరేణ భుజ్యమానాయా ధనస్య దశవార్షికీ'

మ.భా.సా.548

అని యాజ్ఞవల్క్యస్మృతి వ్యవహారకాండము, దీనికి మితాక్షరవ్యాఖ్య యిట్లు చెప్పుచున్నది. తాను చూచుచుండ తన భూమి నిరాక్షేపముగా నన్యునిచే ఇరువది సంవత్సరములు అనుభవింపబడినపుడు తన స్వత్వమునకు హాని కలుగును. గజాశ్వాది రూపధనము పదిసంవత్సరములట్లనుభవింపబడినపుడు తన స్వత్వహాని కలుగును.

ఈ చెప్పబడిన స్వత్వహాని గతఫలవిషయమేగాని స్వరూపవిషయము వ్యవహార విషయముగాదు.

అనగా నిర్వివాదముగా అన్యునిచే నిరువది సంవత్సరములు అనుభవింపబడిన తరువాత గూడ న్యాయముగా తన భూమి తనకు ప్రాప్తించును. కాని తాను చూచుచు నిరాక్షేపముగా నూరకున్న తన దోషముచే గతఫలము మాత్రము ప్రాప్తింపదు. తన పరోక్షములో నట్లనుభవింపబడినప్పుడును, ప్రత్యక్షములో వివాదపూర్వకముగ నట్లనుభవింపబడినప్పుడును, ఇరువది సంవత్సరముల పైనగూడ గత ఫలము ప్రాప్తించును.

ఇరువది సంవత్సరములలోపల ప్రత్యక్షములో నిర్వివాదముగా ననుభవించినను, గతఫలము గూడప్రాప్తించును. దేనికి స్వత్వహాని కలుగుననగా దేని స్వరూపము అనుభవముచే నష్టమగునో అట్టి దానికి మాత్రమే ఆ భూమిలో పుట్టిన ఫలవృక్షాది రూపఫలమునకు గాదని తాత్పర్యము.

ఈ ధర్మశాస్త్ర చర్చను బట్టి విచారించగా పదమూడేండ్లు పాండవరాజ్యమును దుర్యోధను డనుభవించినను పాండవులకు రాజ్యముపై హక్కుపోలేదు. దుర్యోధనునకు హక్కురాలేదు అని తాత్పర్యము.



# 13. ద్రౌపది కర్ణుని ఆరవవానిగా భావించునను ప్రసంగము

రాయబారమైన పిమ్మట శ్రీకృష్ణుడు కర్ణుని తన రథముపై నెక్కించుకొని ఒరులు వినకుండునట్లు కర్ణునితో చెప్పినమాట " ఓ కర్ణా! నీవు కుంతీదేవికి సూర్యానుగ్రహమున కన్యాదశయందు బుట్టినవాడవు.

కానీనశ్చ సహోఢశ్చ కన్యాయాం యశ్చ జాయతే
వోఢారం పితరం తస్య ప్రాహు శ్శాస్త్రవిదో జనాః
సోఽపి కర్ణ స్తథా జాతః పాండోః పుత్రోఽసి ధర్మతః.

మ.భా -ఉ.7అ

టీక॥ కానీనో ద్వివిధః సహోఢః వివాహోదూర్ధ్వం జాతః
వివాహాత్ప్రాగ్జాతశ్చ తన్మాతుర్వోఢారం తస్య
పితరం ప్రాహుః. -తత్త్వ. పు 1031

నీవు కుంతికి కన్యాదశయందు బుట్టుటచేతను, కన్యాసుతుడు ఆ కన్యను వివాహముచేసికొనిన వానికే చెందునని శాస్త్రనిర్ణయము కనుకను, నీవు పాండు పుత్రులలో జ్యేష్ఠుడవైతివి. నీవు వచ్చినయెడల పాండవులు నీకు రాజ్యమిచ్చివేయుదురు.-

"షష్ఠే త్వాం చ తథా కాలే ద్రౌపద్యుపగమిష్యతి"
ద్రౌపది నిన్నారవవానినిగా భావించును"- అని

కృష్ణుడీమాటలుచెప్పినది కర్ణునికి-ఆ కర్ణుడు సాధారణ వ్యక్తికాడు, గొప్ప జ్ఞాని. శ్రీ కృష్ణుడే కర్ణుని వ్యక్తిత్వమునిట్లు ప్రశంసించెను.

ఉపాసితాఽస్తే రాధేయ బ్రాహ్మణా వేదపారగాః
తత్త్వార్థం పరిపృష్టాశ్చ నియతేనానసూయయా
త్వమేవ కర్ణ జానాసి వేదవాదాన్ సనాతనాన్
త్వమేవ ధర్మ శాస్త్రేషు పరినిష్ఠితః

మ.భా . ఉ.పు 241

కర్ణుడు వేదవిదులగు బ్రాహ్మణులనారాధించి తత్త్వమును తెలిసికొన్న జ్ఞాని. అదియు కపటముతో కాక, అసూయారహితుడై వారికి శుశ్రూష గావించి నియమ బద్ధుడయియే తెలిసికొన్న జ్ఞాని. పెద్దలవలన గ్రహించిన శాస్త్రమును తానును స్వయముగా పరిశీలించి దృఢ పరచుకొన్న దిట్ట. ఆ ధర్మశాస్త్రములలో గూఢ ధర్మసూక్ష్మముల నెరిగిన ప్రౌఢ. అందుచేత శ్రీకృష్ణుని వచనములలోని అంతరార్థమును లెస్సగా గ్రహింపగలిగిన విద్వాంసుడేగాని మూర్ఖుడు కాడు. అట్టి కర్ణునితో కృష్ణుడు-

షష్ఠే త్వాం చ తథా కాలే ద్రౌపద్యుగమిష్యతి
అహం చ త్వాఽభిషేచ్యామి రాజానం పృథివీపతిం
యువరాజోఽస్తు తే రాజా ధర్మపుత్రో యుధిష్ఠిరః

మ.భా. ఉద్యో - 242

శ్రీకృష్ణుడు కర్ణునితో చెప్పిన విషయములు రెండు. ఒకటి- నీవిటు వచ్చి రాజ్యమును స్వీకరింపుమనునది. రెండవది- ద్రౌపదీదేవికి సంబంధించినది.

ఆంధ్రభారతము నందిట్లు చెప్పబడినది.-

వ॥ ఏను నిన్ను సామ్రాజ్యంబునకు నభిషిక్తుం జేయుదు నీవు వెడలునప్పటి మహోత్సవంబునకు యువరాజై యుధిష్ఠిరుండు నీరథంబున నుండి నీకు ధవళ చామరంబులు వైచు. వాయుపుత్త్రుండు సితచ్ఛత్రంబు వట్టు. నవ్యసాచి సారథ్యంబు సేయు. మఱియుఁ బాంచాలయాదవ పాండ్యమాత్స్యులు లోనుగాఁగల రాజలోకంబుల తోడఁగవలలు నభిమన్యు ప్రభృతి కుమారులు జేరయ మేమెల్లంబలసి పరివేష్టించి వత్తు మిట్టిమహేంద్ర విభవంబున మహనీయుండ వగుచు మహీచక్రంబేలు మని మఱియును.

క॥ పాంచాలరాజ పుత్రియు
నంచితముగ నిన్నుఁబొందు నార్వురవరుసన్
సంచితపుణ్యుఁడ నీవాక
యించుకయును వేఱుసేయ కేతెమ్మెలమిన్.

ఆం.భా-ఉద్యో -4అ-31-31

రాజ్యము విషయమై కర్ణుడిట్లు సమాధానము చెప్పినాడు. 'నేను కుంతీదేవిచే విడువబడి సూతకులమున జేరి సూతకులమందే పెంచబడితిని. సూతకులస్త్రీనే వివాహమాడి సంతతిని గాంచితిని. ఆ కులమునకు చెందిన పుత్రపౌత్రాదులు అనేకులు గలరు. నాకు వారియందు ప్రీతిమెండు. దుర్యోధను నాశ్రయించి నిష్కంటకమైన రాజ్యమును నేను పదమూడేండ్లు అనుభవించితిని. నన్ను నమ్ముకొనియే దుర్యోధనుడు యుద్ధముకు సిద్ధమైనాడు. అందుచేతనే నేనర్జునునిపై వైరము వహించినాను. నే నర్జునునితో యుద్ధము చేయకున్న యెడల నాకును అర్జునునకును అపకీర్తి కలుగును. అంతేకాక -

ధార్తరాష్ట్రస్య వార్ష్ణేయ శస్త్రయజ్ఞో భవిష్యతి
అస్య యజ్ఞస్య వేత్తా త్వం భవిష్యసి జానార్దన
అధ్వర్యవం చ తే కృష్ణ క్రతావస్మిన్ భవిష్యతి

మ.భా -ఉ. ఉద్యో. 244

ఈ విషయమాంధ్ర భారతమున -

క॥ అనుజులు ఋత్విజులుగ నీ
పనియిటు సేయు మని నీవుపద్రష్టవుగా
విను కురుకుమార పశువిశ
సనమున రణయజ్ఞమతఁడు సమ్మతిఁ జేయున్

ఆ.భా. ఉద్యో - 4అ - 45

ఆంధ్రభారతమున నీవు ఉపద్రష్టవుగా ఈ యజ్ఞము జరుగునని యున్నది. వ్యాసభారతమున శ్రీకృష్ణుడు వేత్తయును, అధ్వర్యుడుననను రెండధికారముల నిచ్చినాడు. లోకమున అధ్వర్యుడు వేరుగను ఉపద్రష్ట వేరుగను నుందురు. ఉపద్రష్టయన సాక్షియై చూచువాడు. ఈశ్వరరూపముచేత శ్రీకృష్ణుడే కర్తయై, పరబ్రహ్మగా సాక్షియై యీ యజ్ఞమును ఆతడే నడుపునన్న మాట. యజ్ఞమున హోతయనువాడు ఋత్విక్కు. ఆతడర్జునుడు. హోత చాల ప్రధానమైన పాత్ర. యజ్ఞమునందు నేతి నుంచి హోమము చేయు పాత్రకు స్రుక్కని పేరు. ఆ స్రుక్కు ఇక్కడ గాండీవము. ఆ స్రుక్కు నందుంచబడు ఆజ్యము యోధులయొక్క పరాక్రమము, వారిప్రాణములు. ఇట్లు చెప్పుచు ఆయజ్ఞముయొక్క తుదియెక్కడో చెప్పినాడు.

యదా ద్రోణం చ భీష్మం చ పాంచాల్యౌ పాతయిష్యతః
తదా యజ్ఞావసానం తద్భవిష్యతి జనార్దన
దుర్యోధనం యదా హన్తా భీమసేనో మహాబలః
తదా సమాప్స్యతే యజ్ఞః ధార్తరాష్ట్రస్య మాధవ

మ.భా. ఉ. ఉద్యో. పు 244

భీష్మద్రోణుల పతనము దుర్యోధనుని యజ్ఞమునకు చివరిభాగము. దుర్యోధనుని భీముడు చంపగా నీ యజ్ఞము సమాప్తమగును. ఈ సమయమున యుద్ధము జరుగుట చాలాముఖ్యమని చెప్పినాడు. యుద్ధమరణము శ్రేష్ఠము. క్షత్రియులకు వృధామరణము శ్రేయస్కరము కాదు. కావున విద్యావృద్ధులును, వయోవృద్ధులునగు రాజులెందరో యీ కురుక్షేత్ర యుద్ధమున నీల్గి పుణ్యలోకములను పొందవలసి యున్నది. కనుక తన జన్మరహస్యమును యుధిష్ఠిరునికి వెల్లడించవలదని ప్రార్థించినాడు. ఇట్లు తాను పాండవపక్షమున జేరి రాజ్యమును స్వీకరించుటకు నిరాకరించినాడు.

ద్రౌపదీ విషయమయి శ్రీకృష్ణుడన్న దానికి కర్ణుడు సమాధానమీయలేదు. అసలు శ్రీకృష్ణుడు కర్ణునితో నట్లెందుకనినట్లు? ద్యూతసభయందు ద్రౌపదిననేక దుర్భాషలాడితివి కదా! ద్యూతమున భార్యనోటువడని వేరొకని వరింపుమని ద్రౌపదిని దూషించితివి కదా! ఇపుడామె నిన్నే ఆరవవానిగా వరించును ఏమనియెదవని యెత్తిపొడిచినాడు. శ్రీకృష్ణుని యాంతర్యమును గ్రహింపజాలని బుద్ధిహీనుడా కర్ణుడు? కానేకాడు. కర్ణుని బుద్ధికుశలతను, సౌశీల్యతను శ్రీకృష్ణుడే ప్రసంశించెనే. కర్ణుడు శ్రీకృష్ణుని ఎత్తిపొడుపును లెస్సగా గ్రహించినాడు. అందుకే సమాధానమీయ లేదు.

ద్రౌపది పేరైనను ఎత్తలేదు సరికదా- "ఓ శ్రీకృష్ణా! నేను దుర్యోధనుని ప్రీతికై పాండవులను గూర్చియే దురూక్తులు పలికితినో ఆదుష్కార్యమునకు పరితపించుచున్నా" నని చెప్పినాడు.

యదబ్రువ మహం కృష్ణ! కటుకాని స్మ పాండవాన్
ప్రియార్థం ధార్తరాష్ట్రస్య తేన తప్యే హ్యకర్మణా

మ.భా - ఉద్యో - 7అ

ఆ యేహ్యకర్మకు తాను పరితపించుచున్నానని చెప్పినాడు. ద్యూతసభలో కర్ణుడు

పాండవులను గూర్చి కటూక్తులాడలేదు. అతడాడిన కటూక్తులన్నియు ద్రౌపదిని గూర్చియే. కాని ఆ పేరు ఎత్తుకొనుటకు దానికి పరిహారముగా - కూడ పశ్చాత్తాపముచే సిగ్గిల్లినాడు.

యదా ద్రక్ష్యసి మాం కృష్ణ నిహతం సవ్యసాచినా
పున శ్చిత్తి స్తదా చాస్య యజ్ఞస్యాథ భవిష్యతి.

ద్రక్ష్యసి

ఉద్యో - 7అ.

అర్జునునిచే హతుడనైన నన్ను నీవెప్పుడు చూచెదవో అప్పుడు రణయజ్ఞములో చయనమయినట్లు అని పలికెను.

కర్ణుడు రాజ్యమును గ్రహించుటకు పాండునందనునిగా ఏధర్మశాస్త్రము లాధారమయినవో ద్రౌపది పత్నియగుటకును ఆ ధర్మశాస్త్రములే ఆధారములగునని మహాభారతోపన్యాస కర్తలు వ్రాసిరి. ఇది యనుచితము. రాజ్యమును గ్రహించుటకీ ధర్మశాస్త్రము లాధారమో పై నిరూపింపబడినది. ద్రౌపదికి అయిదుగురు భర్తలగుటకు ఏ ధర్మశాస్త్రములును ప్రమాణములు కావు. ఈశ్వరవరప్రభావమున నామెకు పంచపతీత్వము ప్రాప్తించెను. ఆమె అయోనిజ. స్వర్గలక్ష్మి. ఆమె శుక్రశోణిత సంబంధమున జన్మించలేదు. ఆమె పంచపతిత్వము ప్రతిదిన కన్యాత్వవరపవిత్రీ కృతము. ఆమె ఈశ్వరునిచే అక్షతయోనిత్వ రూపమయిన కన్యాత్వము ప్రసాదింపబడి పవిత్రీకృతమయ్యెను. ఇట్టి స్థితిలో కర్ణుని ఆరవవానిగా పేర్కొనుట, దానికి కర్ణుడు పాండు పుత్రుడగుటకు ఏ ధర్మశాస్త్రములాధారములో ఆధర్మశాస్త్రములే దీనికిని ప్రమాణములని చెప్పుట అసంగతము. తంత్రవార్తికమునకు గల న్యాయసుధావ్యాఖ్యలో-

"కృష్ణేనాపి కర్ణం భేదయితుం పాండవా స్త్వా
మేవ మాతృసంబంధాజ్జ్యేష్ఠం భ్రాతరం మత్వా
రాజ్యేఽభిషేక్ష్యంతీత్యాది ప్రలోభయిత్వా షష్ఠే
చ త్వా మహని ద్రౌపద్యాగమిష్యతీత్య భిధానా
దమనుష్యత్వేనాఽనిషిద్ధత్వం తస్యాస్సూచిత
మిత్యాహ - అతఏవ చేతి"

మ.భా - తత్త్వకథనము - పు 1038

శ్రీకృష్ణుడుకూడ భేదోపాయమున కౌరవపక్షమునుండి కర్ణుని విడదీయుటకై తన ప్రయాణసమయమున తటస్థించిన కర్ణుని తనరథముమీదికి తీసికొనిపోయి పాండవులు నీకే రాజ్యాభిషేకము చేయుదురని యుపదేశించి ద్రౌపది నిన్నారవవానిగా భావించునని కూడ అనుటతో ఆమె పంచపతిత్వము పూజ్యమనియు, ఆమె పరమపవిత్రురాలనియు, ఆమెను నీవు జారిణియనుట చాల తప్పనియు సూచించి యుండెను. లేకున్న ప్రమాణభూతుడైన శ్రీకృష్ణుడట్లు చెప్పునా అను దానిపై కొందరు విద్వాంసులిట్లు వ్యాఖ్యానించిరి.

"షష్ఠే త్వాం చ తథా కాలే ద్రౌపద్యుపగమిష్యతి" అనికదా శ్రీ కృష్ణుని వాక్యము.

షష్ఠే కాలే యనగా అభిజిత్కాలమని అది సర్వదోషఘ్నము సకలశుభకార్యములకు ప్రశస్తమని చెప్పిరి. కనుక అప్పుడు పట్టాభిషేకము జరుగును. ఆ సందర్భమున వెనుక వస్త్రాపహరణసమయమున నీవాడిన పరుషవాక్యములను మరచి బావగారికి కోడలువలె సంతోషపూర్వకముగ ముత్తైదువులతో కలసి వచ్చి ద్రౌపది నీకు సత్కారము చేయునని వ్యాఖ్యానించినారు. ఈ వ్యాఖ్యయుక్తియుక్తముగానే యున్నది. మరి అభిలషణీయమే కాని, వీరి షష్ఠేకాలము మాత్రము అభిజిన్ముహూర్తమున కెట్లును పొసగుటలేదు. వీరుగ్రహించిన శ్లోకములో

"కుతపమధ్యాహ్నే అభిజితి తస్య షష్ఠకాలత్వం ప్రసిద్ధమేవ"

అని ఉదాహృతము. మరియు "ఏతావతా షష్ఠేకాల ఇతి అభిజిత్కాలత్వం ఘటతి' అని

కుతపకాలమభిజిత్కాలమన్నారు. కాని

"అంశోఽష్టమోఽహ్నః కుతపోఽస్త్రియాం"

అని అమరము. కన్నుక అష్టమకాలము కుతపమయినది కాని షష్ఠకాలము కాలేదు.

పగటి కాలమును పదునైదు ముహూర్తములుగా అమరములో చెప్పిన స్మృతియందున్నది. దీనికే మరొక పాఠాంతరము-

"ఆర్ద్రోరగమత్ర మఘా వసుజల విశ్వాభిజిద్విరించేంద్రా
ఐంద్రాగ్నమూల వరుణార్యమ భాగయుక్తో దివా ముహూర్తా స్స్యుః"
- మ.భా. వి.పు 381

అని వింధ్యమాధవీయపాఠము. ఇందును ఎనిమిదవదే అభిజిత్తు కాని షష్ఠమము కాదు.

'మహాభారతము-ధర్మసూక్ష్మదర్శనమను గ్రంథమున

"నీకు పట్టాభిషేకము జరుగు ప్రశస్తమగు ఆరవకాలమందు అనగా ఉషఃకాలమును కలిపి సాయంకాలము, ప్రాతఃకాలము తోకలిపి నిశాముఖము అగును. కాలములు 6, ప్రాతః, సంగవ, మధ్యాహ్న, అపరాహ్ణ, సాయం, నిశాముఖములు. ఆ ఆరవకాలము నందు పట్టాభిషేకము ప్రశస్తమగునని శ్రీకృష్ణుడు కర్ణునకు చెప్పెనని వ్రాసిరి.

(పు.30)

రామాయణమునందు పెక్కు చోట్ల పట్టాభిషేకప్రశంసచేయబడినది. అన్ని చోట్లను ప్రాతఃకాలముననే పట్టాభిషేకమని సూచించబడినది.

ఇక వైదిక విధానమును పరిశీలించినచో మహాసామ్రాజ్య పట్టాభిషేకోత్సవ కల్పమందిట్లు చేప్పబడినది.

సంకల్పదివసే బ్రాహ్మే ముహూర్తే చోత్థాయ నిత్యానుష్ఠానం
నివర్త్య, యాగమంటపమాగత్య సపత్నీకః పరిషదుపదిష్టక
ద్వినాయకం సంపూజ్య పుణ్యాహవాచనం నాందీముఖం చ
కృత్వా సంకల్ప్య --- దీపస్థాపనం కృత్వా ఋత్విగ్వరణం
కృత్వా దేవతా నామావాహనం కృత్వా షోడశోపచారైః
సంపూజ్య, యస్య స్మృత్యేతి పూజాసమాప్త్యంతం కృత్వా
పట్టాభిషేక సర్గశ్రవణం కృత్వా అనంతరం రామాయణ
వాచకాది క్రమేణ యథా విభవం ఋత్విక్పూజనం

సువాసినీ బ్రాహ్మణ పూజన భోజన రాత్ర్యుత్సవ
నవాయతనపూజా దేవతోద్వాసనాదికం కుర్యాత్

మ.భా. వి. పు. 386.

దీనిని బట్టి పట్టాభిషేకమహోత్సవము పూర్వాహ్ణమందే జరిగినదనుట స్పష్టము. అభిజిన్ముహూర్తమున జరిగినట్లు లేదు. సాయంకాలమునగాని నిశాముఖమునగాని పట్టాభిషేకము జరుగలేదు. అభిజిన్ముహూర్తము అష్టమమయినదికాని షష్ఠమకాలముకాలేదు. కనుక వీరివ్యాఖ్యానము అసమంజసము మరియు అశాస్త్రీయము నగుటచే చెల్లుబాటు కాలేదు.

దీని తత్త్వమును తెలియలేక ఎవరికి తోచినట్లు వారు ద్రౌపది కర్ణుని తనకు ఆరవ భర్తగా నంగీకరించుటకు సిద్ధమేయని వ్రాయుట అనుచితము.



# 14.అర్జునుడు ఉలూపియను వితంతువైన నాగకన్యను వివాహమాడి ఇలావంతునికి జన్మనిచ్చెనా?

అర్జునుడు ఉలూపి యందు ఇలావంతుని కనిన విధము

పాండవులు ఇంద్రప్రస్థపురమునయున్న రోజులలో నొకనాడు ఒక బ్రాహ్మణుని హోమధేనువును దొంగలపహరించుకొని పోయిరి. ఆ బ్రాహ్మణుడు అర్జునునకు మొరపెట్టుకొనగా అర్జునుడు తన ఆయుధములకొరకు ధర్మజుని ఆయుధశాలకు వెళ్ళెను. అచ్చట ద్రౌపదీ ధర్మరాజాలుండిరి. అయినను ఫల్గుణుడు తన ఆయుధములను గ్రహించి, బ్రాహ్మణుని హోమధేనువులను తెచ్చియిచ్చి యాతని కప్పగించెను. పాండవులు తమలో తాము నారదుని సమక్షమున చేసికొన్న నియమ భంగమయినందులకు ప్రాయశ్చిత్తముగా అన్నయనుమతిని పొంది ద్వాదశవార్షిక బ్రహ్మ వ్రతముపై తీర్థయాత్రలకు వెడలెను.

ఇచ్చట అర్జునుడు ధర్మజుని ఆయుధశాలకుగాక శయన మందిరమునకే వెళ్ళెనని ఒక అపోహ. అది సరికాదు. ఆయుధములకొరకు పోవలసినవాడు ఆయుధశాలకే పోవును కాని శయనమందిరమునకేలపోవును?

మూలమున-

"ప్రావిక్షన్మనసా తతస్తు నృపతే శ్శస్త్రాయ గేహం స్వయం"

 మ.భా.సా - ఆది. పు.382

అని 'శస్త్రాయ గేహం' అని ఆయుధ శాలకే వెళ్ళినట్లున్నది. నన్నయభట్టారకులు ఆంధ్రభారతమునకూడ-

" ద్రౌపదీసహితుఁడై ధర్మరాజాయు ధా
గారంబునందున్నఁగార్ముకంబుఁ

ఆ॥ బుచ్చికొనఁగఁదనకుఁబోలమియెఱిఁగియు
విప్రునార్తరవము వినఁగ నోప
కర్జునుండు విజశరాసనగ్రహణార్థ
మాయుధాలయమున కరిగెనపుడు"

మ.భా. ఆది - 8అ. 118.

అని అర్జునుడు ఆయుధాగారమునకు వెళ్ళినట్లే చెప్పెను. ధర్మజుని శయనమందిరమునకు వెళ్ళినట్లు మూలమున గాని ఆంధ్రభారతమున గాని చెప్పబడలేదు. కావున నీ ఆపోహ నిరాధారము.

ఒకనాడు అర్జునుడు గంగాతీరమున స్నానము చేయుటకు నదిలోనికి దిగగానే నాగకన్య యొకతె అర్జునుని నీటిలోనికి లాగుకొని పోయి నాగలోకమును చేర్చెను. అర్జునుడాశ్చర్యపడి 'నీవెవ్వతె'వని యడుగ ఆకన్య 'నేను కౌరవ్యుడను నాగరాజుకన్యను. నాపేరు ఉలూపి. నీవు స్నానము చేయునపుడు నిన్ను చూచి ప్రేమించితిని. అనన్యనైన నన్నునుగ్రహింపుమ'ని కోరెను. అంత అర్జునుడు నేను ధర్మరాజుచే నాజ్ఞాపింపబడి ద్వాదశవార్షికబ్రహచర్యవ్రతము చేయుచున్నాను. నీకు ప్రీతి కలిగించుటకు నేనస్వతంత్రుడను. అనృతమాడువాడను కాననియు 'నాకనృత దోషము, ధర్మహానియు లేకుండునట్లు నీకు ప్రియము కలుగునట్లు చేయు'మనెను.

అసలీనాగులెవరు? ఈనాగజాతి స్వరూపస్వభావములేమి? వీరెక్కడనుందురు? అను ప్రశ్నలుద్భవిల్లును. దీనికి నీలకంఠీయువ్యాఖ్య ఇట్లు కలదు.

"నాగా: కాద్రవేయా: నాగకార్దవేయశబ్దౌ మానుషా కరేషు ఫణలాంగూలాది యుక్తేషు దేవయోనిషు భోగిషు వర్తతే" నాగలోక ఇతి పాతాళ ఇత్యత్ర గుప్తభూ వివరేష్వేక: ఇత్యర్థ:"

అనగా కాద్రవేయులు నాగ, కాద్రవేయ శబ్దములు మనుష్యాకారము కలిగినట్టియు, పడగ, తోకతో కూడుకొని యున్న దేవయోని సర్పములందు వర్తించును. నాగలోకమనునది పాతాళమునందు ఒకానొక సర్పములు నివసించు భూప్రదేశము. అని యర్థము. నాగులనగా వేశ్యజాతి యందొక విభాగమనియు, వీరును వేశ్యలే యనియు మహాభారత చరిత్ర కారులు వ్రాసిరి, అది సరికాదు. అమరకోశము భోగివర్గమునందును --

"ఛాగా: కాద్రవేయా:"-వ్యాఖ్య-నాగకాద్రవేయశబ్దౌ
మానుషాకారేషు ఫణాలాంగూలాది యుక్తేషు, దేవ
యోనిషు భోగిషు వర్తతే" అధోభువన పాతాళ,
బలిసద్మరసాతలం నాగలోక:" అని కలదు.

-మహా. భా .తత్త్వ. పు. 658

అర్జునుడు స్త్రీలోలుడనియు, వితంతువును నాగకన్యయు నయిన ఉలూపిని మోహించి వివాహమాడి ఇలావంతుని కనెననియు ఉలూపితో బహుకాలము కాపురము చేసెననియు మహాభారత చరిత్రకారులేమేమో వ్రాసిరి. కాని ఇది వాస్తవ విరుద్ధము. అర్జునుడు ఉలూపిని చూచి మోహించలేదు. ఉలూపియే అర్జునుని చూచి మోహించినది. పైగా అర్జునుడు ద్వాదశవార్షిక బ్రహ్మచర్యమునందుండుటచే తానశక్తుడనియే చెప్పెను. ఉలూపిని కూడుటకు నిరాకరించెను. అర్జునునకు సమాధానముగా నులూపి తన అతీంద్రియజ్ఞానము ప్రదర్శించుచు-

"జానామ్యహం పాండవేయ యథా చరసి మేదినీమ్
యథా చ తే బ్రహ్మచర్య మిద మాదిష్టవాన్ గురుః
పరస్పరం వర్తమానాం ద్రుపదస్యాత్మజాం ప్రతి
యోన్యాను ప్రవిశేన్మోహాత్స వై ద్వాదశవార్షికమ్
వనే చరేద్బ్రహ్మచర్యమితి వ స్సమయః కృతః
తదిదం ద్రౌపదీహేతోరన్యోఽన్యస్య ప్రవాసనమ్
కృతవాం స్తత్ర ధర్మార్థమత్ర ధర్మో న దుష్యతి"

నీలకంఠీయవ్యాఖ్య - జానామ్యహం పాండవేత్యాదినా స్వస్యాతీన్ద్రియజ్ఞానం దర్శయన్తీ ద్రౌపదీనిమిత్తమేవ తవ బ్రహ్మచర్యం, నాన్యత్రేత్యాహ, అత వాఽగ్రేపి చిత్రాంగదా సుభద్రయోః పాణిగ్రహణం సంగచ్ఛతే"

- మ.భా - తత్త్వ పు.662

ద్వాదశవార్షికబ్రహ్మచర్యమను సమయబంధము మీరు ద్రౌపదీదేవినిగూర్చి చేసికొనినదియే. నేనెరుగుదును. ధర్మజునిచే నాజ్ఞాపింపబడినదియు నేనెరుగుదును. నామూలమున దానికి భంగము కలుగదు. ధర్మలోపములేదు. మరియు నిట్లు చెప్పినది.

"పరిత్రాణం చ కర్తవ్య మార్తానాం పృథులోచన
కృత్వా మమ పరిత్రాణం తవ ధర్మో న లుప్యతే
భక్తాం చ భజ మాం పార్థ సతామేతన్మతం ప్రభో
న కరిష్యసి చేదేవం మృతాం మా ముపధారయ

శరణం చ ప్రపన్నాస్మి త్వా మద్య పురుషోత్తమ
యాచే త్వా మభికామాహం తస్మా త్కురు మమ
ప్రియమ్"

ము.భా. తత్త్వ పు 663

ఆత్మరక్షణమవశ్య కర్తవ్యము. ఇది సత్పురుష ధర్మము కూడ. నీవిట్లు చేయక ఉపేక్షించినచో నేను మరణింతును. అని నాగకన్య చెప్పగా

"కృతవాం స్తత్తథా సర్వం ధర్మముద్దిశ్య కారణమ్"

అను ధర్మమునుద్దేశించి అర్జునుడట్లే ప్రవవర్తించెను. ఈ కథనమును ఆంధ్రభారతమున

వ॥ ఏ నులూచి యను నాగకన్యక నైరావత కుల సంభవుండయిన కౌరవ్యకూఁతుర నిన్నుఁజూచి మనోజబాణబాధితనయితి నామనోరథంబు సలుపుము.

దాని కర్జునుండు ఇట్టనియె
ద్వాదశ మాసికవ్రతము సలుపుదుఁదరుణి మాయన్న
యాదేశమునఁజేసి సర్వ తీర్థము లాడుచు బ్రహ్మ
వాదుల సంగతి బ్రహ్మ చర్య సువ్రతుఁడనై యుండి
నీదు మనోరథమెట్లు సలుపంగనేర్తునేనిపుడు

వ॥ అనిన నవనతాననయుయి నాగకన్యక యర్జునుం జూచి ద్రుపదరాజపుత్రియందు మీ చేసిన సమయంబును భవత్తీర్థాగమన నిమిత్తంబును, వ్రతంబును నెఱుంగని దానగాను, సర్వతీర్థ సేవనంబును, సర్వవ్రతంబులు సలుపుటయును సర్వదానధర్మక్రియలును ప్రాణదానంబుతో సమానంబులుకావు, నా మనోరథంబు విఫలంబయిన మనోజానలంబునం బ్రాణ పరిత్యాగంబగుంగావున నన్ను రక్షింపుము దీన నీకు వ్రతభంగంబు గాదనిన నర్జునుండును దాని మనోరథంబు సలిపి యా

రాత్రి నాగ భువనంబున వసియించి నాగకన్యకయందు సద్యోగర్భంబున
నిలావంతుండను కొడుకుం బడసి నాగలోకంబు వెలువడి యాదిత్యోద
యంబు తోడన గంగాద్వారంబునకు వచ్చి"

ఆం. భా - ఆది. 8అ. 130-133-134.

అనియే కలదు. మూలమున నర్జునుడు

" బ్రహ్మచర్యమిదం భద్రే మను ద్వాదశ వార్షకమ్
ధర్మరాజేన చాదిష్టం నాహ మస్మి స్వయవశః"

తాను ద్వాదశ వార్షక బ్రహ్మచర్యమును మాహించితిననియు చెప్పెను. మూలమున ద్వాదశవార్షికబ్రహ్మచర్యవ్రతమని యుండ నన్నయభట్టారకులు ద్వాదశ మాసికబ్రహ్మచర్యవ్రతమని వ్రాయుట వింత.

చేమకూర వేంకటకవి విజయవిలాసమునందును ఈ కథనమును వర్ణించెను.

---యౌనెకా! వ్రతముగైకొని యుండెడి నన్ను నేల తో
డ్కొనియిటఁదెచ్చె నీవెడఁగు కోమలి? భూజగమేడ మారుతా
శనజగమేడ? యెంత ఘనసాహస మింతుల కంచు నెంచుచున్.

కII కాముకుఁడఁగాక వ్రతినై
భూమి ప్రదక్షిణముసేయఁబో యెడి వానిన్
గామించి తోడి తేఁదగ
వా? మగువ? వివేక మించుకైనన్ వలదా?

దానికి ఉలూచి యీవిధముగా సమాధానము చెప్పెను. చేమకూరవేంకటకవి తన విజయవిలాసమున-

మII ఒక భూమీదివిజుండు చోరహృత ధేనూత్తంసుఁడై వేడికొం
టకు రా ధర్మజుకేళి మందిరము దండంబోయి కోదండసా
యకముల్ దెచ్చుట బూర్వక్లుప్త సమయవ్యాయాను కూలంబుగా
నొక యేఁడుర్వి ప్రదక్షిణంబరుగు నుద్యోగంబు వాటిల్లినన్.

వి.వి. 1అ. 43.

ఇందు మూలభారతమునకు విరుద్ధమయిన యంశములు రెండు కలవు. ఒకటి ఆయుధముల కొరకు అర్జునుడు ధర్మజునికేళీమందిరమునకు పోయెనని. రెండవది అర్జునుడు ఒకయేడు భూప్రదక్షిణమునకు అనగా తీర్థ యాత్రకు బయలుదేరెనని. ఒక యేడు కాదు, ద్వాదశవార్షిక బ్రహ్మచర్యవ్రతము అనగా పండ్రెండేండ్లు తీర్థయాత్ర. ఈ విజయ విలాసముననే వేరొక పద్యమున

"ద్విజార్థము ధర్మజు పాన్పుటింటి ముంగ

లఁజని, శస్త్రశాల విలుగైకొను, టందు నిమిత్తమీవు

నిశ్చలమతి భూప్రదక్షిణము సల్పగ వచ్చుట నేనెఱుంగుదున్"

వి.వి. -1ఆ. 92.

అని ఉలూపిచే పలికించెను. అనగా అర్జునుడు ధర్మజుని శయన మందిరమునకు పోలేదు. అర్జునుని ధనుస్సును బాణములును ధర్మరాజుయొక్క పడకగది ప్రక్కగదిలోనున్నవి. వానిని తెచ్చుటకు అర్జునుడు పడకగదిముందునుండి శస్త్రశాలకు పోయెనన్నమాట. కావున విజయవిలానకర్త కూడ అర్జునుడు ధర్మజుని శయనమందిరమునకు పోయెనని చెప్పలేదు.

ఇక అర్జునుడు పూనినది ద్వాదశవార్షికబ్రహ్మచర్యవ్రతమేకాని ద్వాదశమాసిక బ్రహ్మచర్య వ్రతముకాదు. ఉలూపి సమాగమమునకు పూర్వమే కొన్నినాళ్ళు గడిచినవి. ఆ తరువాత ఆసేతుశీతాచలము సుదీర్ఘతీర్థయాత్ర గావించినాడు. అద్దానిని విజయవిలాసకర్త సుదీర్ఘ వచనమున నతివిపులముగా వర్ణించి

"పదమూడవనెలఁబాండ్య మహీ

కుండలా ఖండలుండగు మలయధ్వజుండేలు

మణిపురంబుజేరం బోవు సమయంబున"

వి.వి - 1ఆ - 128.

అనిముగించినాడు. అప్పటికే పదమూడు మాసములు గడిచినవికదా? మణిపురమున చిత్రాంగదను వివాహమాడి యచ్చట మూడు సంవత్సరములున్నట్లు మూల భారతముననే చెప్పబడినది.

"స తథేతి ప్రతిజ్ఞాయ తాం కన్యాం ప్రతిగృహ్య చ

ఉవాస నగరే తస్మిం స్త్రిసః! కున్తీసుత స్సమాః"

మ.భా - ఆది. ఆ. 215.

తరువాత తీర్థయాత్రలను కొనసాగించుచు ప్రభాసతీర్థమును చేరెను. అక్కడ కొన్నాళ్ళుండెను. తరువాత రైవతకాద్రియందు నివాసము కపటయతివేషము సుభద్రాపరిణయము. అప్పటికిని పార్థునకు పండ్రెండేండ్ల గడువు తీరలేదు. కావున నాతడు తన గడువు తీరువరకు పుష్కరతీర్థముననివసించి గడువుతీరిన పిమ్మటనే సుభద్రతో కూడ నింద్రప్రస్థమున కేగెను. ఇది జరిగిన విషయము. కనుక అర్జునుడు చేసినది ద్వాదశమాసిక బ్రహ్మచర్యమనుట ప్రామాదికమనక తీరదు.

చ॥ తెలియని దానగాను జగతీవర ద్రౌపది యందు ముందు మీ
రల సమయంబుసేయుట, ద్విజార్థము ధర్మజుపాన్పు టింటిముం
గలఁజని శస్త్రశాల విలుగైకొనుటందు నిమిత్తమీవుని
శ్చలమతి భూప్రదక్షిణము సల్పఁగ వచ్చుట నేనెఱుంగుదున్.

తే॥ చెఱకు విలుకాని బారికి వెఱచి నీదు
మఱుఁగుఁజేరితిఁ జేపట్టి మనుపునన్నుఁ
బ్రాణదానంబు కన్నను వ్రతము కలదె?
యెఱుఁగవే ధర్మ పరుఁడవు నృపకుమార

వి.వి. 1అ. 87-88-92-93.

దీనిని బట్టి చూడగా అర్జునుడు ఉలూపిని మోహించలేదు. ఉలూపియే అర్జునుని మోహించి తానే అభికామయై అర్జునుని పరిపరివిధముల సమాధానపరచి యాతనితో రమించినది. అర్జునుడు 'నీవు ఫణిజాతివి నేను మనుజజాతిని అన్య జాతిని ప్రవర్తించుట అర్హముకాద'నిన ఉలూపి

ఉ॥ ఏమనఁబో యెదన్ దగులమెంచక నీవిటులాడఁతొల్లి శ్రీ
రాముకుమారుఁడైన కుశరాజు వరింపడె మా కుముద్వతిన్
గోమల చారుమూర్తి పురుకుత్సుడు నర్మదఁబెండ్లి యాడఁడే
నీమనసాక్కటే కరఁగ నేరదు గాని నృపాలకాగ్రణీ

వి.వి. ప్రథమ -101

యని సమాధానపరచినది అంతదూరమెందులకు? అర్జునుని ముత్తాత శంతనుడు గంగాదేవిని వివాహమాడి సంతానమును కనెను కదా? భీష్ముడు గంగా శంతనుల సంతానమే కదా?.

ధర్మసూత్రముల ననుసరించియే అర్జునుడు చిత్రాంగదను, సుభద్రలను వివాహమాడెనని గ్రహించవలెను.

ఆ ఒక్క రాత్రియే అర్జునుడు ఉలూపితో గడపినది. ఆమెను వివాహమాడనూలేదు. కాపురము చేయనూ లేదు. పైగా నామె విధవకూడ, అందుచేతనే నియోగ పద్ధతిని ననుసరించియే ఆమెకు పుత్రదానము చేసెను. అర్జునునికి ఉలూపితో గల సంబంధము నియోగధర్మముకాని వైవాహికము కాదు. అందు చేత మరల నామెను కలువలేదు. మరల ఎప్పుడును మాట్లాడను కూడ మాట్లాడలేదు, స్పృశింప లేదు. కాముకుడై ప్రవర్తింపలేదు. నియోగధర్మములో నుద్దేశింపబడిన కార్యము నెరవేరిన పిమ్మట మరలనొకరి నొకరు కలిసి కొనకూడదు. అట్లు కలిసినచో నది వ్యభిచారమగును. దోషమగును. చిత్రాంగదను వివాహమయిన పిమ్మట -

"ఇహైవ భవ భద్రం తే వర్ధేథా బభ్రువాహనం
ఇంద్రప్రస్థ నివాసే మే త్వం తత్రాఽగత్య రంస్యసి"

-మహా. భా .తత్త్వ పు. 666

నీవు ఇక్కడనే యుండి బభ్రువాహనుని సంరక్షించుచుండుము. నేనింద్ర ప్రస్థమున నివసించినప్పుడు నీవువచ్చి నాతోనుండవచ్చునని చిత్రాంగదతో చెప్పిన అర్జునుడు ఉలూపితో నట్లు చెప్పలేదు. కారణము చిత్రాంగదను వివాహమాడినాడు. ఉలూపిని వివాహమాడలేదు.

ఈ కథ యింత వరకు మహాభారతము ఆదిపర్వమునందున్నది. మరల ఉలూపీ ప్రసక్తి భీష్మపర్వమునందును, అశ్వమేధపర్వమునందును కాననగును. భీష్మపర్వమున సంజయుడు ధృతరాష్ట్రునికి ఇలావంతుని గూర్చి చెప్పుచూ-

"అర్జునస్య సుత: శ్రీమాన్ ఇరావాన్నామ వీర్యవాన్
సుతాయాం నాగరాజస్య జాత: పార్థేన ధీమతా
ఐరావతేన సా దత్తా అనపత్యా మహాత్మనా
పత్యౌహతౌ సుపర్ణేన కృపణా దీనచేతనా
భార్యార్థం తాం చ జగ్రాహ పార్థ: కామవశానుగాం
ఏవమేన సముత్పన్న: పరక్షేత్రేఽర్జునాత్మజ:"

-మహా. భా .తత్త్వ పు. 667

ఈ ఇలావంతుడు ఉలూపియందు పార్థునివలన జన్మించెను. ఉలూపి భర్త గరుత్మంతునిచే హతుడు కాగా, సంతతిలేక కామించినట్టి యామెను తండ్రి యనుజ్ఞపై పార్థుడు గ్రహించెను. ఇట్లు పరక్షేత్రమయిన ఉలూపియందు అర్జునాత్మజుడు జన్మించెను. ఆ ఇలావంతుడు నాగలోకమునందే పెరుగుచుండెను. ఇంద్రలోకము నందర్జునుడున్నట్లు తెలిసికొని ఇలావంతుడు స్వర్గమునకేగి తండ్రిని కలిసికొని తన్ను తాను పరిచయము చేసికోగా, అర్జునుడా పూర్వవృత్తాంతమును స్ఫురణకు తెచ్చుకొని ప్రీతుడై రాబోవు కురుక్షేత్రసంగ్రామమున తమకు సహాయపడవలసినదిగా కోరెను. దీనిని బట్టి ఉలూపి విధవయగుట స్పష్టమే. అర్జునుడు నియోగ విధినననుసరించియే ఉలూపియందు ఇలావంతుని కనెననుటయు స్పష్టమే. లేనియెడల అర్జునునకు ఉలూపి పరక్షేత్రమెట్లగును? వివాహమయినచో స్వక్షేత్రమే కావలయును కదా! మరల నీ ఉలూపి ప్రసక్తి అశ్వమేధ పర్వమున బభ్రువాహనుని చేతిలో అశ్వరక్షకుడైన అర్జునుడు మూర్ఛిల్లినప్పుడు కాననగును. అర్జునుడు బభ్రువాహనుని నిందించి యుద్ధము చేయుమని సవాలు చేయగా విని ఉలూపి భూమిని పెకలించుకొని వచ్చి బభ్రువాహనుని తండ్రితో యుద్ధముచేయుమని పురికొల్పినది.

"తమేవ ముక్తం భర్త్రా తు విదిత్వా పన్నగాత్మజా"

-మహా. భా .తత్త్వ. పు. 669

ఇచ్చట భర్తృశబ్దము, భీష్మపర్వములో "భార్యార్థం తాం చ జగ్రాహ" అని భర్తృభార్యా శబ్దములు ప్రయుక్తములైనవి కదా! వివాహము కానిచో భర్తృభార్యా శబ్దములెట్లు ప్రయుక్తములైనవని యొక సంశయము. అందుకు సమాధానమిది. ఈ విషయమై మనుస్మృతి యిట్లు చెప్పుచున్నది.

భర్తుః పుత్రం విజానన్తి శ్రుతి ద్వైధం తు భర్తరి
ఆహు రుత్పాదకం కేచి దపరే క్షేత్రిణం విదుః

మను. 9అ. 32.

వాఖ్యానము : భర్తుః పుత్రో భవతీతి మునయో మన్యన్తే
భర్తరం ద్విప్రకారా శ్రుతిర్వర్తతే కేచి దుత్పాదక
మహోఢారమపి భర్తారం తేన పుత్రేణ పుత్రిణమాహుః
అన్యే తు వోఢారం భర్తారమనుత్పాదక మపి అన్యజనితేన
పుత్రేణ పుత్రిణ మాహుః

ఇచ్చట వివాహము చేసికొనినవాడేకాక వివాహము చేసికొనక సంతతి కలిగించినవాడు కూడా భర్తయనబడునని చెప్పబడినది. కనుక వివాహము చేసికొనక పోయినను ఉలూపీపార్థులయందు భార్యాభర్తృ శబ్దములు వాడబడుట యుక్తమే. ఉలూపి పార్థుని కోరుటలో కూడ నీకు నా పరిత్రాణము వలన ధర్మలోపము కలుగదు. నేనభికామనై నిన్ను యాచించుచుంటిని

"యాచే త్వా మభికామాహంతస్మాత్కురు మమ ప్రియమ్"

-మహా. భా .తత్త్వ. పు. 672

అని చెప్పికొన్నది.

" అభికామాం స్త్రియం యశ్చ గమ్యాం రహసి యాచితః

నోపైతి న చ ధర్మేషు భ్రూణహే త్యుచ్యతే బుధైః"

-మహా. భా .తత్త్వ. పు. 672

మహాభారత తత్త్వకథనము.

అని శాస్త్రవచనమున్నది. ఈ మహాభారతవచనమునకు అభికామయు గమ్యయునైన స్త్రీచే రహస్యమందు యాచింపబడి యెవ్వడు తిరస్కరించునో, ఆతడు భ్రూణహత్యాపాతకమును పొందునని యర్థము,

ఆంధ్రమహాభారతమున యయాతి చరిత్రముసందును శర్మిష్ఠయందు సుతులను కన్న యయాతిపై శుక్రుడలుగ యయాతియు నీ ధర్మసూక్ష్మమునే చెప్పెను.

క॥ "ఋతుమతియై పుత్త్రార్థము

పతిఁగోరిన భార్యయందు బ్రతికూలుండై

ఋతు విఫలత్వము సేసిన

నతనికి మఱి భ్రూణహత్య యగునండ్రు బుధుల్"

ఆం. భా - ఆది. 3ఆ. 188

దీనిని బట్టి యా పార్థుడు కూడిన నాగకాంత గమ్యస్త్రీయని తేలినది. ఆ నాగకాంతచే బ్రార్థితుడైన పార్థుడు "ఏవమేవ సముత్పన్నః పరక్షేత్రే ఽర్జునాత్మజః" అని అర్జునుడు ధర్మబద్ధుడై ఉలూపిని కూడుట కంగీకరించెనని చెప్పబడినది. ఇందేమాత్రము దోషములేదు.

ఇక బభ్రువాహనుని చేతిలో మూర్ఛబొందిన అర్జునుని, లేక మృతిచెందినట్లున్న అర్జునుని బ్రతికించుటకు, ఉలూపి సంజీవని మణిని స్మరించి, అద్దానిని బభ్రువాహనుని చేతులతో అర్జునుని వక్షస్థలమున పెట్టించి బ్రతికించెనేగాని తనకు పరపురుషుడైన అర్జునుని ఉలూపి తాకలేదు.

ఎందువలన? "ఏవమేవ సముత్పన్నః పరక్షేత్రే ఽర్జునాత్మజః" అను భీష్మపర్వోక్తవచనమును బట్టి అర్జునునకు ఉలూపి పరక్షేత్రముకనుక వివాహమాడిన భార్య కాదు కనుక.

"అయం తు మే మణిర్దివ్య స్సమానీతో విశాంపతే
మృతాన్ మృతాన్ పన్నగేంద్రాన్ యో జీవయతి నిత్యదా
ఏనమస్యో రసి త్వం చ స్థాపయస్వ పితుః ప్రభో
సంజీవితం తదా పార్థం స త్వం ద్రష్టాపి పాండవం
ఇత్యుక్తః స్థాపయామాస తస్యోరసి మణిం తథా"

-మహా. భా .వి.పు 195

చచ్చిపోయిన పన్నగముల నీ మణి బ్రతికించును. ఈమణిని నీతండ్రి వక్షమున నుంచుము. ఇతడు జీవించును అని చెప్పెను. అతడట్లు చేయగా నర్జునుడు జీవించెను. ఆంధ్రమహాభారతమున కూడ నిట్లే చెప్పబడినది.

వ॥ ---యమ్మణి పూరపురపతి కరతలంబున నమ్మణియిడి విమ్మహాత్ముని హృదయదేశంబున మోపుమపుడు నతడట్లు చేయుటయుం బార్థుండు ప్రత్యుజ్జీవితుండై.

ఆ.భా. అశ్వ. 4అ. 83.

ఇక్కడ అర్జునుని హృదయప్రదేశమున మణినుంచుమని బభ్రువాహనునిచే పెట్టించెనేగాని తాను తాకి పెట్టలేదు. వివాహమయిన భార్యయయినచో తాను భర్తను స్పృశించుటలో దోషములేదుకదా! వివాహము కాదు కనుక నియోగధర్మమే కనుక పరపురుషునితో సమానమయిన అర్జునుని మరల స్పృశింపలేదు. బహుభార్యాత్వము క్షత్రియులకు దోషము కాదు కనుకను, శాస్త్రసమ్మతమే కనుకను చిత్రాంగదను, సుభద్రను శాస్త్రవిధిని వివాహమాడెను.



# 15. భీష్ముని సేనానాయకత్వము

1. పాండవులది ధర్మపక్షమని యెరిగియు భీష్ముడు కౌరవ పక్షమున నేల యుద్ధము చేసెను?

ఈ ప్రశ్న పలువురు మేధావులను వేధించుచున్నది.

1. భీష్ముడు తొలుత దాశరాజు సమక్షమున నీకుమార్తెయొక్క పుత్రపౌత్ర పర్యంతము నేను రాజ్యములేకుండ యుండి అన్ని విధముల వారిని సంరక్షించెదనని ప్రతిజ్ఞ చేయుట మొదటి కారణము.

2. పాండవ పక్షము పౌత్రస్థానము. ధృతరాష్ట్రుడు జీవించియుండుట చేతను పాండురాజు మరణించుట చేతను ధృతరాష్ట్రుడు దగ్గరవాడగుటచే పుత్రస్థానీయమైన కౌరవరాజ్యాధికారము సంరక్షింపదగినది.

3. పాండవులెట్లును ధర్మాత్ములు పరాక్రమవంతులగుటచే స్వయముగా జయింపగలరు.

4. యుద్ధమున శిఖండి కారణముగా తన మరణము కూడ సంభవించును. కౌరవులు తప్పక నాశనమొందగలరు. తానుకూడ ధర్మపక్షమయిన పాండవ పక్షము నున్నచో తాను స్వయముగా కౌరవులకు వినాశకారకుడు కాగలడు. అట్లయిన తాను దాశరాజునకు చేసిన ప్రతిజ్ఞ భగ్నమగును.

5. అంతేకాదు భీష్మద్రోణాది దేవాంశ సంభూతులందరు భూమిపైకి వచ్చినది యుద్ధముచేయుటకే కదా! తాను పాండవపక్షమున చేరినచో పాండవులు జయింతురు కనుక తనకు యుద్ధమరణము సంభవింపదు. తానేమో స్వచ్ఛందమరణము కలవాడాయెను. అష్టవసువులలో నొకడు, ఎట్లును తాను జన్మను చాలించవలసినదే. మరియు క్షత్రియునకు యుద్ధమరణము శ్లాఘ్యము, శయ్యామరణము నింద్యము. ఈ విషయము రాజ ధర్మ ప్రస్తావములో భీష్ముడే చెప్పెను.

అధర్మః క్షత్రియస్యైష యచ్ఛయా మరణం భవేత్
విసృజన్ శ్లేష్మమూత్రాణి కృపణం పరిదేవయన్
న గృహే మరణం తాత క్షత్రియాణాం ప్రశస్యతే
రణేషు కదనం కృత్వా జ్ఞాతిభిః పరివారితః

తీక్ష్ణైశ్శస్త్రైరభిక్లిష్టః క్షత్రియో మృత్యుమర్హతి
శూరో హి కామమన్యుభ్యా మావిష్టో యుధ్యతే భృశమ్
హన్యమానాని గాత్రాణి పరైర్నైవాఽవబుధ్యతే
స సంఖ్యే నిధనం ప్రాప్య ప్రశస్తం లోకపూజితమ్
స్వధర్మం విపులం ప్రాప్య శక్రస్యైతి సలోకతామ్,

మ.భా. శాన్తి. 97అ.

క్షత్రియునకు శయ్యామరణము నింద్యము. రణరంగమున యుద్ధము చేసి శస్త్రహతుడై మరణించుట ప్రశస్తము. అతడే పక్షమునందును జేరక మిన్నకుండరాదా అనుటకు వీలు పడదు. అట్లు చేసినచో తాను క్షత్రియ విరోధమయిన శయ్యామరణమునకు పాల్పడవలసి వచ్చును.

అంతేకాదు "యత్ర భీష్మస్తత్ర ద్రోణః" అన్నట్లు ద్రోణుడును పాండవపక్షమున చేరును. అతని బావమరది కృపాచార్యుడు, పుత్రుడు అశ్వత్థామయు నట్లే చేయుదురు. భీష్మద్రోణకృపాశ్వత్థామలు లేనిచో ఒక్క కర్ణుని పెట్టుకొని దుర్యోధనుడు యుద్ధము చేయలేడు. ఆ కర్ణుడైనా తనకండ్లముందే ఎన్ని యుద్ధములలోనో ఎందరిచేతిలోనో ఓడిపోయినాడు గాని ఎక్కడను గెల్చినట్లు లేదు.

కర్ణుడప్పటికి :-

1) గురుదక్షిణ సందర్భములో ద్రుపదుని చేతిలో ఓడిపోయినాడు.

2) ద్రౌపదీస్వయంవరసందర్భమున బ్రాహ్మణ వేషములోనున్న అర్జునుని చేతిలో నోడినాడు.

3) దిగ్విజయసందర్భమున భీముని చేతిలో ఓడిపోయినాడు.

4) ఘోషయాత్రా సందర్భమున సామాన్యగంధర్వుడు చిత్రసేనుని చేతిలో ఓడిపోయినాడు.

5) ఉత్తర గోగ్రహణమునందు భీష్మద్రోణాది మహాయోధులెందరున్నను, వారితో పాటే కర్ణుడును ఓడిపోయినాడు.

గతిలేదు కనుక కర్ణునితో సఖ్యము పెట్టుకొనుచున్నాడు తప్ప కర్ణుడు యుద్ధమున పాండవులను గెల్చి తనను రాజ్యాభిషిక్తుని జేయునని నమ్మునంతటి యవివేకి కాడు దుర్యోధనుడు. యుద్ధము అనివార్యమనియు పాండవవిజయము కౌరవ వినాశము తప్పదని భీష్ముడెరుంగును.

ఇప్పుడేకాదు పూర్వము పాండవులర్ధరాజ్యము తీసికొని ఇంద్రప్రస్థమునకు వెళ్ళి అక్కడ సుఖముగా పరిపాలన చేయుచున్న నిరువదిమూడు సంవత్సరములు కూడ భీష్ముడు హస్తినాపురమున కౌరవులతోడనే ఉన్నాడు కాని ఇంద్రప్రస్థమునకు వెళ్ళలేదు. అట్లు వెళ్ళకపోవుటకు కారణములు :-

1. ధృతరాష్ట్రాదుల తండ్రి విచిత్రవీర్యుడు పుట్టకపూర్వమునుండియు, తరువాత విచిత్రవీర్యుడు పెద్దవాడగునంతవరకు, పిమ్మట పాండురాజు పెరిగిపెద్దవాడై రాజ్యమేలు స్థితికివచ్చు వరకు తన జీవితమంతయు ఈ రాజ్యాభివృద్ధి కొరకే అంకితము చేసి యున్నాడు. అట్టివాడు యుద్ధమాసన్నమైనప్పుడు కౌరవులను నీడి పాండవపక్షమునకు పోవునా?

2. తాను పాండవపక్షమున చేరినచో పైనచెప్పబడినట్లు యుద్ధమే జరుగదు. యుద్ధయు జరుగనిచో దైవకార్యము నెరవేరదు.

3. తనను చంపుటకొరకై పుట్టియున్న శిఖండి పాండవులకు బావమరదియై పాండవపక్షమున నున్నాడు.

4. తాను శాపగ్రస్తుడై భూలోకమున పుట్టియున్న వసువుగనుక, శాపము తీరిమరల స్వస్థితికి పోవలెననియుండును గాని, అనిత్యము, అసుఖము అయిన యీ లోకమున శాశ్వతముగా నుండగోరడు. తాను యుద్ధములో వీరమరణము పొందుటకిట్టి యవకాశము మరలరాదు.

"అర్థస్య పురుషో దాసః దాసస్త్వర్థో న కస్య చిత్
బద్ధోఽస్మ్యర్థేన కౌరవ్యైః"

అనియుద్ధప్రారంభమున ఆశీస్సులు పొందుటకై భీష్మునియొద్దకు వచ్చిన ధర్మరాజునకు చెప్పినాడు. అర్థమునకు పురుషుడు దాసుడుగాని అర్థమెవ్వరికిని దాసికాదు. కౌరవులచే అర్థముచే కట్టుబడినానని భీష్ముడు చెప్పినాడు.

పాండవులది ధర్మపక్షమేయని యెరిగియుండియు, కౌరవులది అధర్మపక్షమని యెరిగియుండియు భీష్ముడు కౌరవులపక్షమున యుద్ధము చేయుటకు ఇన్ని కారణములు కలవు.

## 2. యుద్ధప్రారంభమున ధర్మరాజు భీష్ముని మరణరహస్యమునడుగ వచ్చునా? అట్లడిగిన భీష్ముడు చెప్పవచ్చునా?

ఇది చాల జటిలమయిన సమస్య. వాస్తవమునకు కౌరవులలో గాని పాండవులలో గాని భీష్మునిమరణరహస్యము తెలియని వారెవ్వరును లేరు. ధర్మరాజు భీష్ముని మరణరహస్యమును తెలిసికొనుటకు భీష్ముని శిబిరమునకు పోలేదు. భీష్ముడు తన మరణరహస్యమును ధర్మరాజునకు చెప్పనూలేదు. ధర్మజుడు తాను ధరించిన కవచమును విడిచి, ధనుస్సును రథమునందుంచి రథము దిగి కృతాంజలియై శత్రు సేనలోనికి పోవునపుడు భీమసేనాదులును, శ్రీకృష్ణుడును వెంటపోవు చుండగా చూచి ఉభయసేనలు పరిపరివిధముల సంశయములు వెలిబుచ్చిరి. శ్రీకృష్ణభగవానుడొక్కడే ధర్మజుని మనోగతమునిట్లు చెప్పెను. ఈతని యభిప్రాయము నాకు తెలిసినది. గురువులగు భీష్మ ద్రోణ కృప శల్యుల అనుమతిని తీసికొని యుద్ధము చేయును. గురువుల యనుమతిని తీసికొనకుండ యుద్ధము చేసిన యెడల చేటుకలుగునని శాస్త్రమందున్నది. యథాశాస్త్రముగ పూజ్యుల అనుమతిపై యుద్ధము చేసిన వానికి జయము ధ్రువము. ఆసంకల్పము తోడనే ధర్మరాజు భీష్ముని పాలికేగి యాతని పాదములొత్తి.

ఆ॥ అనఘ నీ కెదిర్చి యని సేయువాఁడనై
మున్ననుజ్ఞ గొనగ నిమ్నగాన
నెమ్మి వచ్చినాఁడ నీచేత దీవన
వడసి చనిన నేను బగఱగెలుతు.

ఆ. భా - భీష్మ - 1అ. 156

అట్లనగా భీష్ముడును

"ధర్మజా! నీవిట్లు రాకుంటివేని అనగా ఈ పక్షములో నేనుండుటకు గల కారణము గ్రహింపక నీవు శత్రుపక్షములోనున్న నన్ను శత్రువుగనే భావించి యిట్లు రాకుంటివేని నీకు చేటు కలుగునటు శపించి యుందును. పుత్రా! సంతోషించితిని

యుద్ధము చేయుము. జయమునొందుము. యుద్ధమునకు సంబంధించి మరే యభిలాషలు నీకు గలవో వాని నన్నింటిని పొందుము. నా వలన నీకేమి కావలయునో వరము కోరుము ఇట్టి యాచరణము వలన నీకు పరాజయముండదు. పురుషుడర్థమునకు దాసుడు, బద్ధుడు అనునది సత్యము. అర్థముతో నేను కౌరవులచే పోషింపబడితిని. కౌరవులచే బద్ధుడనైతిని. అందుచేత నేను నీకు కొంత సంకుచితము చేసి వరము గోరుమనుచున్నాను. నేను నీకు ప్రతిభటుడనై యుద్ధము చేయుచున్న విషయములో మాత్రము మార్పును గోరక మరేమి కావలయునో కోరుము" అనెను. ధర్మజుడు "మహనీయా! నీవు కౌరవ పక్షమందే యుద్ధముచేయుము. నాహితమును గోరెడి నీవు నాకాలోచనమును చెప్పు"మనెను.

అప్పుడు భీష్ముడు "కౌరవపక్షమున యుద్ధము చేయుదును. నీకేమి సహాయము చేయవలెను? నీ అభిప్రాయమే"మని ప్రశ్నించెను. అందుకు ధర్మజుడు

**కథం జయేయం సంగ్రామే భవన్త మపరాజితం**
**ఏతన్మే మంత్రయ హితం యది శ్రేయః ప్రపశ్యసి**

మ.భా. భీష్మ - 43అ-40

**టీ॥ శ్రేయః ప్రపశ్యసి యది వక్తుం యోగ్యమితి మన్యతే యది వదేత్యర్థః.**

మహనీయా! యుద్ధమం దజేయుడవయిన నిన్ను జయించుటెట్లు? ఈ విషయమును చెప్పవచ్చునని తోచిన యెడల చెప్పుము.

అంత భీష్ముడు

**నైనం పశ్యామి కౌన్తేయ యో మాం యుధ్యన్త మాహవే**
**విజయేత పుమాన్ కశ్చిత్సాక్షాదపి శతక్రతుః**

మ.భా - భీష్మ - 43అ. 41

ఇంద్రుడైన కానిమ్ము, నేను రణరంగమున నిలిచి యుద్ధముచేయుచున్న కాలములో నన్ను జయింపగల పురుషుడు లేడు. తిక్కన సోమయాజి తెలుగు భారతమునను-

కం॥ నను మార్కొని గెలువఁగన
య్యనిమిషులకు నరిది యనుడు నట్లగుటఁగదా

నిను వేఁడెద నని కుంతీ
తనయుఁడు వలుకుటయుఁదత్పితామహుఁడు గృపన్.

ఉ॥ చుట్టతికంబునన్ మనసుసొచ్చిననుం గరఁగించి వేడినన్
దిట్టతనంబు వోవిడిచి తీవ్రరణంబుకడంక దక్కినేఁ
బట్టిన యాయుధంబు వెడఁబాసినఁగాని వధింపఁబోలది
ట్టిట్టన కేఁగు మిప్పరుస యింతక కాలముఁగాదు దానికిన్

ఆ. భా - భీష్మ - 1అ. 158-159

అంతట ధర్మజుడు భీష్మునితో నిన్ను జయించువాడు లేకుండట చేతను. నీవు జయము నాశీర్వదించుట చేతను, నిన్ను నమస్కరించి యడుగుచున్నాను. పితామహా! నీవధోపాయమేమి? అంతట భీష్ముడు -

న స్మ తం తాత పశ్యామి సమరే యో జయేత మాం
న తావన్మృత్యు కాలోఽపి పునరాగమనం కురు.

మ.భా -భీష్మ - 43.అ. 43

ధర్మరాజా! యుద్ధములో నన్ను జయింపగలవాడు కనపడడు, ఇప్పుడు మరణసమయము కాదు. మరల రమ్మ అని చెప్పి పంపెను.

ధర్మరాజా భీష్ముని మరణరహస్యమడిగి అకార్యము చేసినట్లును, భీష్ముడు తన మరణరహస్యమును చెప్పి తానొక మహాద్రోహము చేసినట్లును అపవాదువేయుచున్నారు. ధర్మజుడు శాస్త్రమర్యాదననుసరించి గురువులతోడను, పెద్దలతోడను యుద్ధము చేయుటకు ముందు వారియనుమతిని, ఆశీర్వాదమును తీసికొనదలచి భీష్మద్రోణ కృపాచార్యులయొద్దకును, శల్యుని యొద్దకును వెళ్ళెను. అంతేకాని లోకులు వాకొనునట్లు వారల మరణరహస్యము కొరకు కాదు.

భీష్ముడు శిఖండిచేత చచ్చునని ధర్మరాజునకు మిగిలిన వారలకందరకు నిదివరకే తెలిసియున్నది ఇందులో రహస్యమేమియులేదు.

పాండవులరణ్యావాసములో నుండగా పాండవులనూరడించుచు ధృష్టద్యుమ్నుడు-

అహం ద్రోణం హనిష్యామి శిఖండీ తు పితామహం
దుర్యోధనం భీమసేనః కర్ణం హంతా ధనంజయః

మ.భా - అరణ్యా. 12 అ.

నేను ద్రోణుని చంపెదను, శిఖండి భీష్ముని చంపును, భీముడు దుర్యోధనుని, కర్ణుని అర్జునుడు చంపుదురు - అని (ధృష్టద్యుమ్నుడు) చెప్పెను.

ఉద్యోగ పర్వములో పాండవులు కౌరవవీరులను వాటాలు వేసికొను సందర్భమును సంజయుడు ధృతరాష్ట్రునితో-

"భీష్మశ్శాంతనవో రాజన్ భాగః క్లుప్తః శిఖండినః"

భార - ఉద్యో - 476

గంగాసుతుండు శిఖండిపాలు

ఆ ఉద్యోగపర్వమునందే సంజయునితో అర్జునుడిట్లు చెప్పెను -

రణే హతే కౌరవాణాం ప్రవీరే
శిఖండినా శంతనోర్యై తనూజే
న జాతు నశ్శత్రవో ధారయేయు
రసంశయం సత్యమే తద్బ్రవీమి.

-భా.ఉద్యో-47అ.

కౌరవ వీరుడైన భీష్ముడు శిఖండి చేతిలో చనిపోయినపుడు ఇక శత్రువులు జీవించరు. అనుమానము లేదు అని, ధర్మరాజెవరి సహాయముతో దండెత్తి వచ్చునని అడిగిన ధృతరాష్ట్రునకు సంజయుడిట్లు చెప్పెను. చచ్చిన పిమ్మటనైనను భీష్ముని జంపగోరియే కాశీరాజు కన్య ఘోరముగ తపస్సు చేసి పాంచాలరాజు పుత్రికయై జన్మించెనో, భీష్మ-ఈ్షమునకు వచ్చును. భీముడు శిఖండి సర్వసేనానిగా పేర్కొనుచు, భీష్ముని చంపుటకై ద్రుపదాత్మజుడై పుట్టినవాడు శిఖండి. అతడు తప్ప మరెవ్వరును భీష్ముని చంపలేరు. అతడే మన సేనానికాదగినవాడు. ఉలూక రాయబారమున శిఖండి -

అహం భీష్మవధాం సృష్టో నూనం ధాత్రా మహాత్మనా
సోఽహం భీష్మం హనిష్యామి మిషతాం సర్వధన్వినాం.

-మ.భా-ఉద్యోగ-1అ2 అధ్యా.

భీష్ముని చంపుటకే నన్ను బ్రహ్మ సృష్టించినాడు. అట్టి నేను ధనుర్ధరులందరు చూచుచుండగ భీష్ముని వధించెదను. యుద్ధములో మొదటి రోజు భయపడుచున్న ధర్మజునితో కృష్ణుడు "శిఖండీ చ మహాబాహో భీష్మస్యాంతకరః కిల"-శిఖండి భీష్ముని చంపునని చెప్పెను. ఉద్యోగపర్వమున కర్ణుడు శ్రీకృష్ణునితో -

"యదా ద్రోణం చ భీష్మం చ పాంచాల్యో పాతయిష్యతః
తదా యజ్ఞావసానం తద్భవిష్యతి జనార్దన"

-మ.భా.ఉద్యో.140అ.

అని చెప్పెను. భీష్ముడు శిఖండి చేతిలో చచ్చునని ఎల్లరకు తెలియును. ఇందున్న రహస్యమేమి? ధర్మజుడడిగినదేమి? భీష్ముడు చెప్పినదేమి? ఇక యిందున్న దోషమేమి? భీష్ముడు స్వచ్ఛందమరణము కలవాడు. తాను తలచుకొన్నప్పుడే అతడు చచ్చును. భీష్మునికి మరణసంకల్పము కలుగనిదే తనని ఎవ్వరును తుదకు శిఖండికూడ చంపలేడు. కనుక ధర్మరాజు భీష్ముని చంపుటకతని యనుజ్ఞను కోరినాడు.

ఈ యనుజ్ఞను ధర్మజుడు కోరనగునా? భీష్ముడు చెప్పదగునా?-అని మరియొక ప్రశ్న. అందుకు సమాధానము -

భీష్మ ద్రోణులెప్పుడును పాండవులను జయించి దుర్యోధనునికి రాజ్యాభిషేకము చేయుదుమని చెప్పలేదు. పాండవులు ధర్మపరాయణులు. శ్రీకృష్ణపరమాత్మ వారికి రక్షగానున్నాడు. పాండవులజేయులు కనుక వారి రాజ్యము వారికిచ్చి సుఖించుమనియు వినాశము తెచ్చుకొనవలదనియు బోధించుచునే వచ్చిరి. శ్రీకృష్ణ రాయబార సందర్భమున భీష్ముని హితోక్తులను పెడచెవిని పెట్టిన దుర్యోధనునితో ద్రోణుడు -

"దుర్యోధనా! భీష్ముడును నేనును దానములు హోమములు అధ్యయనము మొదలగు జన్మసార్థక్యహేతువులగు కార్యములను చేసికొనినాము. మా కాలము గతించినది. మేము కృతార్థులమే. నీవు మాత్రము సుఖమును రాజ్యమును మిత్రులను ధనమును విడనాడి పాండవవిరోధ మూలమున గొప్ప ఆపదను పొందుదువు. ఎవ్వనికి మంత్రి జనార్దనుడో, సర్వ శస్త్రజ్ఞుడగు సోదరుడు అర్జునుడో అట్టి యుధిష్ఠిరుని నీవెట్లు జయింపగలవు" - అనెను.

దీనితో మా ఆయుఃపరిసమాప్తికి యుద్ధము సూచకమనియు, శ్రీకృష్ణ భగవాను

నాశ్రయించియున్న పాండవులను నీవు జయించుట కల్లయనియు చెప్పుటను బట్టి క్షాత్రధర్మమునను సరించి యుండుట వలన భీష్మునితోపాటు ద్రోణుడును కూడ యుద్ధమరణము నపేక్షించియే యుద్ధములో పాల్గొనెననుట స్పష్టము.

దుర్యోధనుడు యుద్ధమునకు సిద్ధమై భీష్మపితామహుని యొద్దకు వెళ్ళి నీవు సేనానాయకుడవై మాకంగరక్షకుడవు కావలయునని ప్రార్థించెను. అంతేకాక - "పితామహా! నీవు శుక్రునితో సమానుడవు. ఎప్పుడును నాహితమును గోరువాడవు నీతండ్రిచే నీయబడిన స్వచ్ఛంద మరణము కలవాడవగుటచే నీవన్యులచే సంహరింపబడనివాడవు. ధర్మబద్ధుడవు. ఇట్టి నీవు సేనానాయకుడు కావలసినదని ప్రార్థించుచున్నాను. నీచే రక్షితులమైన మేము దేవతలనుకూడ లక్ష్యపెట్టనివారమై యుందుము. దేవతాసేనలకు ముందు కుమారస్వామి నడచినట్లు మాకు ముందు నీవు నడువవలెను. నీవెంట మేము వత్తు"మని ప్రార్థించెను. అప్పుడు భీష్ముడు -

"నీవన్నది నిజమే. నాకు మీరెట్టివారో పాండవులు నట్టివారే. నా నిర్ణయము ప్రకారము పాండవులకు శ్రేయస్సు నుపదేశించవలయును. మీ నిమిత్తము యుద్ధము చేయవలయును. పాండవులు నాకు నశింప శక్యము కానివారు. "న మే మయా ఉత్పాదనీయా నాశయితుం శక్యాః"- అని కంఠోక్తిగా చెప్పెను.

ఆంధ్ర భారతమునను నిట్లే కలదు -

ఆ. మీరు పాండు సుతులు నారయ నాకొక్క
రూప కార్యమున్న రూపు వలుక
వలయుఁ గయ్యమైన వత్తు మీలోననా
యునికి చందమునకు నుచిత మిదియ

క. సేనాధిపత్యమునుదగఁ
బూనెద నను మార్కొనంగఁ బురుషుల నుర్విం
గానఁగిరీటికి నొక్కని
కేనోర్వ నతండు శరములెక్కు డెఱుంగున్

క. పెఱవారినెల్లఁ దరమిడి
నఱుకుదుఁ బాండు క్షితీశు నందనులను రూ

పఱ సేయం జేయాడదు
దఱుమరు నామీఁద నత్యుదగ్రత వారున్

-అ.మభా. ఉద్యో- 4 అ. ప. 148-145-150

అని ఎంతో స్పష్టముగా చెప్పినాడు. కనుక భీష్ముడు కౌరవుల పక్షముననే యుద్ధమును చేయును. పాండవులకు హాని చేయడు. పైగా వారికి శ్రేయస్సు నుపదేశించును - అదీ విషయము. ఎనిమిదవ రోజు రాత్రి దుర్యోధనుడు భీష్ముని శిబిరమునకు వెళ్ళి- "దయ చేతనో, నాయందలి ద్వేషభావము చేతనో, లేక నా దురదృష్టము చేతనో, నీవు పాండవులను రక్షించుచున్నావు. నీవు కర్ణునకనుజ్ఞ యిచ్చినచో అతడు పాండవులను జయించు"నని చెప్పగా భీష్ముడు తొమ్మిదవ రోజున కడు భీకరముగా పోరాడెను. తొమ్మిదవ రోజు రాత్రి మరల ధర్మజుడు తమ్ములతో గూడ నిరాయుధుడై భీష్ముని శిబిరమును ప్రవేశించి భీష్ముని వలన నాతని వధించుటకు అనుజ్ఞను పొందెను.

పదియవరోజు యుద్ధములో సమీపములోనున్న యుధిష్ఠిరుని జూచి భీష్ముడు "శాస్త్ర విశారదుడవగు యుధిష్ఠిరా! ధర్మబద్ధము, స్వర్గ సాధనమునరిుున నా యీ మాటను వినుము. రణరంగమున నసంఖ్యాకముగా వధించుచున్న నాకు కాలము గతించినది. ఈ శరీరముపై నాకత్యంత విరక్తి కలిగినది. కనుక నాకు ప్రీతికలిగింపదలచితివేని పార్థుని పురస్కరించుకొని పాంచాలాది మహావీరులతో నన్నిక వధించుటకై యత్నింపవలయును" అని యుద్ధమరణమును గోరి ప్రోత్సహించిన పిమ్మటనే యాతని యాజ్ఞను నెరవేర్చుటకొరకే పార్థుడు యుద్ధమున శిఖండిని ముందునిడుకొని భీష్ముని వధించెను.

కనుక భీష్ముని మరణమున కాతని యనుమతిని పొందిన ధర్మజునియొక్కగాని తనమరణరహస్యమును చెప్పి తన మరణమును కోరిన భీష్ముని చర్యలలోగాని యేమాత్రము దోషము లేదని గ్రహించవలెను.

## భీష్మ ప్రతిజ్ఞ

శంతనమహారాజు దాశరాజపుత్రికయయిన సత్యవతీదేవిని వివాహమాడ తలంచినపుడు దాశరాజు తనకుమార్తెకు కలిగిన సంతతికే రాజ్యాధికారము కావలెనని కోరినాడు. భీష్ముడు తాను రాజ్యమును పరిత్యజించి సత్యవతీదేవికి కలిగిన పుత్రునికే

రాజ్యమునిచ్చి పట్టాభిషిక్తుని చేయుదునన్నాడు. భీష్ముడు సత్యవంతుడు, గుణవంతుడు గనుక అట్లే జరుగవచ్చునుకాని భీష్ముని సంతతియూరకుండునా? జ్యేష్ఠ కుమారుడైన భీష్ముని కుమారులు రాజ్యమును కోరకుందురా? అని దాశరాజు శంకను బయల్పరచినాడు. అందుకు సమాధానముగా భీష్ముడు -

"అద్య ప్రభృతి మే దాశ బ్రహ్మచర్యం భవిష్యతి
అపుత్రస్యాపి మే లోకా భవిష్యంత్యక్షయా దివి"

మ.భా - ఆది. 100అ. 96శ్లో

అని ఇప్పటినుండి బ్రహ్మచర్యవ్రతమవలంబితును అని ప్రతిజ్ఞ చేసెను. 'అద్య ప్రభృతి' అనగా నిప్పటినుండి బ్రహ్మచర్యవ్రతమవలంబింతు ననగా ఇది వరకే భీష్మునకు వివాహమై యుండవచ్చునా? అని యొక సంశయము. నన్నయభట్టారకులాంధ్ర భారతమునందును.

కII ధృతిఁబూని బ్రహ్మచర్య
వ్రతమున్నతిఁదాల్చితిని ధ్రువంబుగ ననప
త్యతయైనను లోకములా
యతిఁబెక్కులు గలవు నాకు ననుభావ్యములై

ఆ.భా. ఆది. 4అ. 190.

అని వ్రాసిరి. మరియు అనుశాసనపర్వమున భీష్ముని నిర్యాణసమయమున ధర్మరాజు -

స్తూయమానో మహాతేజా భీష్మస్యాగ్నీనమువ్రజన్
నిశ్చక్రామ పురాత్తస్మాద్యథా దేవపతిస్తథా

మ.భా - అను. 167 అ. 11శ్లో

భీష్మునికి శరీరత్యాగమయినదని గ్రహించి ధర్మరాజు సర్వపరికరములతో భీష్మ సంస్కారమునకై అగ్నులవెంటనడిచెను. వివాహానంతరము గాని అనగా యజ్ఞములు చేసిన వానికిగాని వివాహమయిన వాడు తప్ప యజ్ఞములు చేయరాదుగనుకను, భీష్మునకు వివాహమయి యుండవచ్చునని అనుమానింపబడుచున్నది.

"భీష్మస్యాగ్నీనితి తేన తస్యాపి పత్నీ ఆసీత్"

అని నీలకంఠులు సూచించిరి. భీష్మునికి వివాహమైనట్లెక్కడను భారతములో చెప్పబడలేదు. వివాహముకాలేదను నిషేధవాక్యము కూడ భారతము నందెచ్చటనూ లేదు. భీష్మునకు యౌవరాజ్యపట్టాభిషేకము జరిగినట్లు స్పష్టముగా చెప్పబడినది.

"గుణవంతం మహాత్మానం యౌవరాజ్యేఽభ్యషేచయత్"

దీనికి నన్నయభట్టారకులును-

వ॥ తనపురంబునకు వచ్చి (గంగాదేవి భీష్ముని శంతనునికి
అప్పగించగా నన్నమాట) సకల రాజన్య ప్రధానసమక్షంబున
గాంగేయునకు యౌవరాజ్యపట్టాభిషేకంబు
సేసి కొడుకుతోడి వినోదంబులం దగిలి నాలుగు
వత్సరంబులనన్యవ్యాపారుండై యుండి ---"

-మహా. భా .ఆది. 4పు. 170

అని స్పష్టముగా చెప్పెను. భీష్మునకు యౌవరాజ్యపట్టాభిషేకమయినదని వ్యాసులును, నన్నయభట్టారకులును చెప్పిరి కదా! పట్టాభిషేకవిషయమును చెప్పినవారు వివాహమయినచో వివాహవిషయము నేల చెప్పియుండరు?

భీష్మునకు పత్నియున్నట్లు భారతములో నెచ్చటను చెప్పబడలేదు. అయినను యజ్ఞములు చేసినాడని చెప్పబడుటచేత కేవలము యజ్ఞము కొరకు మాత్రమే పత్ని యున్నదని యూహింపబడుచున్నదని కుమారిలభట్టు చెప్పినారు. వివాహసంకల్పములో "ధర్మప్రజాసంపత్త్యర్థం స్త్రియముద్వహే" అనికాక కామముతో పనిలేక కేవలము ధర్మము కొరకే అయినచో ''మమ శ్రౌతస్మార్త నిఖిలకర్మానుష్ఠానయోగ్యతాసిద్ధ్యర్థం స్త్రియముద్వహే" అని సంకల్పము చెప్పి వివాహము చేసికొని ధర్మకార్యములకు మాత్రమే ఆమెను నియోగించుకొనుచు కామప్రవృత్తి లేకుండ బ్రహ్మచర్య దీక్షలో నుండ వచ్చునుగదా, అట్లే భీష్మునకు యజ్ఞార్థపత్ని యుండి యుండవచ్చునని వారు చెప్పిరి. భీష్ముడు ఆజన్మబ్రహ్మచారియనుటలో విప్రతిపత్తిలేదు, కాని బ్రహ్మచారియైనను వివాహితుడు కావచ్చునని ఊహించుట అంత సముచితముగా కన్పింపదు.

ఇది యొక విచిత్రమయిన యూహ. ఒకవేళ ఈ వాదమునంగీకరింతమన్నను భీష్ముడు ఆజన్మబ్రహ్మచారి యెట్లు కాగలడు. తాను శపథము చేసిన నాటి నుండియే 'అద్యప్రభృతి' బ్రహ్మచారి కావలయును కాని..

తంత్రవార్తికములో కుమారిలభట్టు "కేవల యజ్ఞార్థ పత్నీసంబన్ధ ఆసేదితి తదర్థా ఽనుక్తమపి గమ్యతే"

అనగా భీష్మునకు పత్ని యున్నట్లు చెప్పబడకపోయినను చెప్పబడిన విషయములకు విరోధము లేకుండుటకై కేవలము యజ్ఞార్థము పత్ని యున్నదనియు, అర్థకామములకయిన పత్నికాదు కనుక ఊర్ధ్వరేతస్త్వ బ్రహ్మచర్యములకు భంగము లేదనియు నిది "యర్థాపత్తి" ప్రమాణముచే గమ్యమానమగుచున్నదనియు తాత్పర్యము.

అర్థాపత్తి యనగా "పీనో దేవదత్తో దివా న భుఙ్క్తే" అను వాక్యమున్నది. దేవదత్తుడు ఏనుగై (పుష్టి కలవాడై) యున్నాడు. పగలు భుజింపకున్నాడు - అన్నప్పుడు భోజనముకు పీనత్వమునకు సంబంధముండుట వలన, పీనత్వోపపత్తికై యూహింపబడు రాత్రి భోజనము అర్థాపత్తి యనబడును.

అట్లే - ఊర్ధ్వరేతస్కత్వ స్థితికిని అటు క్రతు సిద్ధికిని భంగకరము కానట్టు కేవల యజ్ఞార్థ పత్నీ సంబంధము కల్పింపబడినని కుమారిలభట్టు చెప్పియుండెను. అంతేకాని భీష్మునకు వివాహమయినదని చెప్పియుండలేదు. పైగా వైయాకరణ సిద్ధాంత లఘు మంజూషలో నాగేశోపాధ్యాయుడు చెప్పిన విషయమేమనగా -

"అపత్నికోఽప్యగ్నిహోత్ర మాచరేత్"
ఇత్యుక్తే రపత్నీకస్యా ప్యగ్నిసాధ్యే కర్మణ్యధికారాత్
........ అపత్నీకో ప్యపినా తస్యా విద్యమానత్వే
తాం విను యజ్ఞాద్యభావం సూచయతి"

- మ.భా. తత్త్వ కథనం. పు 1347

ఇత్యాది గ్రంథస్థ ప్రమాణములచే పత్నీ గ్రహణము లేనివాడు కూడ యజ్ఞము చేయవచ్చుననియు, క్రతు సిద్ధికై భీష్మునకు పత్నీ పరిగ్రహణ కల్పనమనవసరమనియు నిర్ణయించెను. ఆపైన ---

"వైయాఘ్ర పద్యగోత్రాయ సాంకృత్య ప్రవరాయ చ
గంగాపుత్రాయ భీష్మాయ ఆజన్మబ్రహ్మచారిణే
అ పుత్రాయ దదా మ్యేత దుదకం భీష్మకర్మణే
వసూనా మవతారాయ శన్తనో రాత్మజాయ చ
అర్ఘ్యం దదామి భీష్మాయ ఆజన్మబ్రహ్మచారిణే"

మ.భా.తత్త్వ.పు.1347

అనియున్న పద్మపురాణోక్త తర్పణమాత్ర అర్ఘ్యమంత్రములను బట్టి భీష్ముడాజన్మ బ్రహ్మచారియే యనుట సుస్పష్టము.

అందుచే "అద్య: ప్రభృతి --- బ్రహ్మచర్యం భవిష్యతి" అనునపుడు "పునరపి బ్రహ్మచర్యం భవిష్యతీత్యర్థః" అని వ్రాసి, అంతకు పూర్వముగల బ్రహ్మచర్యమును ఇటుపై కూడ ననువర్తింపజేయుదుననియే అర్థముకాని, పూర్వము లేనిదానిని ఇప్పటినుండి వహింతునని అర్థము కాదనియు చెప్పి భీష్ముడా జన్మబ్రహ్మచారియనియే సిద్ధాంతము చేసిరి. కాబట్టి పైన పేర్కొన్న విచిత్రమయిన యూహ కేవలము నిరాధారము.

"మన్నియోగా న్మహాబాహో! ధర్మం కర్తు మిహార్హసి
రాజ్యే చై వాభిషిచ్యస్వ భారతా ననుశాధి చ
దారాంశ్చ కురు ధర్మేణ మా నిమజ్జీః పితామహాన్"

మ.భా. - ఆది. 105అ.

నీలకంఠీయమ్

రాజ్యే చైవ = రాజ్య ఏవ వా

ఆత్మానమభిషిచ్యస్వ = అభిషేచయ

కురు = బ్రహ్మచర్య సంకల్పాత్ప్రభృతి త్యక్తాన్ సంతత్యర్థ మంగీకురు

మాం నిమజ్జీః = మా నిమజ్జయ.

అనగా రాజ్యమునందైనను నీవభిషిక్తుడవు కమ్ము. బ్రహ్మచర్యసంకల్పము మొదలుకొని త్యజింపబడిన దారలను సంతతికై యంగీకరింపుము -అని

భీష్ముడు శంతనుని యొద్దకు వచ్చిన తరువాత నాలుగు సంవత్సరములకే శంతనుడు సత్యవతిని జూచుట, భీష్మప్రతిజ్ఞ, సత్యవతీశంతనుల వివాహము జరిగినవి. ఈ నాలుగు సంవత్సరములలో భీష్మునికి యౌవరాజ్యపట్టాభిషేకమయినట్లు చెప్పబడినది కాని వివాహమయినట్లెచ్చటను చెప్పబడలేదు. వివాహమే యైనచో వ్యాసులుగాని నన్నయభట్టారకులు కాని యేల చెప్పకుందురు? ఒకవేళ వివాహమయినచో సత్యవతి భీష్ముని "దారాంశ్చ కురు" వివాహమాడుమని యేల కోరును. 'దారాంశ్చ కురు' అనగా వివాహమాడి దారలను సంతతతికై పరిగ్రహింపుమనియే తాత్పర్యము.

ఉద్యోగపర్వమున భీష్ముడు దుర్యోధనునితో చెప్పునప్పుడు-

"ప్రతిజ్ఞాం దుష్కరాం కృత్వా పితురర్థే కులస్య చ
అరాజా చోర్ధ్వరేతాశ్చ యథా సువిదితం తవ"

మ.భా. ఉద్యో - 146. ౬

తండ్రికొరకు, కులముకొరకు దుష్కరమైన ప్రతిజ్ఞను చేసి రాజ్యమును వదలి ఊర్ధ్వరేతస్కుడనై యున్నసంగతి నీకు తెలిసినదేకదా అని చెప్పెను.

అట్లే దేహత్యాగము చేయునపుడు భీష్ముడు శ్రీకృష్ణునితో-

"త్వద్భక్తం త్వద్గతస్వాంతం అదారమపరిగ్రహం
త్రాయస్వ పుండరీకాక్ష పురుషోత్తమ నిత్యశః"

మ.భా -వి.పు 399

అని అనెను. ఆంధ్రభారతమున తిక్కన సోమయాజియు -

ఆ॥ బలము నీవ నాకు భక్తుండనీయెడ
నాలు బిడ్డలు లేని యట్టివాఁడ
గావు నన్ను నధిక కారుణ్యమున నిమ్మ
మజ్జఁగమలదళమనోజ్ఞనయన.

ఆ.భా. అను. 5ఆ. 463

అని వ్రాసిరి. శరతల్పగతుడైయున్న భీష్ముని మాధవుడు సాత్యవతేయ ప్రభృతిమునీంద్రుల సమక్షమున నిట్లు స్తుతించెను.

ఉ॥ రాజటె రాగహీనుడటె రాజిత సుందర మూర్తి యట్టె వి
భ్రాజితసంపదున్నతివిభాసితవర్తను(డట్టె కామినీ
రాజిమనోజ్ఞభంగి చతురత్వ ధనుండటె బ్రహ్మచర్యదీ
క్షాజితమన్మథుండునటె జన్మములిట్టివి యెందు(గల్గునే

ఆ.భా - శాంతి - 2అ - 103

శ్రీకృష్ణపరమాత్మ సహితము భీష్ముని బ్రహ్మచర్యవ్రతము నిట్లు ప్రశంసించు చుండ, భీష్ముడు బ్రహ్మచర్యవ్రతమును స్వీకరించినను ఆతనికి వివాహమైయుండ వచ్చునని యూహించుట తగదు. భీష్ముడు తానే కంఠోక్తిగా ఊర్ధ్వరేతస్కుడనని 'అదారపరిగ్రహం' అని ఆలుబిడ్డలు లేని వాడనని పదేపదే చెప్పుచుండ నీవు బ్రహ్మచారివైతే కావచ్చునేమో కాని నీకు వివాహమయినదేమోయని మా యభిప్రాయ మనుట ఎంత హాస్యాస్పదము.

భీష్ముని వివాహప్రసక్తిని గూర్చి చర్చించు సందర్భమున వశిష్ఠమహర్షి శాపప్రకారమును పరిశీలింపవలసి యున్నది.

"అయం తు మత్కృతే యూయం మయా శప్తాః స వత్స్యతి
ద్యౌస్తదా మానుషే లోకే దీర్ఘకాలం స్వకర్మణా
న ప్రజాస్యతి వాప్యేష మానుషేషు మహామనాః
భవిష్యతి చ ధర్మాత్మా సర్వశాస్త్ర విశారదః
పితుః ప్రియహితే యుక్తః స్త్రీభోగాన్ వర్జయిష్యతి.

మ.భా. వి. పు 390

ఎవరి నిమిత్తము మీరు నాచే శపింపబడినారో ఆయా 'ద్యౌ' అనువాడు (అతడే ప్రభాసుడు) చాలాకాలముభూమి యందుండును. ఇతడు ధర్మాత్ముడు సర్వశాస్త్రవిదుడు, విపులమనస్కుడు, తండ్రికి ప్రియముచేయుటకు స్త్రీభోగములను

విసర్జించుచునని చెప్పెను. వశిష్ఠ మహర్షి శాపప్రకారము కూడ భీష్ముడు ఆజన్మ బ్రహ్మచారి కనుక నతని జీవితములో నెప్పుడును వివాహము కాలేదనుట స్పష్టము.

## భీష్ముడు యావజ్జీవబ్రహ్మచర్యవ్రతమును స్వీకరించవచ్చునా?

'జాయమానో వై బ్రాహ్మణ స్త్రిభిర్ ఋణవాన్ జాయతే
బ్రహ్మచర్యేణ ఋషిభ్యః, యజ్ఞేన దేవేభ్యః, ప్రజయా పితృభ్యః"

మ.భా. విరాట. 391

అని శ్రుతి. బ్రాహ్మణుడు ముగ్గురకు ఋణగ్రస్తుడై పుట్టుచున్నాడు. బ్రహ్మచర్యముచేత ఋషిఋణము, యజ్ఞములచేత దేవఋణము, సంతానము చేత పితృ ఋణము తీర్చవలెను.

"ఋణాని త్రీణ్యా పాకృత్య మనో మోక్షే నివేశయేత్
అన పాకృత్య మోక్షంతు సేవమానో వ్రజత్యథః"

-మను.

మూడు ఋణములు తీర్చుకొనిన పిమ్మట మనస్సును మోక్షమునందు ప్రవేశపెట్టవలెను. ఋణములను తీర్చనిదే మోక్షార్థియగువాడు అథఃపతనమగును.

మంత్రము :-ప్రజననం వై ప్రతిష్ఠా లోకే సాధుప్రజాయా
స్తంతుం తన్వాన: పితౄణామనృణో భవతి
తదేవ తస్యా అనృణం తస్మాత్ప్ర జననం పరమం వదన్తి

(తైత్తిరీయారణ్యకం 10వపాఠం 63 అనువాకం)

అపుత్రస్య వృథా జన్మ శ్రీర్భోగో వా నిరుత్తర:
మృతోఽపి శోభతే పుత్రీ న జీవన్నపి న స్సుత:
అగ్నిం పురస్తా దాదాయ యస్య గచ్ఛతి గర్భజః
బంధుభిర్నీయమానస్య మృతిరప్యుత్సవాయతే

మ.భా.వి. పు - 391-392

పుత్రులు లేని వాని జన్మము నిరర్థకము. సంపదయు భోగములు నిరర్థకములు.

పుత్రవంతుడు చచ్చినను శోభించును. పుత్రహీనుడు జీవించినను శోభింపడు. పుత్రవంతుడు మృతినొందినప్పుడు, పుత్రుడగ్నిని ముందుతీసికొని వెళ్ళుచుండగా, బంధువు లనుగమించుచుండ, ఆపుత్రవంతుని మరణము ఉత్సవముగా పరిణమించును. పుత్రవంతుని ఉత్కృష్టతను శాస్త్రము లింతగా చెప్పుచుండ భీష్ముడు బ్రహ్మచర్య వ్రతమును స్వీకరించుట ఉచితమా? ఉచితమనియే నిర్ణయము.

తండ్రి కోర్కెను తీర్చుటకు కనుక ఉచితమే. మనుస్మృతి యీ విధముగా చెప్పుచున్నది.

యం మాతాపితరౌ క్లేశం సహేతే సంభవేన్నృణాం
న తస్య నిష్కృతిశ్శక్యా కర్తుం వర్షశతైరపి ।
తయోర్నిత్యం ప్రియం కుర్యా దాచార్యస్య చ సర్వదా
తేష్వేవ త్రిషు తుష్టేషు తపస్సర్వం సమాప్యతే ।
తేషాం త్రయాణాం శుశ్రూషా పరమం తప ఉచ్యతే
స తైరభ్యననుజ్ఞాతో ధర్మాన్యం సమాచరేత్ ।
త ఏవ త్రయో లోకాస్త ఏవ త్రయ ఆశ్రమాః
త ఏవహి త్రయో వేదాస్త ఏవోక్తా స్త్రయోఽగ్నయః ।
పితా వై గార్హపత్యోఽగ్ని ర్మాతాగ్ని ర్దక్షిణః స్మృతః
గురురావహనీయస్తు సాగ్ని త్రేతా గరీయసీ ।
త్రిష్వప్రమాద్యన్నేషు త్రీన్ లోకాన్ విజయేద్గృహీ
దీప్యమానః స్వవపుషా దేవవద్దివి మోదతే ?

-మను2అ.227-232

తల్లిదండ్రులు బిడ్డల విషయములో గర్భధారణము మొదలుకొని విద్య నేర్పు వరకు ఎంత కష్టపడుచున్నారో దానికి ప్రత్యుపకారము ఎన్ని జన్మములెత్తినప్పటికిని తీరునది కాదు. తల్లితండ్రి ఆచార్యుడు వీరల యపేక్షితము నిత్యము చేయుచుండ వలయును. వారలు ముగ్గురును సంతోషించిన యెడల సకల తపఃఫలములు సిద్ధించును. ఆ ముర్వురకు శుశ్రూష చేయుటయే ఉత్కృష్టమయిన తపస్సు. వారి యాజ్ఞ లేక స్వయముగా నేధర్మమును చేయరాదు. వారు ముగ్గురే లోకత్రయ ప్రాప్తి

హేతువులగుటచే ముజ్జగములూ వారే. బ్రహ్మచర్యాద్యాశ్రమములూ వారే, వేదత్రయ ఫలప్రాప్తి కారణభూతులుగాన వారే వేదములు, వారే యజ్ఞాదిఫలదాతలు కనుక త్రేతాగ్నులు తండ్రిగార్హపత్య మనెడి యగ్నియనియు, తల్లి దక్షిణాగ్నియనియు, గురువు ఆవహనీయమనెడి అగ్ని అనియు చెప్పబడుదురు. ఈ మాతాపితృ గురురూపమయిన అగ్నిత్రయము మిక్కిలి శ్రేష్ఠమైనదని చెప్పబడును. కనుకనే తండ్రికొరకై భీష్ముడు బ్రహ్మచర్యవ్రతమును స్వీకరించెను. అంతేకాక-

భ్రాతౄణా మేకజాతానా మేకశ్చే త్పుత్రవాన్భవేత్
సర్వాంస్తాం స్తేన పుత్రేణ పుత్రిణో మనురబ్రవీత్

మను - 9అ. 182.

అన్నదమ్ములలో నొక్కనికిమాత్రమే పుత్రుడు కలిగెనేని వాని చేతనే తక్కినయతని సోదరులందరు పుత్రవంతులగుదురు. కనుక విచిత్రవీర్యునిసంతానమే తనకును సంతానమగును. అందుచే భీష్మునికి అనపత్య దోషము లేదు.

అనేకాని సహస్రాణి కుమారబ్రహ్మచారిణాం
దివంగతాని విప్రాణామకృత్వా కులసంతతిమ్

మను. 5అ. 159.

బాల్యముననే బ్రహ్మచారులై వివాహము చేసికొనక యుండిన సనకసనందన వాలఖిల్యాదులగు బ్రాహ్మణులయొక్క వంశములు వేనవేలు సంతతిని బొందకయే పుణ్యలోకములను పొందినవి. కనుక భీష్మునకు సంతతిలేమి లోపము కాదు. యది త్వా త్యంతికం వాసం రోచయేత గురో: కులే

యుక్త: పరిచరేదేన మా శరీర విమోక్షణాత్
ఆ సమాప్తేశ్శరీరస్య యస్తు శుశ్రూషతే గురుమ్
న గచ్ఛత్యంజసా విప్రో బ్రహ్మణస్సద్మ శాశ్వతమ్.

మను. 2అ. 243-244

వివాహమాడకపోయినను బ్రహ్మచర్యనిష్ఠులగు విప్రులెందరో స్వర్గమును పొందియుండిరి. బ్రహ్మచారికి వివాహము నందపేక్షలేక గురుకులవాసమందే అపేక్ష

కలిగియున్నట్లయిన జితేంద్రియుడై మరణపర్యంతము నైష్ఠిక బ్రహ్మచారియై గురుశుశ్రూష చేయుచుండవచ్చును. ఎవ్వడీప్రకారము మరణపర్యంతము గురు శుశ్రూష చేయుచుండునో అతడు బ్రహ్మలోక నివాసము శాశ్వతముగ పొందును. సనకసనందనాదులు, నారదుడు వాలఖిల్యాదులు, కణ్వమహర్షి మొదలైన వారెందరో నైష్ఠికబ్రహ్మచారులు కలరు. వారికి భార్యాపుత్రులు లేరు.

'అపుత్రస్య గతిర్నాస్తి' అన్నట్లు వారికి సద్గతులులేక పోలేదు. అట్లే భీష్ముడును అని గ్రహించవలెను.

## 3. జీవన్ముక్తుడైన భీష్ముడు ఉత్తరాయణము వచ్చువరకు వేచి యుండనేల?

మహనీయుడు జీవన్ముక్తుడునైన భీష్మునకు ఉత్తరాయన దక్షిణాయన భేదములు కలవా? అయిన అంతకాలమెందుకు అంపశయ్యపై శరీరముతో నుండెను? అను ప్రశ్నలకు సమాధానము.

హేమంతే ప్రథమే మాసి శుక్లపక్ష త్రయోదశే
ప్రవృత్తం భారతం యుద్ధం నక్షత్రే యమదైవతే

భారతసావిత్రి - మభా. వి. పు 427

భారతయుద్ధము మార్గశిర శుద్ధ త్రయోదశినాడు ప్రారంభమయినది. మార్గశిర బహుళ సప్తమినాడు అనగా పదియవరోజున భీష్ముని పతనము. మాఘశుద్ధ అష్టమి నాడు భీష్మనిర్యాణము. అనగా నలువదియారు రోజులు అంపశయ్యపై పడియుండెనన్న మాట. హేమంతఋతువు చలిఎక్కువగా ఉండేకాలము. ఎముకలు కొరికే ఆచలిలో బట్టబయట మంచులో అంపశయ్యపై పడియుండుట ఎంత కష్టమో ఊహింపజాలము వెంటనే ప్రాణములు వదలినచో ఈ బాధయుండదుకదా! ఉత్తరాయణములో చనిపోయినచో సద్గతులు కలుగుననియు, దక్షిణాయణమయినచో పునర్జన్మ వచ్చునని భయము చేతనా! యుద్ధము జరిగిన పదునెనిమిది రోజులు దక్షిణాయనముననే కదా! ఆ చచ్చిన పదునెనిమిది యక్షౌహిణుల సైన్యము, ప్రభువులు, అందరు దక్షిణాయనముననేకదా! వారందరకు దుర్గతులు కలిగినవా అంటే -

దేవలోకం యయుః కేచిత్కేచి ద్బ్రహ్మస దస్త థా
కేచిత్ భవారుణం లోకం కేచి త్కౌబేర మాప్నువన్

తతో వైవస్వతం లోకం కేచిచ్ఛాప్నువన్నృపాః

మ.భా - ఆశ్రమ. 33అ. 14-15శ్లో.

అని మహాభారతమందే చెప్పబడినది. కొందరు దేవలోకమునకు కొందరు బ్రహ్మలోకమునకు, కొందరు వరుణలోకమునకు, కొందరు కుబేరలోకమునకు, కొందరు యమలోకమునకు వెళ్ళిరి. స్వర్గలోకమునకు వెళ్ళిన ధర్మరాజునకు ఇంద్రుడు-

"వారు ఉపపాండవులు, చంద్రునివలె ప్రకాశించు అభిమన్యుడితడు, వసువులలో గూడియున్న భీష్మడితడు, బృహస్పతి ప్రక్కనున్న ఈ ద్రోణుని జూడుము" అని అందరను జూపెను. దక్షిణాయనములో చచ్చినను వీరందరు పుణ్యలోకములనే పొందిరికదా! అయినపుడు భీష్మడింత శ్రమపడుచు ఉత్తరాయణముకొరకు నిరీక్షించుచు అంపశయ్యపై పడియుండుటెందులకు?

దేవయాన పితృయాన మార్గములని రెండుకలవు వాని వివరమిది -

యత్ర కాలే త్వనావృత్తి మా వృత్తిం చైవ యోగినః
ప్రయాతా యాన్తి తం కాలం వక్ష్యామి భరతర్షభ
అగ్నిర్జ్యోతి రహశ్శుక్ల షణ్మాసా ఉత్తరాయణం
తత్ర ప్రయాతా గచ్ఛన్తి బ్రహ్మ బ్రహ్మవిదో జనాః
ధూమోరాత్రి స్తథా కృష్ణ షాణ్మాసా దక్షిణాయనం
తత్ర చాంద్రమ సం జ్యోతిర్యోగీ ప్రాప్య నివర్తతే.

గీత 8అధ్యా - శ్లో.23-24-25

ఏ కాలములో చనిపోయిన కర్మయోగులు తిరిగి జన్మకురారో, ఏకాలమున చనిపోయినవారు తిరిగి జన్మకు వత్తురో ఆకాలమును చెప్పెదను వినుము.

అగ్ని జ్యోతి, పగలు, శుక్లపక్షము, ఉత్తరాయణము ఇవన్నియు కాలాభిమాన దేవతలకు మార్గభూతములై యున్నవి. ఈ మార్గమున పోయినవారు బ్రహ్మోపాసకులు, బ్రహ్మమందే లీనమయి బ్రహ్మభూతులగుదురు.

పొగ, రాత్రి, కృష్ణ పక్షము, దక్షిణాయనము ఈ మార్గమున పోయినవారు చంద్రలోకమునకు పోయి కర్మఫలముననుభవించి, అదిపూర్తియయిన పిమ్మట తిరిగి జన్మకు వత్తురు. ఇది గీతలో చెప్పబడ్డ విషయము. ఛాందోగ్యోపనిషత్తులో కూడ

పంచాగ్ని విద్యలో పరలోక గమనమునకు దేవయానమార్గము, పితృయానమార్గము ఉపదేశింపబడినవి. మార్గమునకు విద్య కర్మను సాధనములుగా చెప్పబడినవి. మనుష్యులలో-

**1.** జ్ఞానులు (జీవన్ముక్తులు):- "న తస్య ప్రాణా హ్యుత్క్రామన్తి"

వీరిప్రాణము లెక్కడికిపోవు. ఇక్కడనే బ్రహ్మమునందే లయమగును.

**2.** నిష్కామకర్మానుష్ఠానపరులు :- దేవయానమార్గమున వెళ్ళెదరు. బ్రహ్మలోచేరి, ఆ బ్రహ్మతో సహాముక్తిని బొందుదురు.

'బ్రహ్మణా సహ ముక్తి:" వీరు తిరిగి జన్మకురారు.

**3.** కామ్యకర్మానుష్ఠానపరులు :- వీరు పితృయానమార్గమునపోయి, చంద్రలోకమున కర్మఫలమనుభవించి తిరిగి జన్మకువత్తురు. ఈ వచ్చుటలో ద్యు. పర్జన్య, పృథివీ, పురుష, యోషిత్తులనెడి అయిదు స్థానములద్వారా తిరిగి భూమిపై జన్మింతురు. దీనినే పంచాగ్ని విద్య యందురు.

**4.** నిషిద్ధ కర్మానుష్ఠాతలు :- విద్యా కర్మలు లేక మార్గద్వయభ్రష్టులగువారు జనన మరణావృత్తి రూపమైన తృతీయ స్థానమును పొంది చచ్చుచుపుట్టుచు నుందురు.

చంద్రలోకమునకు పోయి అక్కడ కర్మఫలానుభవము పూర్తి అయినపిమ్మట మరల జన్మకువత్తురని చెప్పినమాట అజ్ఞానుల విషయమున గాని జ్ఞానుల విషయమున కాదు.

'చంద్రం ప్రాప్తస్య పునరావృత్తి వచనం అబ్రహ్మవిద్విషయం' అని భాష్యములో చెప్పబడినది. అయితే భీష్ముడీ నాలుగు విధములైన జీవులలో నెందుజేరునని ప్రశ్న, అతడు మహాజ్ఞాని, మహాయోగి, మహాభక్తుడు, మరియు జీవన్ముక్తుడు. అందుకు మహాభారతమే సాక్షి. దేహాభిమానము కర్తృత్వాభిమానము పూర్తిగా వదలిన జీవన్ముక్తుడు. అతడు పరమార్థమెరిగిన జ్ఞానియగుటచే కర్తృత్వము లేని వాడగుట చేతను వందలకొలది అశ్వమేధయాగములు చేసిన పుణ్యము కాని, అనేక బ్రహ్మహత్యలు చేసిన పాపము కాని పొందడు. ఆతనికి విధి నిషేధములులేవు. ఉత్తరాయణ దక్షిణాయన భేదములును లేవు. అయిన అంత కాలము ఎందుకు శరీరముతో నుండెనను దానికి సమాధానము -

"భీష్మాదీనాం స్వచ్ఛందమరణానాం ఉత్తరాయణ
ప్రతీక్షణం ఉత్తరాయణప్రాశస్త్యప్రదర్శనార్థం"

స్వచ్ఛంద మరణముగల భీష్మాదులు ఉత్తరాయణముకొరకు నిరీక్షించుట ఉత్తరాయణప్రాశస్త్యమును లోకులకు తెలియజేయుట కొరకే తన తండ్రి తనకు స్వేచ్ఛా మరణమునిచ్చియుండెను. కనుక ఆవరముయొక్క తండ్రియొక్క గొప్పతనమును లోకులకు తెలియజేయుట కొరకు శరీరమును నిలిపియుంచెనేకాని వేరు కాదు. తాను జీవించియుండగనే కర్తృత్వాభిమానము లేవియు లేక దేహము తనది కాదని వ్యవహరించిన మహానుభావునకు ఈ దేహమున్న నేమి? పోయిననేమి? దేహాభిమానమే యున్నచో ఆ చలిలో ఆరుబయట బాణములపై అట్లు పడియుండుట అదియు నలుబది యారు రోజులు సాధ్యమగునా?

వాసుదేవుని యానతిప్రకారము భీష్ముడు మాఘశుద్ధ అష్టమీ, నవమీ, ఏకాదశీ దినములందు యోగసమాధి యందుండి మాఘశుద్ధ ద్వాదశినాడు స్వర్గమును పొందెను. ఈ అయిదు దినములకు భీష్మపంచకమని పేరు.

మాఘే మాసి సితాష్టమ్యాం సలిలం భీష్మతర్పణం
శ్రాద్ధం చ యే నరాః కుర్యుః తే స్యుః సంతతిభాగినః

మ.భా. వి.పు 447

అని పద్మపురాణమునందు కలదు.

మాఘశుద్ధ అష్టమినాడు భీష్మునకు నువ్వులతో తర్పణము శ్రాద్ధము యే మానవులు చేయుదురో వారు సంతానవంతులగుదురు. మాఘశుద్ధ అష్టమినాడు భీష్మ తర్పణము చేసిన వారికి సంవత్సరమంతా చేసిన పాపము ఆ క్షణమందే నశించునని మహాభారతము నందు చెప్పబడినది. శిష్టులు, బ్రాహ్మణులు సంప్రదాయపరులు ప్రతిమాఘశుద్ధ అష్టమినాడు భీష్మునకు తర్పణములను విడుతురు.

సాధారణముగా తండ్రిజీవించియున్న వారు తర్పణము చేయరాదు. కాని

"జీవత్పితాని కుర్వీత తర్పణం యమభీష్మయోః"

తండ్రిజీవించియున్న వారుకూడ యమతర్పణము భీష్మతర్పణము చేయవలెనని పద్మపురాణము శాసించుచున్నది.

# 16. ద్రోణుని వధకై ధర్మజు డసత్యమాడుట

వాసుదేవుడు ధర్మజునితో

కII మమునీతని కొప్పింపక
సముచితముగఁగాచికొను మసత్య వచనదో
షము లేదు ప్రాణరక్షణ
సమయంబున నతని కొడుకు సచ్చెననుమా

ఆం. భా -ద్రోణ - 5అ.310

అశ్వత్థామ యనునొక యేనుగు భీమసేనునిచే చచ్చెను. భీమసేనుడును అశ్వత్థామ చచ్చెనని ఎలుగెత్తి యరచెను. ద్రోణుడాతని యరపును లెక్క గొనక యథాప్రకారము మారణహోమము చేయుచుండెను. భీమ వాసుదేవులిరువురును ధర్మజుని అశ్వత్థామ చచ్చెనని చెప్పుమని బోధించిరి.

కII మదినయ్యిరువురమాటలుఁ
బదిలంబుగఁబట్టికొనుటఁబట్టియు నెట్లుం
దుదినది యట్టుల కాఁగల
యదియై యుండుటను దానికతఁడొడఁబడియెన్

వII ఇట్లు సమ్మతించి

కII అనృత భయము నాజిజయముఁ
గొనియెడు తమకంబు పెంపు గదియింపఁగఁబాం
డువరేంద్రు న్నగ్రతన యుం
డనుమానము వాయఁబెట్టి యస్త్రగురునితోన్
వలయుకొలది నెలుంగెత్తి వర్ణసమితి
యచ్చుపడఁగ నశ్వత్థామసచ్చెననియె
వని పదంపడి యట్లనయతని చెవికి
వినఁగ రాకుండఁ గుంజరమనియెనధిప

ఆం. భా. ద్రోణ. 5అ. 313-316

ద్రోణుని యైదవనాటి యుద్ధమున ద్రోణుడు బాగుగా విజృంభించి పాండవసైన్యమును సర్వనాశనము చేయుచుండెను. వాసుదేవుడు పరిస్థితిని గమనించి ధర్మరాజుతో ద్రోణుడీవిధముగా క్రుద్ధుడై ఇంకొక పూట యుద్ధము చేసినచో నీసైన్యము తప్పక సర్వనాశనము కాగలదు. మమ్ములను ద్రోణుని నుండి నీవే కాపాడవలయును. ఇట్టి పరిస్థితులలో సత్యము కంటె నసత్యమే యుక్తము. అశ్వత్థామ చనిపోయెనని నీ వసత్యమాడినగాని యీతడు యుద్ధమును విరమింపడు.

"సత్యా జ్జ్యాయో ఽనృతం వచః"

సత్యముకంటె అసత్యమే యుక్తమని శ్రీకృష్ణుడంతటివాడు చెప్పవచ్చునా? అని ప్రశ్న. ఇందలి యుక్తాయుక్తములను పరిశీలింపవలెనన్న యుద్ధమారంభమయిన మొదటిరోజునకు పోవలెను. ఆ రోజున ధర్మరాజు భీష్ముని యొద్దకు పోయి నమస్కరించి జయాశీర్వాదమును కోరినట్లే ద్రోణాచార్యుని సన్నిధికి కూడపోయి జయాశీర్వాదమర్థించెను. ద్రోణుడు ధర్మజునితో యుద్ధసన్నద్ధుడవైన నీవు నాయొద్దకిట్లు రాకుంటివేని నీకు చేటుకలుగునట్లు శపించెడివాడను. నీవు నన్ను పూజించుటచే సంతోషించితిని. నీ కనుజ్ఞనిచ్చుచున్నాను. యుద్ధము చేయుము. విజయము నొందుము. నేను కౌరవులకు అర్థముచే బద్ధుడనైతిని. కనుక కౌరవపక్షమందే యుద్ధము చేయుదును. కౌరవుల నిమిత్తమయియే యుద్ధము చేయుదును. నీకు జయము నాశీర్వదింతుననగా ధర్మరాజు మహనీయా! నీవు కౌరవుల పక్షమున యుద్ధము జేయుము. నాకు జయమాశీర్వదించి హితముపదేశింపుము. అనగా దానికి ద్రోణుడు -

ధృవస్తే విజయో రాజన్ యస్య మన్త్రీ హరిస్తవ
అహం త్వా మభిజానామి రణే శత్రూన్ విమోక్ష్యసే॥
యతో ధర్మ స్తతః కృష్ణో యతః కృష్ణస్తతో జయః
యుద్ధ్యస్వ గచ్ఛ కౌన్తేయ పృచ్ఛ మాకిం బ్రవీమి తే.

మ.భా . తత్త్వ 793.

యుధిష్ఠిరా, శ్రీహరిమంత్రియై యున్న నీకు తప్పక విజయము కలుగును. నీకనుజ్ఞ నిచ్చుచున్నాను. యుద్ధమునందు నీవు శత్రుక్షయము చేయుదువు,

ధర్మమెచ్చటనో కృష్ణుడచ్చట, కృష్ణుడెచ్చటనో విజయమచ్చట. వెళ్ళి యుద్ధము చేయుమనెను. మరికొంత సంవాదమయిన పిమ్మట ధర్మజా! నేను శస్త్రమును విడిచి ప్రాయోపవేశమును పొంది చైతన్యం లేకున్నప్పుడు కాని, శరవర్షమును కురిపించుచు సరంభముతో యుద్ధము చేయుచున్నంతసేపు నన్ను వధింపగలవాడు లేడు, నేను శస్త్రమును విడుచుట యెప్పుడనగా విశ్వాసపాత్రుని వలన గొప్ప అప్రియవార్త వినినప్పుడు నేను శస్త్రమును విడిచివేయుదును ఇది నిజము. అని ద్రోణాచార్యులు ముందుగనే ధర్మజానికి అనుజ్ఞనొసంగిరి. ద్రోణుడు విశ్వసనీయునివలన అప్రియవార్తా శ్రవణము జరిగినపుడుగాని శస్త్ర సన్యాసము చేయనని చెప్పియుండుట వలనను, అట్టి విశ్వసనీయుడు ధర్మజుడేయగుటవలనను, అట్టి గొప్ప అప్రియవార్త అశ్వత్థామమరణ వార్తయేయగుట వలనను దానిని కృష్ణుడు విశదీకరించుట చేతను ధర్మజుడెట్ట కేల కసత్యమాడెను. ఈ ధర్మజుని యనృతవాక్కుకూడ ద్రోణాచార్యున నుజ్ఞపై ద్రోణవధాంగముగ ధర్మజుడాడిన అసత్యవచనములోని ధర్మరహస్యము. ఈసందర్భమున ధర్మ శాస్త్రము కూడ --

"న చాత్మా రక్షితవ్యో వై రాజన్ రణగతేన హి
యౌ యస్య యుజ్యతే ఽర్థేషు స వై రక్ష్యో నరాధిప
తై రక్ష్యమాణై స్స నృపో రక్షితవ్యో మహామృధే
మా స్మ తాం స్తాదృశాం స్తాత జనిష్టాః పురుషాధమాన్
యే సహాయాన్ రణే హిత్వా స్వస్తిమంతః గృహాణ్యయుః
అస్వస్తి తేభ్యః కుర్వన్తి దేవా ఇంద్రపురోగమాః
త్యాగేన యస్సహాయానాం స్వాన్ ప్రాణాన్ త్రాతుమిచ్ఛతి
తం హన్యుః కాష్ఠలోష్టైర్వా దహేయుర్వా కటాగ్నినా
పశువ న్మారయేయుర్వా క్షత్రియా యేస్స్యురీదృశాం

మ.భా. శాంతి 97అ. 20-21-32 శ్లో.

యుద్ధమునందు తనను తాను రక్షించుకొనుటేగాదు, తనకొరకెవరు పని చేయుచున్నారో వారును రక్షింపబడవలెను.

వారిచే రక్షింపబడుచువారిని తాము రక్షింపవలెను. ఎవరైతే సహాయులను వదలి

క్షేమముగా గృహములకు వెళ్ళెదరో అట్టి పురుషాధములు మాకు పుట్టకుందురుగాక. సహాయులను వదలి తమ ప్రాణములను గాపాడుకొనగోరు వారికి ఇంద్రాదిదేవతలు అశుభమును కలిగింతురు. ఇటువంటి క్షత్రియులను కట్టెలతోను, మట్టి గడ్డలతోను గొట్టి పశువులవలెచంపి చెక్కల అగ్నితో దహించవలెను.

ఈ వచ్చిన సైన్యములన్నియు తమకొరకు గాదు యుద్ధము చేయుట, ధర్మరాజు కొరకు గదా! ఇందుప్రాప్తించు శుభాశుభములు జయాపజయములు తమకేమి కావు గదా! ప్రభువుకొరకిట్టి ప్రాణత్యాగము చేయుచున్న సైన్యములను నాశనము కాకుండ జూచుట ప్రభువు కర్తవ్యము గదా! వారేమైతే నాకేమని తన సత్యవ్రతమును పట్టుకొని తాను కూర్చొనిన తనకెంతదోషమో పై శాస్త్రవాక్యములను వింటిరికదా. అబద్ధ మాడుటయు దోషమే. ఏమైనను దోషము తప్పనిసరియయినది. కనుక ఇప్పుడు ఏదోషము మంచిది? ఏదోషము చెడ్డది? అనే విషయము విమర్శనీయమైనపుడు నీవనుకునే సత్యము కంటె నీవనుకునే అసత్యమే మేలని శ్రీకృష్ణ భగవానుడు చెప్పెను.

శూద్రవిట్ క్షత్ర విప్రాణాం యత్రార్తోక్తౌ భవేద్వధః
తత్ర వక్తవ్యమనృతం తద్ధి సత్యాద్విశిష్యతే॥

-మను.8అ.104

మనుస్మృతి యందును ఉత్కృష్టమగు ధర్మము లేదనియే నిర్ణయము. అయినను ఒకానొకప్పుడు సందర్భానుసారముగా అబద్ధముకూడ చెప్పదగినదేయని విధించు చున్నారు. అదెట్లన శూద్ర వైశ్య క్షత్రియ విప్రులకు ఎచ్చట సత్యమునే పలికిన వధ సంభవించునో అచ్చట అసత్యము చెప్పవలసినది. అబద్ధము ప్రాణములను రక్షించు చున్నది. కావున అబద్ధము ప్రాణములను తీయు సత్యము కంటె గొప్పది. అట్టి అసత్యమును చెప్పినవారా అసత్యదోషము పోవుటకై సరస్వతీ దేవతాకమైన చరువులతో సరస్వతిని గూర్చి యాగమొనర్తురు. దానివలన అనృతదోషమును పోగొట్టుకొందురు. యజుర్వేదీయములైన కూష్మాండ మంత్రములచేతను "ఉదుత్తమ"మను వరుణ దేవతాకమైన ఋక్కులతోను, అబ్దేవతాకమైన, "ఆపో హిష్ఠా మయోభువ" అను

మంత్రములతోను అగ్ని యందాజ్యహోమము చేయవలెనని మనుస్మృతి యందే చెప్పబడినది. కనుక అసత్యదోషము ప్రాయశ్చిత్తము చేత తప్పక హరించునని భావము.

కామినీషు వివాహేషు గవాం భక్తే తథైవ చ
బ్రాహ్మణాం ద్యుపపత్తే చ అన్నృతే నాస్తి పాతకం.

-మహా. భా . ద్రోణి. పు.110

అని స్త్రీయందును, వివాహములయందునూ గోవుల రక్షణ విషయమునందునూ, బ్రాహ్మణాదుల రక్షణకలుగు సందర్భముననూ అన్నృతమాడిననూ దోషము లేదని భారతమునందే చెప్పబడినది. యాజ్ఞవల్క్యస్మృతి వ్యవహారకాండయందును "వర్ణానాంచ వధో యత్ర తత్ర సాక్ష్యనృతం వదేత్ ఇతి ప్రతిపాదితమ్" అనగా నెచ్చట సాక్షి సత్యమాడినచో చాతుర్వర్ణ్యులకు వధ సంభవించునో అట సాక్షి అబద్ధమాడియైననూ వధను తప్పించవలయునని చెప్పబడినది.

కావుననే శ్రీకృష్ణ భగవానుడు -

ప్రాణినా మవధ స్సర్వజ్యాయాన్మతో మమ
అన్నృతాం వా వదే ద్వాచం న తు హింస్యా త్కథంచన
యద్భూతహిత మత్యంతం తత్సత్యమితి ధారణా
విపర్యయకృతోఽధర్మః పశ్య ధర్మస్య సూక్ష్మతాం

-మహా. భా .వి. పు. 137

అని తీర్మానించెను. అనగా ప్రాణి హింస చేయకుండుటే సర్వశ్రేష్ఠమని నా యుద్దేశము. అబద్ధమైన చెప్పవచ్చునుగాని ఎవరిని హింసించగూడదు. భూత హితమయినదే సత్యము. భూతముల కహితమయినదే అసత్యము, అధర్మము. కావుననే శ్రీకృష్ణుడట్లు చెప్పెను.

అంతేకాక ఘోషయాత్రయయిన పిమ్మట అవమానమును భరింపజాలక ప్రాయోపవేశమునకు సన్నద్ధుడైన దుర్యోధనుని దైత్యదానవులు తమ యొద్దకు రప్పించుకొని యుద్ధ సమయమున భీష్మద్రోణ కృపాచార్యులయందు అసుర శక్తులావేశించునట్లు, అనగా అసురులే యావేశించునట్లు వాగ్దానము చేసి అట్లే చేసిరి

కనుక ద్రోణాచార్యుని యుద్ధప్రవృతి అసుర ప్రవృత్తి కలదని గ్రహించవలెను.

"ధర్మా జ్జేతు మశక్యం చే ద్ధర్మం త్యక్త్వా ప్యరిం జయేత్"

అను న్యాయము ననుసరించి ధర్మముచే జయించుట సాధ్యము కానపుడు ధర్మమును విడిచియైనను శత్రువును జయింపవలెను.

ఈ యనృతము కేవలము ఛలము. దీనికి వాక్ఛలమని పేరు. ఛలములెన్ని విధములో అందది యే ఛలమో·నీలకంఠీయములో చెప్పబడినది.

"నిత్యం పంచోపధాతీతైర్మంత్రయే త్సహ మన్త్రిభిః"

-మ.భా.శాంతి 83అ.

దీనికి టీక వ్రాయుచు "ఉపధాః ఛలాని తాని పంచ తేషు కేవలం వాచకీ ద్రోణవధే -

"హతోఽశ్వత్థామా కుంజరః" ఇత్యుక్తి
ర్యుధిష్ఠిరస్య మనసి ఛలాభావాత్ । భీమస్య
తు తత్రైవ కాయకీ వాచకీ చ । కేవలం
మానసికీ పాండవేషు । ధృతరాష్ట్రస్య
వాచిక్యా అభావాత్ । తత్రైవ ధార్త్ర రాష్ట్రాణాం
కాయవాఙ్మనో భయం జతుగృహే ।
సౌప్తికేఽశ్వత్థామ్నః కాయకీతి పంచవధా ।

-మహా. భా .తత్త్వ. పు. 1418

ఛలములు కేవల కాయకమని, కేవల వాచికమని, కేవల మానసికమని, కాయిక వాచికమని, మనోవాక్కాయకృతమని యైదు విధములు. ఇందు ద్రోణ వధోద్దేశ్యకమైన యుధిష్ఠిరోక్తిలోని అశ్వత్థామ శబ్దమాగజార్థకముగనే భావించి వాడబడుట చేతనది కేవల వాచికమయిన ఛలమేగాని మానసిక ఛలము లేదు. ఆ విషయమై అశ్వత్థామనామక గజమును వధించి 'అశ్వత్థామా హతః' అని భీమసేనుడనుటలో నది కాయిక వాచికచ్ఛలము. అది గజార్థముగనే వాడబడుటచేత మానసికచ్ఛలములేదు.

ధృతరాష్ట్రునకు పాండవులపట్ల కేవల మానసిక ఛలము. వాక్కులలోగాని క్రియలలోగాని ఛలము లేదు. అశ్వత్థామ సౌప్తిక వధ విషయములో తెలియకుండ వచ్చి వధించుటచే కాయిక ఛలము. పాండవుల నిమిత్తము లాక్షాగృహదహనవిషయమయి దుర్యోధనాదులది మనోవాక్కాయకృతచ్ఛలము. దీనినిబట్టి దుష్ట చతుష్టయము చేసినంత ఛలము భీమసేనుడు చేయనేలేదు. ఇక ధర్మజాని ఛలము విషయము చెప్పనక్కరలేదు. అనగా నెంతమాత్రము లెక్కకురానిది. దోషము లేదని భావము. అదియైనను దుష్ట చతుష్టయమువలె చేసినది గాక శరణాగత స్వసైనికరక్షణార్థము యుద్ధభూమిలో చేయవలసి చేసినపని. ద్రోణాచార్యుడు అశ్వత్థామవిషయమును సన్నిధానవర్తులగు తన పక్షము వారినడుగక ధర్మరాజు నడిగినప్పుడు చేసినపని. తాననుచున్న అశ్వత్థామ గజమనియే భావించి చేసినపని. ద్రోణాచార్యుని విజయాశీర్వాద కాలమందలి సూచన ననుసరించి చేసినపని. ఆపద్ధర్మము ననుసరించి చేసినపని. కృష్ణభగవానుని ప్రబోధము ననుసరించి చేసినపని. అట్లు కానిచో మరణమే లేని చిరంజీవియైన అశ్వత్థామ మరణించెనని ధర్మజుడు పలికినను ద్రోణాచార్యుడెట్లు విశ్వసించెను? అది సత్యమా అసత్యమా? సంభవమా కాదా అనునది ముఖ్యము కాదు. ద్రోణాచార్యుడు అస్త్ర సన్యాసము చేయుటకు అప్రియమైన వార్త విశ్వసనీయుని నోట వినవలెను.

ఈ విషయమై కర్ణపర్వారంభమున నీలకంఠాచార్యులిట్లు వ్రాసిరి. "శరణాగత స్వసైనిక త్రాణార్థ మన్యాయేనాపి కృతో బ్రహ్మవధో నేతరబ్రహ్మవధవ దనర్థోఽపి తు అనర్థా భాస ఏవ । న తేన బ్రహ్మహా భవేత్ । ఇత్యాతతాయివధే దోషాభావస్మరణాత్"

ఇచ్చట శరణాగత సైనికత్రాణార్థమై అన్యాయముగా జేయబడినను బ్రహ్మవధము ఇతర బ్రహ్మవధము వలె అనర్థకరము కాదు. అనర్థాభాసమే. ఆతతాయివధ అంత దోషావహము కాదనియున్నదని భావము. ద్రోణాచార్యుడు మహాక్రుద్ధుడై యుచితానుచితములను విస్మరించి పాండవసేనను నాశనము చేయుచుండెను. అతడు చేయుచున్నది అధర్మయుద్ధము. ద్రోణుడు చేయుచున్నది పాపిష్ఠికర్మ. ఎందువలన్న ననగా -

"శస్త్రైర్యుద్ధే జయో యత్ర తత్రాస్త్రాణి న యోజయేత్
నిరస్త్రేష్వల్పశస్త్రేషు పలాయన పరేషు చ

అస్త్రాణి ముంచన్ దివ్యాని స్వయమేవ వినశ్యతి"

- శివగీత 5అ 37శ్లో

శస్త్రాల చేతనే జయము ప్రాప్తించునపుడు అస్త్రములను ప్రయోగింపరాదు. అస్త్రములు లేనివారిపైన, అల్పశస్త్రములు గలవారిపైన, పారిపోవువారిపైన దివ్యాస్త్రములు ప్రయోగించినచో తానే నశించిపోవును.

ద్రోణాచార్యుని యుద్ధరీతిని సప్తర్షులే పాపిష్ఠికర్మ యన్నారు. అగ్నిహోత్రుని ముందు నిడుకొని జమదగ్ని, భరద్వాజుడు, విశ్వామిత్రుడు, గౌతముడు, వశిష్ఠుడు, కశ్యపుడు, అత్రి మున్నగు సప్తర్షులు ద్రోణాచార్యుని బ్రహ్మలోకమునకు గొనిపోవవచ్చి నీ మరణ సమయమాసన్నమయినది, యుద్ధమును విరమింపుము, నీకిట్టి క్రూరకర్మము తగదని బోధించిరి.

అధర్మత: కృతం యుద్ధం సమయో నిధనస్య తే

న్యస్యాయుధం రణే ద్రోణ సమీక్ష్యాస్మా నిహాస్థితాన్

అంతేకాదు

బ్రహ్మాస్త్రేణ త్వయా దగ్ధా: అనస్త్రజ్ఞా నరా భువి

యదేత దీదృశం విప్ర కృతం కర్మ న సాధువత్"

- మ.భా. వి.పు 138.

నీవు చేసినది అధర్మయుద్ధము. మిక్కిలి క్రూరమయినది. అస్త్రజ్ఞానము లేనట్టి సామాన్య సైనికులను సహితము నీ బ్రహ్మాస్త్రప్రయోగముచే అధర్మముగా సంహరించితివి. నీకు మరణ కాలమాసన్నమయినది. బ్రాహ్మణుడవైన నీకిట్టి క్రూర కర్మ తగదు. శస్త్రాస్త్రములను వదలిపెట్టి యుద్ధమును విరమింపుమనిరి.

ఉచితానుచితములను విస్మరించి అస్త్రములేని సైనికులను తన బ్రహ్మాస్త్ర ప్రయోగముచే క్రూరముగా సంహరించుచున్న ద్రోణాచార్యుడు ఆకతాయి యగుచున్నాడు. అట్టి ఆకతాయిని వధించుటలో దోషము లేదు.

"జ్యాయాంస మపి చే ద్వృద్ధం గుణైరపి సమన్వితమ్

ఆకతాయిన మాయాన్తం హన్యా ద్ఘాతక మాత్మన:"

-మహా. భా .తత్త్వ. 798

టీ॥ ఆతతాయిన మిత్యస్య ఘాతక మితి విశేషణ
మన్యేభ్య ఆతతాయిభ్యో వ్యవచ్ఛేదాయోక్తమ్.

పూజ్యుడైనను వృద్ధుడైనను గుణవంతుడైనను తన్ను హింసింపవచ్చువానిని వధింపవలసినదే యని బృహస్పతి వచనము. తన మీదకు వచ్చుచున్న ఆతతాయిని నిర్విచారముగా చంపవచ్చును. ఆతతాయిని వధించినచో వధించినవానికి దోషములేదు.

ధర్మజుని చర్య యింతగా సమర్థనీయమే యైనను ధర్మరాజు "అశ్వత్థామా హతః కుంజరః" అనినంతనే -

"అశ్వత్థామా హత ఇతి శబ్దముచ్చైశ్చకార హ
అవ్యక్త మబ్రవీద్వాక్యం హతః కుంజర ఇత్యుత
తస్య పూర్వం రథః పృథ్వా శ్చతురంగుల మున్నతః
బభూవైవం తు తే నోక్తే తస్య వాహోఽస్పృశన్మహీమ్"

- మ.భా. ద్రోణ 191 అ. 56, 57, 58 శ్లో

అంతకు పూర్వము భూమికి నాలుగు అంగుళములు ఎత్తుగా భూమిని తాకకుండ సంచరించుచున్న ధర్మజుని రథము ఈ అబద్ధముచే భూమిని తాకెను. అతని గుఱ్ఱములు భూమిని తాకినవి. ధర్మరాజు తన దైవత్వము కోల్పోయెనన్నమాట. కృష్ణుడు చెప్పినట్లు ధర్మరాజు అశ్వత్థామ చచ్చెనని చెప్పినచో అది ఆపద్ధర్మమయ్యేడిది. అది దోషావహము కాకపోవును. ఒకవేళ దోషావహమయినను ప్రాయశ్చిత్తముతో హరించును. అట్లు కాక ధర్మరాజు తన స్వబుద్ధితో నాలోచించి 'కుంజరః' అని కలిపి చెప్పుటచే నది వంచన యయినది. ఈ విషయమునే ఇంద్రుడు కూడ ధర్మరాజుతో నిట్లు చెప్పెను -

వ్యాజేన హి త్వయా ద్రోణ ఉపచీర్ణః సుతం ప్రతి
వ్యాజేనైవ తతో రాజన్ దర్శితో నరకస్తవ.

- మ.భా. స్వర్గా. 3అ. 15 శ్లో.

టీక॥ హతః కుంజరః ఇత్యశ్వత్థామ వధే ద్రోణ ఉపచీర్ణః వంచిత । గణవాచీ

శబ్దో మనుష్య పరత్వేన జ్ఞాపిత ఇత్యుపచారచ్ఛలేనేత్యర్థః"

నీవు ద్రోణుని పుత్ర నిమిత్తముగా వంచించినావు. కనుక నీకును వ్యాజము నిమిత్తము క్షణకాలము నరకము చూపించబడినది. అట్లే ద్రౌపదీ భీమ సేనాదులకును నరక దర్శనమయ్యెను అని చెప్పెను. ధర్మదేవతయు ధర్మరాజుతో "మాయైషా దేవరాజేన మహేంద్రేణ ప్రయోజితా" అని చెప్పెను. ఇది ఇంద్రుడు ప్రయోగించిన మాయ. లేకున్న స్వర్గమున నరకమెట్లుండును.

పిండితార్థమేమనగా ద్రోణాచార్యుడు ధృష్టద్యుమ్నుని మూలమునగాని, శస్త్రములను విడుచువాడుకాడు. శస్త్రములను విడిచినగాని ధృష్టద్యుమ్నునికి స్వాధీనము కాడు. స్వాధీనమైనగాని ధృష్టద్యుమ్నుని జన్మమునకు సార్థక్యము రాదు. పాండవులకు ద్రోణాభిమత విజయమును రాదు. అందుకై ద్రోణాచార్యుని యనుజ్ఞ ప్రకారము ధర్మజుని మూలమున ద్రోణుని శస్త్ర సన్న్యాసము, ధృష్టద్యుమ్నుని మూలమున ద్రోణ వధయు జరుగవలసి యున్నందునను, ఈ ఘటనను శ్రీకృష్ణభగవానుడు చేయగలుగు ననియే "ధ్రువస్తే విజయో రాజన్ యస్య మన్త్రీ హరిస్తవ' ' అని ద్రోణాచార్యులు సూచించి యున్నందునను ఆచార్య హృదయము తెలిసిన శ్రీకృష్ణభగవానుడు అట్లు ప్రబోధించి యా విషయముల నన్నింటిని ఘటింప జేసెనని గ్రహించవలెను.



# 17. క్రుంగిన రథచక్రమునెత్తు కొనుచున్న కర్ణుని పార్థుడు వధించుట

చ॥ వినుము నరేంద్ర విప్రుడలిగెన్ జమదగ్నిసుతుండు శాపమి
చ్చె నమరభర్త వంచనముసేసె వరంబని కోరి కుంతి మా
న్చె నలుక భీష్ముఁడర్థరథుంజేసి యడంచెఁగలంచె మద్రరా
జనుచిత మాడి శౌరి విధియయ్యెనరుండనిఁజంపెఁగర్ణునిన్

క॥ హరసురపతియమవరుణులుఁ
గురుకృపులును దివ్యబాణకోటు లొలఁగుటన్
నరుశక్తి కర్ణుతేజ
స్ఫురణము నార్పంగఁజాలెఁజువ్వె నృపాలా!

ఆ.భా -శాంతి . 1అ.35-37

శ్రీమదాంధ్రభారత శాంతి పర్వమున కర్ణుని చావునకు ఇన్ని కారణములు చెప్పబడినవి.

ద్రోణవధానంతరము కర్ణుని సేనానాయకత్వము వరించినది. ఆనాడది యుద్ధమారంభమై పదియవ రోజు. కర్ణునిసేనానాయకత్వమున సూర్యుడస్తమించు వరకును యుద్ధము సాగినది. కౌరవులకు జయము కలుగలేదు. పాండవబలమే కౌరవసైన్యమును తరిమి కొట్టినది. కర్ణునిసేనానాయకత్వమున మొదటిరోజు యుద్ధము ముగిసినది. రెండవరోజు కర్ణుడు దుర్యోధనునితో-

"అద్య రాజన్ సమేష్యామి పాండవేన యశస్వినా
నిహనిష్యామి తం వీరం సవామాం నిహనిష్యతి
అనిహత్య రణే పార్థం నాహమేష్యామి భారత"

మ.భా. కర్ణ - 2అ - 43.

కౌరవేశ్వరా! నేనీనాటి యుద్ధమున అర్జునుని సంహరింతును, లేదా అతని చేతిలో

ప్రాణములనైన విడుతును, కాని వ్యర్థముగ తిరిగిరాను. కాని నాకొక సాయము కావలెను. అర్జునునకు అగ్నిదత్తమైన రథమున్నది. గాండీవమున్నది. దేవతాశ్వములున్నవి. నాకవిలేవు. అంతే కాక నా అస్త్రమయిన శక్తి వ్యర్థమైపోయినది. అయినను లోటులేదు. నాయొద్ద భార్గవాస్త్రమున్నది. కాని అర్జునుని సారథి శ్రీకృష్ణునితో సరిపోదగిన సారథి నాకు లేడు. అట్టివాడు శల్యుడొక్కడే. అట్టి శల్యుని నాకు సారథిగా నియమించినచో నర్జునుని నేడు తప్పక వధింతునని చెప్పెను. దుర్యోధనుడెట్లో శ్రమపడి శల్యుని కర్ణునికి సారథిగా నుండుటకంగీకరింపజేసినాడు. ఆ శల్యుడు తాను సుక్షత్రియుడై యుండి సూతుడైన కర్ణునికి సారథిగా నుండుటకు మొదట అంగీకరింపలేదు. తుదకొక నియమమునుపెట్టి అంగీకరించెను. తానుతనకు తోచినట్లు రథికునకు ఉపాయములు చెప్పును. అతడేమీ మాట్టాడినను అవి వీనులకు ఇంపుగానున్నను లేక అవి పరుషోక్తులే యైనను దుర్యోధనుడు కాని, కర్ణుడు కాని కోపింపరాదు, సహించి తీరవలెను. ఈ నియమముపై శల్యుడు కర్ణునకు సారథి యయ్యెను. ఇక శల్యసారథ్యము ఆరంభమైనది. శల్యుడు కర్ణుని చావుచూచు మృత్యువునకే అతడు సారథికాని కర్ణునికి సారథి కాడు. మృత్యువే కర్ణునికంటె ముందుగా సారథియై రథమును అధిరోహించినదన్నమాట.

శల్యుని నియమమిది -

**"యత్తు కర్ణమహం బ్రూయాం హితకామః ప్రియాప్రియే**
**మమ తత్ క్షమతాం సర్వం భవాన్ కర్ణశ్చ సర్వశః"**

-మహా. భా .కర్ణ 36 అ

హితమును గోరిన నేను కర్ణునిగూర్చి ప్రియాప్రియవిషయము లాడినపుడు నీవును కర్ణుడును సహించి యుండవలెను. రథికునకు హితమును చెప్పుట సారథి ధర్మము.

**"అవశ్యం తు మయా వాచ్యం రథిశ్చ బలాబలం**
**ఆయుధస్య పరిజ్ఞానం ఋతం చ మృగపక్షిణాం**
**అస్త్రయోగశ్చ యుద్ధం చ నిమిత్తాని తథై వ చ**
**బుధ్యతాం తద్ధితం త్వద్య రథస్యాస్య కుటుంబినా"**

మ.భా - కర్ణ . 2అ. 34-35.

సారథియగునాచే రథికుని బలాబలము, రథికుని ఆయుధపరిజ్ఞానము, పక్షిమృగములయొక్క ధ్వనిరావములగు శకునములు, ఏకాలమున ఏ అస్త్రప్రయోగముచితమో, అదియు శకునము, యుద్ధవిశేషము రథికునకు నాచే చెప్పవలసి యున్నది. కావున రథసంరక్షకుడనగు నాచేచెప్పబడు హితమును నీవెరుంగుము అని భావము. ఈ భావమునే ఆంధ్రభారతమున తిక్కన సోమయాజియు విశదీకరించినాడు.

ఉ॥ సారథి దక్షుఁడై రథికసారము రథ్యబలంబు నాయుధో
దారత మానమున్ రణవిధంబు నిమిత్తశుభాశుభత్వని
ర్ధారణమున్ మదింగని హితంబెఱింగించుట నీతిగాననీ
వీరసమెత్తి నోఁబలికితేనియుఁజెప్పుదు సూతనందనా

-మహా. భా .కర్ణ 2 అ 52 ప.

కావుననే శల్యుడు తన సారథి ధర్మమును చక్కగా నిర్వహించినాడు. అందులకై ప్రియముకానిండు అప్రియము కానిండు నిజమైన హితమును నిర్మొహమాటముగా నిర్భయముగా తెలియజేసినాడు.

ఆనాటి కర్ణుడు మహాభీకరముగా పోరాడినాడు. "నైనం భీష్మో న చ ద్రోణః" అని వర్ణించినాడు సంజయుడు, కర్ణుడు భార్గవాస్త్రమును ప్రయోగించి పాండవ సైన్యమును పటాపంచలు చేయుచుండెను.

కర్ణుని భీకరప్రతాపమునకు అర్జునుడే భీతిల్లవలసిన పరిస్థితి అది. చావుకు సిద్ధమై వచ్చిన కర్ణునకెదురుగా బ్రతుకదలచిన అర్జునుడు నిలువదలచలేదు. యుద్ధధర్మమదియే. బ్రతికి విజయముసాధింపవలెను గాని అలవికానివేళ అధికుడనని శత్రువుపైకి వెళ్ళకూడదు. ఆమాటయే పార్థుడు కృష్ణునితో ననెను.

జీవన్ ప్రాప్నోతి పురుష స్సంఖ్యే జయపరాజయౌ
మృతస్య తు హృషీకేశ భంగ ఏవ కుతో జయః

మ.భా. కర్ణ - 64 అ.

శ్రీకృష్ణా! ఆభార్గవాస్త్రముయొక్క ఉగ్రస్థితిని చూడుము. దానిని పరిహరించుటకు ప్రత్యస్త్రము లేనేలేదు. ఆ కర్ణుడు అంతకునివలె మండిపడుచు నాకొరకు చూచుచు

నెట్లుండెనో చూడుము. నేనిప్పుడు కర్ణునకెదురయి ఆయస్త్ర మప్రతిహతమగుటవలన నిషిద్ధమయిన పలాయనము చేయుట నాకిష్టము లేదు. జీవించియున్ననాడు జయమో పరాజయమో కలుగవచ్చును, మరణించిన ఇంకేమున్నది అని పార్థుడే భీతిల్లినాడు.

ఈ విషయమే ఆంధ్రభారతమును చెప్పినది.

తే॥ పట్ట పగలింటి సూర్యుని పగిదిఁగర్ణుఁ
డుగ్రమూర్తి యై వెలుఁగుచునున్న వాడు
మన రథంబిప్డు మాధవ మరలనిమ్ము
బ్రతికి యుండిన శుభములు వడయవచ్చు

ఆ.భా - కర్ణ - 3అ. 18ప

కృష్ణార్జునులు ధర్మజుని క్షేమమరయుటకు ధర్మజుని శిబిరమునకేగినారు. పార్థుడు తన్ను హింసించిన కర్ణుని కాని పార్థుడు కర్ణునితో తలపడకయే వచ్చెనని తెలిసికొని రౌద్రమూర్తియైన ధర్మరాజు పార్థుని తూలనాడినాడు.

ధిక్ గాండీవం ధిక్చ తే బాహువర్యం
అసంఖ్యేయాన్ బాణగణాంశ్చ ధిక్తే
ధిక్తే కేతుం కేసరిణః సుతస్య
కృశానుదత్తం చ రథం చ ధిక్తే

-మహా. భా .సా. కర్ణ. పు. 170

గాండీవమును తీసిపారవైచినాడు. అర్జునుని బాహువీర్యమును ధిక్కరించినాడు. తనగాండీవమును మరెవ్వరికైన నిమ్మనినాడు. అట్టిమాటయెవరినోటివెంట వచ్చునో వాని శిరస్సును ఖండింతునని పార్థునివ్రతము. అది ఉపాంశువ్రతము, వెంటనే ధర్మజుని తలనరుకుటకు ఒరనుండి కత్తిని తీసినాడు పార్థుడు. శ్రీకృష్ణభగవానుడు కలిపించుకొని వారించినాడు. పెద్దలను నీవని సంబోధించి నిందించుచో వారిని చంపినట్లే యని ధర్మశాస్త్రము. అట్లే ధర్మరాజు జూదమాడుట మున్నగు దోషములను పేర్కొని నిందించినాడు. మరి పెద్దలను దూషించిన దోషమునకు పార్థునికి శిక్షయేమి? అతడు చావనుద్యమించినాడు. ఆదోషపరిహారమిది. ఆత్మస్తుతి చేసికొనుము.

చావునకదిసమానమగును. అట్లే అర్జునుడు ఆత్మస్తుతిచేసికొని పాపపరిహారము చేసికొన్నాడు. దీనితో నీ సమస్య పరిష్కారమయినది.

పిమ్మట కృష్ణార్జునులు మరల రణరంగమునకు బోయిరి. కర్ణుడు పార్థునిపై ఆగ్నేయాస్త్రమును ప్రయోగించినాడు. పార్థుడు వారుణాస్త్రముచే దానిని వమ్ము చేసెను. అనేకములైన తీవ్రశరములచే కృష్ణార్జునులను కర్ణుడు నొప్పించుచునే యుండెను. కాని తన ఆగ్నేయాస్త్రముచే పార్థుని సంహరించుట అసంభవమని తలపోసిన కర్ణుడు తానెన్ని నాళ్ళనుండియో భద్రపరచి యారాధించుచున్న సర్పముఖాస్త్రమును ప్రయోగింప సమకట్టినాడు. కర్ణుడు నాగాస్త్రమును గురిచూచి పార్థునిపైకెక్కు పెట్టగా శల్యుడు -

"న కర్ణ గ్రీవామిషురేష లప్స్యతే సమీక్ష్య సంధత్స్వ శిరం శిరోఘ్నం"

కర్ణా! ఈ బాణము కంఠమును జేరదు. బాగుగా గురిచూచి శిరస్సును ఖండించునట్లు గురిచూడుమని చెప్పెను. అప్పుడు కర్ణుడు క్రోధముచే మండిపడుచూ-

"న సంధత్తే ద్విశ్శరం శల్య కర్ణో న మా దృశా జిహ్మయుద్ధా భవంతి"

కర్ణుడొక బాణమును రెండుమారులు గురిచూడడు. మాబోంట్లు కపటయుద్ధమును చేయమని బాణమును ప్రయోగించెను. అది మంటలు గ్రక్కుచూ పార్థుని వైపు వచ్చుట కృష్ణభగవానుడుచూచి గురితప్పించదలచి లీలగాతన పాదముచే రథమును నొక్కి భూమిలో కొంతదిగిపోవునట్లు చేయగా అపుడశ్వములు నేలకు వ్రాలి మోకాళ్ళపై నేలకానుకొన్నవి. అంత కర్ణుని నాగాస్త్రము గురితప్పి పార్థుని కిరీటము మాత్రము నేలపడగొట్టినది. శల్యుడు చెప్పినను కర్ణుడు తన సహజమైన అహంకారముచే గురిని సరిచేసికొనలేదు. నాగాస్త్రము వ్యర్థమయినది. ఆ నాగాస్త్రము నాశ్రయించి యున్న నాగము కర్ణునియొద్దకు వచ్చి 'సరిగా చూడక నన్ను ప్రయోగించినావు కనుక అర్జునుని శిరస్సు ఖండించలేక పోయితిని. ఈ సారి బాగుగా చూచి ప్రయోగించుము. శత్రువును తప్పక సంహరింతు' ననెను. కర్ణునకు ఈ నాగము తన నాగాస్త్రమునాశ్రయించి యున్న సంగతి తెలియదు. ఈ నాగము యొక్క వృత్తాంతమును విని "ఈ కర్ణుడు పరులబలము నాశ్రయించి జయమును పొందగోరడు. వందమంది అర్జునులను చంపునట్లైనను కర్ణుడు బాణమును రెండుమారులు సంధింపడని అథఃకరించెను. ఆ నాగము తానే స్వయముగా బాణమై

పార్థునిమీదికి పోగా పార్థుడు దానిని సంహరించెను. ఈ విధముగా శల్యునియందలి దురభిప్రాయముచేతను స్వాతిశయమును దురభిమానము కారణముగా కర్ణుని నాగాస్త్రము వ్యర్థమయ్యెను.

పరశురాముని శాపఫలితముగా భార్గవాస్త్రము (అదియే బ్రహ్మాస్త్రము) ఇప్పట్లున అక్కరకు రాకపోయెను. పరశురాముని శాపస్వరూపమిది.

"యస్మా న్మిథ్యోపచరితో హ్యస్త్రలోభా దిహ త్వయా
తస్మా దేవన్న తే మూఢ బ్రహ్మాస్త్రం ప్రతిభాస్యతి
అన్యత్ర వధకాలా త్తే సదృశే న సమీయుష:"

-మహా. భా .తత్త్వ పు. 1227

అస్త్రలోభమున నీవునన్ను మోసపుచ్చినావు కనుక నీవు శూరునితో తలపడి యద్ధముచేయుచు వధింపబడునపుడు నీకీ బ్రహ్మాస్త్రము స్ఫురింపకుండు గాక. అబ్రాహ్మణుని యందు బ్రహ్మాస్త్రము మరణావధి నిలువదు. అని పరశురాముడు శపించెను. తత్ఫలితముగా అర్జునుడు తన్ను వధింపనుద్యుక్తు డై యున్నప్పుడు కర్ణునకు బ్రహ్మాస్త్రము స్ఫురింపలేదు.

రథచక్రమునెత్తుకొనుచు పరధ్యానములో నున్న కర్ణుని కొట్టుట అర్జునునకు తగునా యని ప్రశ్న. పార్థుడన్యాయముగా కర్ణుని వధించెనని ఒక అభియోగము. కాని ఇది వాస్తవవిరుద్ధము. కర్ణుడు ప్రయోగించిన నాగాస్త్రము వ్యర్థమైపోగా రథచక్రము భూమిలోక్రుంగినను కర్ణుడు మహాపట్టుదలతో యుద్ధము చేయుచుపార్థుని గాండీవము యొక్కత్రాటిని పదునొకండు సార్లు ఛేదించెను. పార్థుడు దానిని వెంటవెంటనే సరిచేసికొని విరామములేకుండ యుద్ధము చేయుచుండుటచే కర్ణుడు దానిని గుర్తింపలేదు.

"తత: కర్ణ: శితై ర్బాణై ర్జ్యాం చిచ్ఛేద సుతేజనై:
ద్వితీయాం చ తృతీయాం చ చతుర్థీం పంచమీం తథా
షష్ఠీ మథాస్య చిచ్ఛేద సప్తమీం చ త థాష్టమీం
నవమీం దశమిం చాస్య తథై వైకాదశీం వృష:
జ్యాశతం శతసంధాన: స కర్ణో నావబుధ్యతే

తతో జ్యాం వినిధాయాన్యా మభిమంత్ర్య చ పాండవః
శరైరవా కిరత్కర్ణం దీప్యమానై రివాహిభిః
తస్య జ్యాఛేదనం కర్ణో జ్యావధానం చ సంయుగే
నాన్వబుధ్యత శీఘ్రత్వాత్ తదద్భుతమివాఽభవత్"

మ.భా. కర్ణ 91అధ్యా - 103 నుండి 107 శ్లో

కర్ణుడు రథమునుండి దిగి భుజముతో చక్రము పైకెత్తుటకు ప్రయత్నించెను.

తతోఽవతీర్య రాధేయో రథాదాశు సముద్యతః
చక్రం భుజాభ్యామాలంబ్య సముక్షేప్తు మియేష సః
సప్తద్వీపా వసుమతీ సశైలవనకాననా
గీర్ణచక్రా సముక్షిప్తా కర్ణేన చతురంగులం
గ్రస్తచక్రస్తు రాధేయః క్రోధాదశ్రూణ్యవర్తయత్

మ.భా. కర్ణ. 91అ. 112 - 113 శ్లో

దిగబడిన చక్రముతో సహా సప్తద్వీపములు, పర్వతారణ్యములతో సహా భూమి నాలుగు అంగుళములు పైకి లేచెను. కాని చక్రము ఊడిరాలేదు. కర్ణుడు కండ్లనీరు కార్చెను.

ఆంధ్రభారతమును --

"అట్లు ప్రస్ఫీత కేతుపాతనం బాచరించిన దానంగనలి కర్ణుండతి నిశితక్రూరనారాచ జాలంబులు కృష్ణార్జునుల మీదం గురిసి వెగడు పఱచి యురదంబుపిఱింది కొమ్ముక్రిందికి మూఁపు సానిపి లావున నెత్తిన రథచక్రంబు విడువక భూమి గలపర్వత కానన సహితసముద్రసహితం బాఱంగుళములు లెగసె ---------"

ఆం. భా. కర్ణ - 3అ - 357

వ్యాసభారతము కర్ణుడు రథచక్రమునెత్తు నపుడు చక్రమును వదలకయే భూమి నాలుగంగుళములు పైకి లేచినదని చెప్పుచుండ యేలకో ఆంధ్రభారతము ఆరంగుళములు పైకి లేచినదని చెప్పినది.

కర్ణుడు క్రుంగిపోయిన రథము నెత్తుటకు ప్రయత్నించుచునే యుద్ధమును గూడ చేయుచు తన వాడియైన శరములచే కృష్ణార్జునులను మిక్కిలి బాధించుచుండెను. పైగా అర్జునుని చంపుటకు కర్ణుడు అగ్నివలె మండుచున్న మహాఘోరమైన బాణమును ప్రయోగింపగా నది పిడుగు వలె వెళ్ళి పార్థుని భుజాంతరమును ఛేదించెను. ఆ దెబ్బలకు కంపించిపోయిన పార్థునిచేతినుండి గాండీవము జారి పడినది. ఆ అవకాశమును చూచుకొని కర్ణుడు రథచక్రమునెత్తుకొనుటకు రథమునుండి దిగి భుజములతో పట్టియెత్తెను. కాని ఫలితము లేదు.

కర్ణుడు పార్థునితో నిట్లనెను -

**భో!భో! పార్థ! మహేష్వాస ముహూర్తం పరిపాలయ**
**యావ చ్చక్ర మిదం గ్రస్త ముద్ధరామి మహీతలాత్**

-మహా. భా .తత్త్వ పు. 1433

పార్థ! భూమియందుగ్రుంగిన నారథచక్రము పైకి లాగువరకు నీ బాణప్రయోగము నిలుపుము. నీవు యుద్ధధర్మమెరిగినవాడవు. సాధువ్రతులగు శూరులలో చేరిన నీవు యుద్ధధర్మమును విడనాడకుము. నిరాయుధుడు, కవచభ్రష్టుడు, ఇత్యాదులపై శస్త్రములను ప్రయోగింపరాదు. నేను చక్రమునెత్తునంతవరకు రథమందున్న నీవు భూమిపైనున్నట్టియు వికలుడనైనట్టియు నన్ను ప్రహరించుట ధర్మముకాదని వచించెను. కర్ణునకు కృష్ణుడే సమాధానమును చెప్పెను. దుష్టులకు తమకు ఆపదకలిగినపుడే ధర్మము జ్ఞాపకమునకు వచ్చును. అన్యాయముగా పరులను హింసించునప్పుడు ధర్మము స్మృతి యందుండదు. పాండవులకు దుష్టచతుష్టయము గావించిన ఆపదలు చెప్పి ఆ సమయమున కర్ణునియొక్క ధర్మాధర్మ విచక్షణయేమైనదని శ్రీకృష్ణుడు వాడియైన మాటలతో కర్ణుని ఎత్తిపొడవగా కర్ణుడు సిగ్గుతో తలవంచుకొనెను. ఆసమయముననే పార్థుడు శ్రీకృష్ణభగవానుని ప్రేరణమున తీవ్రమయిన శస్త్రప్రయోగముచే కర్ణుని శిరస్సును ఖండించెను. కర్ణుని దివ్యతేజము సూర్యమండలములో ప్రవేశించెను.

విరథుని, కవచములేని వానిని పారిపోవుచున్నవానిని శరణువేడినవానిని వధింపరాదన్నది యుద్ధధర్మమే కాని ఇక్కడ కర్ణుని పరిస్థితి అట్టిది కాదు. ఒక ప్రక్క

తీవ్రముగ యుద్ధముచేయుచు అర్జునుని చంపబాణప్రయోగమును చేయుచు, అతని అల్లెత్రాటిని ఛేదించుచు ఇంతఘోరముగ యుద్ధముచేయుచున్న కర్ణుని విరథుడని పార్థుడు కొట్టుట మానవలెనా? విరథుడు నిరాయుధుడు అగువారిని చంపగూడదను మాటకర్థము వారు యుద్ధప్రయత్నమును మాని యూరకున్నప్పుడు కొట్ట కూడదని గాని, వారు ప్రత్యర్థిని చావకొట్టుచున్నప్పుడును ఊరకుండుమని కాదు.

కర్ణుడు భూమియందుక్రుంగిన రథచక్రము నెత్తుట సాధ్యమగునది కాదు. అది అమోఘమయిన బ్రాహ్మణశాపఫలితము. కర్ణుడు చక్రమునెత్తగా భూమి లేచినదిగాని చక్రము లేవలేదు. కాని కర్ణుడు చనిపోయినవెంటనే ఎవరూ ఎత్తకుండగనే చక్రము తనంతట తానే పైకి లేచివచ్చినది. బ్రాహ్మణశాపస్వరూపమిది.

"యేన విస్పర్థసే నిత్యం యదర్థం ఘటసేఽనిశమ్
యుధ్యత స్తేన తే పాపభూమిశ్చక్రం గ్రసిష్యతి
తతశ్చక్రే మహీగ్రస్తే మూర్ధానం తే విచేతస:
పాతయిష్యతి విక్రమ్య శత్రుర్గచ్ఛ నరాధమ
యథేయం గౌర్హతా మూఢ ప్రమత్తేన త్వయా మమ
ప్రమత్తస్య తథాఽరాతి శ్శిరస్తే పాతయిష్యతి.

మ.భా. శాంతి 2అ. 24-25-26 శ్లో

"ఓ కర్ణుడా! నీకెవ్వని యందు నిత్యస్పర్థకలదో ఎవ్వని జయించుటకై సతతమునీవు బాణప్రయోగము చేయుచున్నావో అతనితో యుద్ధము చేయునపుడు నీరథచక్రము భూమిని కరచిపట్టును. అప్పుడు నీవు ప్రమత్తుడవై యుండ నీశత్రువు నీశిరస్సును ఛేదించును". ఈ శాపము సార్థకము కావలయును. రథచక్రము భూతలగ్రస్త మయినపుడే మరణమని నిర్దేశింప బడుటవలన కాలమతి క్రమింపకుండ కర్ణుని సంహరించవలెను. రథచక్రమెత్తుట కర్ణునకశక్యము. మరణమాసన్నమయినది. ఇట్టి పరిస్థితిని సర్వజ్ఞుడగు భగవంతుడాలోచించియే శాపసార్థక్యమునకై ప్రమత్తుడై యున్నప్పుడే సమయముదాటకుండ కర్ణుని సంహరించుటకు పార్థుని ప్రోత్సహించెను.

చివరగా కర్ణుని పరాజయమునకు నీలకంఠులవారు చెప్పిన శాస్త్రీయమైన సమాధానమిది.

"సర్వేషాం హి వర్ణానాం ద్వివిధం జన్మయోనిజం,
సంసారజం చ। తత్ర య ఏవ యోనిః స ఏవ సంస్కర్తా
చేత్స ఏకజో న ప్రకృతిత శ్చ్యవతే, కర్ణస్తు
దైవక్షత్రజోఽపి అక్షత్రియేణ సూతేన సంస్కృత ఇతి
ద్విజాతత్వాత్ క్షత్రియత్వేన ప్రహర్తుం కుశలోఽపి
సూతత్వేన పరకీయప్రహారం సోఢు మశక్త ఇతి
యుద్ధాత్పలాయతే ----"

-మహా. తత్త్వ. పు. 1307

పుట్టుకను బట్టియు, సంస్కారమును బట్టియు జన్మరెండు విధములు, ఇది చాతుర్వర్ణ్యసాధారణము. దేవతలలో సూర్యుడు క్షత్రియుడు, కనుక కుంతీ సూర్యులకు జన్మించిన కర్ణుడు క్షత్రియుడగుటచే పరులను బాగుగా ప్రహరింపగలిగియు, అక్షత్రియుడైన సూతునిచేత సూతసంస్కారములు చేయబడి యుండుట చేత శత్రుప్రహారములకు తట్టుకొని నిలువలేక పలాయితుడగు చుండును. సంస్కారలోపము చే కర్ణునికి ప్రాప్తించిన దుస్థితి యిది.

ఇట్టి జన్మసంస్కారసాంకర్యము కర్ణునియందే కాక విశ్వామిత్రుని యందును సంభవించినది. విశ్వామిత్రుడు క్షత్రియుడగు గాధియొక్క పుత్రుడు ఆగాధిభార్య ఋషీకమహర్షిచే తపశ్శ్రద్ధాది బ్రాహ్మణలక్షణములు కలుగునట్లు మంత్రసంస్కృతము చేసియుంచబడిన హవిస్సును దైవికముగా భుజించుటవలన ఆమె యందు జన్మించిన విశ్వామిత్రుడు జన్మమూలకమైన క్షాత్రము, మంత్రసంస్కారమూలకమయిన తపోనిష్ఠాదికము కలిగి యుండెను. ఈ విషయమే నీలకంఠీయ శ్లోకముచే ప్రతిపాదింపబడినది.

"కౌశికే క్రౌర్యతపసే రాధేయే శౌర్యభీరుతే
ఖలే చ వాచి మాధుర్యం బీజసంస్కారసంకరాత్"

మహాభారత తత్త్వ కథనము .పు. 1310

# 18. భీముడు ధుర్యోధనుని తొడలు విరుగగొట్టుట

ఇంతవరకు కర్ణుడు శల్యుడు కూడ మరణించినారు. దుర్యోధనుని బలగమంతయు నాశనమయినది. జయింతు మనునాశ నశించినది. ప్రాణములను గాపాడుకొనుటకై జలస్తంభనవిద్యనేర్చిన దుర్యోధనుడు ద్వైపాయనహ్రదమునదాగినాడు. ఈ విషయమెట్లో పాండవులకు తెలిసినది. వారు శ్రీ కృష్ణసమేతముగా ద్వైపాయనహ్రదమునొద్దకు చేరిరి. ధర్మజాలు పోటుమాటలతో ధుర్యోధనునికి పౌరుషము తెప్పించి బయటకు రప్పించెను. కొంత వాగ్వాదము జరిగినమీదట భీమదుర్యోధనులు గదాయుద్ధములో (అదియే ద్వంద్వయుద్ధము)కురుక్షేత్రమున జయాపజయములను తేల్చుకొనుటకు నిర్ణయించిరి. యాత్రలకై యేగిన బలరాముడు భీమదుర్యోధనుల ద్వంద్వయుద్ధము జూడవచ్చెను. గదా యుద్ధము భీకరముగా జరుగుచున్నది. బలరామ శ్రీకృష్ణులును, ధర్మరాజా నతని సోదరులును యుద్ధమును తిలకించుచున్నారు. యుద్ధము భీకరరూపము దాల్చినది. భీమదుర్యోధనులిరువురు ఒకరినిమించి యొకరు గదాఘాతములచే నొకరినొకరు నొప్పించుకొనుచున్నారు, ఆసమయమున అర్జునుడు శ్రీకృష్ణుని వీరిద్దరిలో జయమెవరికని ప్రశ్నించినాడు. శ్రీకృష్ణభగవానులు సత్యస్వరూపులేకాదు. సత్యవాదికూడ. అన్యాయముగ యుద్ధమును చేయుచో భీమునకును, న్యాయయుద్ధమున దుర్యోధనునకును జయమని సమాధానమిచ్చినాడు. ధర్మము అతి సూక్ష్మము. భీముడు దుర్యోధనునితొడలు విరుగగొట్టెదనని ప్రతిన చేసినాడు. యుద్ధమువచ్చుచో ఆపని చేసెదనినాడు. ఆ యుద్ధము వచ్చినది. ఆ ప్రతిజ్ఞను ఇక్కడ వాడుకొనవచ్చును. సామాన్యదృక్పథమున నది అన్యాయమే యయ్యువిశేష శాస్త్రముచే నిది ధర్మమే. గదా యుద్ధమున నాభికిక్రింది భాగమున కొట్టకూడదనుట సామాన్య ధర్మము.

"మా యావినం తు రాజానం మాయయైవని కృత్తయేత్
సుయోధనః కృతీ వీర ఏకాయన గతస్తథా

పునరావర్తమానానాం భగ్నానాం జీవితైషిణాం
భేతవ్య మరిశేషాణాం ఏకాయనగతాహి తే"

మహా. ఉ. శల్య పు - 186

అని శుక్రనీతి అని భగవానులు చెప్పిరి. ఇది సర్వరాజనీతిశాస్త్రసారము. మాయావియైన సుయోధనుని మాయచేతనే చంపవలెను. అతడే కాయనగతుడు అనగా ఏవిధముగనైనను శత్రువులనిర్జించిరాజభోగములననుభవించవలెనను ఒకేఒక మార్గము ననుసరించినవాడు.

సభాపర్వసందర్భమున ద్యూతప్రక్రియచే పాండవైశ్వర్యము నపహరింపదలచి, తండ్రియధర్మమని చెప్పగా దుర్యోధనుడు రాజధర్మమునిట్లు చెప్పెను.

"లోకవృత్తా ద్రాజవృత్తమన్యదాహ బృహస్పతిః
తస్మాద్రాజ్ఞాఽప్రమత్తేవ స్వార్థశ్చిన్త్యస్స దైవ హి
క్షత్రియస్య మహారాజజయే వృత్తిస్సమాహితా
సవైధర్మ స్వధర్మో వాస్య వృత్తౌ కా పరీక్షణా"

-మహా. భా .తత్త్వ. పు. 817

తండ్రీ! లోకవ్యవహారములేదు. రాజ్యవ్యవహారములేదు. అని బృహస్పతి చెప్పెను. కనుక రాజు అప్రమత్తుడై స్వార్థచింతన నదా చేయుచుండవలెను. క్షత్రియునకుజయించుటేవృత్తి. ధర్మము కానిమ్ము అధర్మము కానిమ్ము అని దుర్యోధనుడు గాఢముగా నమ్మిన రాజధర్మము. అట్టి యెడ గదాయుద్ధనియమములకు విరుద్ధముగా భీముడు దుర్యోధనుని తొడలు విరుగగొట్టుట ఎంతమాత్రము దోషముకాదు.

"అగ్నిదో గరదశ్చైవ శస్త్రపాణధనాపహః
క్షేత్రదారాపహర్తా చ షడేతే హ్యాతతాయినః
ఆతతాయినమాయాన్తం హన్యాదేవావిచారయన్
నాతతాయివధే దోషః హంతుర్భవతి కశ్చన"

-మను . 8- 350,351

నిప్పుపెట్టువాడు, విషముపెట్టువాడు, ఆయుధపాణి, ధనాపహారి, క్షేత్రమును భార్యను హరించినవాడు, ఈ ఆరుగురు ఆతతాయులు తనపైకివచ్చు ఆతతాయినివిచారించకుండగనే చంపవలెను. ఆతతాయిని చంపుటవలన చంపిన వానికిదోషములేదు. దుర్యోధనుడు లక్కయింటికి నిప్పుపెట్టెను, భీమునకు విషముపెట్టెను, పాండవుల ధనమునేమి సామ్రాజ్యభాగమునే అపహరించెను, మహాసాధ్వియైన ద్రౌపదిని నిండుసభలో పరాభవించెను. కనుక దుర్యోధనుడు సర్వవిధముల ఆతతాయి, వధార్హుడు, కావున దుర్యోధనుని వధించినదోషము భీమునకు లేనే లేదు కదా.

ఇంతకును గదాయుద్ధములో నేమి జరిగెను? తన తొడలు విరుగబొడిచి చంపెదనని భీముడానాడు ప్రతిజ్ఞచేసినాడు. మైత్రేయ మహర్షి శాపముగూడ నట్లే యున్నది. తన తల్లియైన గాంధారివచనము కూడ నీలాగుననే యున్నది. కనుక తన తొడ యేదో భీమునకు తోచకుండ చేయుటకై పైకి, క్రిందికి ప్రక్కలకు దుర్యోధనుడు పల్టీలు గొట్టుచు భీమునకు చిక్కకుండ పైకెగిరిపోవుచున్నాడు. గదాయుద్ధమయినచో తొడమీదకొట్ట కూడదుకనుక గదాయుద్ధమునే కోరినాడు. భీమదుర్యోధనులు చిత్రసంచారములు చేయుచుండగా దుర్యోధనుడు కొట్టినదెబ్బకు నెత్తురు ప్రవహించి భీముడు సొమ్మసిల్లి నేలపైబడెను. దుర్యోధనుడు మరియొకదెబ్బవేసినబో భీముడు చచ్చెడివాడు. కాని దుర్యోధనుడది గమనించలేదు. భీముడు కొట్టునేమో యని అతనికి చిక్కకుండ పల్టీలుగొట్టుచు పైకెగిరిపోయెను. ఇంతలో భీముడు తెప్పరిల్లెను. ఎదుట దుర్యోధనుడు కన్పించకపోగా భీముడు కంపమొంది ఏమి చేయుటకును తోచక గదాయుద్ధధర్మమును బట్టి నాభిదిగువ కొట్టకూడదు, ఇతడు క్రిందికి మీదికి ఎగురుచున్నాడు, ఇప్పుడు నాభికి దిగువ, ఎగువ గుర్తించుటెట్లని ఆలోచించుచుండెను. భీముడు కొట్టుటకురాగా చిక్కకుండ దుర్యోధనుడు మరలపైకిగంతులు వేయుచుండగా పైది క్రింద, క్రిదదిపైన అగును కనుక ఆ అవకాశమును చూచుకొని భీముడు గదా ప్రహారము గావింప దుర్యోధనుడు తొడలు విరిగి క్రిందపడెను. పొగ కండ్లకు గమ్మి కనపడకపోయినను హోమము చేయువానిహవిస్సు అగ్నిలోనే పడినట్లు భీముడు కొట్టిన దెబ్బ సరిగా నతని తొడలపైననే తగిలెను. అవకాశముదొరుకక ఒకవేళభీముడు మానినను మైత్రేయమహర్షి శాపమెట్లు తప్పును? భీముని వంచించుటకు పల్టీలు కొట్టుట నేర్చినాడే కాని మైత్రేయమహర్షి శాపమునెట్లు తప్పించుకొనగలడు?.

ఆంధ్రభారతమున తిక్కన సోమయాజియు -

క॥ ఆలోనం గురుధరణీ
పాలుడరిఁ వ్రేయుటయును బవనసుతునిమై
సోలెనదిగానఁడాపతి
కేళీవిభ్రమము దోఁపఁగ్రేళ్ళుఱికె నృపా!
ఉఱికినఁదేఁటిపై కుఱికియుగ్రత భీముడు వ్రేయనవ్వి భుం
డుఱికి మహాద్భుతస్ఫురణ నూర్ధ్వపరిభ్రమణంబుసేసినం
దెఱపి యతండు గాంచి సముదీర్ణరయంబున వైచెఁబెన్దొడల్
విరిగి నగాగ్ర ముద్భటపవిప్రహతింబడు చాడ్పునంబడెన్"

ఆం.భా - శల్య 2అ -275-276.

అని వర్ణించెను. భీముడు దుర్యోధనుని తొడలు విరుగగొట్టగానే బలరాముడు నాభిక్రిందకొట్టుట గదాయుద్ధనియమవిరుద్ధమని మండిపడుచు భీమునపై కురికెను. శ్రీ కృష్ణుడు బలరామునివారించి యిట్లు చెప్పెను.

'ప్రతిజ్ఞాపాలనం ధర్మః క్షత్రియస్యేహ వేద్మ్యహం'
సుయోధనస్య గదయా భంక్తా స్మ్యూరూమహాహవే
ఇతిపూర్వం ప్రతిజ్ఞాతం భీమేనహి సభాతలే
మైత్రేయేణాభిశప్తశ్చ పూర్వమేవ మహర్షి ణా
ఊరూ తే భేత్స్యతే భీమో గద యేతి పరంతప
అతో దోషం న పశ్యామి మాక్రుధ్యస్య ప్రలంబహన్'

-మహా. భా .తత్త్వ. పు. 1448పు

క్షత్రియులకు ప్రతిజ్ఞాపాలనము ధర్మము. ఈ భీమసేనుడు ద్యూతసభలో దుర్యోధనుడు చేసిన దుర్ణయమునకు శాస్తిగా నీతొడలు భగ్నము చేయుదునని ప్రతిజ్ఞ చేసెను. ఈ దుర్యోధనుడు మైత్రేయమహర్షియొద్ద చూపిన మూర్ఖత్వమునకు నీ తొడలు భీముడు గదతో విరుగ బొడుచునని పూర్వమే శపించియుండెను. కాబట్టి ఇది అధర్మముకాదు అని శ్రీకృష్ణుడు బలరామునకు నచ్చజెప్పెను. నీలకంఠీయములో

కూడ "ప్రతిజ్ఞాపాలన రూపత్వాత్=అప్యధోనాభి ప్రహార: నాధర్మ: ఇత్యర్థ:" అని వ్యాఖ్యానించిరి. ప్రతిజ్ఞాపాలన రూపమగుటచే నాభికిక్రిందకొట్టుట అధర్మముకాదు. బలరాముని ఆక్షేపము సామాన్య ధర్మమును బట్టి శ్రీకృష్ణుని సమాధానము విశేషధర్మమును బట్టి. ప్రతిజ్ఞలేక సహజ మయిన యుద్ధమయినచో నాభికి దిగువ కొట్టకూడదు. ఇది సామాన్య ధర్మము. ఇక్కడ ప్రతిజ్ఞ యున్నదికనుక సామాన్య ధర్మమును త్రోసివైచి ప్రతిజ్ఞను పాలించుటే విశేషధర్మము.

ఇంకొక ప్రశ్న దుర్యోధనుని తలను తన్నుట భీమునకు తగునాయని భీముని ప్రతిజ్ఞలోనె దుర్యోధనుని తలను తన్నుటయున్నది.

సుయోధనమిమం పాపం హంతాస్మి గదయా యుధి
శిర: పాదేనచాఽస్యాహమధిష్ఠాస్యామి భూతలే'

-మహా. భా .వి. పు. 164

పాపియైన దుర్యోధనుని గదతో చంపి తలను పాదములతో తన్నెదని ప్రతిజ్ఞ చేసెను.

ఆంధ్రభారతము సభాపర్వమున నన్నయగారు ఈ విధమున చెప్పెను :

ఉ॥ ధారుణి రాజ్యసంపదమందంబునఁగోమలి గృష్ణఁజూచి రం
భోరునిజోరుదేశమున నుండఁగబిల్చిన యిద్దురాత్ముదు
ర్వారమదీయ బాహుపరివర్తిత చండ గదాభిఘాత భ
గ్నోరుత రోరుఁజేయుదు సుయోధను నుగ్రరణాంతరంబునన్'

ఆ.భా - సభా- 2అ. 249

ఈ పద్యమున భీముని పూర్తి ప్రతిజ్ఞ అనువదింపబడలేదు. తొడలు విరుగగొట్టుట మాత్రమే చెప్పబడ్డదికాని-

'శిర: పాదేన చాఽ స్యాహమధిష్ఠాస్యామి భూతలే' అనుశ్లోక పాదము అనువదింప బడలేదు. తెలుగు భారతమును మాత్రమే చదివినవారు భీముడు దుర్యోధనుని తలపై తన్నుట అక్రమమని భ్రమింతురుగాని భీమసేనుని ప్రతిజ్ఞలో భాగమేనను విషయము నెరుగవలెను.

అయితే శత్రువు తలను తనపాదములతో తన్నుట శాస్త్రసమ్మతమా అనుసంశయము కలుగును. భీముడు దుర్యోధనుని తలపై తన్నుటకు హేతువు దుష్టశిక్షణ ప్రకారములలో నది యొకటి నీతిశాస్త్రోక్తవిషయమై యుండుటే యని నీలకంఠీయములో విశదపరుచబడినది.

'వామపాణి కచోత్పీడా భూమౌ నిష్పేషణం బలాత్
మూర్ధ్ని పాదప్రహరణం జానునోదరమర్దనమ్
ములూరాకారయా ముష్ట్యా కపోలే దృఢ తాడనమ్
కఫోణిపాతోఽప్యస కృత్సర్వత స్తలతాడనమ్
తాపేన యుద్ధే భ్రమణం మారణం స్మృతమష్టధా
చతుర్భిః క్షత్రియం హన్యాత్పంచభిః క్షత్రియాధమమ్'

-మహా. భా .సా. శల్య. పు. 238

ఎడమ చేతితో జుట్టు పట్టుకొనుట, బలాత్కారముగా భూమిమీద పడవైచి మర్దించుట, శిరస్సును కాలితో తన్నుట, మోచేతులతో ఉదరమును మర్దించుట, బిగించిన పిడికిలితో కణతల యందు గట్టిగా కొట్టుట యీ నాల్గు ఉపాయముల చేతను క్షత్రియుని చంపవచ్చును. క్షత్రియాధముని అయిదు ఉపాయములచే చంపవచ్చునని చెప్పబడ్డది. ఇట్లు శాస్త్రోక్తమైన దుష్టశిక్షణప్రకారము నవలంబించుటయు, భీముడు దుర్యోధనుని శిరస్సును పాదములతో తన్నుట అధర్మముకాదు క్రూరకృత్యమును గాదని గ్రహించవలెను.



# 19. కామ్యకవనమునందున ధర్మజునొద్దకు శిష్యసమేతుడై దుర్వాస మహాముని ఆతిథ్యము కొరకు వచ్చుట

వ్యాసభారతమునందలి కథాసందర్భమిది.

దుర్వాసమహర్షి తన శిష్యగణముతో దుర్యోధనుని ఆతిథ్యమును స్వీకరించి వెళ్ళబోవుచుండగా దుర్యోధనుడు దుర్వాసమహర్షిని ఒక వరమును కోరెను.

"గమ్యమానే తు  తం రాజా వరమేన మయాచత
వనే వసతి ధర్మాత్మా మమ భ్రాతా యుధిష్ఠిర:
తదా త్వం తత్ర గచ్ఛేథా యద్యనుగ్రాహ్యతా మయి॥

దుర్వాసా అపి చాగత్య కామ్యకే పాండవాన్ప్రతి
భుక్త్వా చావస్థితాం కృష్ణాం జ్ఞాత్వా శిష్యైర్యుతో ముని:
ఆతిథ్యం కుర్వతి గత స్స్నాతుం శిష్యగణైర్యుత:॥

ద్రౌపదీ చింతయామాస కృష్ణం విష్ణుం జగత్ప్రభుం
తత్రా జగామ త్వరితో హ్య చింత్యగతి రీశ్వర:॥

తతో నిర్బంధ: స్థాలీ మానాయ్య స యదూద్వహ:
స్థాల్యా: కంఠేఽథ సంలగ్నం శాకాన్నం వీక్ష్య కేశవ:
విశ్వాత్మా ప్రీయతాం దేవస్తుష్టశ్చాస్త్వితి యజ్ఞభుక్॥

ఆ కంఠతృప్తశ్శిష్యైణ సహితో మునిరాట్స్వయం
విజ్ఞాయ సర్వ మశప ద్దుర్యోధన మధార్మికం॥

మిత్రభ్రాతృసపుత్రస్త్వం సమరే వినశిష్యసి
ఇతి శప్త్వా గత శ్శిష్యై: కృష్ణోఽపి ద్వారకాం యయౌ॥

-మహా. భా .సా. అరణ్య పు. 86-88

"ఓ మహానుభావా! నాసోదరుడును, ధర్మాత్ముడును నగు ధర్మరాజు వనమునందున్నాడు. నాయందు మీకనుగ్రహము కలిగిన మీరు ధర్మరాజు నొద్దకు వెళ్ళి వారియాతిథ్యమును గూడ స్వీకరింపగోరు చున్నాను" అనెను. దుర్వాసుడును ద్రౌపదికూడ భుజించియుండుటను తెలిసికొని పదివేలమంది శిష్యులతో గూడ కామ్యకవనమందున్న పాండవుల యొద్దకు వెళ్ళెను. ఆతిథ్యము నీయుడని "ధర్మరాజుతో చెప్పి శిష్యగణముతో గూడి స్నానార్థము నదికి వెళ్ళెను. అంతట ద్రౌపది చేయునది లేక జగత్ప్రభువగు శ్రీకృష్ణుని ధ్యానించెను. అంతట శ్రీకృష్ణుడు త్వరిత గతిని అక్కడకు వచ్చి, తనకాకలి యగుచున్నది ఏమైన పెట్టుమని ద్రౌపదిని కోరెను. ద్రౌపది తానును భుజించితిని, ఇప్పుడేమియులేదు, సూర్యభగవానునిచే ననుగ్రహింపబడిన అక్షయపాత్రయందు మరునాటి వరకు ఏ పదార్థములు ఉత్పన్నముకావని చెప్పెను. అంతట కృష్ణుడు బలవంతముగా నక్షయపాత్రను తెప్పించి ఆ పాత్రకంఠమున నంటియున్న కూరాకుముక్కను "విశ్వాత్మకుడు సంతోషించుగాక, యజ్ఞభుక్కు సంతోషించుగాక" అని పలుకుచు భుజించెను. అచ్చట నదీస్నానమునకేగిన దూర్వాసుడును ఆయన శిష్యులును గూడ కంఠమువరకు తృప్తులై దుర్యోధనుని కపటమును తెలిసికొని "ఓ దుర్యోధనా! నీవు బంధుసోదరపుత్రమిత్రులతో సమరమున నశించగలవని" శపించివెళ్ళిపోయెను. శ్రీకృష్ణుడు ద్వారకానగరమునకు వెళ్ళిపోయెను. ఇది ఇచ్చట కథా సందర్భగ్రంథవిషయము.

దుర్యోధనుడు దుర్వాసమహర్షిని కోరిన వరమే కాపట్యముతో గూడియున్నది.

**శిష్యైస్సహ మను బ్రహ్మన్ యథాజాతోఽతిథిర్భవాన్**
**అస్కత్కులే మహారాజో జ్యేష్ఠ శ్శ్రేష్ఠో యుధిష్ఠిర:**
**వనే వసతి ధర్మాత్మా భ్రాతృభి: పరివారిత:**
**గుణవాన్ శీలసంపన్న స్తస్య త్వ్ఁమతిథిర్భవ**
**యదా చ రాజపుత్రీ సా సుకుమారీ యశస్వినీ**
**భోజయిత్వా ద్విజాన్ సర్వాన్ పతీంశ్చ వరవర్ణినీ**
**విశ్రాన్తా చ స్వయం భుక్త్వా సుఖాసీనా భవేద్యదా**
**తదా త్వం తత్ర గచ్ఛేథా యద్యనుగ్రాహ్యతా మయి.**

-మహా. భా .తత్త్వ. పు. 1286

అనగా మా వంశమునందు మహారాజు శ్రేష్ఠుడు, జ్యేష్ఠుడు నయిన యుధిష్ఠిరుడు గుణవంతుడును, ధర్మాత్ముడును, సుశీలుడునునయి వనమందు సోదరసహితుడై యున్నాడు. అట్టి యుధిష్ఠిరునకు గూడ శిష్యసమేతముగా నీవతిథివి కావలెను. ఆ అగుటలో కూడ సుకుమారియైన ద్రౌపది ద్విజులను పతులను భుజింపజేసి తాను భుజించి తాను విశ్రాంతి తీసికొనిన తరువాత నీవతిథివగుట మా కోరిక. దుర్యోధనుడు ధర్మరాజును గూర్చి -

"అస్మత్కులే మహారాజః, శ్రేష్ఠః, ధర్మాత్మా గుణవాన్, శీలసంపన్నః" అనివాడిన విశేషణములు గమనార్హములు. దూర్వాసమహర్షియు "తథా కరిష్యే త్వత్ప్రీత్యా"- అట్లే చేయుదునని చెప్పివెళ్ళిపోయెను. ఇచ్చట మన విమర్శకులు రెండు ఆక్షేపములను తెలిపిరి. ఒకటి యీగాథ అసంబద్ధముగానున్నదట. అనగా నమ్మశక్యము గాదట. ఇది జరుగనేలేదట. అభూతకల్పనయట. అందుచేతనే ఎఱ్ఱాప్రగడ తన భారతారణ్య పర్వశేషమున నీవృత్తాంతమును పేర్కొనలేదట. శంభుదాసుడీ వృత్తాంతమును పేర్కొనకపోవుట నిజమే. అదియసంబద్ధమనియే అనువదింపలేదని విమర్శకులవాదన. అట్లైనమూలభారతము నందలి లెక్కకు మిక్కిలియైన విషయములు, విశేషాంశములు అనువాదమునకు రాలేదు. అనువాదమున లేనంత మాత్రమున మూలగాథను అవాస్తవమనుటయవివేకము. శ్రీకృష్ణుడు ఆకలితీరి తృప్తుడైనంత మాత్రమున దూర్వాసమహర్షి ఆయన పదివేలమంది శిష్యులు ఆకలితీరి తృప్తులగుట పరిహాసపాత్రమని వీరి రెండవ ఆక్షేపణ.

ఈ వృత్తాంతము అభూతకల్పన కాదు వాస్తవముగా జరిగినదే. వ్యాసభగవానులు అసంబద్ధములను అభూతకల్పనలను ఏలవ్రాయును? వ్యాసభారతమునందలి విషయములన్నియు పరమప్రామాణికములు, శిరోధార్యములు. అవి అనువాదమున లేనంతమాత్రమున అప్రమాణికములు, అసంబద్ధములు ననుట పొసగదు.

ఈ దుర్వాసగాథ వనపర్వములో రెండవ అధ్యాయములో నున్నది. పర్వసంగ్రహములోకూడ "దుర్వాస సోఽవ్యాఖ్యాన మత్రైవ పరి కీర్తితమ్" అని చెప్పబడియే యున్నది. శ్రీమద్భాగవతమున-

"యోనో జుగోప వన మేత్య దురన్తకృచ్ఛ్రా
ద్దుర్వాససోఽరిరచితా దయుతాగ్రభుగ్యః ।

శాకాన్నశిష్ట ముపయుజ్య యత స్త్రిలోకీం
తృప్తా మమంస్త సలిలే వినిమగ్న సంఘః ॥"

శ్రీమద్భాగవతం - ప్రథమ స్కం - 15 అధ్యా

శ్రీధరీయమ్ -

శిష్యాణా మయుతస్యాగ్రే తత్పంక్తౌ భుక్త్యై యస్తస్మాద్దుర్వా
ససో హేతోః అరిణా దుర్యోధనేన రచితం యద్దురన్తం కృచ్ఛ్రం శాప
లక్షణం తస్మాత్సకాశాన్నోఽస్మాన్నవ మేత్య జుగోప. కిం కృత్వా.
శాక మేవాన్నం తస్మిన్నేవ పాత్రేఽవశిష్ట ముపయుజ్య జగ్ధ్వా. యత
ఉపయోగాత్ సలిలే వినిమగ్నో మునీనాం సంఘ స్త్రిలోకీం తృప్తా
మమం స్త ఏవంహి భారతే కథా --

"కదాచి ద్దుర్వాససో దుర్యోధనే నాతిథ్యం కృతం. తేనచ పరి
తుష్టేన వరం వృణీ ష్వేత్యుక్తే దుర్వాసస శ్శాపా త్పాండవా నశ్యే
యురితి మనసి నిధాయ దుర్యోధనే నోక్తం. యుధిష్ఠిరోఽస్మత్కుల
ముఖ్యః, అత స్తస్యాపి భవతైవ మేవ శిష్యాయుతసహితే నాఽతిథినా
భవితవ్యః కిన్తు ద్రౌపదీ యథా క్షుధా న నీదే త్తథా తస్యాం భుక్త
వత్యాం తద్గృహం గన్తవ్య మితి. తతశ్చ తథైవ దుర్వాసి ప్రాప్తే పర
మాదరేణ యుధిష్ఠిరేణ మాధ్యాహ్నికం కృత్వా ఆగమ్యతా మితి
విజ్ఞాపితో మునిసంఘోఽఘమర్షణాయ జలే నిమమజ్జ. తత్ర చింతా
తురాయా ద్రౌపద్యాస్మృతమాత్ర శ్రీకృష్ణోఽంకస్థాం రుక్మిణీం హిత్వా
తత్క్షణమేవ భక్తవత్సలతయా చాగతః. తయా చావేదితే వృత్తాన్తే
భగవతోక్తం- "హేద్రౌప ద్యహంచ బుభుక్షితోఽస్మి. ప్రథమం మాం
భోజయేతి. తయా చాతిలజ్జయోక్తం స్వామిన్! మద్భోజనపర్యన్త
మక్షయ మప్యన్నంసూర్యదత్తస్థాల్యాం మయాచ సర్వాన్ సంభోజ్య
భుక్త మతో నాస్త్యన్న" మితి. తథాప్యతినిర్బన్ధేన స్థాలీ మానాయ్య

తత్కంఠలగ్నం కించిచ్ఛాకాన్నం ప్రాశ్యోక్త మనేన "విశ్వాత్మా భగ
వాన్ ప్రీయతామ్ ।" అథ భోక్తుం మునిసంఘ మాహ్వాయేతి భీమం
ప్రహితవాన్ స చ తావతాఽతితృప్తో వృథాపాకభయేన పలాయిత ఇతి"

-మహా. భా .తత్త్వ. పు. 330

ఇచ్చట శ్రీమద్భాగవత శ్లోకములలో వనపర్వములోని దుర్వాసుని గాథయు శ్రీకృష్ణునివలన రక్షింపబడుటయు నుదాహరింపబడినది. ఆ మహాభారతకథా సందర్భమందలి శ్లోకముల తాత్పర్యమే యీ శ్రీధరీయవాఖ్యాతాత్పర్యమునయియున్నది.

ఇక రెండవ ఆక్షేపణమునకు సమాధానమిది. ఇంకను నీలకంఠాచార్యులచే నుదాహరింపబడిన శ్లోకము - 'బ్రహ్మాణం ప్రతి భగవద్వాక్యం :-

'విధేఽహం సర్వోఽస్మి వ్రజ పృథుకగోవత్స వదహం
బిభర్మి బ్రహ్మాణ్డం గిరివ దహ మద్వి జ్వలనవత్
సృజామి ద్రౌపద్యా వసనవ దహం ప్రాణ భృదహం
యదత్రాహం తృప్తో మునిరితిమదన్యన్న కిమపి'

-మ.భా. తత్త్వ.పు 332

"ఓ బ్రహ్మ! నందవ్రజమున గోపబాలకులు, గోవత్సములు నేనేయైనట్లు సర్వమును నేనే. గోవర్ధనగిరిని ధరించినట్లు బ్రహ్మాండమును ధరించువాడను నేనే. ద్రౌపదికి వస్త్రములు సృజించినట్లు సర్వమును సృజించువాడను నేనే. నాతృప్తిని బట్టి ముని (దుర్వాసుడు) తృప్తుడగుటవలన ప్రాణభర్తను నేనే. నాకంటె వేరైనదేదియూలేదు. ప్రాణభర్తయనుటలో "బుభుక్షా చ పిపాసా చ ప్రాణస్య" అని ఆకలిదప్పులు ప్రాణధర్మములు. శ్రీకృష్ణుని తృప్తిచే ప్రాణధర్మమైన ఆకలిశాంతించి ముని బృందమునకు తృప్తి కలుగుటవలన శ్రీకృష్ణుడే ప్రాణభర్తయని తాత్పర్యము. ముని బృందము యొక్క ఆకలియే శ్రీకృష్ణుని యాకలి. ముని బృందముయొక్క ఆకలిచే తనకు కలిగిన ఆకలిని శ్రీకృష్ణుడు ద్రౌపదిచే కూరాకును గ్రహించి "విశ్వాత్మా ప్రీయతాం దేవః" అని శాంతించుకొనుటవలన మునిబృందము యొక్క ఆకలి శాంతించినది.

ఈ విషయమునే మహాభారత హృదయాభిజ్ఞుడగు నీలకంఠాచార్యులు వనపర్వ

వ్యాఖ్యానారంభ మంగళ శ్లోకములో వెల్లడించిరి.

"యో దేవో మునినిచయ క్షుధా క్షుధావాన్
యత్తృప్త్యా మునినివహోఽపి తృప్తి మాప
తస్యైవం నిజజగదన్త రాత్మ భావం
వ్యాకర్తుః పదముపయామి గోపసూనోః"

-మహా. భా .తత్త్వ. పు. 332

ఇట్లు ఋషుని బృందము యొక్క క్షుత్తుచే తనక్షుత్తు, తన తృప్తిచే ముని బృందమునకు తృప్తియు కలుగుట మూలమున శ్రీకృష్ణపరమాత్మ తనయంతరాత్మ భావమును ప్రకటించియుండెను. దీనితత్త్వ మెరుంగని వారేవేవో శంకలు చేయుచుందురు. అవి నిరాకరణీయములు.

# 20. శ్రీకృష్ణుడు ధర్మజునితో ద్యూతసమయమున తాను ద్వారకలో లేకుంటిననుట.

ద్యూత సమయమున ద్రౌపదికి అక్షయవస్త్రముల నొసంగి మాన సంరక్షణము గావించిన శ్రీకృష్ణుడు తరువాత ధర్మరాజుతో 'నేను ద్వారకలోనే యుండిన యెడల పిలువక పోయినను ద్యూతమును నివారింపజాలుదునని యేల చెప్పెను?

ఇచ్చట రెండంశములు ప్రస్తావింపబడుచున్నవి. ఒకటి ద్రౌపదీ వస్త్రాపహరణము జరుగుచున్నప్పుడామె 'హే కృష్ణా ద్వారకావాసా'యనునంతనే శ్రీకృష్ణుడు ఆమె కక్షయవస్త్ర ప్రదానము చేసి యామె మానసంరక్షణము గావించెను. అతడే తరువాత ధర్మరాజుతో 'నేనాసమయమున ద్వారకలోనే యున్నచో ననాహూతుడనైనను వచ్చి ద్యూతము నివారించువాడను కదా! ఆద్యూతమువలన సంభవించిన యనర్థములు సంభవింపక పోవును కదా! అనెను. ద్యూతసమయమున శ్రీకృష్ణుడు ద్వారకలో లేని మాటవాస్తవమే. అప్పుడు శ్రీకృష్ణుడు సాళ్వయుద్ధమున నిమగ్నుడై ద్వారకకు దూరముగానే యున్నాడు. అట్టివాడు ద్రౌపదికి అక్షయవస్త్రములు ప్రసాదించి మాన సంరక్షణము గావించినది అశరీరరూపమున, సాళ్వయుద్ధములో నిమగ్నమై యున్నను ద్యూతసందర్భము శ్రీకృష్ణునకు తెలిసియే యుండవలెను. లేనిచో 'హే కృష్ణా ద్వారకావాసా! యనినంతనే అశరీరరూపముతో ద్రౌపది కక్షయ వస్త్రములెట్లు ప్రసాదింపగలిగెను? అశరీరరూపముతోనే ద్యూతమును నివారించ వచ్చును కదా! అందుకు తానా సమయమున ద్వారకలో లేకపోవుట ప్రతిబంధకమెట్లగును?

కనుక ఇక్కడ గ్రంథవిషయమున నిశితముగా పరిశీలింపవలసి యున్నది. శ్రీకృష్ణుడు ధర్మజునితో నన్నమాటలివి.

నైతత్కృచ్ఛ్ర మనుప్రాప్తో భవాన్‌స్యా ద్వసుధాధిప
యద్యహం ద్వారకాయాం స్యాం రాజన్ సన్నిహితః పురా
ఆగచ్ఛేయమహం ద్యూతమనాహూతోఽపి కౌరవైః
ఆంబికేయేన దుర్ధర్ష రాజ్ఞా దుర్యోధనేన చ
వారయేయమహం ద్యూతం బహూన్ దోషాన్ ప్రదర్శయన్

అసాన్నిధ్యస్తు కౌరవ్య మమానర్తే ష్వభూత్తదా
యేనేదం వ్యసనం ప్రాప్తా భవన్తో దూతకారితమ్
సోऽహమేత్య కురుశ్రేష్ఠ ద్వారకాం పాండునన్దన॥
అశ్రౌషం త్వాం వ్యసనినం యుయుధానా ద్యథాతథమ్.

-మ.భా.తత్త్వ.పు. 349

నీలకంఠీయమ్ :- సంప్రతి భగవత్స్మరణ మేవ తత్సాన్నిధ్యహేతుః, సాన్నిధ్యంచ సర్వాపత్తరణకృదితి భగ్యన్తరేణ ప్రతిపాద్యతే- నైతదిత్యాదినాऽధ్యాయేన, యదహం ద్వారకాయాం నవద్వారవత్యాం దేహనగర్యాం తవ మాం చిన్తయతః సన్నిహితస్స్యాం తర్హిఏతత్కృచ్ఛ్రం వనవాస సంకటం భవాన్ నానుప్రాప్తస్స్యాత్. యథా ద్రౌపదీ కృచ్ఛ్రకాలే మాం స్మృతవతీ వస్త్రరాశిప్రదానేన మయా సభాయాం కృచ్ఛ్రాన్మోచితా తథా త్వమపి అక్షపాతనకాలేమాం యదిస్మరేస్తర్హినైతత్కృచ్ఛ్రంప్రాప్నుయాః ప్రత్యుత తవైవ జయస్స్యాదితి భావః, అనాహూతోऽపి వారయేయం ద్యూతమన్తర్యామిత్వేన. కథాపక్షేత్వృజు రేవార్థః. ఆసమన్తాన్నర్తయన్తి తేషు ధీవిలాసేషు. పక్షే దేశవిశేషేషు. కథాన్తర మవతారయితుం కథాపక్ష మేవానుసరతి-సోऽహ మిత్యాదినా-

మ.భా. తత్త్వ.పు 350

అనగా యుధిష్ఠిరా! నేనప్పుడు ద్వారకయందు సన్నిహితుడనై యున్న యెడల నీకీ వనవాసక్లేశము ప్రాప్తించక పోవును. కౌరవుల చేతను, ధృతరాష్ట్ర దుర్యోధనుల చేతను ద్యూతమున కనాహూతుడనైనను (తమక్షేమమునకై ప్రార్థింపబడకున్నను) వచ్చియుందును. దోషములను ప్రదర్శించి ద్యూతమును నివారించి యుందును. అప్పు డానర్తము (ఆనర్తదేశము)లలో నాకసాన్నిధ్యము కలిగెను. కనుకనే ద్యూత ద్యూత ప్రయుక్తమైన యీకష్టమును పొందినారు. తరువాత నేను ద్వారకకు వచ్చి సాత్యకివలన మీ కష్టములను వినియిట్లు వచ్చితినని కథాపక్షములోని యర్థము.

ఇకనీలకంఠా చార్యులు వర్ణించిన అంతరార్థము :- భగవత్స్మరణమును బట్టియే భగత్సాన్నిధ్యమేర్పడును. భగవత్సాన్నిధ్యము కలిగినప్పుడు ఆపదలన్నియు నంతరించును. అనువిషయమిచ్చట భంగ్యతరముగా చెప్పబడినది. ఇచ్చట మొదటిశ్లోకములోని "యద్యహం ద్వారకాయాం సన్నిహితస్స్యామ్" అను వాక్యమందలి

'ద్వారక' యనగా నవద్వారములు కలదేహనగరి. అది యుధిష్ఠిరునితో చెప్పెడి ప్రస్తావమును బట్టి యుధిష్ఠిరునిది. యుధిష్ఠిరుడప్పుడు భగవచ్చిన్తనము చేసియున్న సంభవించెడిది. అతడా చింతనమప్పుడు చేయలేదు. అదికారణముగా శ్రీకృష్ణుడు యుధిష్ఠిరా! నేనప్పుడు ద్వారకయందు అనగా నీదేహనగరియందు సన్నిహితుడనై యుంటినేని అనగా నన్ను చింతించుటను బట్టి నీకు నాసాన్నిధ్యమ కలిగియుండెనేని యీ కష్టము నీకు ప్రాప్తింపక పోవునని పలికెను.

కృష్ణభగవానుడు మొదట ద్రౌపదితో సంభాషించినట్లెట్లోపలుకక యుధిష్ఠిరునితో సంభాషించినపుడే ద్రౌపదీసమక్షములో నిట్లు పలుకుటవలన, ద్రౌపది కష్టకాలములో నన్ను స్మరించి నాచే నీయబడిన వస్త్రరాశిమూలమున కష్టమునుండి విముక్తురాలైనట్లు నీవాద్యూతసమయమున నన్ను స్మరించియుంటివేని నీకీ కష్టము రాకుండుటే కాక జయమునీకే యగునే అను భావమును సూచించెను. నేనట్లు సన్నిహితుడనై యున్నయెడల ద్యూతమును దోషప్రదర్శనములతో నివారించి యుందుననుటలో తన అంతర్యామిరూపమున ద్యూతమును కల్పించిన దుర్యోధనాదుల మనస్సునకే ద్యూతదోషములను స్ఫురింపజేసి నివారించి యుందుననియు భావము.

అప్పుడానర్తములలో నా అసాన్నిధ్యమును బట్టి మీరీకష్టమును పొందినారు. ఆ నర్తలనగా --

"ఆసమన్తాత్ నర్తయన్తీ త్యానర్తాః" అను వ్యుత్పత్తిచే చిత్తవృత్తులు. అప్పుడా చిత్తవృత్తులలో నేను సన్నిహితుడను కాకపోతినే అని సూచించెను. కడపటి శ్లోకమందలి ద్వారకకు కథాపక్షమయిన ద్వారకాపట్టణమనియే యర్థము.

శ్రీకృష్ణుడు పరమేశ్వరావతారమగుటవలననే ఇట్లు చెప్ప గలిగెను. తాను భగవంతుడనని గీతయందును పెక్కుపర్యాయములు చెప్పెను. అందువలన శ్రీకృష్ణునికి సాధ్యాసాధ్యములు లేవు.

భగవద్గీతలో చతుర్థాధ్యాయారంభమున

**"ఇమం వివస్వతే యోగం ప్రోక్త వానహ మవ్యయమ్"**

**అనియును "స ఏవాయం మయా తేఽద్య యోగః ప్రోక్తః పురాతనః"**

అనగా కర్మయోగ సహిత మయిన యీజ్ఞానయోగమును సృష్ట్యాదియందు సూర్యున

కుపదేశించితిని. దానినే నీకిప్పుడుపదేశించితినని చెప్పగా నర్జునుడు

అపరం భవతో జన్మ పరం జన్మ వివస్వత:
కథమేత ద్విజానీయాం త్వమాదౌ ప్రోక్తవానితి

-మహా. భా .తత్త్వ. పు. 278

వసుదేవగృహమందు జన్మించియున్న నీవు సృష్ట్యాదియందు సూర్యునకెట్లు చెప్పితివి? అను ప్రశ్నకు శ్రీకృష్ణుడిట్లు చెప్పెను.

బహూని మే వ్యతీతాని జన్మాని తవ చార్జున
తాన్యహం వేద సర్వాణి న త్వం వేత్థ పరంతప
అజోఽపి సన్నవ్యయాత్మా భూతానామీశ్వరోఽపి సన్
ప్రకృతిం స్వా మధిష్ఠాయ సంభవామ్యాత్మమాయయా!

-మహా. భా .తత్త్వ. పు. 278-279

నాకు బహుజన్మములతీతములయినవి. నాకేకాక నీకును అయినవి. కాని వానిని నేనెరుగుదును, నీవెరుగవు. నాది అనావృతజ్ఞానము. నీది యావృతజ్ఞానము. అనావృతజ్ఞానశక్తి కలిగి కర్మబంధములేని యీశ్వరుడవు నీకు జన్మమెట్లని శంకింతువేమో. ఆప్రక్రియ వినుము నేనజుడను. అవ్యయుడను. ఈశ్వరుడనయియున్నను నా అధీనమయినయున్నట్టియు జగత్తును మోహపెట్టునట్టియు వ్యాపకము త్రిగుణాత్మకమునను మాయనవలంబించి జన్మించుచున్నాను. అనగా కర్మనిబంధనమయిన లోకసామాన్యమయిన జన్మమువంటిది కాక నాది మాయామయుమయిన జన్మము. అంతేకాదు. కృష్ణభగవానుడు ఏకకాలమున అక్కడ అనగాసాళ్వునితో యుద్ధరంగమునను ఇక్కడ ద్యూతమందిరమందును సశరీరముతో ప్రత్యక్షము కాగలడు. న్యాయస్థానములందు నేరస్థులు నేరమును తప్పించుకొనుట నేరముజరిగిన సమయములో తామాప్రదేశమున లేనట్లును వేరొకచోటనున్నట్లును సాక్ష్యముసృష్టించి తప్పించుకొందురు. దానినే న్యాయశాస్త్రపరిభాషలో ఎలిబి ని సృష్టించుటయందురు. ఈ ఎలిబి వ్యవహారము కృష్ణభగవానుని పట్ల పనికిరాదు. ఏలయనగా అతడేక కాలము పలుచోట్లనుండగలడు

కనుక దీనిని గూర్చి మహాభారతము ద్రోణపర్వములో భగదత్తవధసందర్భమున నర్జునకు శ్రీకృష్ణ భగవానుడు చెప్పెను :-

"చతుర్మూర్తి రహం శశ్వల్లోకత్రాణార్థ ముద్యతః ।
ఆత్మానం ప్రవిభజ్యేహ లోకానాం హిత మాదధే ॥
ఏకా మూర్తి స్తపశ్చర్యాం కురుతే మే భువి స్థితా ।
అపరా పశ్యతి జగత్ కుర్వాణా సాధ్వసాధునీ॥" -మ.భా.తత్త్వ.పు 280

టీ. ఏకా మూర్తి ర్బదరికాశ్రమే నారాయణరూపా, అపరా పరమాత్మ రూపా.

"అపరా కురుతే కర్మ మానుషం లోక మాశ్రితా ।
శేతే చతుర్థీ త్వపరా నిద్రాం వర్ష సహస్రికామ్॥
అవరా క్షేత్రజ్ఞరూపా అపరా జలశాయినీ.
యాఽసౌ వర్ష సహస్రాన్తే మూర్తి రుత్తిష్ఠతే మమ !
వరార్హేభ్యో వరా శ్రేష్ఠాం స్తస్మి కాలే దదాతి సా॥"

-మ.భా. తత్త్వ.పు 280

అనగా లోకరక్షణ కుద్యమించెడి నేను నాలుగు మూర్తులను ధరించి లోకులకు హితము కలుగచేయుచున్నాను. అందొక మూర్తి బదరి కాశ్రమము నందు నారాయణ రూపమై తపశ్చర్యయందున్నది. మరియొక మూర్తి పరమాత్మరూపమయి మంచి చెడ్డలను చేయుచున్నజగత్తును కనిపెట్టుచున్నది. మరియొకమూర్తి జీవరూపమై మనుష్యలోకము నాశ్రయించి కర్మచేయుచున్నది. మరియొకమూర్తి జలశాయినియై సహస్రవర్షములు యోగనిద్రచే శయనించి వర్షసహస్రాంతమందు లేచియప్పుడు వరములీయ దగిన వారికి వరములిచ్చు చున్నదని తాత్పర్యము.

ఏక కాలమందనేక శరీరరధారణము యోగులకుకూడ సుప్రసిద్ధమైనపుడు జన్మసిద్ధులైన దేవతల కనేక శరీరధారణము మాట చెప్పవలసిన దేమున్నదని వేదాంతశాస్త్రము బోధించుచున్నది.

"విరోధః కర్మణీతి చేన్నానేక ప్రతిపత్తేర్దర్శనాత్"

బ్రహ్మసూత్రము 1-3-27.

భగవద్గీత మహాభారతాంతర్గతము. మహాభారతకర్త వ్యాసమహర్షియై యుండ మహాభారతఅంతర్గతమగు భగవద్గీతకును వ్యాసమహర్షియే కర్తయగుట సత్యము. మరియు ప్రవృత్తిధర్మము, నివృత్తి ధర్మము అని ద్వివిధమైయున్న వేదోక్త ధర్మమును శోకమోహమహోదధి మగ్నుడైన యర్జునునకు శ్రీకృష్ణ భగవానుడుపదేశించెను. ఆయుపదేశింపబడిన విషయమునే సర్వజ్ఞుడైన వ్యాసమహర్షి ఏడువందల శ్లోకములుగా రచించెను. ఇట్లు చూడగా భగవద్గీతకు శ్రీకృష్ణభగవానుడును వేదవ్యాసమహర్షియు కర్తలే.

ఈ విషయమునే శాంకరభాష్యము స్పష్టము చేసినది -

"వైదికం హి ధర్మద్వయ మర్జునాయ శోక
మోహమహోదధౌ నిమగ్నాయోపదిదేశ.
తం ధర్మం భగవతా యథోపదిష్టం వేదవ్యాస
సర్వజ్ఞో భగవాన్ గీతాఖ్యైస్సప్తతి శ్లోక
శతైరుపనిబబన్ధ"

-మహా. భా .తత్త్వ. పు. 454

ఇక బాణములను విడువబోవుచుండగా నంత విషయమునుపదేశించుట అయుక్తమని హాస్యాస్పద ప్రసంగమని కదా ఆక్షేపణ. ఒకమారు గ్రంథమును పరిశీలించినచో గీతోపదేశమెప్పుడో బాణప్రయోగమెప్పుడో విశదమగును.

"గీతా ప్రస్తావః యుధిష్ఠిరేణ రథాదవ
రుహ్య భీష్మాద్యభివాదన పూర్వకం తేభ్యో
జయాऽశీర్గ్రహణమ్. యుధిష్ఠిరే పునర్భ్రాతృభి
స్సహ రథా రూఢే సన్నాహ భేరీవాదనమ్. కురు
పాండవసేనయోర్యుద్ధారంభః"

-మహా. భా .తత్త్వ. పు. 454

ఈ క్రమమును బట్టి సన్నాహభేరీవాదనమైన గాని యుద్ధారంభములేదు.

ఉభయపక్ష సేనలు వ్యూహములు పన్నుకొని సిద్ధముగా నుండు సమయమున గీతోపదేశము ముందైనది, తరువాతనే యుధిష్ఠిరుడు శ్రీ కృష్ణుడును సోదరులును వెనుకవచ్చుచుండ కౌరవసేన యొద్దకు పాదచారియై వెళ్ళి భీష్మ ద్రోణాదులకు మ్రొక్కి వారి జయాశీర్వాదములు స్వీకరించి మరల వచ్చి సోదరులతో రథములనధిష్ఠించి సన్నాహభేరీవాదములు గావించిన పిమ్మట బాణప్రయోగము జరిగినది. కనుక గీతావిషయోపదేశమున కిది సమయము కాకపోదు. అయుక్తమును కాదు. హాస్యాస్పదమును కాదు.

ఆంధ్రభారతమున ధర్మరాజు కౌరవ సైన్యమునకు పాదచారియై వెళ్ళి భీష్మద్రోణాదులనుండి జయాశీర్వాదమును గ్రహించిన పిమ్మటనే గీతోపదేశమైనట్లు మూలమునకు వ్యత్యస్తముగా నున్నది.



# 22. భీమసేనుని పోరాటపటిమ - బాణప్రయోగకౌశలము.

భీమసేనునికి శరీర దారుఢ్యము కలదని, యుద్ధకుశలత తక్కువయని, గదా యుద్ధమునను మల్లయుద్ధములో ప్రత్యర్థిని పిడిగుద్దులతో మొరటుగా చంపుట యందు మేటియే గాని బాణప్రయోగకౌశల్యము శూన్యమని మనవారితలంపు. అది నిజము కాదు.

సైంధవవధనాడు కౌరవవ్యూహమునందున్న ద్రోణాచార్యునొద్దకు రథారూఢుడై వచ్చియున్న భీమసేనునితో ద్రోణుడిట్లనెను.

క॥ ననుగెలిచిగాక నీకి। మ్మొనసొరగా నెట్లు వచ్చు మునునీతమ్ముం
డను మతుడై కాదే చొర। గనియె ననుడు వతడు(గన్నుగవ।
గెంపారన్

ఆం.భా. ద్రోణప. చతుర్థా-146.

దానికి సమాధానముగా భీమసేనుడు:-

చ॥ ప్రియములు వల్కినిన్ననుసరింపగ । బార్థుడు గాడు సుమ్ముదు
ర్జయభుజశక్తి నిర్మథిత శత్రుడు భీముడుగాని నీవుదం
డ్రియు గురుడుం బ్రియుండునని ప్రీతి యొనర్చెద బూనివైరికిం
జయమొనరింతు గాక యని సైతునె దర్పము సూపకుందునే.

అని పలికి

గదసారించి చెలంగి వైచిన భుజాగర్వంబు సాలించియు
మ్ముదుకందుర్వికి దాటిపోయెనది రశ్మిల్ మింటబర్వంగ బె
ట్టిదమై మ్రోయుచువచ్చి బల్విడుగుమాడ్కిం దాకుడున్ గుఱ్ఱముల్
పదిసెన్ సారథిమ్రగ్గె దేరునాలిసెన్ సైన్యంబు భీతిల్లగాన్.

ఆ.భా. ద్రోణ -4అ.146 149-150

మూలభారతమున భీమునిసమాధానము:-

తేన వై పరామాం పూజాం కుర్వతా మానితోఽహ్యసి
నార్జునోఽహం ఘృణీ ద్రోణ భీమసేనోఽస్మి తే రిపు:
పితా న స్త్వం గురుర్బన్ధుస్తథా పుత్రాస్తు తే వయమ్
ఇతి మన్యామహే సర్వే భవన్తం ప్రణతా స్థితా: ॥
అద్య తద్విపరీతం తే వదతోఽస్మాసు దృశ్యతే
యది త్వం శత్రుమాత్మానం మన్యసే తత్తథా స్త్విహ ॥
ఏష తే సదృశం శత్రో: కర్మభీమ: కరోమ్యహమ్.

-మహా. భా .తత్త్వ. పు. 1395

ఆచార్యా! నీయందు పూజ్యభావముగల మా పార్థుడు నిన్నట్లు సన్మానించినాడు. నేనర్జునుండను గాను. భీమసేనుడను. నీవు మాకు తండ్రివి, గురువవు, బంధువవు, మేమునీబిడ్డలము. అని మేమందరము నీకు మ్రొక్కుచుందుము నేడు 'నేను శత్రువను' అని మాయెడల నీవనుటలోనది యంతయు విపరీతమయినది. నీవు శత్రుభావమునే వహింపదలతువేని అట్లే కానిమ్ము. శత్రువుపట్ల చేయవలసిన పనినే భీమసేనుడు చేయుచున్నాడని చెప్పెను. అంతకుముందు ద్రోణుడు భీమసేనునితో నన్న మాటలివి-

"భీమసేన న తే శక్యా ప్రవేష్టు మరివాహినీ
మామనిర్జిత్య సమరే శత్రుమద్య మహాబల:"

-మహా. భా .తత్త్వ. పు. 1395

అని ద్రోణాచార్యుడు భీమసేనునికి శత్రువునని చెప్పెను. అంతట భీమసేనుడు

తతో రథాదవప్లుత్య వేగమాస్థాయ పాండవ:
నిమీల్య నయనే రాజన్ పదాతిర్ద్రోణి మభ్యయాత్
అంసే శిరో భీమసేన: కరా కృతోరసి స్థిరా
వేగమాస్థాయ బలవాన్ మనోఽనిలగరుత్మతామ్
యథా హి గోవృషో వర్షం ప్రతిగృహ్ణాతి లీలయా
తథా భీమో నరవ్యాఘ్రశ్శరవర్షం సమగ్రహీత్

# 22. భీమసేనుని పోరాటపటిమ - బాణప్రయోగకౌశలము.

భీమసేనునికి శరీర దారుఢ్యము కలదని, యుద్ధకుశలత తక్కువయని, గదా యుద్ధమునను మల్లయుద్ధములో ప్రత్యర్థిని పిడిగుద్దులతో మొరటుగా చంపుట యందు మేటియే గాని బాణప్రయోగకౌశల్యము శూన్యమని మనవారితలంపు. అది నిజము కాదు.

సైంధవవధనాడు కౌరవవ్యూహమునందున్న ద్రోణాచార్యునొద్దకు రథారూఢుడై వచ్చియున్న భీమసేనునితో ద్రోణుడిట్లనెను.

కII వనుగెలిచిగాక నీకి। మ్మొనన సారగా నెట్లు వచ్చు మునునీతమ్ముం
డను మతుడై కాదే చొర। గనియె వనుడు వతడు(గన్నుగవ।
గెంపారన్

ఆం.భా. ద్రోణప. చతుర్థా-146.

దానికి సమాధానముగా భీమసేనుడు:-

చII ప్రియములు వల్కినిన్ననుసరింపగ । బార్థుడు గాడు సుమ్ముదు
ర్జయభుజశక్తి నిర్మథిత శత్రుడు భీముడుగాని నీవుదం
డ్రియు గురుడుం బ్రియుండునని ప్రీతి యొనర్చెద బూనివైరికిం
జయమొనరింతు గాక యని సైతునె దర్పము సూపకుందునే.

అని పలికి

గదసారించి చెలంగి వైచిన భుజాగర్వంబు సాలించియ
మ్ముదుకండుర్వికి దాటిపోయెనది రశ్మల్ మింటబర్వంగ బె
ట్టిదమై మ్రోయుచువచ్చి బల్పిడుగుమాడ్కిం దాకుడున్ గుఱ్ఱముల్
పదిసెన్ సారథిమ్రగ్గె దేరునొలిసెన్ సైన్యంబు భీతిల్లగాన్.

ఆ,భా. ద్రోణ -4అ.146 149-150

మూలభారతమున భీమునిసమాధానము:-

తేన వై పరామాం పూజాం కుర్వతా మానితోఽహ్యసి
నార్జునోఽహం ఘృణీ ద్రోణ భీమసేనోఽస్మి తే రిపు:
పితా న స్త్వం గురుర్బన్ధుస్తథా పుత్రాస్తు తే వయమ్
ఇతి మన్యామహే సర్వే భవన్తం ప్రణతా స్థితా: ॥
అద్య తద్విపరీతం తే వదతోఽస్మాసు దృశ్యతే
యది త్వం శత్రుమాత్మానం మన్యసే తత్తథా స్త్విహ ॥
ఏష తే సదృశం శత్రో: కర్మభీమ: కరోమ్యహమ్.

-మహా. భా .తత్త్వ. పు. 1395

ఆచార్యా! నీయందు పూజ్యభావముగల మా పార్థుడు నిన్నట్లు సన్మానించినాడు. నేనర్జునుండను గాను. భీమసేనుడను. నీవు మాకు తండ్రివి, గురువవు, బంధువవు, మేమునీబిడ్డలము. అని మేమందరము నీకు మ్రొక్కుచుందుము నేడు 'నేను శత్రువను' అని మాయెడల నీవనుటలోనది యంతయు విపరీతమయినది. నీవు శత్రుభావమునే వహింపదలతువేని అట్లే కానిమ్ము. శత్రువుపట్ల చేయవలసిన పనినే భీమసేనుడు చేయుచున్నాడని చెప్పెను. అంతకుముందు ద్రోణుడు భీమసేనునితో నన్న మాటలివి-

"భీమసేన న తే శక్యా ప్రవేష్టు మరివాహినీ
మామనిర్జిత్య సమరే శత్రుమద్య మహాబల:"

-మహా. భా .తత్త్వ. పు. 1395

అని ద్రోణాచార్యుడు భీమసేనునికి శత్రువునని చెప్పెను. అంతట భీమసేనుడు

తతో రథాదవప్లుత్య వేగమాస్థాయ పాండవ:
నిమీల్య నయనే రాజన్ పదాతిర్ద్రోణి మభ్యయాత్
అంసే శిరో భీమసేన: కరౌ కృతోరసి స్థిరౌ
వేగమాస్థాయ బలవాన్ మనోఽనిలగరుత్మతామ్
యథా హి గోవృషో వర్షం ప్రతిగృహ్ణాతి లీలయా
తథా భీమో నరవ్యాఘ్రశ్శరవర్షం సమగ్రహీత్

స వధ్యమానస్సమరే రథం ద్రోణస్య మారిష
ఈ షాయాం పాణినా గృహ్య ప్రచిక్షేప మహాబలః
ద్రోణస్తు సత్వరో రాజన్ క్షిప్తో భీమేన సంయుగే
రథమన్యం సమారుహ్య వ్యూహద్వారం యయౌ పునః
తమప్యతిరథం భీమశ్చిక్షేప భృశరోషితః
ఏవమష్టౌ రథాః క్షిప్తాః భీమసేనేన లీలయా
తతస్స్వరథ మాస్థాయ భీమసేనో మహాబలః
అభ్యద్రవత వేగేన తవ పుత్రస్య వాహినీమ్.॥

వ్యా. భా. - ద్రోణపర్వ 128 అ.

భీమసేనుడిట్లు పలికి తనరథమునుండి యురికి కనులు మూసికొని శిరస్సు నొక భుజమువైపునకు వంచి హస్తమును వక్షస్థలమున సంధించి వర్షధారాపరంపరను లెక్క పెట్టక చొచ్చుకొని పోవు వృషభేంద్రమువలె శీఘ్ర

గతితో ద్రోణాచార్య శరవర్షమును లెక్కబెట్టక ద్రోణుని మీదకు బోయి రథమెత్తి విసరివేయ, రథాంతరమధిష్ఠించి ద్రోణుడతిత్వరలో మరల నిలువ, దానినికూడ విసరివేసి

ద్రోణుడధిష్ఠించుచువచ్చిన యెనిమిది రథములనట్లు అవలీలగా విసరివేసి ఆ అవకాశములో తుదకు తనరథమధిష్ఠించి సైన్యములోపల ప్రవేశించెను.

ఇది భీమసేనునిపోరాటపటిమకు చాకచక్యమునకు సమయస్ఫూర్తికి ప్రబలనిదర్శనము.

అదే సైంధవవధనాడు భీమసేనుడు కర్ణునెదుర్కొని అతని తన శరపరంపరచే విరథుని చేసి ధనుస్సులను త్రుంచి పలాయితుని చేసెను. కర్ణుడు జగదేకవీరుడనియు గొప్ప ధనుర్ధరుడనియు, బాణప్రయోగకౌశలమున నతడు పార్థునే మించినవాడని కేవలము శాపోపహతుడగుటవలననే రణమున పార్థుని వలనమడిసెననియు మన వారితలంపు. భీమసేనునితో పోరులో కర్ణుని గతి యేమయ్యెనో చూడుడు.

తతో భీమో మహాబాహుస్సూతపుత్రస్య భారత
క్షురప్రేణ ధనుశ్ఛిత్వా ననాద పరవీరహా

తదపాస్య ధనుశ్ఛిన్నం సూతపుత్రో మహారథ:
అన్యత్కార్ముకమాదత్త భారఘ్నం వేగవత్తరమ్
తదప్యథ నిమేషార్ధా చిచ్ఛేదాఽస్య వృకోదర:
తృతీయం చ చతుర్థం పంచమం షష్ఠమేవ చ
సప్తమం చాష్టమం చైవ నవమం దశమం తథా
ఏకాదశం ద్వాదశం చ త్రయోదశమథాపి చ
చతుర్దశం పంచదశం షోడశం చ వృకోదర:
తథా సప్తదశం వేగా దష్టాదశమథాపి వా
బహూని భీమశ్ఛిచ్ఛేద కర్ణస్యైవం ధనూంషి హి.

వ్యా.భా. - ద్రోణప -139అ.

సైంధవవధనాడు ఏకాకియై కౌరవవ్యూహములో బడి చెండాడుచున్న భీమసేనుని పరాక్రమప్రతిహతమై యుండ కర్ణుడు డీకొని "కర్ణో భీమశరాహత:, ప్రాద్రవజ్జ వనైరశ్వై రణం హిత్వా మహాభయాత్" భీమసేన బాణపీడితుడై నిలువలేక తొలగి పోయి మహారథులతో గలసి మరలవచ్చి ఢీకొని "పునరేవాఽభవత్కర్ణో భీమసేనా దవాఙ్ముఖ:" మరల పరాఙ్ముఖుడై పోయెను.

ఆ మహాసంఘర్షణములో 31మంది దుర్యోధనసోదరులను భీమసేనుడు సంహరించెను. అప్పుడు కర్ణుడు భీమసేనునితో బోరుటలో భీమసేనుడు కర్ణుని ధనుస్సును ఛేదించుచుండ మరియొకటి కర్ణుడు గ్రహించుచుండ విరామము లేకుండ పదునెనిమిది ధనుస్సులను పట్టినది తడవుగా ఛేదించుచు వచ్చెను. భీమసేనుని బాణప్రయోగ కౌశల్యమట్టిది. భీమసేనునకు కర్ణుని వధించునవ కాశము చిక్కియు "శక్తోపి నావధీత్కర్ణం సమర్థ: పాండునందన: । రక్షమాణం ప్రతిజ్ఞాం తాం యా కృతా సవ్యసాచినా॥ అని వధింపక విడిచిపెట్టెను.

ఆంధ్రభారతమునను కర్ణభీమసేనుల యుద్ధము చాలవివరముగా వర్ణింపబడినది.

" ------ నయ్యనిలతన యుండు

క॥ విలుదుమురు సేసిగుఱ్ఱం
బులు సూతుని చిలుకుమార్చి భుజగనిభశరం
బుల జేద్పచిన సిగ్గఱి
కలగి పఱచి యొండురథము కర్ణుండెక్కెన్

ఆం.భా. ద్రోణప. చతుర్థ 177ప

వ. అతండు శక్తివైచిన.

క॥ ఎనిమిది తునియలుగా నది దునిమిమరున్నందనుండు తొమ్మిది శరముల్
తనువాడవేయబలువిలు గొని యన్నియ గర్ణుడేసెఁగ్రూరాస్త్రంబుల్ -189

క. వానినెడనతికి యప్పవమాన తనూభవుడు నిశితమార్గణములుపై
పైసిగిడింపగ రాధాసూనుండును సాయకములసోనలు గురిసెన్.-190

ఉ॥ అత్తరి కర్ణువిల్లును హయంబులు నుగ్గుగసేసి నెత్తుటన్
జొత్తిల బాణములు సొన్పి మరుత్సుతు డార్చెనార్చినం
జిత్తము తల్లడిల్ల గురుసింహుడుదుర్జయజప్పనాతడ
త్యుత్తమ సాహసప్రకటితోద్దతి నాజగజెట్టి దాకినన్.-192

తే॥ బలములచ్చెరు వందనల్లులవు మెఱయ నీసుతు డనిలసుతు దాకి నిశితసాయ
కములనొప్పించి రథతురంగములనొంచి సూతునోనేయగ్రోధవిస్ఫూర్తినతడు
-200

క॥ తురగములతలలు సూతుని శిరమునతని మస్తకంబు శితశరషట్క
స్ఫురణమున ధరణిమీదం దొరగించెం గర్ణుడేద్భుతో గనుగొనగాన్ - 201

ఆ॥ వాడివాసరములు మూడు కర్ణునిరొమ్ము గాడనేయనానగడలినొవ్వ
భయముగదురఁజేయరయమున నరదంబు దోలికొని యతండు దొలగబాతె
-202

క॥ దానికి మనమునవించుక యైనను దలఁకక సమీరణాత్మజుడవిపై
రానీక నిలిపి యతనిం దానిరువదినాసరములు దలరఁగ జేసెన్ - 222

వ॥ అప్పుడు శత్రుజయుండగు, శత్రుసహుండును, సుదేహుండును,
మదనుండును, ద్రుముండును, చిత్రచాముండును, వికర్ణుండును
కర్ణరక్షణపరులై కడిమి నెలయే (వారు మరణించిరి) నంత దుర్యోధనుండు

దనమనంబున జూదంబునప్పుడు విదురుండు సెప్పినట్ల యగుచున్నదని విషాదంబునొంది యూసభనమ్మేయి బాండవులం బఱచిన పావఫలంబను భవించెననపుడు- -ఆ.భా.ద్రోణ. చతుర్థ .ఆ.

అట్లే కర్ణుడును "వ్యాయుధం నా వధీచ్చైనం కర్ణ:

కున్త్యా వచస్మరణమ్" భీమసేనుని వధించు నవకాశముండియు తాను కుంతికిచ్చిన వాగ్దానమును స్మరించి వధింపక విడిచిపెట్టెను.

సైంధవుని రక్షించుట కొరకు కర్ణుడు పార్థునితో పోరుసలుపుచు నిలువరించిన తనకు జయమగునని దుర్యోధనుని కా కర్ణుని యుద్ధమునకు పురికొల్పగా కర్ణుడు దుర్యోధనునితో భీమసేనబాణప్రహారముచే తన శరీరమెట్లు వశముకాకున్నదో చెప్పికొన్నారు.

> దృఢలక్షేణ వీరేణ భీమసేనేన ధన్వినా
> భృశం భిన్నతనుస్సంఖ్యే శరజాలైరనేకశ:
> స్థాతవ్యమితి తిష్ఠామి రణే సంప్రతి మానద
> నాంగమింగతి కించిన్మే సన్తప్తస్య మహేషుభి:
> యోత్స్యామి తు యథా శక్త్యా త్వదర్థం జీవితం మమ
> ------ జయో దైవే ప్రతిష్ఠిత:"

-మ.భా. తత్త్వ .పు. 1399

దుర్యోధనా! భీమసేనుని బాణాఘాతములకు క్షతగాత్రుడనై యున్న నేను రణభూమిలో నిలుచుట తప్పక నిలిచియున్నాను. భీమబాణప్రహారములకు గురియైన శరీరము కించిత్తయినను కార్యకారి కాకున్నది. అయినను నీకొఱకే నాజీవితము గనుక యథాశక్తి యుద్ధముచేయుదును. జయము దైవాధీనము.

ఈ కర్ణుని మాటలను బట్టి భీమసేనుడెంతటి గొప్ప ధనుర్ధరుడో, ఆయన బాణప్రయోగకౌశలమెంతశ్లాఘ్యమో కర్ణునే క్షతగాత్రునిచేసి దీనాలాపము లాడించిన ఈభీమసేనుని ధనుర్విద్యా పరాక్రమము ప్రశంసనీయము.

• • • • • •

# 23. శ్రీకృష్ణార్జునులు త్రాగిమత్తులై యుండిరను ప్రసంగము

సంజయుడు సంధికేగునపుడు అంతఃపురములో కృష్ణార్జునులుండగా తాను విడిగా వారిని కలిసితినని తిరిగి వచ్చి ధృతరాష్ట్రునికి చెప్పుసందర్భములో

ఉభౌ మధ్వాసవక్షీబా వుభౌ చందనచర్చితౌ
ఏకపర్యంకశయితౌ దృష్టౌ మే కేశవార్జునౌ

మ.భా - ఉద్యోగ 58. అశ్వా

ఆంధ్రమహాభారతమున

----------- "సంజయుండునుం జని
యుపప్లావ్యంబు సొచ్చి మాధవుమందిరంబున కరిగి
యభ్యంతర వినోదంబుల నరసహితుండై యున్న
యన్నారాయణునకుం దన రాక నెఱింగించి ---"

ఆం.భా - ఉద్యోగ - 1అ. 272.

అని కలదు.

కృష్ణార్జునులవంటి సత్పురుషులు మద్యపానము చేయవచ్చునా అని ఒక శంక, దానిని గురించికుమారిలభట్టు తన తంత్రవార్తికమున నిట్లు చెప్పెను. అన్న వికారసురామాత్రమే (రమ్ సారామాత్రమే త్రైవర్ణికులకు నిషేధము. అందువలన బ్రహ్మక్షత్రియ వైశ్యులు కల్లుద్రావరాదు. ద్రాక్ష చెరకు సారాయిలు మాత్రము క్షత్రియవైశ్యులకు బ్రతినిషేధములేదు. అవి బ్రాహ్మణులకు బ్రతినిషేధము. ఈ సమాధానము విమర్శకులకు తృప్తినీయలేదు.

ఇచ్చట కొంతవివరణ మవసరము. సుర యనబడున దొకటి, మద్య మనబడు నదొకటి, అన్నవికారమైనది సుర,అది యేకవిధమే. పనస, ఖర్జూర, తాళ, నారికేళ, ద్రాక్షాదిజన్యమై మదకరమైనది మద్యము. అది బహువిధము. అన్నవికారమయిన సురకు పిష్టము (పిండి)చే నిర్మితమగుటచే పైష్టి యనియు పేరు. ఆ పైష్టియే సురా

శబ్దమునకు ముఖ్యార్థము.

సురా వై మలమన్నానాం పాప్మా చ మలముచ్యతే
తస్మాద్బ్రాహ్మణరాజన్యౌ వైశ్యశ్చ న సురాం పిబేత్.

మను. 11అధ్యా. 93శ్లో

పైష్టి యనెడి మద్యము బియ్యపు పిండితో చేయబడుటవలన నన్నముల మలమని చెప్పబడినది. మలమనగా పాపము. సుర మలసదృశమైనది గాన బ్రాహ్మణక్షత్రియ వైశ్యులు సురాపానమ్ము చేయరాదు.

గౌడీ పైష్టీ చ మాధ్వీ చ విజ్ఞేయాత్ర విధా సురా
యథైవైకా తథా సర్వా న పాతవ్యా ద్విజోత్తమైః

మను 11అధ్యా శ్లో 94.

గౌడి, పైష్టీ-మాధ్వీ యను మూడు రకములు, గౌడి యనగా బెల్లముతో చేసినది పైష్టి యనగా పిండితో చేసినది. మాధ్వి యనగా ఇప్పపువ్వుతో చేయబడినది. ఈ మూటిని ద్విజులు పానము చేయరాదు.

బ్రాహ్మణులకు సురాపానము కాని మద్యపానముకాని నిషిద్ధము. క్షత్రియ వైశ్యులకు సురాపానము మాత్రము నిషిద్ధము. మద్యపానము నిషిద్ధము కాదని చెప్పబడినది.

పరాశర మాధవీయమున :- మద్యపాన్యప్రాయశ్చిత్తమ్.
మద్యపశ్చ ద్విజః కుర్యాన్నదీం గతా సముద్రగామ్
చాంద్రాయణే తతశ్చీర్ణే కుర్యా ద్బ్రాహ్మణభోజనమ్
అనడుత్సహితాం గాం చ దద్యాద్విప్రేషు దక్షిణామ్.
మాధవీయమ్ - పనసాదిజన్యం మదకారణ ద్రవ్యం మద్యం, తదాహ పులస్త్యః :-
పానసం ద్రాక్షమాధూకం ఖార్జూరం తాళమైక్షవమ్
మధూత్థం సై రేరమారిష్టమైరేయం నారికేళజమ్
సమానాని విజానీయా న్మద్యాన్యేకాదశైవ తు"
------తదేతన్మద్యపాన ప్రాయశ్చిత్తం బ్రాహ్మణస్యైవ,

న తు క్షత్రియవైశ్యయోః, మద్యపానస్య బ్రాహ్మణం ప్రత్యేవ నిషేధాత్.

బృహద్విష్ణుః-

మాధూకమైక్షవం పైరం తాళం ఖర్జూరపానసమ్
మధూత్థం చైవ మార్ద్వీకం మైరేయం నారికేళజమ్
అమేధ్యాని దశైతాని మద్యాని బ్రాహ్మణస్య తు. ఇతి
రాజన్యవైశ్యయోస్తు మద్యపానమనుజానాతి

బృహద్యాజ్ఞ్యవల్క్యః :-

కామా ద్యది చ రాజన్య వైశ్యో వాఽపి కథంచన
మద్యమేవ సురాం పీత్వా న దోషం ప్రతిపద్యతే। - ఇతి.

-మహా. భా .తత్త్వ. పు. 412-413

ఇచ్చట మద్యమనేకవిధమనియు, బ్రాహ్మణుని గూర్చియే మద్యపానము శాస్త్రకారులచే నిషేధింపబడినదనియు, క్షత్రియవైశ్యులకు నిషేధములేదనియు బృహద్విష్ణు, బృహద్యాజ్ఞ్యవల్క్య, వేదవ్యాసవచనములట్లు చెప్పుచున్నవనియు ప్రతిపాదింపబడినది. కాగా నీశ్లోకములోని 'మధ్వాసవక్షీబౌ' అను పదమునకు మధ్వాసవమును పరిగ్రహించి హెచ్చరికగానున్నారనియే భావముగాని త్రాగిమత్తులై యున్నారని గాదు. వారు యథోచితమధుపరిగ్రహణమును మాత్రమే చేసిరి.

కుమారస్వామి యవతారమని శంకరవిజయాదులలో పొగడబడిన కుమారిల భట్టపాదుడు తన తంత్ర వార్తికమునందు సహితము-

"యత్తు వాసుదేవార్జునయోర్మద్యపానం స్మృతివిరుద్ధముపన్యస్తమ్.
తత్రాన్నసురామాత్రస్యైవ త్రైవర్ణికానాం ప్రతినిషేధః.
సురా వై మల మన్నానాం పాప్మా చ మల ముచ్యతే ।
తస్మాద్బ్రాహ్మణరాజన్యౌ వైశ్యశ్చ న సురాం పిబేత్
ఇతి మధుసీధోస్తు (సీధుర్గౌడీ) క్షత్రియవైశ్యయోరేవ
ప్రతిషేధః కేవలబ్రాహ్మణవిషయత్వాత్".

-మహా. భా .తత్త్వ. పు. 415

అనగా కృష్ణార్జునులు చేయబడినట్లు చెప్పబడిన మద్యపానము స్మృతి విరుద్ధముకాదనియు పైష్టి యనబడు అన్నవికారమైన సురయే బ్రాహ్మణులకు వలె క్షత్రియవైశ్యులకు కూడ నిషిద్ధము కాని, గౌడి మాధ్వి అనబడు మద్యములు క్షత్రియవైశ్యులకు నిషిద్ధములు కావని చెప్పబడినది.

పనసాది జన్య మదకారణ ఏకాదశమద్యములు క్షత్రియ
వైశ్యులకు నిషిద్ధములు కావనుట స్పష్టము.

చరకసంహితలో మద్యమునుగూర్చి గుణదోషములను చర్చించి యిట్లు పదేశించెను. చరకసంహిత - చికిత్సాస్థానము. అ.24.

"యత్రైక: స్మృతివిభ్రంశస్తత్రసర్వ మసాధువత్
ఇత్యేవం మద్యదోషజ్ఞా మద్యం గర్హన్తి యత్నత:
సత్య మేతే మహాదోషా మద్యస్యోక్తా న సంశయ:
అహితస్యాతిమాత్రస్య పీతస్య విధివర్జితమ్
కిన్తు మద్యం స్వభావేన యథైవాన్నం తథా స్మృతమ్
అయుక్తియుక్తం రోగాయ యుక్తియుక్తం యథాఽమృతమ్
ప్రాణా: ప్రాణభృతామన్నం తదయుక్తాని హన్త్యసూన్
విషం ప్రాణహరం తచ్చ యుక్తియుక్తం రసాయనమ్.॥

-మహా. భా .తత్త్వ. పు.417

స్మృతి లేకుండ చేసెడి మద్యమునందు దోషములున్నవనుట సత్యమే. ఆ దోషములు మద్యమును వినియోగింపవలసిన విధానమును విడిచి హితాహితము లెరుగక అధికముగా స్వీకరించినపుడే కలుగును. అన్నమువలె హితముగను మితముగను వాడబడిన మద్యము అమృతమగును. లేకున్న రోగహేతువగును. కావున కృష్ణార్జునులు చేసిరన్న యథోచిత మధుపరిగ్రహణము స్మృతివిరుద్ధమును గాదు - నిషిద్ధమును కాదు.

# 24. శ్రీకృష్ణ నిర్యాణము.

మహాభారతములో శ్రీకృష్ణశరీరమునకు దహనసంస్కారము జరిగినట్లు చెప్పబడినది. శ్రీమద్భాగవతములో గూడ ప్రథమస్కంధములో "యయాऽహరద్భువో భారం తాం తనుం విజహావజః" అని శరీరత్యాగము చెప్పబడినది. ఏకాదశస్కంధములో మాత్రము శరీరత్యాగము చేయకయే వైకుంఠమునకు వెళ్ళినట్లు చెప్పబడినది. ఈ వైరుధ్యమునకు కారణమేమియో పరిశీలించవలసి యున్నది.

ఆంధ్రమహాభారతము మౌసలపర్వమునందు శ్రీకృష్ణనిర్యాణప్రశంసకలదు. చూడుడు :-

బోయవాడు బాణముచే శ్రీకృష్ణుని బొటనవ్రేలిని కొట్టి దగ్గరకువచ్చి చూచి తనచే కొట్టబడినవాడు శ్రీకృష్ణునిగా గ్రహించి చాల విలపించెను. అప్పుడు కృష్ణుడు

క॥ పడి యేడ్చునఁగృష్ణుఁడు దగు
నొడువులనూరార్చి తనమనోరథమిమ్మై
నొడఁగూడిన మానుషమగు
నొడలు విడిచి నిజపదము నొందుట కరిగెన్!

సీ॥ ఊర్ధ్వలోకమునకు నూర్జితతేజస్కుఁ డగు కృష్ణుడరిగిన నచటి దివ్య
మునివరులును సిద్ధులును రుద్రవసుమరు దాదిత్య విశ్వముఖామరులును
సంక్రందనుండును సంభృత సంభ్రమము లగుచు భక్తియు విన యంబు నెఱయ
గానెదుర్కొని చరణానతులైపరమస్తుతి వాక్యములన్ విస్తరిల్ల

ఆ॥ బలసిరందు దేవపతి యల్లఁజేరి కరములు మొగిచి ధర్మరక్షణమున
కై దయావిధేయమగు ఖేలనంబున నవని నవతరించితాదిపురుష.

ఆ.మ.భా. మౌసలపర్వము 85-86ప.

అర్జునుడు రామకృష్ణులకళేబరంబులను చూచి :-

క॥ మఱికొంతసేపునకు దె ప్పిఱిలేచి ముకుందుమేను పెద్దయుం బ్రొ

ద్దిటియం గౌఁగిఁటఁజేర్చెం బటివోయిన తాల్మి నూష్మబాష్పములురులన్

ఆ.భా - మౌ - ప 163

ఉ॥ కావునవేగమగ్గియును గాష్ఠములున్ సమకూర్చి సద్విధి
శ్రీవిలసిల్లఁ గృష్ణుని శరీరము సంస్కృతిఁగూర్చి క్రమ్మరం
బోవుట బుద్ధియంచుమతి భూసురకోటియుఁ దానుగాఢసం
భావనతోడఁజేసె దృఢభక్తికుఁడై పితృమేధ భద్రమున్,

ఆం. భా. మౌ - 1అ - 171.

శ్రీకృష్ణుడు సశరీరియై వైకుంఠముకేగినట్లే సూచించ బడినది. అట్లే ఆతని శరీరమున దహనసంస్కారములు అర్జునుడు జరిపించినట్లును తెలియుచున్నది.

ఇక వ్యాసభారత కథనము నరయునది :-

తతో రాజన్భగవానుగ్రతేజా నారాయణః ప్రభవశ్చాప్యయశ్చ
యోగాచార్యో స్వస్వరూపేణ విష్ణోః స్థానం
ప్రాపస్వం మహాత్మా ప్రమేయం గంధర్వాగ్ర్యై
రప్సరోభిర్వరాభిస్సిద్ధై సాధ్యైశ్చానతైః పూజ్యమానః
కృష్ణోహ్యత్యక్త దేహేఽపి త్యక్తదేహస్సదేహవత్
లోకానాం దర్శయామాస స్వరూపసదృశాకృతిం
శుక్లేన జని రన్యేషాం హరేస్వతను నైవ తు
నిత్యోదితజ్ఞానతనోః కుతస్యాచ్ఛుక్లతో జనిః
నావతార్వేష్వపి హరేర్దేహే శుక్లాదిసంభవః
తథాఽపి వాయురూపేణ మాతృదేహం ప్రవిశ్య చ
వినాపి శుక్లం తత్రైవ కేవలం జ్ఞానరూపకః
ఉదేతి భగవాన్విష్ణుర్మాయియా లోకం విమోహయత్.

భారతము. - మౌస - 1 అశ్వా -శ్లో॥

జగత్సృష్టికర్తయును, నాశరహితుడును ఉగ్రతేజుడును, భగవానుడు అప్రమేయు

డగు వాసుదేవుడు గంధర్వులచేతను, అప్సరసలచేతను, సిద్ధసాధ్యులచేతను పూజింపబడుచున్నవాడై తనదగు విష్ణుస్థానమును పొందెను. యథార్థమునకు వాసుదేవుడు వదలి పెట్టబడిన దేహము కలవాడు కాకపోయినను సామాన్యదేహులు దేహమును విడిచినట్లువలె లోకులకు కనిపింపజేసెను. ఇతరజీవులకు శుక్లశోణితసంయోగముచే పుట్టుక కలుగుచున్నది. హరికి మాత్రము స్వయముగానే జన్మ కలుగుచున్నది. నిత్యోదితమయిన జ్ఞానశరీరముగల శ్రీహరికి శుక్లశోణితముల చే జన్మ యెట్లు కలుగును? శ్రీహరికి అవతారముల యందును శుక్లాదులచే పుట్టుక లేదు. అయినను వాయురూపముతో మాతృదేహమును ప్రవేశించి కేవలము జ్ఞానమే రూపముగా కలవాడై మాయకుడయిన శ్రీహరి లోకమును మోహపెట్టుచు అచ్చట పుట్టినవాడువలె కన్పడుచున్నాడు.

శ్రీమద్భాగవతమున ఏకాదశస్కంధము 31వ ఆశ్వాసములో :-

"లోకాభిరామాం స్వతనుం ధారణాధ్యానమంగలమ్ ।
యోగధారణయాఽఽగ్నేయ్యాఽదగ్ధ్వాధామాఽవిశ త్స్వకమ్ ॥

శ్రీధరీయమ్-- యోగానామివ స్వచ్ఛన్దమృత్యుభ్రమం వార యతి అయమర్థః-- యోగినోమి స్వచ్ఛన్దమృత్యవః స్వాం తను మాగ్నేయ్యా యోగధారణయా దగ్ధ్వా లోకాన్తరం ప్రవిశన్తి భగ వాంస్తు న తథా, కిన్తు, అదగ్ధ్వైవ స్వతనుసహితేవ స్వకం ధామ వైకుంఠాఖ్య మవిశత్. తత్ర హేతుః లోకాభిరామాం లోకానా మభిరామోఽభితో రమణం స్థితిః యస్యాం తామ్ జగదాశ్రయత్వేన జగతోఽపి దాహప్రసంగా దిత్యర్థః। కించ ధారణాయా ధ్యానస్యచ మంగలం, శోభనవిషయమ్. ఇతరథా తయోర్నిర్విషయత్వం స్యాత్. దృశ్యేతే చాఽద్యాపి తదుపాసకానాం తథైవ తద్రూపసాక్షాత్కారః ఫలప్రాప్తిశ్చేతి భావః,

ఇచ్ఛాశరీరాఽభిప్రాయేణ వా యథాశ్రుత మేవాస్తు తత్రా ఽపి లోకాభిరామా మిత్యాదీనాం విశేషణానా మానర్థక్యప్రసంగా త్తదప్యదగ్ధ్వా తిరోధాయ నిర్గత ఇత్యేవ సాంప్రతమ్.

శ్రీధరీయవ్యాఖ్యా వంశీధరీయా - శుద్ధసత్త్వమయస్య విద్య
మానత్వేఽపి తత్ప్రతికృత్యభిప్రాయేణ యథాశ్రుతార్థాస్వీకారేఽపి వ
దోష ఇత్యాహ-ఇచ్ఛాశరీరేతి. తత్రాపి యథాశ్రుతార్థాంగీకారేఽపి

తతశ్శరీరే రామస్య వాసుదేవస్య చోభయోః।
అన్విష్య దాహయామాస పురుషైరాప్తకారిభిః॥"ఇతి.
తదాఽసురజనమోహార్థమేవ త దుక్తం బ్రహ్మాండే-
"స్త్రీపుంమలానుషంగాత్మా దేహో నాస్య విజాయతే।
కిన్తు నిర్దోషచైతన్యం సుఖనిత్యాం స్వకాం తనుమ్॥
ప్రకాశయతి సైవేయం జనిర్విష్ణోర్న చాఽపరా।
తథాఽప్యసురమోహార్థం పరేషాఞ్చ క్వచిత్క్వచిత్॥
దుఃఖాజ్ఞానశ్రమాదీంశ్చ దర్శయేచ్ఛుద్ధ సద్గుణః।
క్వ వ్రణాది క్వ చాజ్ఞానం స్వతన్త్రాఽచిన్త్యసద్గుణే॥
మోక్షాభావాయ తేషాన్తు దర్శయేత్తానజో హరిః।
కృష్ణో హ్యత్యక్త దేహోఽపి త్యక్తదేహస్య దేహవత్॥
లోకానాం దర్శయామాస న స్వరూపసదృశాకృతిమ్।
ఏతేన యయాఽహరద్భువో భారం తాం తాం తనుం విజహావజః"
ప్రథమ స్కంధోక్తిరపి సమంజసా స్యాదితి సర్వమనవద్యమ్॥

-మహా. భా .తత్త్వ. పు. 490-491

అనగా స్వచ్ఛందమృత్యువులగు యోగులు తమ శరీరములను యోగాగ్ని చే దగ్ధము చేసి లోకాంతరములకు వెళ్లినట్లు కాక శ్రీకృష్ణ పరమాత్మ స్వశరీరము తోడనే వైకుంఠమున కేగెను. సకల జగదాధారమైన శరీరము దగ్ధమయిన యెడల జగత్తు దగ్ధమయిపోవును. ధ్యానధారణలకు విషయము లేకయే పోవును. ఆ శ్రీకృష్ణ శరీరమట్లేయున్న హేతువుచేతనే ఉపాసకులకు నేటికిని ఆరూపము యొక్కసాక్షాత్కారము, ఆ ఫలప్రాప్తి అనుభవసిద్ధములై యున్నవి. ఆ కృష్ణ శరీరము ఇచ్ఛాశరీరమన్నను అదియు దగ్ధముకాలేదనుటే యుక్తమని శ్రీధరీయవ్యాఖ్య.

మహాభారత మౌసలపర్వములో శ్రీకృష్ణశరీరమును దగ్ధము చేసినట్లు చెప్పబడిన విషయమునకు బ్రహ్మాండపురాణములో సమాధానమిట్లున్నది.

అవతారసందర్భములో భగవచ్ఛరీరము శుక్లశోణిత సంబంధము కలది కాదు. తనస్వరూపమును ప్రకాశింపజేయుటే భగవంతుని జన్మ యనబడును. అయినను దుఃఖమును, అజ్ఞానమును, ప్రయాసమును, అసురమోహార్థము తనకున్నట్లు ప్రదర్శించుచుండును. నిజముగా తనయందు అంత్యతాసంభవములైన దుఃఖాజ్ఞానాదులను అనధికారులకు మోక్షము రాకుండుటకే భగవానుడు ప్రదర్శించుచుండును. శ్రీకృష్ణుడు దేహమును త్యజింపకుండియే త్యజించిన దేహమువలె స్వస్వరూపముతో సమానమయిన యొక యాకృతిని జూపియుండెను. దీనిచే దగ్ధము చేయబడినట్లు చెప్పబడియున్న ఆకారము అప్పటికప్పుడు చూపబడినదగుటచే దానికే యట్టి సంస్కారము జరిగెననియు, శ్రీకృష్ణుడు స్వస్వరూపముతోడనే వైకుంఠము నలంకరించెననియు బ్రహ్మాండపురాణము స్పష్టముచేయుచున్నది. కనుక శ్రీకృష్ణనిర్యాణసందర్భమున చూపబడిన వైరుధ్యము పరిహారమైనట్లే కదా!



# 25. విరాటుని కొలువులో ధర్మజుడు తన్ను గూర్చి సత్యమునే చెప్పెనా?

పాండవుల అరణ్యావాసము ముగిసినది. అజ్ఞాతవాస మారంభము కానున్నది. పాండవులు తమ అజ్ఞాతవాసమును మత్స్యదేశపు రాజైన విరాటుని కొలువులో గడుప నిశ్చయించుకొనిరి. వారు మారుపేర్లతో మారువేషములతో ఇతరులకు ఎరుక రాకుండ అజ్ఞాతవాసమును గడుపవలెను. తమతమ నిజరూపములను నిజగోత్రనామములను చెప్పుకొనరాదు. సత్యమును చెప్పిన అజ్ఞాతవాసము భంగమగును. అట్లని అసత్యమును చెప్పరాదు. గొప్పధర్మసంకటస్థితి. తమ్మగూర్చి విరాటుడడిగిన ప్రశ్నకు ధర్మజుని సమాధానమిది.

ఆ॥ ఉన్నరూప పలుకు నన్నరులెక్కడఁ గలరు తోఁచినట్లు పలుకు పలుక
నైన చంద మయ్యె నంతియ కాకంత పట్టిచూండఁగలరె యెట్టివారు.

వ॥ అని మందహాసంబు సేయుచు మఱియును

క॥ నానావిధభూతమయము
మేనతిచంచలము మనము మెయికొని నిక్కం
బేనరునకుఁజెల్లింపం
గానగు సత్యంబునడపుక్రమ మట్లుండెన్,

వ॥ అనుచు మత్స్య మహీవల్లభు నవలోకించి

క॥ ద్విజుఁడఁగురు విషయజాతుడ సుజన ప్రియుఁడైన ధర్మసుతు సఖుఁడఁబరి
వ్రజనాశ్రమకలితుండ మనుజవల్లభ యోగ్యబహువినోద కరుఁడన్.

ఆం.భా - విరాట. 1అ. 191 నుండి 196

ధర్మజుడు విరాటుని కొలువున కెట్లు ప్రవేశించెనో తన్ను గుఱించి యేమి చెప్పెనో పరికింపుడు.

త్రి దండ కాషాయ కమండలూజ్జ్వలో
జపస్ఫురద్దంత పటో యుధిష్ఠిరః
ఉపానహం దారుమయీం పదా
స్పృశన్నుపాసద త్సంసది మేదినీశ్వరం॥
యుధిష్ఠిరస్యాసమహం పురా సఖా
వైయాఘ్రపద్య పునరస్మి విప్రః
అక్షాన్ ప్రయోక్తుం కుశలోఽస్మి దేవితా
కంకేతి నామ్నాఽస్మి విరాట విశ్రుతః॥

మ.భా -సా. విరాట.పు 140

ధర్మరాజు త్రిదండములను ధరించి కాషాయకమండలములతో ప్రకాశించుచు జపముచే ప్రకాశించుచున్న పెదవులు కలవాడై పాముకోళ్ళనుధరించి సభలోనున్న విరటుని సమీపించెను. నేను పూర్వము ధర్మరాజునకు స్నేహితుడను. వైయ్యాఘ్రపద్యగోత్రజుడను మరల కంకుడను పేరుగల విప్రుడనైతిని. పాచికలను ఆడుటయందు నేర్పరిని.

'కంకో నామ ద్విజో భూత్వా మతాక్షః ప్రియదేవనః'
మతాక్షః=బృహదశ్వాత్ జ్ఞాత అక్షతత్త్వః అని నీలకంఠీయవ్యాఖ్య

అంతేకాదు

'ఆసం యుధిష్ఠిరస్యాహం పురా ప్రాణసఖా' యుధిష్ఠిరునకు ప్రాణసఖుడట అతడు బ్రాహ్మణుడట. పేరు కంకుడట. అన్నియూ అబద్ధములే. ఆశ్చర్యము ధర్మరాజు అబద్ధములాడునా? అవి అబద్ధములుకావు. అక్షరసత్యములు. గుప్తపదములు, వినువారికి అసత్యములవలె భాసించును. కాని అవి సత్యదూరములు కావు. ఆయనపేరు కంకుడట.

'కంకచ్ఛద్మద్విజే ఖ్యాతః లోహపృష్ఠకృతాంతయోః'

అనికంకశబ్దమునకు నానార్థములు. కంకశబ్దము కపట వేషధారియగు

బ్రాహ్మణునకును, యమధర్మరాజునకును కూడ నర్థము. కావున నేను కపట వేషధారియగు బ్రాహ్మణుడనేకాని యథార్థమునకు నేను బ్రాహ్మణుడను గానని యర్థము.

అంతేకాదు నేను యమధర్మరాజునకు పుత్రుడనని కూడ అర్థము, పుత్రుడననగా ఆత్మయే. ఆత్మా వై పుత్రనామాసి' అనిశ్రుతి అట్లే నేను యుధిష్ఠిరుని ప్రాణస్నేహితుడనని. ఆత్మశబ్దము శరీరమునకును జీవునకును కూడ వర్తించును. యుధిష్ఠిరుడను పదము చేత శరీరము చెప్పబడగా ఆశరీరమునుద్ధరించు ప్రాణమువలెనే యుధిష్ఠిరశబ్దవాచ్యమై శరీరమునకు జీవాత్మ ప్రాణమువంటిదగుటచేత చిదాత్మ పక్షమున గ్రహించి యుధిష్ఠిరునకు నేను ప్రాణసఖుడనైతినని చెప్పినాడు. అనగా యుధిష్ఠిరుడను పేరుగల ఈ శరీరమునకు ప్రాణము వంటివాడనై శరీరమును నడుపునట్టిచిదాత్మనని భావము.

"యుధిష్ఠిరాఖ్యస్య శరీరస్య యథా ప్రాణఉత్థాపకః
తద్వచ్చిదాత్మాఽపి, ఇతి ప్రాణసామ్యేన యుధిష్ఠిరాత్మైవ
వివక్షిత ఇతి భావః - అని నీలకంఠీయవ్యాఖ్య.

తన గోత్రమును వైయాఘ్రపద్య గోత్రమనియు చెప్పి కొనినాడు. వారి గోత్రప్రవర- "వ్యాఘ్రపద్యం త్రయార్షేయ గోత్రం శంతను విచిత్రవీర్య పాండు ధర్మభీమార్జుననకుల సహదేవాఖ్య పంచరూపధారీ శ్రీపురందర నామధేయః వరః "- అని వారి వివాహసందర్భమున చెప్పబడ్డది. వారి పురోహితుడైన ధౌమ్యునిది వైయాఘ్రపద్య గోత్రమే.

భీముని పేరు బల్లవుడు. పౌరోగవుడనై బల్లవుడ నువ్యవహారనామమున వ్యవహరింతునని చెప్పినాడు. పౌరోగవుడన వంటయింటి పెత్తనదారు బల్లవుడన వంటవాడు. జీవులు మాతృగర్భమున ప్రవేశించుటకు ముందు చరించువాడు వాయువు. కావున వాయువునకు పురోగవుడని పేరు. అతని పుత్రుడు కనుక భీముడు పౌరోగవుడయ్యెను. బల్లవపదము తానిప్పుడు చేయువృత్తిని బట్టి వచ్చినది. ఇదియు నీలకంఠుల వ్యాఖ్యానమే పురఃపురస్తాత్ గావః రశ్మయః యస్య సః

పురోగః=వాయుః, తస్య పుత్రః పౌరోగవః
లోకే తు పౌరోగవో మహానసాధ్యక్షః

బల్లవ:=సూపకార:.
ఇక అర్జునుడు! స్త్రీత్వేన యోగ: ఖలు వీరగర్హ్య:
పుంస్త్వేన చాంత: పురవాసవిఘ్న:
ఇతీవ షండత్వ మవశ్యభావ్య
మాదాయ పార్థోఽపి జగామ మాత్స్యం
గాయామి నృత్యామ్యథ వాదయామి
భద్రోఽస్మి నృత్యే కుశలోఽస్మి గీతే
బృహన్నలాం మాం నరదేవ విద్ధి
సుతం సుతాం వా పితృమాతృవర్జితా:

ม.భా. సా- విరాట .పు.148

స్త్రీత్వమును పొందుట వీరులకు నింద్యమైనది కదా! పురుషత్వముతో అంత:పురనివాసము కుదురదు కదా! అందువలన అనివార్యమైన షండత్వమును గ్రహించెదను. నేను గానము చేయగలను. నృత్యము చేయగలను. మరియు వాద్యములను వాయించగలను. నృత్యముల యందును గీతముల యందును మిక్కిలినేర్పరిని. తల్లిదండ్రులు లేని బృహన్నల అనుపేరుగల నన్ను కుమారునిగా గాని కుమార్తెగా గాని తలంచుమని చెప్పెను.

షండపదమునకు గోపతియన్న అర్థమున్నది. గోపతియన గోపాలుడు. గోపాలకుడైన శ్రీకృష్ణునికి స్నేహితుడనని నర్మగర్భమగు నర్థము. బృహన్నలయనగా బృహన్నరుడని యర్థము. రలయోరభేద: అని రలకు భేదములేదు. బృహన్నరుడనగా నారాయణ ఋషికి సహచరుడగు నరుడని భావము. ఇదియు నీలకంఠుల వ్యాఖ్యయే.

నకులు డశ్వశాల కధిపతి. వానిపేరు గ్రంథికుడు. ఆయుర్వేదమును అధ్వర్యమును తెలిసినవానికి గ్రంథికుడనిపేరు. అశ్వినీదేవతలు దేవవైద్యులు. దేవవైద్యుల ఆత్మనే నేనని భావము "ఆయుర్వేదమాధ్వర్యం చ వేత్తీతి గ్రంథిక: అశ్వినో: సుతత్వాత్" - అని నీలకంఠీయము.

నకులుడు చెప్పిన వ్యాసవాణిని పరికింపుడు.

అశ్వబంధో భవిష్యామి విరాటన్నృపతే రహం

సర్వథాజ్ఞానసంపన్నః కుశలః పరిరక్షణే
గ్రంథికో నామ నామ్నాऽహం కర్మైతత్ సుప్రియం మమ
కుశలోऽస్మ్యశ్వశిక్షాయాం తథైవాశ్వచికిత్సనే
పాండవేన పురా తాత అశ్వేష్వభికృతః పురా!

మ.భా - ఉ. విరాట పు 197

అశ్వేష్వధికృతః" అనగా యుద్ధరంగమున కూడ నేను శూరుడనని

నాస్త్యశ్వో యేషాం తే శూరాః
సమరే తృణీకృత ప్రాణాః తేషు అధికృతః
ముఖ్యః ఇతి గూఢాశయః' అని నీలకంఠుల వారి వ్యాఖ్య.

-మహా. భా . విరాట. పు.198

ఇక సహదేవుడు. అతడు విరటుని కొలువులో తంతిపాలుడై గోరక్షణముచేయును.

తంతిపాల ఇతి ఖ్యాతః నామ్నాऽహం విదితస్త్వథ
లక్షణం చరితం చాపి గవాం యచ్చాపి మంగళం

మ.భా -ఉ. విరాట -పు 200

తంతియన వాక్కునకు వేదమున ప్రయోగమున్నది. వాక్కును పాలించువాడు తంతిపాలుడు, ధర్మజుని వాక్కును పాలించువాడు. సత్యవాక్కును పాలించువాడు. సామాన్యార్థమున పశులకాపరి.

ధర్మజుడు ద్రౌపదిగూర్చి ఇట్లుచెప్పెను.

ఇయం హి నః ప్రియా భార్యా ప్రాణేభ్యోऽపి గరీయసీ
మాతేవ పరిపాల్యా చ పూజ్యా జ్యేష్ఠేన చ స్వసా"

మ.భా. ఉ. విరాట- పు 200

మనకత్యంత ప్రియురాలును భార్యామణియునగు నీ ద్రౌపది ప్రాణముకంటె శ్రేష్ఠమై తల్లివలె పరిపాలించదగినదియు జేష్ఠసోదరివలె పూజ్యురాలునుకూడ యట. ఈ వర్ణనయం దనౌచిత్యమున్నట్లు తోచును. కాని కాదు. వ్యాసుడు వేదవిభాగకర్త

వేదపారిభాషికపదములు మహాభారతమునందు విరివిగా ప్రయోగింపబడును. సంస్కృతపదములకు నానార్థములుండుట సహజము. మాతృశబ్దమును గోవునందును భూమియందును కూడ వాడవచ్చును. కావున భూమినెట్లు పాలించవలెనో అట్లు పరిపాలన గావింపదగినదని. అట్లే జ్యేష్ఠస్వసా అనుపదము వేదమునందు అంబిక (పార్వతి) యందు వాడబడినది. పార్వతివలె పూజ్యురాలు. పార్వతి వంటిదే ద్రౌపది. అగ్ని కుండమునుండి యావిర్భవించిన దుర్గయని ఆది పర్వమున వర్ణించబడినది. కావున "పూజ్యా జ్యేష్ఠేవ చ స్వసా" అని వాడినాడు. భార్యను దేవతాస్వరూపముగా పలుకవచ్చునా? పలుకవచ్చుననియే నీలకంఠులు సెలవిచ్చిరి.

"జాయా గార్హపత్యః పుత్రో న్వాహార్యవచనః"

గార్హపత్యమను అగ్నిని భార్యయనియు అన్వాహార్య వచనమును పుత్రుడనియు శ్రుతి పలికినది.

ఆ ద్రౌపది తన్నుగూర్చి ఇట్లు చెప్పినది-

అహం బ్రువాణా సైరంధ్రీ కుశలా కేశకర్మణి
సుధేష్ణాం ప్రత్యుపస్థాస్యే యుష్మాభిస్తత్ర తస్థుషి
యుధిష్ఠిరస్య గేహే వై ద్రౌపద్యాః పరిచారికా
ఉషితాస్మీతి వక్ష్యామి పృష్టా రాజ్ఞ్యా చ భారత.

మ.భా -సా. విరాట, పు.132

నేను కేశప్రసాధన కర్మయందు నేర్పురాలనై సైరంధ్రి యను పేరుతో మీరక్కడ ఉండగా సుధేష్ణను సేవించెదను. యుధిష్ఠిరుని గృహమున నేను ద్రౌపదికి పరిచారికగా పూర్వముని వసించి యుంటిని.

వ్యాఖ్య:- సైరంధ్రీతి॥ ప్రతిసీరాంతః పటః ధ్రీయతే
అనయాఽస్యేతి వా సీరంధ్రా - సైవ సైరంధ్రీ॥
స్వార్థే తద్ధితః అంతఃపుర పరిచారికారాజ
భార్యా వా ఇత్యర్థః॥

టీక॥ రాహోశ్శిర ఇతివత్ అభేదేఽపి భేదోపచారః॥
సీరం ధియే సైరంధ్రి. సీరంధ్రియనగా

-మహా. భా .సా. విరాట. పు. 132

అంతఃపురమునందలి వస్త్రము, అనయా= ఈమెచే లేక ఈ మెకు
ధ్రీయతే=ధరింపబడునది గాన సీరంధ్ర. ఈమెయే సైరంధ్రియని చెప్పబడును.
అంతఃపురపరిచారిక యని గాని రాజ భార్యయని గాని యర్థము.

ఇచ్చట ద్రౌపదియొక్క పరిచారికయనుచోట ద్రౌపదియే పరిచారిక అని యర్థము. రాహోశ్శిరః యను చోట రాహువునకు శిరస్సునకు భేదములేక పోయినను ఎట్లు భేదవ్యవహారమో అట్లే తనకును ద్రౌపదికిని భేదము లేకపోయినను భేదమున్నట్లు వ్యవహరించుట.

సారాంశమేమనగా ధర్మరాజుగాని భీమార్జును నకులసహదేవులుగాని ద్రౌపది గాని సత్యమునే చెప్పిరి. అసత్యమిసుమంతయు చెప్పలేదు. కాని గూఢముగా చెప్పిరి. సంస్కృతపదములకు అనేకార్థములుండుట ఆ భాషలోని విశిష్టత. సంస్కృత భాషలోని సౌలభ్యమిదియే. దీనిని గ్రహించుటకు నిశితమైన పరిశీలన మవసరము.

# 26. సుక్షత్రియులైన పాండవులు ఏకచక్రపురమున భిక్షాటనము చేయవచ్చునా?

దుర్యోధనుని ప్రేరణచే ధృతరాష్ట్రుడు పంచపాండవులను కుంతిని వారణావతమునకు పంపెను. అకడ ఒక లక్కాయింటిని నిర్మించి అందు పాండవులకు నివాసమేర్పాటు చేసెను. వారిని లక్కాయింటియందు తగులబెట్టుటకు పురోచనుని నియమించినాడు దుర్యోధనుడు. దానికిముహూర్తము పాల్గుణకృష్ణచతుర్దశి. ఆసంగతి విదురుని ద్వారా తెలిసికొనిరి పాండవులు. విదురప్రేరణచే నియమింపబడిన ఖనకుడు రహస్యసొరంగ మార్గమును సిద్ధపరచెను. అదేముహూర్తమున లక్కాయింటికి భీముడు నిప్పుపెట్టి సోదరులను తల్లిని రక్షించెను. వారు గంగను దాటి అరణ్యమును ప్రవేశించిరి. పురోచనుడు లక్కాయింటియందే భస్మమయ్యెను. ఒకానొక బోయకాంతయు తన అయిదుగురు పుత్రులతో సహా నారాత్రి మిక్కిలిగా భుజించి తెలివితప్పి ఆమంటలలోనే భస్మమయ్యెను.

ఆబోయకాంతయు పుత్రులైదుగురును పాండవులే యనుకొని లక్కాయింటిలో భస్మమయిరని భావించిన పురజనులు వారి యెముకలను హస్తినాపురమునకు పంపి పాండవుల మరణవార్తను తెలిపిరి. ధృతరాష్ట్రుడు దుఃఖించి పాండవులకు యథావిధిగా ప్రేతకార్యములు చేయించెను. తరువాత హిడింబాసురవధయు, భీమ-హిడింబుల వివాహము, ఘటోత్కచుని జననము జరిగినవి - పాండవులు తల్లితోసహా ఏకచక్రపురమును ప్రవేశించి, బ్రాహ్మణవేషములతో భిక్షాటనము చేయుచు జీవింపజొచ్చిరి. పాండవులు మరణించిరనియే లోకమునకు తెలియును. వారు మరణించిరను విశ్వాసముతోడనే దుర్యోధనాదులు నిశ్చింతగా నుండిరి. ఒక వేళ పాండవులు జీవించి యున్నట్లు సుయోధనాదులకు తెలిసినచో తప్పక ఏవిధముగా నైనను పాండవులను చంపింతురు. అట్టి పరిస్థితులలో ప్రచ్ఛన్న వేషములతో అజ్ఞాతముగా జీవించుటకన్న పాండవులకు మార్గాంతరములేదు.

ఇక ఇప్పుడు సుక్షత్రియుడైన పాండవుల వర్ణాశ్రమధర్మములనుల్లంఘించి క్షాత్రధర్మవిరుద్ధమయిన భిక్షాటనము చేయవచ్చునా అని ప్రశ్న.

వర్ణాశ్రమధర్మములను గూర్చి మనుధర్మ శాస్త్రమేమి చెప్పినది.

అధ్యాపనం చాధ్యయనం యజనం యాజనం తథా
దానం ప్రతిగ్రహణం చైవ బ్రాహ్మణానా మకల్పయత్.

మను. అధ్యా 1 - 88 శ్లో.

వేదాధ్యయనము, వేదాధ్యాపనము, యజ్ఞములు చేయుట చేయించుట దానమొసంగుట దానమునుగ్రహించుట ఈ ఆరును బ్రాహ్మణకర్మలు. దీనికే షట్కర్మాధికార మందురు.

ప్రజానాం రక్షణం దాన మిజ్యాధ్యయనమేవ చ
విషయే ష్వప్రసక్తిశ్చ క్షత్రియస్య సమాసత:

మను. అధ్యా1 - 89శ్లో.

ప్రజాసంరక్షణము, దానము, యాగము చేయుట వేదాధ్యయనము, విషయములందాసక్తి లేకపోవుట వీనిని క్షత్రియధర్మములుగా నియమించెను. ఈ క్షత్రియధర్మములు సాధారణ పరిస్థితులలో క్షత్రియులు పాటింపదగినవి - పాండవులప్పుడు సాధారణ పరిస్థితులలో లేరు. మహోపద్రవకరమయిన ఆపత్కరపరిస్థితులలో నున్నారు.

ఏవం తథైవాపది లింగమేతత్ ధర్మాధర్మౌ నిత్యవృత్తీ భజేతామ్
ఆద్యం లింగం యస్య తస్య ప్రమాణం ఆపద్ధర్మం సంజయ తం నిబోధ.

మ.భా. ఉద్యోగ - 28అ.

ఆపదయందు ధర్మాధర్మములు వ్యత్యస్తమగును. అయినను యజనయాజనాది బ్రాహ్మణధర్మము ఆపద యందును స్వీకరింపదగినది కాదు.

"విద్యా శిల్పం భృతిస్సేవా గోరక్షం విపణి: కృషి:
ధృతిర్భైక్ష్యం కుసీదం చ దశజీవనహేతవ:"

మను. 10అధ్యా. 116.

ఆపత్కాలమున వర్ణాశ్రమధర్మముల నతిక్రమించిన జీవనాధారముతో బిచ్చమెత్తు కొనుట యొకటి, భిక్షాటనము నందరకును ఆపదలందు జీవికలు. జీవించుటకు వేరుమార్గము పూర్తిగా లేనప్పుడు నిషిద్ధ ధర్మమైనను ఆచరింపవచ్చును. అధర్మభీతితో

జీవనమునకు ఇబ్బందియైన ధర్మమాచరించు వాడు దూషింపదగినవాడు. కాన ఎంత నిషిద్ధమయిన పని చేసియైనను బ్రతుకు మార్గముననుసరించ వలెను. నిషిద్ధమయిన పనిచేసిన దోషమగును కదా యనిన ప్రాయశ్చిత్తముచే నాదోషమును మాపుకొనవచ్చునని ధర్మశాస్త్రము చెప్పుచున్నది.

జీవేత్తేన రాజన్యస్సర్వేణాప్యనయం గతః
న త్వేవ జ్యాయసీం వృత్తిమభిమన్యేత కర్హిచిత్

మను. 10అధ్యా - 95.

త్రయో ధర్మా నివర్తంతే బ్రాహ్మణాత్ క్షత్రియం ప్రతి
అధ్యాపనం యాజనం చ తృతీయశ్చ ప్రతిగ్రహః

మను 10 అధ్యా. 77

క్షత్రియుడాపదనొందినపుడు వైశ్యవృత్తితో జీవించవచ్చునుగాని బ్రామ్మణవృత్తితో జీవింపరాదు. బ్రాహ్మణునినుండి క్షత్రియుని కడకు పోవునపుడు పై షట్కర్మలతో నధ్యాపనయాజనప్రతిగ్రహములు మరలుచున్నవి. అనగా నివి మూడును వానికి లేవు, అధ్యయన యజనదానములు వానికి కలవు. అయితే క్షత్రియులు భిక్షాటనముచేయుట దోషమేయయ్యు నది ఆపత్కాలమున జీవికకు వేరునాధారము లేని పరిస్థితులలో నది

"విద్యా శిల్పం భృతిస్సేవా గోరక్షం విపణిః కృషిః
ధృతిర్భైక్ష్యం కుసీదం చ దశజీవనహేతవః

-మను. అధ్యా 116

వేదవిద్యకంటె నితరమైన దశవిధజీవనోపాయములు నందరకు ఆపదలయందు జీవికలుగా ననుమతింపబడినవి. అధ్యాపన యాజనములవలె ప్రతిగ్రహణము దోషావహముకాదు. ఒకవేళ దోషావహమే యనుకొన్నను ప్రాయశ్చిత్తముచే నివారించుకొనవచ్చును.

అకామతః కృతే పాపే ప్రాయశ్చిత్తం విదుర్బుధాః
కామతస్తు కృతం మోహాత్ ప్రాయశ్చిత్తైః పృథగ్విధైః.

మను ॥ అధ్యా. 45-46.

తెలియక చేసినదానికే ప్రాయశ్చిత్తము కలదని పండితులు చెప్పుదురు. మరికొందరు ఋషులు బుద్ధి పూర్వకముగ పాపము చేసినను దానికిప్రాయశ్చిత్తము కలదని చెప్పిరి. తెలియక దోషము చేసినప్పుడు దోషియొక్క పాపములు వేదాభ్యాసముచే నశించును. రాగద్వేషాదులచే బుద్ధిపూర్వకముగ నొనర్చిన దోషములకు పెక్కుతెరగుల ప్రాయశ్చిత్తములచే (వేదాధ్యయనము, తపస్సు, దానము) నాశము నొందును.

ప్రాయశ్చిత్తమననేమి యని యడుగవచ్చును.

**ప్రాయో నామ తపఃప్రోక్తం చిత్తం నిశ్చయ ఉచ్యతే**
**తపోనిశ్చయసంయుక్తం ప్రాయశ్చిత్తమితి స్మృతమ్**

- మను 11 అధ్యా-47

ప్రాయమనగా తపస్సు. చిత్తమనగా నిశ్చయము. ప్రాయశ్చిత్తమనగా తపస్సు చేయుటకైన నిశ్చయము అని యర్థము. అందుచేతనే ధర్మరాజు సంజయునితో

**"లుప్తా యాం తు ప్రకృతౌ యేన కర్మ నిష్పాదయేత్తత్పరీప్సేద్విహీనః**
**ప్రకృతిస్థశ్చాపది వర్తమాన ఉభౌ గర్హ్యౌ భవతః సంజయైతౌ"**

-మ.భా-ఉద్యోగ 28అ. 4శ్లో

జీవికకు వేరుమార్గములేనప్పుడు ఎంతటి నిషిద్ధకర్మనైనను చేసి జీవితమును కొనసాగించవలెనే కాని అధర్మభీతిచే జీవికకు భంగము రానీయరాదు. నిషిద్ధకర్మలనాచరించుట వలన కలిగెడి దోషమువలని పాపపరిహారమునకు మనుస్మృతి యందే ప్రాయశ్చిత్తకాండలో ప్రాయశ్చిత్తములు సూచింపబడినవి కదా!

'అవినాశమిచ్ఛతాం బ్రాహ్మణానాం ప్రాయశ్చిత్తం విహితం యద్విధాత్రా
సంపశ్యేథాః కర్మసు వర్తమానాన్ వికర్మస్థాన్ సంజయ గర్హయేస్త్వం'

మ.భా. - ఉద్యోగ అధ్యా28. శ్లో5

ధర్మరాజు సంజయునితో వృత్త్యంతరమైనను పొంది జీవులు బ్రతకవలెనని సృష్టికర్తయయిన పరమేష్ఠి ప్రాయశ్చిత్తప్రకరణమును నిర్ణయించెను. కనుక

ఆపద్ధర్మనిర్వహణానంతరము ఆప్రాయశ్చిత్తము చేత మాకు ఎట్టి దోషమును అంటదు. అందుకే మేము ఏకచక్రపురమందు భిక్షాటన మొనరించుట దోషము కానేరదని ఖండితముగా చెప్పెను.

ప్రాయశ్చిత్తమన తపస్సు చేయవలెనను సంకల్పమని గదా చెప్పబడినది.

బ్రాహ్మణస్య తపో జ్ఞానం తపః క్షత్రస్య రక్షణమ్
వైశ్యస్య తు తపో వార్తా తపశ్శూద్రస్య సేవనమ్

మను. అధ్యా ॥శ్లో 235.

బ్రాహ్మణునికి బ్రహ్మచర్యారూపమయిన వేదాంతమును తెలిసికొనుటయే తపస్సు. రాజునకు ప్రజాసంరక్షణమే తపస్సు. వైశ్యునికి కృషి, వాణిజ్యము, పశుపాలనాదులే తపస్సు, శూద్రునికి బ్రాహ్మణపరిచర్యయే తపస్సు.

యథాశ్వమేధః క్రతురాట్సర్వపాపాపనోదనః
తథాఘమర్షణం సూక్తం సర్వపాపాపనోదనం

మను. 11అశ్వా శ్లో 260.

దీనికి కుల్లూక భట్టు వ్యాఖ్య వ్రాయుచు :-

యథేతి. యథాశ్వమేధయాగః సర్వయాగశ్రేష్ఠః
సర్వపాపక్షయహేతు ఘమర్షణ సూఒక్తమపి
సర్వపాపక్షయహేతుపస్తథాతి అఘమర్షణ సూక్తోత్కర్షః

పాపమునశించుటకై జపించు నట్టి మంత్రము. ఇది ఋగ్వేదమున 190వ సూక్తము. జలములందుండి మూడుమారులు దీనిని జపించగా గురుతల్పకల్పాది మహాపాతకములు కూడ నశించును.

సూర్యరాయాంధ్ర నిఘంటువు ప్రథమసంపుటముపుట 76

అశ్వమేధము యాగము లలో నెట్లుత్తమమో ఎట్లు సర్వపాపక్షయహేతుకరమో అట్లే సర్వపాపక్షయహేతువగు నఘమర్షణ సూక్తమును మిక్కిలి యుత్తమము. కావున అశ్వమేధము చేసినను, అఘమర్షణసూక్తమును జపించినను నన్ని పాపములు

నశించును. ధర్మరాజు అశ్వమేధయాగమును చేసి అఘమర్షణసూక్తమును జపించి తన భిక్షాటనము వలని పాపమునుండి విముక్తిని పొందెను.

సంజయుడు రాయబారమునకు వచ్చి ధర్మరాజుతో

---- "రుధిరాభీలా న్నంబుకంటెను మేలగు భిక్షాన్నమైన మీనడవడికిన్"

అని బోధింపగా, ధర్మరాజిట్లు సమాధానమును చెప్పెను.

వ॥ --------- ద్విజాతులకు యజన యాజనాది కర్మకరణవిభాగంబు ధర్మశాస్త్రాచార్యులు విధించునప్పుడు, రాజులిచ్చువారు గాని వేడుకొనువారు గారని చెప్పుట సకలలోక ప్రసిద్ధంబు. సర్వవర్ణాశ్రమధర్మ పరిపాలనంబు సేయునట్టి రాజులు దారనిజధర్మంబు వదలుదురా? యదియునుంగాక పాడితోడి యార్జ నంబునం తమకుఁగల కలిమి యనుభవించుచు సత్పథంబున నడచుచుండం దమ్మొరు లన్యాయం బు సేసిన యప్పటికిం గదా యా శస్త్రాస్త్ర ధర్మంబులింద్రాదులగు పెద్దలు గావించిరి ---- " అని వక్కాణించెను.

ఆం.భా. - ఉద్యోగ - 1అ. 343.

కనుక సుక్షత్రియులైన పాండవాదులు ఏకచక్రపురమున ఆపద్ధర్మమవలంబించి భిక్షాటనముచే జీవనము గడుపుటవలన వారలకేవిధమయిన దోషముగాని పాపము, గాని అంటలేదని నిశ్చయముగా చెప్పవచ్చును.



# 27. అశ్వత్థామ యోగ్యత - సౌప్తికవధోద్యోగము - ఉపపాండవులవధ.

ద్రోణాచార్యునకును కృపాచార్యుని చెల్లెలు కృపికి పుట్టినవాడు అశ్వత్థామ. ఇతడు ఈశ్వరాంశసంభవుడు. ఈశ్వరుడు, యముడు, కామము, క్రోధము ఏకత్వముపొందగా పుట్టినవాడు శూరుడు వీరుడు శత్రుంజయుడు అయినవాడశ్వత్థామయని భారతమునందు చెప్పబడినది.

మహాదేవాంతకాభ్యాం చ కామాత్ క్రోధాచ్చ భారత
ఏకత్వముపపన్నానాం జజ్ఞే శూర: పరంతప:
అశ్వత్థామా మహావీర్య: శత్రుపక్ష క్షయావహ:"

మ.భా. ఆది. 676.

ఆంధ్రభారత మాదిపర్వమునందును -

కII అలఘుఁడు కామక్రోధా
దులయేకత్వమునఁబుట్టె ద్రోణునకు మహా
బలుఁడశ్వత్థామ రిపు
ప్రళయాంతకుఁడస్త్ర శస్త్ర పరిణతుఁడగుచున్

అని కలదు. ఉద్యోగపర్వమునందును అశ్వత్థామ ప్రశంస కలదు :-

ద్రౌణిశ్చ పరమాస్త్రవిత్
అశ్వత్థామ్నో మహారాజ స చ శూర:"

మహా. భా. ఉద్యో . 54అ.

ఇంత మాత్రమే మూలమున కలదు. కాని యీ సందర్భమున తిక్కనసోమయాజి

కII ఈశ్వరవరజనితుడు హరి
దశ్వప్రతిమాన తేజుఁడస్త్రకళాని

త్త్రైశ్వర్య ధురంధరఁడీ
యశ్వత్థామ గలుగ మన కని వెఆపేలా!

- ఆ.మభా. ఉద్యోగ 2అ. 211 ప

అశ్వత్థామ ఈశ్వరవరజనితుడనియే వ్రాసినాడు. అంతేకాదు, అశ్వత్థామ ఈశ్వరవరజనితుడని మహాభారతమున పెక్కుచోట్ల పేర్కొనబడినది.

"విద్ధి ద్రౌణిం చ రుద్రజం"

మ.భా - ఆశ్రమ.31అ

"రుద్రాంశమున ద్రౌణి యుదయమయ్యె"

ఆ.భా. ఆశ్రమ. 2అ. 113ప

తథైవ కర్మణా తూర్ణం మహతస్తపసోఽపి చ
తేజో మన్యుం చ బిభ్రత్త్వం జాతో రుద్రాన్మహామునే

మ.భా. ద్రోణప. అధ్యా 202.

నీవు చేసిన ఈశ్వరారాధన రూపమైన కర్మవలన మహత్తరమైన తపస్సు వలన తేజస్సును, క్రోధమును ధరించి నీవు రుద్రుని వలన జన్మించితివని అశ్వత్థామతో వ్యాసులవారు చెప్పిరి.

అశ్వత్థామ పుట్టినప్పుడే ఉచ్చైశ్రవసమువలె సకిలించెను. ఆ ధ్వనికి మూడు లోకములు కంపించి పోయెను. అశ్వమువంటి స్థామము అనగా శరీరము కలవాడు కనుక అశ్వత్థామ అని ఆకాశవాణి నామకరణము చేసెను. ఈతని పరాక్రమాతిశయములను గూర్చి మహాభారతమునందీ క్రింది ప్రశంస కలదు.

అశ్వత్థామ శూరుడు. యుద్ధమునందు ద్రోణుని యంతవాడు. పరశురామునిచే సమ్మతింపబడిన వాడు, ఇంద్రునితో సమానుడు. వీర్యమున కార్తవీర్యునితో సమానుడు. బుద్ధియందు బృహస్పతితో సమానుడు. ధైర్యమునందు పర్వతముతో సమానుడు, తేజమున అగ్నితో సమానుడు. యువకుడు, గాంభీర్యమునందు సముద్రము వంటివాడు. క్రోధమున కోడెత్రాచు వంటివాడు. రథికులలో ఉత్తముడు. వాయువువలెనే వేగము కలవాడు. ధనుర్ధరులను జయించినవాడు. అలసటలేనివాడు.

వాయువు వలెనే వేగము కలవాడు. యుద్ధమునందు కోపించిన యముని వంటివాడు. యుద్ధమునందు బాణప్రయోగము చేయుచున్నప్పుడు భూమికూడ పీడింపబడిన దగును. యుద్ధమునందు బాధలేనివాడు, వీరుడు నిజమయిన పరాక్రమముకలవాడు, వేదములను పూర్తి చేసినవాడు. వ్రతములన్నిము పూర్తి చేసినవాడు. ధనుర్వేదమును పూర్తిగా నెరిగినవాడు. దశరథరాముని వలెనే సముద్రమువలె కలతబడనివాడు.

రథాతిరథులను వర్ణించి చెప్పునపుడు బీష్మడు అశ్వత్థామనుగూర్చి ఉద్యోగపర్వమున నిట్లు చెప్పినాడు. అశ్వత్థామ గొప్ప విలుకాడు.

ధనుర్ధరులందరిని మించినవాడు. గొప్ప యోధుడు. దృఢమయిన అస్త్రసంపద కలవాడు. అర్జునుని వలెనే ధనుస్సునుండి వదలిన ఈతని బాణములు కూడ కలిసి ఒక్కటిగా పోవును. ఈతని తరగతిని నిర్ణయించుట నాకు అశక్యము. కోరినచో నీతడు మూడు లోకములను దహించివేయగలడు. ద్రోణునివలన దివ్యాస్త్రసంపద అనుగ్రహింప బడినది.

ఇతనిలో నొక మహాదోషమున్నది. అందువలన ఇతడు రథియో అతిరథుడో నేను చెప్పలేకున్నాను. ఇతనికి ప్రాణములపై తీపి మెండు. ఆయుష్కాముడు. ఇతనికి సమానుడు రెండుసేనలలోను లేడు. ఏకాకియై దేవసైన్యమును గూడ జయింపగలడు. అరచేయి శబ్దముచేతనే పర్వతములను ఛేదించగలడు. మంచి శరీరసౌష్ఠవము గలవాడు. లెక్కలేనన్ని సుగుణములు గలవాడు. భయంకర తేజస్సంపన్నుడు. యముని వలె సహింపరాని వాడు. క్రోధమునందు ప్రళయాగ్ని కల్పుడు. ఇతడు భారతయుద్ధము యొక్కచివరి భాగమును పూర్తి చేయును.

అశ్వత్థామ రుద్రుని యంశమున జన్మించిన రౌద్రరసోల్లసితమూర్తి. మిక్కిలి తొందరపాటు కలవాడు. తీవ్రమయిన ప్రతీకారవాంఛ కలవాడు. తాను సంహరింపదలచిన శత్రువును సంహరించుటలో ధర్మా ధర్మవిచక్షణను పాటించని వాడు. మంకు పట్టు కల వాడు. బ్రాహ్మణునకు సహజములై యుండదగు శాంతశమాది గుణములు ఈతనియందు కలికమున్కైనను లేవు. శత్రువులైన వారిని న్యాయముగానో అన్యాయముగానో వధించి శాంతించుటయే యితని ధ్యేయము. ఇతడు విచక్షణారహితముగా నారాయణాస్త్రమును ప్రయోగించెను గాని అది కార్యకారికాలేదు. ఆశించిన ఫలితము రాలేదు. అట్లే కృష్ణార్జునులపై ఆగ్నేయాస్త్రమును ప్రయోగించెను.

అదియు అర్జునుడు ప్రయోగించిన బ్రహ్మాస్త్రముచే శాంతించెను.

అంతట అశ్వత్థామ -

**తతో ద్రౌణిర్ధనుర్యస్య రథాత్ప్ర స్కంద్య వేగిత:**
**ధిగ్ధిక్సర్వ మిదం మిథ్యే త్యుక్త్వా సంప్రాద్రవద్రణాత్**

మ.భా - ద్రోణ - 202 అధ్యా

రథమునుండి దిగి ఛీఛీ అంతామిథ్య అని చెప్పుచు యుద్ధము మాని పరువెత్తెను. ఇవి అశ్వత్థామ యందలి బలహీనతలు, తానుప్రయోగించిన మహాఽగ్నేయాస్త్రము కృష్ణార్జునుల పట్ల యేల వృధయయ్యెనని వేదవ్యాసమునీంద్రులలో మొరపెట్ట వారిట్లు చెప్పిరి. కృష్ణార్జునులు నరనారాయణులు మీరు ఉభయులు శివార్చనాపరులే కాని రెంటికిని తారతమ్యము కలదు. వారులింగారాధన చేయనివారు. నీవు పార్థివలింగమును పూజించినావు.

**స ఏష రుద్రభక్తశ్చ కేశవో రుద్రసంభవ:**
**సర్వరూపం భవం జ్ఞాత్వా లింగమర్చయతి ప్రభు:**
**సర్వభూతమయం జ్ఞాత్వా లింగమర్చయతి య: ప్రభు:**
**తస్మిన్నభ్యధికాం ప్రీతిం కరోతి వృషభధ్వజ:**

-మహా. భా .వి. పు. 479

కృష్ణుడు రుద్రభక్తుడు. సర్వమును రుద్రునిగా తెలిసికొని లింగార్చన చేసెను. సర్వభూతమయముగా నెరిగి లింగార్చనచేసినవారియందు ఈశ్వరునకధికప్రీతి. నీవును తపస్సు వలన, శివార్చనవలన కోపమును తేజమును దాల్చి యా రుద్రునినుండి పుట్టినావని బోధించెను.

2. సౌప్తిక వధోద్యోగము.

దుర్యోధనుడు రణరంగమున తొడలు విరిగి పడియున్నాడు. వాని దురవస్థనుగాంచి కృతవర్మ అశ్వత్థామ కృపాచార్యులు మిక్కిలి విచారించిరి. అశ్వత్థామ పాండవులను వధించి దుర్యోధనునికి ప్రీతిని కలిగింతునని హామీ యిచ్చెను. దుర్యోధనుడు అశ్వత్థామను సర్వసైన్యాధిపతిని చేసెను. దుర్యోధనుడు తాను

చేసినదుష్కార్యమునకు తగిన ఫలమనుభవించుచున్నాడనియు, అందుకు గాను పాండవులను సంహరింపబూనుట అధర్మమనియు కృపాచార్యులు బోధించిరి. అశ్వత్థామ చేయబోవు అకార్యమును మాన్పుటకు కృపాచార్యులెంతయో ప్రయత్నించిరి. ధర్మములు బోధించిరి. కాని ఆ ధర్మోపన్యాసములన్నియు నశ్వత్థామపట్ల నిష్ఫలములైనవి. వటవృక్షముపైన నిద్రలోగల కాకులగుంపును ఒక గుడ్ల గూబ వధించుటయే ఆతనికి మార్గదర్శకమయ్యెను. అశ్వత్థామ పాండవశిబిరమును సమీపించెను. అచ్చట మహేశ్వర సాక్షాత్కారము, అశ్వత్థామ ఆత్మోపహారము శంకరుని అనుగ్రహము జరిగినవి. శంకరుడు అశ్వత్థామతో "అభి భూతాస్తు కాలేన నైషా మద్యాస్తి జీవితం" వారందరు కాలవశులైరి. వారికి జీతములేదని చెప్పి అశ్వత్థామకు ఒక ఖడ్గమునిచ్చి ఆతని దేహములో ప్రవేశించెను.

శంకరావేశితుడైన అశ్వత్థామశిబిరములో ప్రవేశించి కృపకృతవర్మలను ద్వారములందునిలిపి ప్రళయకాలరుద్రునివలె శత్రుసంహారముగావించెను. ధృష్టద్యుమ్నుని శిబిరము ప్రవేశించి ధృష్టద్యుమ్నునకు వచ్చినవాడు అశ్వత్థామయని తెలిసి లేవబోగా జుట్టుపట్టుకొని నేలమీద పొర్లించి కాలితో రొమ్మును కంఠమున త్రొక్కిపట్టి పశువును చంపినట్లు చంపెను.

ధృష్టద్యుమ్నస్య యో మృత్యుః సృష్టస్తేన మహాత్మనా
యథా ద్రోణస్య పాంచాల్యో యజ్ఞసేనసుతోఽభవత్

మ.భా. ద్రోణ 156అ

ఈతనిని చంపిన వానిని చంపే కొడుకు కావలెనని ద్రోణుడు అశ్వత్థామను కోరి కనెను. కనుక ద్రోణుని చంపిన ధృష్టద్యుమ్నుని అశ్వత్థామ చంపవలెను గదా. అదియును గాక భారతయుద్ధము పూర్తి అయినది. దేవకార్యము తీరినది. అగ్నిదేవుడు ధృష్టద్యుమ్నుడుగా పుట్టినాడు. అతడింక ఈ లోకములోనుండి చేయవలసిన దేదియులేదు.

ఈతరువాత ధృష్టద్యుమ్నుని సోదరులు ఉత్తమౌజుడు, యుధామన్యుడు లేచిరాగా వారిని పశువులమాదిరిగా చంపెను. తనను ఎదుర్కొనిన ఉపపాండవులను, శిఖండిని ద్రుపదునియొక్క మిగిలిన పుత్రులను పౌత్రులను విరాటరాజు బలమును, సర్వసైన్యమును తుదకు గజతురగాదులను కూడ ఖండించెను.

ఇక శిఖండివిషయము - భీష్ముని చంపే కుమారుడు కావలెనని ద్రుపదుడు శంకరుని గూర్చి తపస్సుచేయగా శంకరుడు ప్రత్యక్షమై ముందుస్త్రీయై పిదపపురుషుడయ్యే పుత్రుడు కలుగునని వరమిచ్చెను. కాశీరాజు పెద్దకుమార్తె అంబ భీష్ముని వధింపగోరి తపస్సు చేయగా శంకరుడు ప్రత్యక్షమై

"హనిష్యసి రణే భీష్మం పురుషత్వం చ లప్స్యసే"

అని వరమిచ్చెను. స్త్రీగా జన్మించిన శిఖండికి స్థూలాకర్ణుడను యక్షుడు తన పురుషత్వము నిచ్చి శిఖండి స్త్రీత్వమును గ్రహించెను. కుబేరుని శాపమువలన శిఖండి జీవించి యుండు నంతవరకు శిఖండి పురుషత్వమునే వహించును. శిఖండి మరణించిన గాని స్థూలాకర్ణున కాతని పురుషత్వము తిరిగి రాదు. భారతయుద్ధము ముగిసినది. శిఖండి భీష్ముని వధించెను. ఇక యీలోకమున శిఖండి ప్రయోజనములేదు. శిఖండి చచ్చినగాని స్థూలాకర్ణుడను యక్షుని శాపవిమోచనము కాదు. అందువలననే శిఖండి వధింపబడెను.

మనుష్యులయందు అశ్వత్థామకు విరోధముండిన నుండవచ్చునుగాని గుఱ్ఱములు ఏనుగులు ఏమిపాపము చేసినవి? వానినన్నిటిని అశ్వత్థామ మహాదారుణముగా చంపినాడు. లయకర్త ఈశ్వరు డావేశించుటచే యుక్తాయుక్త విచారముగోల్పోయి చేసిన దారుణకృత్యమిది. అశ్వత్థామక్రౌర్యమునకు సజీవతార్కాణమే యీ దారుణ కృత్యము.

### 3. ఉపపాండవుల వధ :-

అశ్వత్థామ నిద్రపోవుచున్న ఉపపాండవులను చంపినాడా యుద్ధము చేసియే వారిని చంపినాడా అను విషయము చర్చనీయాంశము. పోతనామాత్యుడు తన భాగవతమున ద్రౌపది అశ్వత్థామను అధిక్షేపించు సందర్భమున నీవిధముగా వ్రాసిరి.

క॥ భూసురుఁడవు బుద్ధిదయా
భాసురుఁడవు శుద్ధవీరభటసందోహా
గ్రేసరుడవు శిశుమారణ
మాసురకృత్యంబు ధర్మమగునే తండ్రీ.

శా॥ ఉద్రేకంబున రారు శస్త్రధరులై యుద్ధావనిన్ వేరు కిం
చిద్ద్రోహంబును నీకుఁజేయరు బలోత్సేకంబుతోఁజీఁకటిన్
భద్రాకారులఁభిన్నపాపల రణప్రౌఢక్రియా హీనులన్
నిద్రాసక్తుల సంహరింపనకటా ॥ **నీ చేతులెట్లాడెనో!**

అం.మ.భాగవ. - ప్ర.స్కం - 161 - 162.

ఈ పద్యములు మిక్కిలి ప్రజాదరణ పొందిన పద్యములు. వీనిని చదివినవారు పాపము అశ్వత్థామ నిద్రపోవుచున్న పసిపాపలు రణవిద్యాకౌశలమునెరుంగని అయిదుగురు ఉపపాండవులను ఊచకోతగా కంఠములను తునిమి వధించెనని భావింతురు. వాస్తమదికాదు. ఈ ఉపపాండవులు పసిపాపలు కారు ఇరువదియైదుసంవత్సరములు నిండినవారు. అభిమన్యునివలెనే వీరును అర్జునునియొద్ద సకల ధనుర్విద్యారహస్యములను నేర్చినవారు. పదునెనిమిది రోజులు కురుక్షేత్రసంగ్రామమున ఘోరయుద్ధమునను పాల్గొని మృతిచెందక కడవరకు జీవించి యున్నవారు. నాటి రాత్రి పాండవశిబిరమున నేమిజరిగినదో మూలభారతమున చెప్పబడినది :-

ద్రౌపదేయానభిద్రుత్య । ఖడ్గేన వ్యధమద్బలీ
తతస్సనరశార్దూలం । ప్రతివింధ్యం మహాహవే
కుక్షిదేశేఽవ ధీద్రాజన్ । సహతో న్యపతద్భువి.
ప్రాసేన విద్ధ్వాద్రౌణింతు । మతసోమః ప్రతాపవాన్
పునశ్చాసిం సముద్యమ్య । ద్రోణపుత్రము పాద్రవత్
సుమసోమస్య సాసింతం బాహుంభిత్వా నరర్షభః
పునరప్యాహనత్పార్శ్వే । సభిన్న హృదయోఽపతత్
నాకులిస్తు శతానీకో । రథచక్రేణ వీర్యవాన్ --
దోర్భ్యాముతి ప్యవేగేన । వక్షస్యేన మతాడయత్
అతాడయచ్ఛతానీకం ముక్త చక్రం ద్విజస్తుసః
సవిహ్వాలో యయౌభూమిం । తతోఽస్యా పహరచ్ఛిరః
శ్రుతకర్మాతు పరిఘం । గృహిత్వా సమతాడయత్

అభిద్రుత్యతదా। ద్రౌణిం । సవ్యే సఫలకే భృశం
సతుతం శ్రుతకర్మాణ । మాస్యే జఘ్నే వరాసినా

-మహా. భా .వి పు. 60

మ.భా. సౌపిక

దీని వలన ఉపపాండవులు నిరదపోవుట లేదని లేచి ఆయుధధారులై అశ్వత్థామను కొట్టుచు కొంతయుద్ధము జరిపి తుదకు వారందరు చచ్చిరనుట స్పష్టమే కదా! ఈ ఘట్టమునే తిక్కనసోమయాజియు నాంధ్రభారతమున విపులముగా తెనిగించెను.

"----------ద్రౌప

తే॥ దేయులును దానఁబన్ని యు ద్యుత్తశౌర్య
మానతుంగ ప్రభద్రక మాత్స్యతతులుఁ
దోడ బలులిడి దరుమంగ ద్రోణతనయు
ముట్టి శస్త్రాస్త్రచయముల ముంచుటయును

మహాస్రగ్ధర॥

చతురంగ చ్ఛేద కేళీసరభసకలనాశ్చర్య ధౌరేయ నానా
గతులం దన్నెల్ల వారుం గడిఁదియసురనాఁగా నతిక్రూరచేష్టో
ద్ధతి యొప్పంజొచ్చి సైన్యాస్త్రముల నతని యస్త్రములంద్రుంచి వీఁకం
బ్రతివింద్యుం గిట్టి రెండై పడఁగదునిమెఁదద్భాసమానాంగయష్టిన్.

వ. ఇవ్విధంబున ధర్మతనయునందనుని నడుము దెగనడిచి యార్చిపేర్చిన

మహాస్రగ్ధర॥

అతి శోకక్రోధవేగవ్యధితహృదయుడై యశ్వపాదిత్య వీరో
ద్ధతిఁబ్రౌఢస్ఫూర్తి సెల్వొందఁగ సబళముఁ దద్గాత్రము జొన్పఁబూఁచె
న్సృతసోముండల్లఁబట్టెమ్గురుసుతుఁడగియున్ స్రుక్కు చెన్నార వల్క
వృతఖడ్కుండైనఁ జేయున్శిరముఁదురగముస్రేల్మిడిం ద్రుంచివైచెన్

వ॥ ఇవ్విధంబునఁజిత్రవధంబునకు గోచరుండైన కీచకాంతక తనయుం గనుంగొని

మహాస్రగ్ధర॥

నినుఁగూడన్ వీఁడెవచ్చెన్ నృపుడనుచు శతానీకుఁడా ఛలచక్రం
బున నశ్వత్థామ వక్షంబునను రుధిరంబొంగఁగాఁజేయ నప్పా
టున నీడంబోక బల్వేటున నిలఁబడ నాటోపముంజూపి యంతం
దనివో కాదుర్జయుండాతని శిరమును దద్గాత్రముంబాపె లీలన్.

వ॥ అట్లు నకులసూనుండు సమసిన.

మహాస్రగ్ధర॥

శ్రుతసేనుండప్డు కోపస్ఫురదరుణ మరీచుల్ దలిర్పంగఁజక్షు
ర్ద్వితయంబునం గెంపునం బొందినచెలువము సందీప్తఘోరంబుగా బె
ట్టితనిం జంచద్గదన్ వ్రేయఁగనుఱక తదాస్యచ్ఛిదాస్ఫారకేళీ
చతురుండై యక్కుమారున్ జముకడకని చెన్‌జండదోర్దర్ప మొప్పన్.

వ॥ ఇత్తె ఱంగున వికృతాననుండై పడి మృతుండైన సహదేవసుతుం జూచి
రోషంబునం చేర్చి

మహాస్రగ్ధర॥

వితతజ్యానాద మాశావితతి నినిచి దోర్వీర్యమేపార భాణ
ప్రతతిం దన్మ్రంప వీఁకం బాలక జడియుచున్ బల్విడిన్‌చేర్చి చంచ
ద్గతిఁగ్రీడం దంతి హేలాదళనరత మృగేంద్రస్ఫురన్మూర్తి దోఁపన్
శ్రుతకీర్తిం గిట్టె కంఠత్రుటన విలసనారూఢి నవ్విప్రుడొప్పెన్.

వ॥ ఇట్లు ద్రౌపదీ తనయపంచకంబు పంచత్వంబు నొందినఁ
గ్రోధాతిరేకంబునఁబ్రభద్రకులును శాంతనవాంతకుండును
ధృష్టద్యుమ్నాంతకుఁజుట్టెముట్టె.

ఆ.భాన.సౌప్తిక. 1అ. 178 నుండి -190 వరకు

పోతనగారిపైనపేర్కొన్న పద్యములు, మహాభారత సౌప్తికపర్వగాథకు విరుద్ధములు.
కాగా భాగవతమునందిట్లున్నదా అనిన వ్యాసులవారు భాగవతప్రథమస్కంధములో

అర్జునుడు అశ్వత్థామను పట్టి తీసికొనివచ్చి ద్రౌపదికి అప్పగించగా నప్పుడామె.

తదాహృతం పశువత్పాశబద్ధం అవాఙ్ముఖం కర్మజుగుప్సితేన
నిరీక్ష్య కృష్ణాఽపకృతం గురోస్సుతం నామ స్వభావాకృపయానవాను చ
అట్లు లజ్జాపరాఙ్ముఖుండైన యశ్వత్థామను జూచి ద్రౌపది యిట్లనెను.
ఉవాచ చాసహంత్యస్య బంధనానయనం సతీ
ముచ్యతాం ముచ్యతామేష బ్రాహ్మణో నితరాం గురుః
సరహస్యో ధనుర్వేదః సవిసర్గోపసంయయః
అస్త్రగ్రామశ్చ భవతా శిక్షితో యదనుగ్రహాత్
స ఏష భగవాన్ ద్రోణః ప్రజారూపేణ వర్తతే
తస్యాత్మనోఽర్ధం పత్న్యాస్తే నాన్వగా ద్వీరసూ కృపీ
తద్ధర్మజ్ఞ మహాభాగ భవద్భిర్గౌరవం కులం
వృజినం నార్హతి ప్రాప్తుం పూజ్యం వంద్యమభీక్ష్ణశః
మారోదీత్తస్య జననీ గౌతమీ పతిదేవతా
యథాహం మృతవత్సారా రోదిమ్యశ్రుముఖీ ముహుః

మ.భా.వి. పు 61

మా మగవారలందరు మీ తండ్రియయిన ద్రోణాచార్యుని యొద్ద విద్యనభ్యసించి నారు. నీవో పుత్రాకృతినున్న ద్రోణుడవే కదా. దయలేక మీశిష్య సుతులైన ఉపపాండవులను వధించుట ధర్మమా? నేనెట్లు పుత్రశోకముచే దుఃఖించుచున్నానో చూచితివికదా! పతివియోగము చే దుఃఖించుచున్న నీతల్లియైన కృపికి నిన్ను వధించి పుత్రశోకమును కల్గించజాలను. నిన్ను బాధించుట చేతనే నీతల్లి బాధపడును. కనుక బ్రాహ్మణుడైన అశ్వత్థామను హింసించవలదని భర్తలను కోరినది. మూలమున నున్న విషయమిదియే - "ఉద్రేకంబునరారు. అను పద్యపాఠము పోతనామాత్యులు మూలమునకు విరుద్ధముగా కల్పించినది. భక్త్యావేశమున మున్కలిడుచు మూలాతిక్రమణమును లెక్కగొనలేదనవలసి వచ్చును.

పూర్వము హరిశ్చంద్రుని రాజ్యసర్వస్వమును గైకొని విశ్వామిత్రుడు ఆయనను అడవికి పంపునపుడు ఆయన భార్యాసహితముగ దుఃఖముతో నడవికి వెళ్ళునపుడు

విశ్వామిత్రుడు చంద్రమతిని తన చేతి దండముతో గొట్టగా దానిని చూచి విశ్వదేవతలు-

ఉ॥ అక్కటికంబుడెందములు యందు జనింపగ వచ్చి యక్కటా
యిక్కమలాక్షి సాధ్వి యిటులేటికి మోదెడు చేతికోలనిం
కెక్కడి పుణ్యలోకముల కేగెడు నిమ్మని సత్యనిష్ఠ బెం
పెక్కిన యన్నరేశ్వరుని నేమిటినిమ్మొయి గాసి పెట్టెడిన్

వ॥ అనిన నప్పలుకులు విని విశ్వామిత్రుడు రోషారుణిత లోచనుండై
యవ్విశ్వదేవతలంజూచి, మనుష్యపక్ష
పాతంబున నన్ను ధిక్కరించితిరి మనుష్యులు గండని
శపించి లోన ప్రసన్నత్వంబును గైకొని మీకు సంతానంబు
నుర్వినుండకుండ వలయుంగావున మీరు బ్రహ్మచారులై
కామక్రోధలోభమోహమదమత్సరంబులం బొరయక
యల్పకాలంబున శరీరంబులు విడిచి, దేవభావంబులు
గైకొనుండని యను గ్రహించె, అది కారణంబుగ
విశ్వులేవురు ద్రౌపదిగర్భంబున పాండునందనులేవురకును
ఉద్భవించి, వివాహంబులు లేక దీర్ఘాయుష్యులు గాక
చనిపోయిరని"

మార్కండేయపురాణమున చెప్పబడినది.

మార్కండేయపురాణం 1 అశ్వా 185 , 186

వారు విశ్వామిత్రుని శాపము వలన నట్లు చావవలసి యున్నది. మిగిలిన వారందరకు కాలము తీరినది ఆ విషయమును శంకరుడే అశ్వత్థామతో

"అభి భూతాస్తు కాలేన నైషా మద్యాస్తి జీవితం"

అని చెప్పెను. అందుచేతనే ఉపపాండవులు అశ్వత్థామచేతిలో చావవలసివచ్చినది. శాప విమోచనమును పొంది విశ్వదేవతలు విశ్వదేవతలయిరి.

తుదకు అశ్వత్థామ శ్రీకృష్ణ శాపపీడితుడై మూడువేల సంవత్సరములు వ్యాసునివద్దనే యుండి తరువాత శాపానంతరముకూడ అశ్వత్థామ వ్యాసాశ్రమమునందే తపస్సు చేసికొనుచుండును. అతడు చిరంజీవి

"అశ్వత్థామా బలిర్వ్యాసో హనుమాంశ్చ విభీషణః
కృపః పరశురామశ్చ సప్తైతే చిరజీవినః"

దే. భాగ - 1స్కం- 3అధ్యా. 23.

ఈ కలియుగము తరువాత వచ్చు 29వ మహాయుగమున అశ్వత్థామ వ్యాసుడై వేదవిభజనము చేయును.

"ఏకోన త్రింశత్వం ప్రాప్తే ద్రౌణిర్వ్యాసో భవిష్యతి"

29వ మహాయుగమున అశ్వత్థామ వ్యాసుడగును. ఇప్పుడు సప్తమ మన్వంతరము జరుగుచున్నది. రాబోయే అష్టమమన్వంతరములో

"గాలవో దీప్తిమాన్ రామో ద్రోణపుత్రః కృపస్త థా
ఋష్యశృంగః పితాస్మాకం భగవాన్ బాదరాయణః
ఇమే సప్తర్షయస్తస్తిన్ భవిష్యతి స్వయోగతః
ఇదానీ మాసతే రాజన్ స్వేస్వ ఆశ్రమమండలే"

భాగ - 8స్కం- 13అ. 15-16 శ్లో

గాలవుడు, దీప్తిమంతుడు, పరశురాముడు, అశ్వత్థామ, కృపాచార్యుడు, ఋష్యశృంగుడు, వ్యాసభగవానుడు సప్తర్షులయ్యెదరు. ఇప్పుడు వారివారి ఆశ్రమములలో యోగనిష్ఠులై యున్నారు.

రాబోవు మహాయుగమునందు వ్యాసపీఠమును, రాబోవు మన్వంతరమున ఋష్యశృంగ కృప వ్యాస పరశురాములతో పాటు సప్తర్షి పీఠమునలంకరింపనున్న మహాజ్ఞాని, తపస్సంపన్నుడు, శస్త్ర శాస్త్ర పరిజ్ఞానప్రావీణుడు అభిమానధనుడు అశ్వత్థామ.



# 28. శ్రీ కృష్ణుడు పరమేశ్వరావతారము

భగవంతుడైన శ్రీమహావిష్ణువు సర్వవ్యాపకుడు, సర్వశక్తి యుతుడు, అజన్ముడు, అమరుడు, ఆద్యంత రహితుడు, అట్టివాడు మానవ దేహము నెట్లు ధరించును? మానవ దేహమును ధరించినచో జనన మరణవలో శ్రీమహావిష్ణువు మానవుడై యున్నందున ఈ సృష్టిస్థితికి కారకుడెవ్వడు? ఈ యావత్ప్రపంచమును పరిపాలనము నెవరు చేసిరి ? ఆ కాలమున శ్రీమహావిష్ణువు వైకుంఠమున లేకపోవుటచే వైకుంఠము శూన్యమై పోయెనా? ఒకవేళ శ్రీకృష్ణుడు భగవంతుని అవతారమేయైనచో కౌరవులతో విరోధమేల? శిశుపాలునితో వాదులాడుటేల? జరాసంధునితో యుద్ధమేల? ఆ జరాసంధునికి భయపడి మధురను వదలి ద్వారకకు పారిపోవుటేల? కనుక శ్రీకృష్ణుడు పరమేశ్వరుని అవతారమే కాదని లాలా లజపతిరాయ్ వంటి సుప్రసిద్ధ పండితులు శ్రీకృష్ణ చరిత్రము నందు వ్రాసిరి. ఆ శ్రీకృష్ణ చరిత్రము తెలుగున కూడ అనూదితమయినది.

లౌకిక దృష్టికి పైవాదము సమంజసముగనే కనిపించును. కాని వాస్తవమదికాదు. లౌకిక దృష్టి కలవారికి తెలియని ధర్మరహస్యములెన్నియో మన వేద పురాణాది వాఙ్మయమునందు నిక్షిప్తమయియున్నవి. భగవద్గీతలో చతుర్థాధ్యాయ ప్రారంభమున శ్రీకృష్ణుడు - “ఇమం వివస్వతే యోగం ప్రోక్తవానహమవ్యయమ్” అని అర్జునునితో నీకు చెప్పబడిన ధర్మయోగ సహితమయిన జ్ఞానయోగమును సృష్ట్యాదియందును సూర్యున కుపదేశించితిననియు - “స ఏవా యం మయా తేऽద్య యోగః ప్రోక్తః పురాతనః” దానిని నీకిప్పుడుపదేశించితిననియు జెప్పగా అర్జునుడు “వసుదేవ గృహమందు జన్మించిన నీవు సృష్ట్యాదియందు సూర్యునకు జెప్పితిననుట యెట్లు సరిపడును?” అని ప్రశ్నించెను. అర్జుననంతటి మహాజ్ఞానికే నాడే అనుమానము కలిగెనే ! ఇక యీ నేటి పండితుల విజ్ఞానమేపాటిది? దానికి శ్రీకృష్ణపరమాత్మ భగవద్గీతయందే స్పష్టముగా సమాధానమును చెప్పెను.

“బహూని మే వ్యతీతాని జన్మాని తవ చార్జున
తా న్యహం వేద సర్వాణి న త్వం వేత్థ పరంతప
అజోऽపి సన్నవ్యయాత్మా భూతానా మీశ్వరోऽపి సన్
ప్రకృతిం స్వా మధిష్ఠాయ సంభవా మ్యాత్మమాయయా

పరిత్రాణాయ సాధూనాం వినాశాయ చ దుష్కృతామ్
ధర్మసంస్థాపనార్థాయ సంభవామి యుగే యుగే
జన్మ కర్మ చ మే దివ్య మేవం యో వేత్తి తత్త్వత:
త్యక్త్వా దేహం పునర్జన్మ నైతి మా మేతి సోఽర్జున"

-మహా. భా .తత్త్వ. పు. 278-279

"నాకు బహు జన్మములతీతములైనవి. నాకే కాక నీకునునైనవి. కాని వానిని నేనెరుగుదును, నీవెరుగవు. నాది అనావృత జ్ఞానము. నీది యావృత జ్ఞానము. అదియే నీకును నాకును గల భేదము. అనావృత జ్ఞానశక్తి కలిగి కర్మ సంబంధములేని యీశ్వరుడనైన నాకు జన్మములెట్లని శంకింతువేమో, ఆ ప్రక్రియను వినుము. నేనజుడను, అవ్యయుడను, ఈశ్వరుడను. అట్లయ్యును నా యధీనమై యున్నట్టియు, జగత్తును మోహపెట్టునట్టియు, వ్యాపకము, త్రిగుణాత్మకమునగు మాయ నవలంబించి జన్మించుచున్నాను. అనగా కర్మ నిబంధనమయిన లోక సామాన్యము యొక్క జన్మము వంటిది కాక నాది మాయామయమయిన జన్మము". మరియొక విషయము. శ్రీకృష్ణ పరమాత్మయొక్క శరీరము మన శరీరమువలె పార్థివ శరీరము కాదు. అనగా పాంచ భౌతిక శరీరము కాదు. వసుదేవుని వీర్యమున దేవకీగర్భమున జన్మించలేదు. శ్రీ మహావిష్ణువుయొక్క తేజస్సు తేజఃకిరణములచే దేవకీగర్భమున ప్రవేశపెట్టబడుట చేతనే శ్రీకృష్ణ పరమాత్మ జన్మము కాని ఇందు వసుదేవుని ప్రసక్తి లేదని తాత్పర్యము. కనుకనే "శ్రీకృష్ణస్తు భగవాన్ స్వయమ్" అని చెప్పబడినది. ఇట్టి జన్మమునకు సాధు పరిత్రాణము, అసాధు వినాశనము, ధర్మసంస్థాపనము అనునవి ప్రయోజనములు. "ఇట్లు నా జన్మము ఐచ్ఛికము, మాయారూపము. సకలభూతములకు ఈశ్వరుడనై మనుష్య శరీరముతో వ్యవహరించుచున్న నన్ను నా సర్వోత్కృష్టత నెరుంగని మూఢులు తిరస్కరించుచున్నారు".

అయితే శ్రీకృష్ణునిగ మానవావతారములో నున్నపుడు ఈ సృష్టి యెవరి అధీనమున నుండును? శ్రీమహావిష్ణువు వైకుంఠమున లేకుండును కదా! అని మరియొక శంక. దీనికి సమాధానమును మహాభారత ద్రోణ పర్వమున భగదత్తవధాసందర్భమున శ్రీకృష్ణపరమాత్మయే చెప్పెను.

"చతుర్మూర్తి రహం శశ్వ ల్లోకత్రాణార్థ ముద్యత:
ఆత్మానం ప్రవిభజ్యేహ లోకానాం హిత మాదధే
ఏకామూర్తి స్తపశ్చర్యాం కురుతే మే భువి స్థితా
అపరా పశ్యతి జగత్ కుర్వాణా సాధ్వసాధునీ
తే॥ ఏకామూర్తి ర్బదరికాశ్రమే నారాయణరూపా, అపరా పరమాత్మరూపా
అపరా కురుతే కర్మ మానుషం లోకమాశ్రితా
శేతే చతుర్థీ త్వపరా నిద్రాం వర్షసహస్రికాం
టీక. అపరా క్షేత్రజ్ఞరూపా, అపరా జలశాయినీ,
యా ऽసౌ వర్షసహస్రాన్తే మూర్తిరుత్తిష్ఠతే మమ
వరార్హేభ్యో వరాన్ శ్రేష్ఠాం స్తస్మిన్ కాలే దదాతి సా."

-మ.భా. ద్రోణ. 29 అ.

"అనగా లోకరక్షణకుద్యమించెడి నేను నాలుగుమూర్తులను ధరించి లోకులకు హితమును కలుగజేయుచున్నాను. అందొక మూర్తి బదరికాశ్రమమునందు నారాయణ రూపమై తపశ్చర్యయందున్నది. మరియొకమూర్తి పరమాత్మరూపమై మంచి చెడ్డలను చేయుచున్న జగత్తును కనిపెట్టుచున్నది. మరియొకమూర్తి జలశాయనియై సహస్ర వర్షములు యోగనిద్రచే శయనించి వర్ష సహస్రాంతమందు లేచి అప్పుడు వరములీయ దగినవారికి వరములిచ్చుచున్నదని" భావము.

"విరోధ: కర్మణీతి చేన్న అనేకప్రతిపత్తేర్దర్శనాత్"

-బ్ర.సూ.1-3-27

అని బ్రహ్మసూత్రము, ప్రథమాధ్యాయము తృతీయపాదమునందలి దేవతాధికరణము నందు చెప్పబడినది - ఈ యోగము కర్మకు విరుద్ధము కాదా అను ప్రశ్న రాగా అట్లు కాదు. ఏలయన యోగాభ్యాసముచే అనేక సిద్ధులు కలుగునని చెప్పుటచే కర్మతో విరోధము లేదని ప్రతిపాదింపబడినది. శ్రుతియు యోగి తన యోగబలమును పొంది తన యొక్క అనేక శరీరములను పొందగలడు. ఆ శరీరముతో భూమినంతను సంచరించగలడు. మరికొన్ని శరీరములతో ఉగ్రమయిన తపస్సు చేయగలడు. మరల వాటినన్నింటిని సూర్యుడు తన కిరణములవలెనే తనలో

నంతర్ధానము నొందించగలడని చెప్పబడినది. సూత్రభాష్యమున దేవతాధికరణము నందే "భావస్తు బాదరాయణోఽస్తి హి" అను సూత్రభాష్యమున గొప్ప యోగ ప్రభావము వలన దేవతలకు జ్యోతిరాది రూపములలో నుండుటకును, వారి ఇష్టము వచ్చినట్లు ఆయా శరీరములను గ్రహించుటకును సామర్థ్యము కలదు. ఇంద్రుడు మేషరూపమును ధరించి కణ్వవంశమునందు పుట్టిన మేధాతిథియనువానిని హరించెనని శ్రుతియందు చెప్పబడినది. అట్లే సూర్యుడు స్వస్వరూపముతో ఆకాశమున నుండియే పురుష రూపమును ధరించి కుంతిని పొందెనని భారతముననే కలదు కదా! కావున దేవతలకును, యోగులకును అసాధ్యమగునది ఏదియులేదు. యోగులకును, సామాన్య దేవతలకే యిట్టి శక్తులుండగా యోగేశ్వరేశ్వరుడైన "యత్ర యోగేశ్వరః కృష్ణః" శ్రీకృష్ణ పరమాత్మ కట్టి శక్తులుండుటలో నాశ్చర్యమేమున్నది?

శ్రీకృష్ణుడు భగవంతుని అవతారమేయైనచో నాతడు సర్వశక్తియుతుడు కదా! అట్టి శ్రీకృష్ణునకు కౌరవులతో విరోధమేల? శిశుపాలునితో వాదులాడుటేల? జరాసంధునితో యుద్ధము చేయుటేల? ఆ జరాసంధునకు భయపడి మధురను వదలి ద్వారకకేల పారిపోవలసి వచ్చెను అని మరియొక శంక.

మహాభారతములో అశ్వమేధ యాగమయిన తరువాత ద్వారకకు మరలిపోవుచున్న శ్రీకృష్ణునికి మార్గమధ్యమమున ఉత్తంకమహర్షి తారసపడెను. శ్రీకృష్ణుడు సర్వశక్తి యుతుడయ్యును కురుక్షేత్ర సంగ్రామమును నివారించి జనక్షయమును తప్పింప లేదని ఉత్తంకమహర్షి కుపితుడై శ్రీకృష్ణుని శపింపబూనెను. అప్పుడు శ్రీకృష్ణ పరమాత్మ ఉత్తంక మహర్షికి చెప్పిన సమాధానమిది -

"అహం విష్ణు రహం బ్రహ్మా శక్రోథ ప్రభవావ్యయః
భూతగ్రామస్య సర్వస్య స్రష్టా సంహార ఏవ చ
అధర్మే వర్తమానానాం సర్వేషా మహ మచ్యుతః
ధర్మస్య సేతుం బధ్నామి చలితే చలితే యుగే
తాస్తా యోనీః ప్రవిశ్యాహం ప్రజానాం హితకామ్యయా
యదా త్వహం దేవయోనౌ వర్తామి భృగునందన
తదాఽహం దేవవ త్సర్వ మాచరామి న సంశయః
మానుష్యే వర్తమానే తు కృపణం యాచితా మయా

న చ తే జాతసంమోహా వచోఽగృహ్ణన్త మోహితాః
భయం చ మహదుద్దిశ్య త్రాసితాః కురవో మయా"

- మ.భా. అశ్వ-54 అ.

"ఓ ఉత్తంక మహర్షీ! బ్రహ్మ, విష్ణువు, రుద్రుడు నేనే. ప్రజలు అధర్మపరులైనపుడు ప్రజాహితమును గోరి ఆయా జన్మములెత్తి ఆయా యుగములలో ధర్మమునకు సేతువును నిర్మింతును. నేను ఏయే జాతి శరీరములను ధరింతునో ఆయా జాతి ధర్మములతో సంచరించుచుందును. నాటకమున వేషము ధరించిన వ్యక్తి తన వ్యక్తిగత జీవితమున నెట్లు ప్రవర్తించినను, రంగస్థలమున నాయా పాత్రలకనుగుణముగనే ప్రవర్తింపవలెను. కాబట్టి ఇప్పుడు మనుష్య దేహమును ధరించిన నేను కౌరవులను యాచించితిని. విశ్వరూపమును జూపి భయపెట్టితిని. మూఢులైనవారు నా మాట నాదరింపలేదు. నేను ధరించిన పాత్ర కనుగుణమయిన ధర్మమునే నే నభినయించితిని" అని చెప్పెను.

ఈ విషయమునే పరమేశ్వరి అవతార సందర్భమున దేవీ భాగవత పంచమ స్కంధమున చెప్పబడినది.

"యథా నటో రంగగతో నానారూపో భవత్యసౌ
ఏకరూపస్వభావోఽపి లోకరంజనహేతవే
తథైషా దేవకార్యార్థ మరూపాపి స్వలీలయా
కరోతి బహురూపాణి నిర్గుణా సగుణాని చ"

-మహా. భా .తత్త్వ. పు. 288

కనుకనే లీలామానుష విగ్రహుడైన శ్రీకృష్ణ పరమాత్మ కౌరవులతో వైరము, శిశుపాలునితో వాదులాడుట, జరాసంధునితో పోరి ఒకొకప్పుడు జయించుచుండుట, ఒక్కొకప్పుడు పారిపోవుట అనునవి. అంతేకాని సంకల్పమాత్రము చేతనే సృష్టి సంహారమును చేయగలడయ్యును మనుష్యరూపమున నుండుటచేతనే మనుష్య

సహజమయిన అభినయమునే అభినయించెను.

దశావతారములలో శ్రీకృష్ణుడు పేర్కొనబడలేదని మరియొక శంక. మహాభారత శాంతి పర్వమున ---

భగవానువాచ ---

**"శ్రుణు నారద తత్త్వేన ప్రాదుర్భావాన్మహామునే**

**మత్స్య: కూర్మో వరాహశ్చ నారసింహోఽథ వామన:**

**రామో రామశ్చ రామశ్చ బుద్ధ: కల్కీతి తే దశ"**

-మ.భా. కుంభకోణప్రతి అ.348

అని దశావతారములను చెప్పెడి సంగ్రహ శ్లోకము. ఇందు మొదటి రాముడు పరశురాముడు, రెండవ రాముడు దశరథరాముడు, మూడవ రాముడు బలరాముడు. కనుక కృష్ణావతార ప్రసక్తి లేదుకదా అని ఆక్షేపము. ఆ సందర్భముననే నీ క్రింది శ్లోకములు కూడా కలవు.

"ద్వాపరస్య కలేశ్చైవ సన్ధౌ పార్యవసానికే
ప్రాదుర్భావ: కంసహేతో ర్మథురాయాం భవిష్యతి
శిశుపాలం వధిష్యామి యజ్ఞే ధర్మసుతస్య వై
సమాగతేషు బలిషు పృథివ్యాం సర్వరాజసు
వాసవి సుస్సహా యో వై మమ త్వేకో భవిష్యతి
యుధిష్ఠిరం స్థాపయిష్యే స్వరాజ్యే భ్రాతృభిస్సహ"

-మహా. భా .తత్త్వ. పు. 370

అని శ్రీమహా విష్ణువు నారదునకుపదేశించెను. కలి ద్వాపర సన్ధి చరమ భాగమున మధురాపురమునందు తాను కంసవధకై యవతరింతుననియు, ధర్మజుని రాజసూయమున శిశుపాలుని వధింతుననియు, అర్జునుడు సహాయుడై

యుండుననియు, సోదరులతో యుధిష్ఠిరుని స్వరాజ్యమందు స్థాపింతుననియు చెప్పియుండెను. కనుక మూడవ రామ శబ్దమునకు బలరామ సహచరితుడగు శ్రీకృష్ణుడనియే తాత్పర్యము. శ్రీకృష్ణుడు పరమేశ్వరావతారమనియు దశావతారములలో నొకడనియు దేవీ భాగవతమునందును, గరుడపురాణమునందును స్పష్టముగా విశదీకరింపబడియే యున్నది.

"సత్యవ్రత ధరాధీశ మత్స్యరూపాయ తే నమః ।
అమృతాప్తికరేశాన కూర్మరూపాయ తే నమః ॥
మహ్యుద్ధారకృతోద్యోగ కోలరూపాయ తే నమః ।
................................ తస్మై నృహరయే నమః ॥
బలిం సంఛలయామాస తస్మై వామనరూపిణే ।
రేణుకాగర్భజాతాయ జామదగ్న్యాయ తే నమః ॥
శ్రీమద్దాశరథే తుభ్యం నమోఽనంతక్రమాయ చ ।
కంసదుర్యోధనాద్యైశ్చ దైత్యైః పృథ్వీశలాంఛనైః ॥
భారాక్రాన్తాం మహీం యోఽసౌ వుజ్జహార మహావిభుః ।
ధర్మం సంస్థాపయామాస పాపం కృత్వా సుదూరతః ॥
తస్మై కృష్ణాయ దేవాయ నమోఽస్తు బహుధా విభో ।
బౌద్ధం రూపం దధౌ యోఽసౌ తస్మై దేవాయ తే నమః ॥
కల్కిరూపం సమాదధ్యౌ దేవదేవాయ తే నమః ।
దశావతారాస్తే దేవభక్తానాం రక్షణాయ వై ॥
దుష్టదైత్యవిఘాతాయ తస్మాత్త్వం సర్వదుఃఖహృత్ ।

"తతో హరిః ప్రాదురభూ న్మహాత్మా నృశింహనామా ।

తతో హరి ర్భగవా న్వామనోऽభూత్ ॥

తతో హరి ర్జమదగ్నే స్సుతోऽభూత్ ।

తతో హరీ రఘువంశేऽవ తీర్ణః

తతో హరిః కృష్ణరూపీ బభూవ । దేవక్యాం వై వసుదేవాత్స విష్ణుః

కంసాదీన్వై నితరాం హన్తుకామ స్సమ్యక్పాతుంపాండవాంశ్చాపివీంద్ర!

అవతారా హ్యసంఖ్యాతా విష్ణో ర్నారాయణస్య చ ।

స్వయం నారాయణాస్తే తే నాణుమాత్రం విభిద్యతే ॥

మహాభారత తత్త్వ కథనము. పుట 368-369

ఇట్లే ఆగ్నేయాది పురాణములలో కూడ కలదు. ఇచట దశావతారములలో కృష్ణావతారము కీర్తింపబడుచు కంస దుర్యోధనాది సంహారార్థము పాండవరక్షణార్థము ధర్మసంస్థాపనార్థము, దేవకీవసుదేవులనుండి కృష్ణావతారమావిర్భవించినదని స్పష్టముగా చెప్పుచుండ శ్రీకృష్ణుడు దశావతారములలో పేర్కొనబడలేదను ప్రసంగము అసంగతము.

సంస్కృత వాఙ్మయములో నేయే శబ్దములకేయే అర్థములు చెప్పవలెనో తెలుపు నిఘంటువు అమరకోశము. అమరకోశ కర్తయగు అమర సింహుడు జైనమతావలంబి. అవైదిక సంప్రదాయస్థుడు. అతడు అమరకోశ ప్రథమకాండము స్వర్గఖండమునందు విష్ణువు నామముల నిట్లు చెప్పెను.

"విష్ణు ర్నారాయణః కృష్ణః ..........

వాసుదేవ స్త్రివిక్రమః ..... దేవకీ నందన

శ్శౌరి శ్శ్రీపతిః ..... కంసారాతి రథోక్షజః ”

అని కృష్ణ, వాసుదేవ, శ్రీపతి శబ్దములతోపాటు విష్ణుమూర్తినే బోధించుచున్నవని చెప్పెను. 'వసుదేవోఽస్య జనకః' అనియూ చెప్పబడినవాడు వసుదేవుని పుత్రుడనియు బోధించెను.

“విష్ణునామా న్యుక్త్వా 'వసుదేవోఽస్య జనక' ఇత్యేవామరసింహేనావైదికేనాపి శ్రీకృష్ణస్యైవ విష్ణుపదవాచ్యం బ్రహ్మత్వమ్ ధ్వనితమ్” అని అవైదిక సంప్రదాయజ్ఞుడైన అమరసింహుడే వసుదేవసుతుడైన శ్రీకృష్ణుడే శ్రీమహావిష్ణువని ఘంటాపథముగా చెప్పుచుండ శ్రీకృష్ణుడు పరమేశ్వరావతారము కాదనియు, నాతడు దశావతారములలో కీర్తింపబడలేదనియు చెప్పుట అవిచారమూలకము, అసంగతము.



# సంభావిత గ్రంథములు


1. అంతరార్థమహాభారతము
-సూర్యనారాయ శాస్త్రి - వేదుల

2. ఆంధ్రమహాభారతము- కవిత్రయము
-వావిళ్ళప్రతి.

3. కేతన- యాజ్ఞవల్క్యస్మృతి
-శివకుమార్ - హరి.

4.ఛాందోగ్యోపనిషత్ - ఉపనిషద్దర్శనము-వ్యాఖ్య
-శ్రీనాధవేంకట సోమయాజులు-నోరి

5. నన్నయ వ్యాసపీఠము- వ్యాససంపుటి.
-టి.టి.డి. ప్రచురణ.

6. బ్రహ్మసూత్రదర్శనము-వ్యాఖ్య
-శ్రీనాధ వేంకటసోమయాజులు - నోరి.

7. భారతామృత రసము
-వ్యాసమూర్తి - కాళూరి

8. మనుస్మృతి. కుల్లూకభట్టు వ్యాఖ్యతో
- బాలసరస్వతీ బుక్‌డిపో.

9. మహాభారత తత్త్వ కథనము
-సుబ్రహ్మణ్యశాస్త్రి - వారణాసి.

10. మహాభారతము (సంస్కృతము) నీలకంఠీయవాఖ్యానుసహితము విరాటోద్యోగపర్వములు
-రఘునాథశర్మ - శలాక

11. మహాభారత సారోద్ధారము -గ్రంథగ్రథనము
-నరసింహావధానిపాకయాజి - ములుకుట్ల

12. మహాభారతచరిత్రము
-సుబ్రహ్మణ్యశాస్త్రి - పెండ్యాల

13. మహాభారతమీమాంస
- నారాయణ శాస్త్రి - చర్ల

14. మహాభారత రహస్యములు
-సూర్యనారాయణశాస్త్రి - శిష్ట్లా

15. మహాభారతము - విశ్వవిజ్ఞానకోశము
- చంద్రశేఖర శర్మ - మూలంపల్లి
16. మహాభారతోపన్యాసములు
- సుబ్రహ్మణ్యశర్మ - నండూరి.
17. మహాభారతము-విమర్శనము
- హనుమంతరాయశర్మ - బలభద్రపాత్రుని
18. మహాభారతము-ధర్మసూక్ష్మ దర్శనము
- చంద్రశేఖర శాస్త్రి - మల్లాది.
19. వ్యాసమహాభారతము-నన్నయ పరిష్కారము
-మృత్యుంజయరావు - జొన్నలగడ్డ
20. సంస్కృత మహాభారత విశేషములు
-కృష్ణమూర్తి - గరికపాటి.

## గ్రంథకర్త గ్రంథముద్రణకు ధన సహాయమందించిన ఆప్తులు

1. శ్రీ ఎస్. వెంకటేశ్వర్లు గారు
భారత్ మెడికల్ స్టోర్సు - ఖమ్మం రు. 5116/-

2. శ్రీ ఎస్. రామమోహనరావు గారు
De.Pt Raj - Khammam రు. 3000/-

3. శ్రీసి హెచ్. రాజ రత్నారెడ్డిగారు
E.E. Pt. Raj - కొత్తగూడెం రు. 2000/-

4. శ్రీ కె. నారాయణరావు గారు
INDO Automobiles. ఖమ్మం రు. 2000/-

5. శ్రీ బి.ఎన్. శాస్త్రిగారు
వ్యవస్థాపక సంపాదకులు - మూసీ
హైద్రాబాదు రు. 2000/-

6. శ్రీ లంకా సుబ్రహ్మణ్యశాస్త్రి గారు
ఖమ్మం రు. 2000/-

7. శ్రీ కె. లక్ష్మారెడ్డిగారు ఖమ్మం రు. 500/-

## ఓమ్ మహాగణాధిపతయే నమః

ఆదౌ పాండవధార్తరాష్ట్రజననం లాక్షాగృహే దాహనం
ద్యూతం శ్రీహరణం వనే విహరణం మత్స్యాలయే వర్తనమ్
లీలా గోగ్రహణం రణే విహరణం సంధిక్రియాజృంభణం
పశ్చా ద్భీష్మసుయోధనాది నిధన మ్మేత న్మహాభారతమ్

భారతం పంచమం వేదం యః పఠేత్ శృణుయాదపి
స ముక్తస్సర్వపాపేభ్యో విష్ణుసాయుజ్యమాప్నుయాత్

గవాం శతం కనకశృంగమయం దదాతి
విప్రాయ వేదవిదుషే చ బహుశ్రుతాయ
పుణ్యాం చ భారతకథాం పఠతి శ్రుణోతి
తుల్యం ఫలం భవతి తస్య చ తస్య చైవ

- భారత సావిత్రి.

మొదటి శ్లోకమునందు భారతకథ అంతయు నిమిడి యున్నది. తరువాతి రెండు శ్లోకములు మహాభారత ఫలశ్రుతి.

# శుద్ధప్రతి

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| XI | 16 | సన్నిధా పితనుగు | సన్నిధాపితమగు |
| సంకేతముల పట్టిక | | మహాభాతము ఉపన్యాసములు | మహాభారతము, ఉపన్యాసములు |
| 22 | 5 | వజల | వర్షుల |
| 68 | 3-4 | వయసు వారు | వయసువారు కారు |
| 82 | 15 | దూర్వాసు | దుర్వాసు |
| 89 | 11 | భైక్షసంధారిత | భైక్షసంభారిత |
| 104 | 3 | యేనిట్టు వేలకో | యేనిట్టు లేలకో |
| 108 | 18 | వాగ్ధాన | వాగ్దాన |
| 117 | 22 | వచ్యునని | వచ్చునని |
| 142 | 13 | వారిక | వారికి |
| 147 | 6 | నంగనైకల్యంబున | నంగవైకల్యంబున |
| 148 | 26 | రాజ్యాధికారయు | రాజ్యాధికారము |
| 155 | 1 | ఏవంజ్యేషో | ఏవంజ్యేష్ఠో |
| 185 | 8 | మాహించితి | వహించితి, |
| 225 | 15 | పదియవరోజు | పదియారవరోజు. |
| 243 | 7 | దూర్వాసమహర్షి | దుర్వాసమహర్షి |
| 243 | 16 | దూర్వాసమహర్షి | దుర్వాసమహర్షి |
| 248 | 20-21 | ద్యూత - ద్యూత | ద్యూత |

